# ఉపనిషచ్చన్ద్రిక

## ప్రథమ మయూఖము

## తైత్తిరీయోపనిషత్తు



రచయిత

రాయప్రోలు లింగనసోమయాజి

శ్రీవిద్యారణ్యకృతపంచదశీవ్యాఖ్యా శ్రీకల్యాణపీయూష
తైత్తిరీయోపనిషద్భాష్యవార్తిక వ్యాఖ్యావివరణ
విరచయిత

శ్రీః

# ఆశీస్సు

భారత సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీకల్యాణానంద భారతీ మహాంతాచార్యస్వాములవారు.

★

ప్రపంచమునందు ఆసురదృష్టిగలవారలకు భౌతికదృష్టి, తత్సాధనాసక్తతయు నెంతమెండుగానుండునో దైవదృష్టిగల వారలకు తత్త్వచింతనము తద్జ్ఞానసాధనాసక్తతయు నంత మెండుగానుండును. ప్రతిదేశమునందును నియ్యది మనకు గోచరించుచునేయుండును. కాని భారతదేశీయుల మహాసుకృత విశేషమువలన వీరలయాసక్తికి అనుకూలములును సమ్యక్తత్త్వ జ్ఞానసాధనములును నగుగ్రంథరాజములు పరమప్రమాణ భూతములై పిత్ర్యమగు నైశ్వర్యముగా వెలయుచున్నవి. కావున వీరలుం తమ యభీష్టమును దద్ద్వారమున లెస్సగ సాధించు కొనుటకు దగునవకాశము సంపూర్ణముగగలదు. ఇక విదేశీయు లన్ననో తత్త్వజిజ్ఞాసువులయినను ప్రమాణభూత మగుసాధన సామగ్రి కొఱతవడినవారలగుటచే స్వబుద్ధిమాత్రైకప్రమాణు లగుచు దత్త్వమును దెలిసికొనజాలక తత్త్వమనుభ్రాంతితో మోహమును బొందుచున్నారు. ఇదియట్లుండ భారతదేశము యొక్క దుర్దైవవశమున భారతీయవిద్యావిధాన మగుసంస్కృత వాణి వ్యవహారమునుండి చ్యుతమై సన్నగిలుటచే ప్రమాణ గ్రంథరాజము లవగతములుకాక పైవిదేశీయులగతియే వీరల

కును బట్టినది. ఇంతియుగాదు. ఎయ్యది యుండినగాని యీ ప్రమాణగ్రంథముల దెలిసికొను నవకాశములేదో అట్టి సత్సంప్రదాయము అనగా బ్రహ్మవిద్యాసంప్రదాయము లుప్త ప్రాయమగుటచే "సర్వే గురవః సర్వే అన్తేవాసినః" అనుస్థితి సర్వత్ర బయల్పడెడిని. కావున నిట్టిపరవస్థను బోలగజేయు సత్సంప్రదాయసిద్ధమగు నుపనిషద్విద్య భారతదేశమున నావశ్యకమైనది. అంతను పైనదెలిపినతీరున మాతృభాషాజ్ఞానము జిజ్ఞాసువులకు తగ్గుచుండుటంజేసి దేశభాషల నాశ్రయింప నవసరమగుచున్నది. ఇట్టిపరిస్థితులలో—

అస్మదత్యన్తప్రియాన్తేవాసియగు శ్రీ రాయప్రోలు లింగనసోమయాజి తన యోగ్యతావిశేషముచే అస్మచ్ఛ్రీచరణ సన్నిధానమున యథావిధిగ బ్రస్థానత్రయము నధ్యయనమొనర్చి గావించి కృతకృత్యత నొందినాడు. తదనుకూలయుగ దాగ్రహించినవిద్యను "స్వయం తీర్ణః పరాంస్తారయతి" యను న్యాయమున లోకమున బ్రచారముసేయదలచి "కల్యాణపీయూష", "కల్యాణవివరణ" ములనెడి వ్యాఖ్యలను క్రమముగ విద్యారణ్యపంచదశప్రకరణి తైత్తిరీయోపనిషద్భాష్యరాజవార్తికములకు గీర్వాణభాషయందు వ్రాసి అశేషభారతదేశమునను మిక్కిలిమన్ననలనంది గీర్వాణభాషాగ్రంథముల ప్రాశస్త్యము నెఱుంగని యాంధ్రుల యుత్కటమగు నభిలాషముతో నీయుపనిషద్గ్రంథతతిని మూలభాష్యముల విషయసంగ్రహణరూపమున నీతడు వెలయింపదొరకొనెను. కావున నిట్టి సత్ప్రయత్నమువలన గీర్వాణభాషావిహీనులగు నాంధ్రజిజ్ఞాసువులు సద్విద్యనుగ్రహించి కృతార్థులగుటలో సందేహము లేదు.

ఇట్టిలోకోపకారకమగు కృతులను రచించుచు శ్రీసోమయాజి గూడ దనవిజ్ఞానమును సార్థకపఱచుకొనుచు శాస్త్రకర్తలకుగల యుత్తమకీర్తిని గని యైహికాముష్మికనిశ్శ్రేయముల నందునట్లు మేము నారాయణస్మరణమును గావించుచున్నారము.

ఇతి నారాయణస్మృతిః

శ్రీవిద్యాశంకరభవనము
గుంటూరు
శ్రీనందన చైత్రశుక్ల 2
జయవాసరము
1–4–52

★

# ఉ ప ని ష చ్చ న్ద్రి క

## ప్ర థ మ మ యూ ఖా ర మ్భ ము

## ప్రశంసాపద్యావళి

కళ్యాణాత్మైక్యభూతిఁ గనిగ బాదలితద్దర్శితానన్దమెల్లఁ
బళ్యాలఁ దింపి తేటంబలుచునుడులతో, బాలకశ్రోతృచిద్ధా
వళ్యంబుఁ హేలగాఁ జొప్పుఅమపటిమచే బ్రాప్తసార్థాంకు మాశ్రీ
కళ్యానన్దమాన్త్రాగ్రగురు నియతి నేగాంతు సాష్టాంగయుక్తిఁ॥

తాతాన్వవాయు, వ్యాకృతి
హోత న్సుబుధు, మహామహోపాధ్యాయ
ఖ్యాతు, న్సుబ్బారాయా
ద్వైతసుధాంధసుని బ్రణతి భజియింతు నెదఁ॥

అవిరళనైష్ఠికుంను, నిగమాన్తవిదుండును, శాస్త్రషట్కభా
రవి, కవి, గానతత్పరుడు, రమ్యసుహాస్యవినోదవక్త, లౌ
క్యవిదుడు, కాశికృష్ణబుధు, డర్మిలి నాకు గణాదశాస్త్రగౌ
రవమిడు దేశికుం డిదె పరంపరితోక్తి నొనర్తు జోతలఁ॥

వరుస నాతండ్రితో మూలపురుషుదనుక
రాయప్రోలింట నాంధ్రధరాతలాన
వేదనాదాఢ్యులై యజ్వలై దిటంపు
కీర్తి వెలసినబుధులకుం గేలుమోడ్తు॥

రసికుఁడు, శాస్త్రవేత్తయు, బురాణకథాకలితోరువాగ్మి, సో
ల్లసితుఁడు, జాపవిగ్రహుఁడు, లాస్యకళాప్రియుఁడయ్యు యజ్వ, ని
ర్వ్యసనుఁడు, నాదుతండ్రి రమణాఖ్యుఁడు, మ్రొక్కి, తదాశిషంబుల
న్బ్రసగెడిజ్ఞానయజ్ఞ మిటువ్రాసితి లింగనసోమయాజిగన్॥

నాజనయిత్రి, సాధుసహనప్రియకారిణి, ధీరదక్షతా
భ్రాజితశక్తి, సద్గృహిణి, రమ్యపతివ్రత, రాజ్యలక్ష్మినా
నాజిలునన్నపూర్ణ, సవనవ్రతసంభృతసోమపీథిని
న్బూజిదుభక్తితో నెద నమోనమయంచు నయోక్తి మ్రొక్కెదన్॥

సంస్కృతాగాధసాగరసంకులోర్మి
ఘాతజాతవిరక్తులై కడల నడలు
సోదరముముక్షుమనుజప్రచోదకముగ
జ్ఞానయజ్ఞాన్న మీకృతి యానుగాత॥

న్యాయవాదియుఁ బూర్ణదీక్షాయుతుండు
పరహితాస్తిక వైశ్వదేవప్రియుండు
నన్నపూర్ణాసపర్యానిరంతరుండు
నమఁమూర్త్యంబికావీరయాఖ్యసుతుఁడు
నాత్మవిద్య నాసహపాఠి యైనసఖుఁడు
సాంబశివశాస్త్రి యీకృతి నచ్చుఁబఱపి
యేలెపెద్దికలౌదార్య మెంతొ పెంచె
కడుఁగృతజ్ఞుండఁ గైలాగుకాన్క లిడుదు॥

★

# విషయ సూచిక

## బ్రహ్మానందవల్లి

### ప్రథమానువాకము

# శ్రీ

# తైత్తిరీయోపనిషత్తు

## మన్త్రవర్ణానుక్రమణిక



# ఆలోకనము

శ్రీఖరనామసంవత్సర చైత్రశుద్ధ నవమి భానువాసరము నాజీవితములో నొకసుదినము. ఏలూరులో నలరారుచున్న సంస్కృతపాఠశాలావార్షికోత్సవమున కాహూతుడనై యచట శ్రీరామపట్టాభిషేకోత్సవవ్రతమును నిండుభక్తితో నాచరించుచు పార్వతీపరమేశ్వరుల మఱపించు శ్రీ యీదర వెంకట్రావు దంపతుల యతర్కితోపనతము నవ్యాజానురాగపురస్సరము నగునాతిథ్యమునకుం బాత్రుండనైతిని. నే నచ్చట గొలది యుపన్యాసముల నిచ్చుటగూడ సంభవించెను. సంస్కృతభాష నెఱుంగని ముముక్షుజనసామాన్యమునకు నాభాషలో నున్న యాధ్యాత్మికతత్త్వరహస్యము శాంకరమతసౌష్ఠవముంగూడ తాళమువేయబడిన పేటికలోని రత్నములట్లుంటచే వారాత్మజ్ఞానముంగూర్చి నైరాశ్యముం జెందుచున్నారనియు సుప్రసిద్ధము లగుదశోపనిషత్తులను శ్రీశంకరభాష్యసారమును సముచితరీతిం దెలిగించి వారికొఱతం దీర్పవలసినదనియు బ్రహ్మశ్రీ యీదర వెంకట్రావుపంతులుగా రప్పట్ల నన్ను గోరిరి. అంతకుం బూర్వమే నామిత్రులచే నామనోభూమియందు నాటబడిన విత్తనమునకు గంభీరమగు వీరి బలుకులు దోహదకరమగు జలపూరితాలవాలమై దాని నంకురింపజేసెను. అచటినుంచి నే నింటికి వచ్చినంతనే నాగురుపాదులగు భారతీసంప్రదాయ సార్వభౌమ శ్రీజగద్గురుకల్యాణానందభారతీమహాంతాచార్యస్వామిపాదకంజమధుపూరితమగునట్లు నా యాశాంకురమును సమర్పించితిని. సహజార్ద్రస్వభావులగు వారు తమ యాశీర్వాదామృతముచే దానినిం దడిపి యనతికాలముననే వృక్షరూపముం దాల్చి ఫలించునట్లు లనుగ్రహించిరి.

ఇట్టిస్థితి నల్ల నేనపర్యాప్తుడనయ్యు నమోఘము లగు శ్రీగురుపాదుల యాశీస్సుల నూతగాగొని యా వైశాఖశుద్ధ పంచమీ భృగువాసరమున శ్రీమద్భగవచ్ఛంకరపూజానంతర మున దుస్సాధ్యమగు నీకార్యమునకుం బూనుకొంటిని. మున్ముందు స్వశాఖకుం జెందినదగుటేగాక సకలోపనిషత్తులకు దలమానిక మనదగు తైత్తిరీయోపనిషత్తును సభాష్యముగ దెలిగించ నారంభించి జ్యేష్ఠమాసారంభమున నద్దానిం బూర్తిజేయ గలిగితిని. తరువాత నీశాద్యుపనిషత్తుల నెత్తుకొని నడుమ నడుమ నితరములగు తొందఱపనులలో నిమగ్నుడనుగావలసి వచ్చుటయేగాక శరీరానారోగ్యతలుంగూడ నంతరాయముల గల్పించుచుండినను బట్టువదలక బృహదారణ్యకముదక్క నిప్పటి కేకమిది యుపనిషత్తుల బూర్తిజేయగలిగితిని. అనతికాల ములో బృహదారణ్యకముగూడ గురుపాదులవారి యాశీస్సు లచే దెలిగింపబడగలదని యాశించుచున్నాను.

ఈశాదిదశోపనిషత్తుల సభాష్యములుగ దెలుగునం దందించుట కింతకుమునుపు శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండు సన్సువా రొక్కరుమాత్రమే కొంతవఱకు బ్రయత్నించి నటుల కనుపట్టుచున్నది. వారుగూడ చాందోగ్యబృహదారణ్య కముల సభాష్యముగ బ్రచురించిన ట్లగుపడదు. వారి ప్రచురణ ములు కేవలానువాదమాత్రములే. అవియుంగూడ నిప్పుడు దొఱుకుచున్నట్లు లేదు. ఆసేతుహిమాలయవిస్తృత మగు నీ యార్షదేశము పాశ్చాత్యసంస్కృతివ్యామోహముచే బహుళ ముగ నావరింపబడుట నిజమే యైనను నిజనాగరికతాంకూరము లింకను బూర్తిగ నంతరింపలేదు. ఆర్షమగు నాధ్యాత్మిక

తత్త్వమును దెలిసికొనవలయు ననుకోరిక లిప్పటికింగూడ ననేక స్థలముల దలలెత్తుచునే యున్నవి. ముముక్షుచకోరజాతములు మన దేశపు టాధ్యాత్మికాకాశమున బారులుదీరి యాంధ్రోప నిషచ్చంద్రికాదీధితుల కెదురుచూచుచునేయున్నవి. సంప్రదాయ సిద్ధము సభాష్యము నగునట్లుపనిష త్తత్త్వసారమును బ్రస్తుత కాలపు రుచుల కనువగుతీరున విపులముగ వివరించు నాంధ్ర గ్రంథరచన లింతవఱకు లేవు. ఈ కొఱఁతందీర్చుటయే ప్రస్తుత ప్రయత్నమునకు ముఖ్యతాత్పర్యము. ఈ కృత్యౌచిత్యము నెడ పరిత్పప్తియే ప్రమాణము.

చదువరుల బుద్ధివృత్తులయందలి మార్పులతోబాటు మూలభాషాకాఠిన్యముంగూడ నీతెలుఁగుసేతయందలి వైరళ్య మునకుం గారణమగుచున్నది. ఏ సామాన్యగ్రంథమునైనను మాతృకయందలి రసభావాదులు సమగ్రములుగ బ్రకటితము లగునట్లు మఱియొకభాషలోనికి మార్చుటనునది యుభయ భాషాకోవిదులకైనను గడుదుష్కరము. అట్టిచో శాస్త్ర గ్రంథముల మార్పుసంగతి నింకేమి చెప్పవలయును. ప్రతి భాషయు విలక్షణమగు పదజాలము, ప్రత్యేకమగు జాతీయత, విశిష్టమగు వాక్యరచనాదులతో స్వస్వభావము నొకవింతవికాస ముతో బ్రదర్శింపగలదు. మామూలువాడుక తెలుఁగునను గ్రాంథికాంధ్రమునంగూడ నెక్కుడుగ సంస్కృతపదము లుండు చున్నను వాక్యరచనమందును జాతీయతయందుంగూడ నాంధ్ర గీర్వాణసంప్రదాయముల రెంటికి నెంతయో భేద మున్నది. శ్రీమచ్ఛంకరభగవత్పాదుల సంస్కృతవాణి సంస్కృతసంప్ర దాయానుసారములగు ప్రసన్నతాగాంభీర్యతలతోడను నిసుప

మానసము జిగిబిగియల్లికతోడను నిండియున్నది. అట్టివారి
సూక్తిని ప్రతిపదవాక్యానుపూర్వ్యముగ దత్పూర్ణరసానుభవ
యోగ్యముగ నాంధ్రమునకుం దింపుటయే మిక్కిలి కష్ట
మన్నచో నీయాంధ్రభాషాసంప్రదాయసమ్మతముగ నొనర్ప
గల్గుట నాబోటివానికి గగనకుసుమసంపాదనాకాంక్షయే యన
దగును. సద్గురుముఖమున సంప్రదాయసిద్ధముగ శ్రవణము
నొనర్చినవారికినిగూడ నిర్భేద్యమగు శాంకరసూక్తి కేవలాను
వాదముచే ప్రసన్నము కాగలదనుట నామటుకు నాకు సందే
హాస్పదమే యగుచున్నది. అందువలన నాజగదేకాచార్యుని
భాష్యమును భూమికగ గ్రహించి యీరచనలయందు వారి
పఙ్క్తుల ననుకరించితిని. విద్యావిగ్రహులగు నానందగిరి
విద్యారణ్య శంకరానంద రామరాయాదుల వ్యాఖ్యానములలోని
విషయముల సంపుటిజేసి సకలము సుప్రసన్నము సుగమముగ
నుండవలయునను కోరికతో అనివార్యములగు పారిభాషిక
పదములంతక్క సామాన్యసాహిత్యశైలి నవలంబించి యీగ్రంథ
ములను రచియించితిని. భాషాసౌష్ఠవమునకుకంటె భావ
సౌష్ఠవమున కెక్కుడు ప్రాముఖ్యత నొసంగితిని. ప్రసాధనక్రియా
నభిజ్ఞుడనగు నాచే ముడుతలు ముడుతలుగా నమర్పబడిన యీ
క్రొత్తపత్తమువలన సహజసౌమ్యాంగసుందరియగు దెలుంగు
తల్లికి నావంతయు గొంతంత గల్గదని నానమ్మకము. అమూ
ల్యము లగుచీనిచీనాంబరముల గట్టబెట్టి యామె నలంకరింపగల
పండితకవిపుత్రు లనేకులున్నారు. నానేర్చిన యాంధ్రభాషా
ముఖమున వెలువడుచున్న యీ యుపనిషచ్చంద్రిక జిజ్ఞాసు
వుల యద్వైతామృతాస్వాదనాతృష్ణను గొంతవఱకైన దీర్చ

సంస్కృతభాష నెఱుంగలేకపోయితిమిగదా యను ననుతాపము గలవారి కాలోచనామృతముగ గాకున్న నాపాతమధురముగ నైన నేదదేర్పగల్గినచో నేను కృతకృత్యుడనగుదును. సంపూర్ణ విషయగ్రహణము నాకాంక్షించువారికి సాక్షాద్భగవత్పాదులే యాశ్రయణీయులు. మంచుకొండనుండి యతివేగమున క్రిందికి దుముకు గంగాప్రవాహమున స్నానమశక్యమగుచుండ సామాన్యుల సౌకర్యమునుగోరి యాప్రవాహమును మఱల్చి "బ్రహ్మకుండ" మను రేవు నిర్మింపబడినది. అట్లే బహుశాస్త్రచర్చాతిమింగిలసంకులములగు బ్రహ్మవిద్యాజలముల సాక్షాత్ప్రవాహమున నీదినగాని తృప్తినొందని సమర్థుల విషయమట్లుండ దదన్యులకు సౌలభ్యార్జనమునకై యీకృతి ముఖ్యముగ నుద్దేశింపబడినది.

ప్రతిమంత్రమునకును బూర్వోత్తరసందర్భముల దెలియజేయు ప్రతీకయు, సఖండాన్వయము, వివిధవ్యాఖ్యానోపబృంహితము లగుతాత్పర్యార్థవిశేషములు ముఖ్యము లగు ప్రమాణములు వాని లభ్యస్థానములు గిష్టస్థలముల విషయసంక్షేపము, విషయవిభాగవిమర్శనము, ప్రకరణోచిత మగు నుపనిషదంతర విషయానుసంధానము, విషయపట్టిక మొదలగువిశేషములతో స్వతంత్రమగు నుపన్యాసశైలితో శాంకరభాష్యము ననుకరించు నీగ్రంథముల రచియించితిని.

నాకిట్టియోగ్యత ననుగ్రహించిన గురుపాదులమనాథమగునాసృణ్యప్రాప్తి కొఱకు కళ్యాణాత్మకము లగు తన్నామరూపముల కనిశము సపర్యనుమాత్రము జేయుగలను. ఈనారచనలను శ్రద్ధతో జదివి యమూల్యము లగుసూచనలచే నన్నధమర్ణునిగా నొనర్చిన యన్వర్థనాములగు శ్రీమదుపనిషత్స్వామి

వారికిని సహృదయులు సుహృత్తములును నగు శ్రీయుత కర్రా వెంకట్రావు, ఓరుగంటి నీలకంఠశాస్త్రి, దైతా గోపాలకృష్ణయ్య, గొడవర్తి సుబ్బారావు, భువనగిరి విజయరామయ్యగార్లకు కృతజ్ఞతాపూర్వకము లగు నభివందనముల నొసగుచున్నాను. ప్రాక్పశ్చిమ వేదాంతగ్రంథముల వివరించు నొక చక్కని వ్యాసము నుపోద్ఘాతరూపమున నాకు వ్రాసియిచ్చిన యుభయవేదాంత శాస్త్రవిశారదు లగు శ్రీయుత దాడిపర్తి దుర్గాప్రసాదరావుగారికి నా నమస్కృతులు. ఈ రచన లందు గుణ మెద్దియైన నున్నచో నది శ్రీగురుపాదుల యాశీఃఫలమే. జ్ఞాతాజ్ఞాతము లగు లోపములకు నాకించిజ్ఞతయే కారణము. రసగ్రహణైకపారీణులగు చదువరుల కవి క్షంతవ్యములు.

న్యాయవాదికులాలంకారభూతులు, ఆధ్యాత్మికవిద్యార్జనమున నాకు సతీర్థ్యులు, పూర్ణదీక్షాపరులు, నిరతాన్నపూర్ణాసంపర్యానిరంతరులు, ఆస్తికావతంసులు, నాకత్యంతము సుహృత్తములు నగు బ్రహ్మశ్రీ వేదమూర్తి వేదాన్తపారీణ యేలేపెద్ది సాంబశివశాస్త్రిగార్గ్రంథముద్రణకు వలయు ధనమును వెచ్చించి సహజమగు వారియౌదార్యసౌజన్యములకు మెఱుంగు బెట్టిరి. ఆన్ధ్రావనియందు శ్రీశాఙ్కరమతప్రచారమున కవ్యాజప్రేమతో వారు నాకొసంగిన చెయ్యూతకు నే నెంతయు కృతజ్ఞుడను. వారియభీప్సితార్థసిద్ధి యనతికాలములో సమకూర్చునట్లు పరమేశ్వరిని ప్రార్థించెద.

లలితారామం
బృందావనం – గుంటూరు
శ్రీనందననామ సంవత్సర
శ్రావణపౌర్ణమి–మంగళవారం
5–8–1952

రాయప్రోలు లింగనసోమయాజి

# తొలిపలుకు

తత్వమన సత్యాన్వేషణముకన్న నన్యముకాదు. కాన భిన్న దేశములను బట్టిగాని, జాతులనుబట్టిగాని సత్యస్వరూపము నందు భేదమున కవకాశముండదగదు. భారతవిజ్ఞానశాస్త్ర మని (Science), యూరపువిజ్ఞానశాస్త్రమని మన మెట్లు సంభావింపమో అట్లే భరతఖండతత్వమని, యూరపుతత్త్వమని పలుకుటకూడ హాస్యాస్పదముగ కనుపించవచ్చును. ప్రపంచ ములో గొన్ని దేశముల గొన్ని వృక్షములు, జంతువు లుండ వచ్చును. అవి యితర దేశములలో లేకపోవచ్చును. అంత మాత్రముననే జంతుశాస్త్రమునందుగాని, వృక్షశాస్త్రము నందుగాని విభిన్నత కానరాదు. విజ్ఞానమున కెచ్చటనయినను విచారణావిషయము సమానమే. కాని విజ్ఞానశాస్త్రములందు వలె తత్త్వశాస్త్రములందు బ్రాగ్పశ్చిమదేశములందు విచారణ విషయము సమానమేనని చెప్పుటకు వీలులేదు. విజ్ఞానశాస్త్ర ములకు విషయము ప్రకృతి. అయ్యది ఇంద్రియజ్ఞానగమ్యము. అందువలననే 'డార్విను', 'న్యూటను', యీన్‌స్టెయిన్', 'రామన్' ప్రభృతు లంతర్జాతీయఖ్యాతి బడసిరి. తత్త్వశాస్త్ర మన్ననో యింద్రియాతీతము. దేవుని, ఆత్మను గూర్చి విచా రణజేయునప్పుడు సత్యాన్వేషణమె ప్రధానోద్దేశమైనను, ఏయే దేశములం దేయేభావములతో నేయేసాంప్రదాయార్థములతో బదము లుచ్చరింపబడినవో తెలియనిది తత్త్వవిషయములు విజ్ఞాన (Science) విషయములంబోలె తేటతెల్లముగ బోధ పడునట్లు జెప్పనలవికాదు. పూర్వసాంప్రదాయములను, పూర్వదర్శనవిషయములను బురస్కరించుకొనియే ఆయాదేశపు

తత్త్వవేత్తలు సత్యాన్వేషణ మొనర్చిరిగాన భారతతత్త్వశాస్త్ర మని, యూరపుతత్త్వశాస్త్రమనియు జెప్పకతప్పదయ్యెను.

పాశ్చాత్యఖండమునందే భిన్నప్రదేశతత్త్వవేత్తలు భిన్న సాంప్రదాయముల ననుసరించి పెక్కుపోకడల బోయిరి. జర్మను తత్త్వవేత్తయనిన కూలంకషముగ నన్నివిషయముల విమర్శించి సిద్ధాంతమును నిర్ణయించు నని పేరుగాంచెను. ఆంగ్లతత్త్వవేత్త లలో 'బేకను' మొదలు ప్రస్తుతపు 'మూరు', 'రస్సెలు' వర కును నేదోయొకవిధమున జయముగాంచుటయే ప్రధానముగ నెంచెదరు. ఫ్రాన్సుదేశపువా రట్లుగాక గణితశాస్త్రసిద్ధాన్త ములవలె నిస్సందేహముగ నుండునట్లు విమర్శింతురు. 'డేకార్టు' 'బర్గ్సన్' ప్రముఖులు—బర్గ్సన్ "సత్యము నిత్యముకాద నియు, సదా యభివృద్ధిని బొందుచుండు నని" వాదించెను. అమెరికాలో స్త్రీలు, బురుషులు, యువకులు, వృద్ధులు అంద ఱును పాటుపడుటకు వెనుదీయక కృషిచేయుదురుగాన పాటు పడుటయే ప్రయోజనవంతముగావున 'జేమ్సు'—"ప్రయోజన కారియే సత్యము. ప్రయోజనహీన మసత్య"మను (Prag- matism) సిద్ధాన్తమును నిర్వచించెను.

యూరపు, అమెరికాలలోని యంతర్భాగములలోని తత్త్వములందే విభిన్నత యింత గాన్పించుచుండ నాదేశపుతత్త్వ ములకు భారతదేశతత్త్వములకు భేదములుండుట కాశ్చర్యపడ నవసరములేదు. అసలు తత్త్వశాస్త్రము (Philosophy) అనుపదమునకే యూరపునం దర్థము వేరు. భారతదేశమం దర్థము వేరు. యూరపుదేశతత్త్వమునకు జన్మస్థాన మనదగుగ్రీసు దేశమున తొల్లిటినుండియు తత్త్వ మన ప్రకృతి (Nature)ని,

మానవజీవితమునుగూర్చి హేతువాదమువలన నిర్ణయింపదగు జిజ్ఞాస యనిభావము. అందువలన నచ్చట నిప్పటికి రెండు వందలసంవత్సరములపూర్వమువరకు తత్త్వపదమునకు (Philosophy)ను విజ్ఞాన (Science) అను పదమునకు నర్థమొక్కటియే. పూర్వపుతత్త్వవేత్త లగు 'అరిస్టాటిల్', 'డేకార్టు', 'లైబ్నిజ్'లందేమి, నేటితత్త్వవేత్త లగు 'రస్సెల్', 'వైట్ హెడ్', 'బర్గ్ సన్', 'జేమ్సు' ప్రభృతులందేమి విజ్ఞానతత్త్వములకు ప్రయత్నపూర్వకసమన్వయము గాన్పించుచుండును.

భరతఖండమందన్ననో తత్త్వశాస్త్రము ప్రత్యేకవిభిన్న తతో విరాజిల్లును. అది పరవిద్య లేక బ్రహ్మవిద్య యనియు, తదితరశాస్త్రములన్నియు నపరవిద్యలనియు విభాగముగలదు. అపరవిద్యయన నైహికాముష్మికాభ్యుదయమునకు సాధనము లగు సంహితాబ్రాహ్మణములు, వేదాంగములు, తర్కశాస్త్రములు, ధర్మశాస్త్రములు, ఆయుర్వేద, ధనుర్వేదములు, అర్థశాస్త్ర, గణితశాస్త్రములు యిత్యాదులు. పరవిద్య కేవల నిశ్శ్రేయససాధనము. అదియే తత్త్వము. తత్ అనగా పరమాత్మ (Supreme Reality) తస్య భావః తత్త్వమ్ అని అనగా బ్రహ్మభావమని వ్యుత్పత్త్యర్థము. బ్రహ్మభావము కేవల హేతుజ్ఞానగమ్యము కాదు. అనుభవైకవేద్యము. సాక్షాద్దర్శనగమ్యమని భారతీయులు తలంతురు.

పాశ్చాత్యదేశములందువలె కేవల హేతువాదములోనరచ్చపురుషుని శుష్కతార్కికుడండురేగాని భారతభూమి యందు వానిని జ్ఞానిగ భావింపరు. భారతజ్ఞానిని పాశ్చాత్యులు కేవలస్వాప్నికప్రపంచమందున్నమానవుడనియు, భారత

తత్త్వశాస్త్రము కేవలమూఢనమ్మకములపుట్టయనియు నెంచె దరు. దీనికి భారతీయు లిట్లుసమాధాన మిచ్చెదరు. ప్రతి మానవుడును జ్ఞాని కానేరడు. అనేకజన్మములనెత్తి యజ్ఞయాగాదిపుణ్యకర్మముల నొనర్చి తత్సుకృతపరిపాకమువలన నష్టవిదూపుడై చిత్తశుద్ధిగలిగి సద్గురుసాంగత్యమున సజ్జ్ఞానమును దొలగించుకొని బ్రహ్మనిష్ఠుడై పరబ్రహ్మసాక్షాత్కారమును బొంది బ్రహ్మాత్మైకనిరూఢి నద్వితీయబ్రహ్మానందమున నుండుమహావ్యక్తియే జ్ఞాని యనదగును. శ్రీశంకరభగవత్పాదులు పూర్వప్రాయమందే సన్యసించి మండనమిశ్రాదిసర్వశాస్త్రపండితుల ననర్గళవాగ్వాదమున నోడించి ఆనాటిభారతదేశము కన్యాకుమారిమొదలు హిమాచలపర్యంతము పర్యటనముగావించి నాలుగువైపుల శారదాపీఠముల స్థాపించి ఉపనిషత్తులకును, గీతలకును, బ్రహ్మసూత్రములకును భాష్యముల రచించి, పెక్కుస్వతంత్రగ్రంథముల రచించి, బౌద్ధమతనిర్మూలన మొనర్చి వైదికమతమును పునరుద్ధరించిన మహానుభావుడు, జ్ఞాని. ఈయద్భుతకృత్యములన్నియు ముప్పదిరెండువత్సరముల వయసులోపలనే ముగించినవ్యక్తి స్వాప్నికప్రపంచమానవు డెట్లగును? ఇవియన్నియు జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయ మనుత్రిపుటిజ్ఞానమునకు భిన్నమైన నిర్వికల్పసమాధినిష్ఠాజనితానుభవమువలన బ్రహ్మభావమును బొంది బ్రహ్మానందమును చూరగొని వ్యావహారికప్రపంచమును నిరసించి తదాధారమైన పారమార్థికసత్యమగుతత్త్వమును గ్రహించినవ్యక్తి కృత్యములుగాని యన్యములుగానేరవు. ఉపనిషత్తులు తపఃఫలితరహస్యములుగాన నాయుపనిషద్రహస్యముల దనభాష్యరూపమున మనకు కరత

లామలక మొనర్చెను. భారతదేశమందుగూడ బ్రతిమానవు డును జ్ఞానికాజాలడు. జ్ఞానియగుట కధికారిని నిర్ణయించిరి. శ్రీ శంకరాచార్యులు "వివేకినోవిరక్తస్యశమాదిగుణశాలినః । ముముక్షోరేవహిబ్రహ్మజిజ్ఞాసా యోగ్యతామతా॥" నిత్యానిత్య వస్తువివేకము ఇహాముత్రఫలభోగవిరాగము, శమాదిషట్క సంపత్తి, ముముక్షుత్వము గలయతి జ్ఞానాధికారి. అట్టియధి కారు లత్యల్పసంఖ్యాకులయినను తదధికారమును సంపాదింప బ్రయత్నమొనరించుట కందఱ కధికారముగలదు.

ఈరీతి ఐరోపీయ తత్త్వశాస్త్రభారతదర్శనదృక్పథములం దత్యంతవిభేదము కలదు. యూరపుతత్త్వవేత్తలదృష్టి భౌతిక ప్రపంచమందు మానవుని నిత్యజీవితమును గ్రహించుటయును ఐహికాభివృద్ధియే పరమావధిగగొని తత్సాధనముల దమబుద్ధి సూక్ష్మతనంతయు వినియోగించి కనుగొనుటమాత్రమే. సతత జననమరణరూపసంసారచక్రమునుండి తొలగుమార్గ మన్వే షించి క్షణభంగురములగునైహికవిషయానందముల సంపూర్ణ ముగ ద్యజించి శాశ్వతసుఖమగుబ్రహ్మానందమును గాంచుటయే భారతీయులదృక్పథము. నేటిభారతతత్త్వవేత్తలలో బ్రము ఖుడు శ్రీసర్వేపల్లి రాధాకృష్ణపండితుడు "The western mind is nationalistic, ethical, positivist, and practical, while the Eastern mind is more inclined toward inward life and intensive thinking" ("హేతువాదము, నీతి, ప్రత్యక్షప్రమాణము, వ్యావహారిక ప్రయోజనము—వీనియందు పాశ్చాత్యబుద్ధి లగ్నమైయుం డును. ప్రాగ్దేశస్థులదృష్టి విశేషముగ నాధ్యాత్మజీవితమునం దును, అంతర్ధ్యానచింతనమందును ప్రసరించుచుండును") అని

ప్రకటించెను. ఈప్రధానభేదము మనము జ్ఞప్తియందుంచు కొనిన నన్ని భేదములు సులభముగ నవగతములగును. యూరపు తత్త్వభారతదర్శనసత్త్వముల ప్రధానవిషయముల సాదృశ్యము గలదనియు నప్రధానవిషయములందుమాత్రమే భేదములనియు వాదించుపండితులు నే డుభయదేశములందును లేకపోలేదు. కాని వారిప్రయత్నములు జయప్రదములుకావు. ఉభయ తత్త్వముల కందుముఖ్యభేదమునుండి యనేకభేదము లుత్ప న్నములయ్యెను. వాని నారుతరగతులుగ విభజింపవచ్చును.

1. జ్ఞానమే పరమావధి. జ్ఞాన మన్యఫలసాధనము కాదని యూరపుతత్త్వసిద్ధాన్తము. 'సాక్రటీసు' 'ప్లేటో' అను సుప్రసిద్ధగ్రీకుతత్త్వవేత్తలు ప్రకృతియందును, మానవజీవితమందును దురవగాహములగు సమస్యలనేకములు గలవనియు, వానినిగూర్చి నిస్సందిగ్ధమగువిశేషజ్ఞానము బుద్ధిపూర్వకముగ సమార్జించుటయే పరమధర్మమనియు, నయ్యది ఐహికాముష్మిక సాధనముగ నుండదగదనియు ప్రబోధించిరి. యూరపుతత్త్వ వేత్తలీజ్ఞానస్వాతంత్ర్యమునకు గర్వపడుచుందురు. వైజ్ఞానికుడు (Scientist) తన్నెదుర్కొనుసమస్యలకు గ్రమసమాధాన ముల నారయుటే తనపనిగాని వానివలన మానవప్రయోజన మును బుద్ధిపూర్వకముగ గాంక్షింపడు. ఆసమాధానముల గ్రొత్తవిశేషములు కనిపెట్టవచ్చును. అవి లోకోపకారక ములు కావచ్చును. ఆవిరిశక్తి, విద్యుచ్ఛక్తి వైజ్ఞానికులు కను గొనిన అద్భుతవిషయములు. తద్వినియోగమువలన నమెరికా యూరపులు ప్రపంచమునకెల్ల భాగ్యవంతప్రదేశము లయ్యెను. కాని యట్టిప్రయోజనము వైజ్ఞానికున కానుషంగికమేకాని

ప్రధానముకాదు. పాశ్చాత్యతత్త్వవేత్తకు దేవుడు, అమృతత్త్వము-అనునవి వాదసాధ్యములయ్యును తత్త్వమునకు ప్రధానాంగములు కావు. తమ సిద్ధాన్తములందు దైవమునకు నమ్మృతత్త్వమునకు తావులేదని నిరూపించువారును యూరపునందు తత్త్వవేత్తలనిపించుకొనకపోరు. అందువలననే బహుదైవవాదియగు 'స్పినోజా', సర్వసందేహవాదులగు 'వాల్టేరు', 'జానుమిల్లు', నాస్తికులగు 'ఇంగర్ సాల్' ప్రభృతులు, ఆస్తికులగు 'బిషపు బార్క్లే'-ప్రభృతులకంటె తత్త్వవేత్తలలో తక్కువగౌరవమును బొందలేదు. సనాతనక్రైస్తవమతస్థుల కిది నచ్చదు గాని వారిచర్య లీనాస్తికతత్త్వవేత్తల ప్రబోధముల నావజాలవయ్యెను. కాన యూరపులో జ్ఞాన మన్యఫలసాధనవిరహితమైన స్వతంత్రపరమావధి.

భారతభూమియం దట్లుగాక జ్ఞాన ముత్తమసాధనము మాత్రమే. యూరపువైజ్ఞానికజ్ఞానము మానవసుఖజీవనమునకును, వైషయికానందమునకును సాధనమగుటచే దాని నంతగ ప్రశంసింపక గర్హింతురు. అట్టి ప్రాపంచికజ్ఞానమంతయు నవిద్య, అజ్ఞానము అనియు, ఆయవిద్యను నాశనమొనర్చి పరమాత్మసాక్షాత్కారమును జేయుజ్ఞానమే ఉత్తమజ్ఞానమనియును భారతదర్శనకారులమతము. ఆత్మ జననమరణప్రవాహపరంపరలందు మునిగితేలుచు తుదకు విసిగివేసారి విషయానందములందు సంపూర్ణవైరాగ్యము కలిగి పుట్టుకయు చావును లేనిమార్గమునకై వెదకును. అందుకు మార్గమొక్కటియే. అదియే బ్రహ్మవిద్య. కాన యూరపులోవలె జ్ఞానము స్వాతంత్ర్యపరమావధిగాక ఫలసాధనముమాత్రము. ఇట్టిప్రాద్దేశ

భావములను యూరపునందు మతసిద్ధాన్తములుగాని తత్త్వనిర్ణయములు గావందురు.

2. పైభేదమునుబట్టి యూరపులో తత్త్వశాస్త్రమునకు మత (Religion)మునకును గలసంబంధము భారతభూమియందలి సంబంధమునకు కేవలవిపరీతముగనుండును. యూరపులో గ్రీకులనాటినుండియు తత్త్వశాస్త్రమునకును, మతమునకును విరోధము ప్రారంభము. గ్రీకుతత్త్వశాస్త్రప్రారంభమునందే 'క్సెనోఫనీసు' (Xenophanes) అనుతత్త్వవేత్త ఆనాటి దేవతలను పరిహాసించెను. పిదప 'సోక్రటీసు' నిర్భయముగ గ్రీకు దేవతలను శృంగారవిలాసినులని నిందించి ప్రాణములగోల్పోయెను. క్రైస్తవమతము యూరపురాజకీయముగా వెలువడినప్పటినుండియు తత్త్వశాస్త్రస్వాతంత్ర్య మడుగంటి మతమున కంగముగమాత్రము మిగిలెను. కాని తత్త్వవేత్తలగు 'బేకను', 'డీకార్టు'లకాలమునుండియు తత్త్వశాస్త్రమునకు, మతమునకు భేదము విజృంభించి యీనాటివరకును నిలిచియేయున్నది. ఇప్పుడు విజ్ఞానశాస్త్రము, తత్త్వశాస్త్రము, మతములు అన్యోన్యాధారములేక తమతమప్రత్యేకవిషయముల స్వాతంత్ర్యముగనుండుట సమంజసమని యూరపువారిభావము.

భారతదేశమందు దీనికి కేవలవిపరీతపరిస్థితి గలదు. తత్త్వశాస్త్రమునకును మతమునం కెంతమాత్రము విరుద్ధభావముండతగదనియు, వాని కవినాభావసంబంధమనియు, తత్త్వజ్ఞానియే మతగురువనియు, భారతీయులు తమనాగరికత కది ప్రత్యేకాలంకారమనియు నెంచెదరు. ఇది యూరపుదేశస్థునకు వెగటుగా దోచును. భారతతత్త్వశాస్త్రములలోని నిస్సారత

యిదియేనని చాటును. ఈవిరోధముమాత్రము సమన్వయానర్హము. భరతఖండమందొకవ్యక్తి తనమతమందుద్భవమందినరీతినే ఒక్కొక్కతత్త్వశాస్త్రమునందు పుట్టి తనమతమునందలి విశ్వాసము పట్టుదలతోనే తన తత్త్వశాస్త్రగ్రంథముల సహితము పఠించును. అద్వైతు లద్వైతశాస్త్రములను, ద్వైతులు ద్వైతగ్రంథములను, విశిష్టాద్వైతులు విశిష్టాద్వైతశాస్త్రములను అత్యంతపవిత్రము లనుబుద్ధితో పఠింతురు. పాశ్చాత్యదేశములందువలె తత్త్వశాస్త్ర మొకభిన్నశాస్త్ర మనుభావము బ్రిటిషువారివిద్యావిధానము భరతఖండమందడుగిడిననాటి నుండియే ప్రారంభము. ఇచట వైదికధర్మపరమావధి వేదమందేగలదనియు, తన్నిర్ణయవేదభాగ మగునుపనిషత్తులే శరణ్యమనియు, నందుపరస్పరవిరోధము లేదని చూపువ్యాససూత్రములును, తద్రహస్యము సంక్షిప్తముగ శ్రీకృష్ణభగవానుడు గీతలందుపదేశించెను గాన నవియు బ్రహ్మవిద్యాభోదకములనియు తలంతురు. అందువలననే శ్రీశంకరభగవత్పాదులు తనయమూల్యమైనయద్వైతసిద్ధాన్తము తనప్రకరణగ్రంథముల స్వతంత్రముగ నిరూపించి అదియే ఉపనిషద్గీతాశాస్త్రవ్యాససూత్రముల రహస్యములని ప్రస్థానత్రయభాష్యరూపమున సప్రమాణముగ పరమతసిద్ధాన్తఖండనరూపమున వ్యాప్తిగావించెను. అట్లే శ్రీరామానుజాదిమతాచార్యులు తమసిద్ధాన్తముల బోధించిరి.

౪. పైభేదములనుండి మఱియొక భేద మవశ్యము వచ్చెను. ప్రథమమున నుడివినట్లు జ్ఞానము స్వాతంత్ర్యపరమావధిగాక సాధనమాత్రమే యైనచో భారతదేశమందది దేనికి

సాధనము? "జ్ఞానాదేవహి కైవల్యం." వేదశిరోవతంసములు రహస్యసత్యమును స్వానుభవమునకు దెచ్చుకొనుటకు జ్ఞానము త్తమసాధనము. ఆసత్య మద్వైతులకు బ్రహ్మాత్మైక్యము. 'తత్త్వమసి', 'అయమాత్మాబ్రహ్మ' ఇత్యాదిమహావాక్యముల రహస్యమగుతత్త్వము ప్రత్యగాత్మపరమాత్మల కభేద మనునవగతియే. స్థూలసూక్ష్మకారణశరీరభిన్నమగుప్రత్యగాత్మయే మాయాకల్పితవిశ్వతైజసప్రాజ్ఞశరీరవిభిన్నమగు పరమాత్మయని భాగత్యాగలక్షణచే కల్పితోపాధుల ప్రవిలాపమున నెఱుంగనగును. ఆప్రత్యగాత్మపరమాత్మలు భిన్నములనియు, నారెంటికిని సాలోక్యసారూప్యసామీప్యాదులు గమ్యస్థానములనియు నితర వేదాన్తములవారి సత్యములు. అద్వైతులు భక్తి, కర్మోపాసనముల నానుషంగికసాధనములుగను, జ్ఞాన మొత్తమసాధనముగను బరిగణింతురు.

4. ఇండియాలో భారతేతరదేశములం దెచ్చటను గానరానిభేద మొండుగలదు. ప్రతిప్రాణికిని వర్తమానజన్మమునకు పూర్వమందును, పరమందును జన్మాంతరపరంపర యుండుననియు, పూర్వజన్మములలోని సుకృతదుష్కృతములబట్టి ఉత్తరోత్తరజన్మములు నిర్ణయింపబడుచుండుననియు లోకములో గానవచ్చుసుఖదుఃఖతారతమ్యములకు కారణము పూర్వజన్మకర్మవిపాకమే యనునట్టిసిద్ధాన్తము భారతదర్శనకారులందఱు నేకగ్రీవముగ నంగీకరించునట్టిది. అయిన నీసిద్ధాన్త మితర తత్త్వవేత్తలలో నెచ్చటను యూరపునగాని, అమెరికాలోగాని కానము. అందువలన సుఖదుఃఖతారతమ్యతకు తృప్తికరమగు సమాధాన మితరతత్త్వవేత్త లీయజాలరైరి. అది కేవల మైవా

గీన మన్న చో నాదైవమును వైషమ్య నైర్ఘృణ్యాదోషము లాపాదించును. ఆదోషములు కర్మవాదమువలననే పరిహరింప బడగలవు. పూర్వపు గ్రీకుతత్త్వవేత్త 'పైతాగరాసు' (Pythogoras) మాత్రము పూర్వజన్మములు నరులకు గలవని వాదించెనుగాని యితరతత్త్వవేత్తలెవరును అంగీకరింపలేదు.

5. ఈతత్త్వదృక్పథభేదములబట్టి యూరపునకును, ఇండియాకును మానవుని నైతిక, సాంఘిక జీవనవిధానముల ప్రధాన భేదము లుండకతప్పదు. యూరపులో నైహికానందమే పరమానందియని మానవునిజీవితలక్ష్యము. పూర్వము గ్రీకు తత్త్వవేత్తలు మానవుల కత్యున్నతసౌఖ్య మేవిధమగు సాంఘిక రాజకీయపరిస్థితులలోనుండునో దాని నన్వేషించిరి. 'ప్లేటో', 'అరిస్టాటిల్' మహాశయులు తమగ్రంథముల నట్టిసాంఘికరాజకీయపరిస్థితులను నిర్ణయించిరి. క్రైస్తవమతవిజృంభణముతో కొంతవరకు ప్రపంచము దుఃఖభూయిష్టమనియు, క్రైస్తవ స్వర్గసౌఖ్యముకొరకపేక్షించుట మానవకర్తవ్యమనియు ప్రబోధముసాగెను. కాని అది మధ్యయుగమునాటి క్రైస్తవమత ప్రవక్తలవరకే వ్యాపించినదిగాని జనసామాన్యముల కంటలేదు. అందువలన యూరపునందు ప్రబోధము జనసామాన్యపు నృత్యగానమధుపానవినోదవిహారజీవనములను మాన్పజాలదయ్యెను.

భారతదేశమునందు మానవుని నైతిక, సాంఘికజీవన విధాన మన్యగతి నుండును. ఇహలోకమున సుఖదుఃఖములు కావడికుండలని యెంచి, సుఖదుఃఖాకరజన్మపరంపరారూపమగు సంసారమునుండి మానవుడు మోక్షమార్గమును కాంక్షించును. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికతాపత్రయాభీలదావాగ్నుల నార్ప

జాలునమ్మి తత్సృష్టికై పరితపించును. పునరావృత్తిరహితశాశ్వత బ్రహ్మానందస్వరూప మగు బ్రహ్మనిష్ఠ యను 'నిష్కళంకముక్తి స్థితి' జూపు జ్ఞానాంజనమునకై సద్గురువు నాశ్రయించును. ఉపనిషత్తులు శాశ్వతానందమునకు నుత్తమమార్గమును ప్రదర్శించినవి.

అద్వైతమతము ప్రకారము 'బ్రహ్మము - సత్యము', 'జగము - మిథ్య' యనుటవలన శ్రీశంకరాచార్యులు మాయావాదులనియు నీజగము ఇంద్రజాలికుని సృష్టివలె మాయామయము వినోదమయకల్పితమైనట్టి సందేహపదార్థములు సత్యాభాసములే గాని సత్యములు కాజాలవనియు, నట్టి యసత్య, అయథార్థకల్పిత ప్రపంచమునందు మానవుని ప్రవర్తనము, సాంఘిక నైతికజీవన మార్గాభివృద్ధి కవకాశము గాని యవసరముగాని లేదనియు, నట్టిబోధలు సాంఘికజీవననిర్మూలన మొనర్చుననియు పాశ్చాత్యులాక్షేపించిరి. కాని అద్వైతమతమందు సత్య శబ్దము త్రికాలాబాధ్యము అనగా సృష్టికిపూర్వము, సృష్టికాలము, సృష్టికిపరము - యీమూడుకాలములందుండునిర్వికారవస్తువే సత్యమనునర్థమునందు ప్రయోగించిరి. అట్టి సత్యవస్తువు సచ్చిదానందరూప మగుపరబ్రహ్మ మొక్కటియే అద్వితీయముగ నుండుననియు, తదన్యమంతయు మిథ్యయనియు సిద్ధాంతము. మిథ్యాశబ్దముగాని మాయాశబ్దముగాని జగత్తునకు వర్తింపజేయుటలో శ్రీశంకరాచార్యులయభిప్రాయము జగత్తునకు పారమార్థికసత్యత్వము అనగా త్రికాలాబాధ్యమైన సత్యత్వము (Absolute reality) లేదని యర్థముగాని వ్యావహారిక సత్యత్వము (Kalative reality) లేదనిభావముగాదు.

స్వప్నావస్థనున్నవానికు స్వాప్నికప్రపంచము తత్కాలమున వాస్తవముగనే కనుపించి మేల్కాంచి జాగ్రదవస్థను బొందిన వెంటనే తనస్వప్నప్రపంచమంతయు మనఃకల్పితము మిథ్యా మాత్రమే అని యెట్లు నెఱుఁగునో, అట్లే పారమార్థికప్రబోధము బొంది పరమార్థనిష్ఠుఁడగు బ్రహ్మజ్ఞాని తనకిప్పటివఱకు వ్యావహారికప్రపంచముగ నుండుట కల్పితమనియు అప్పటివఱకి వ్యవహారప్రపంచము సత్యమే యనియు నాపేక్షికసత్య మను (Relative reality) యథార్థసత్యముగ (Absolute reality) భావింపఁబడదనియు నందువలననే జాగ్రత్ప్రపంచము (పారమార్థికముగ) సత్యమనిగాని, (వ్యావహారికముగ) నసత్య మనిగాని నిర్వచించుటకు వీలులేనిదిగాన 'యనిర్వచనీయ'మని శ్రీశంకరభగవత్పాదులు వివరించిరి. యూరపుతత్త్వవేత్త లభి ప్రాయపడినట్లు వ్యావహారికప్రపంచమునందు ప్రవర్తింపవలసిన సాంఘిక, నైతిక రాజకీయజీవనమున కద్వైతమతాచార్యులు విరుద్ధాభిప్రాయముల నెన్నఁడును బోధింపలేదు. వ్యావహారిక ప్రపంచజీవనవిధానమును గుఱించియే వేదవేదాంగములలోని విధినిషేధశాస్త్రములను శ్రౌతస్మార్తగృహ్యసూత్రకల్పసూత్ర గ్రంథము లవశ్యపఠనీయములనియు, ప్రథమద్వితీయతృతీయ పురుషార్థము లగుధర్మార్థకామము లవశ్యానుష్ఠేయములుగను ప్రదర్శించి, పరమపురుషార్థసాధన మగుమోక్షస్థితికి సోపాన ముగ నుండదగునని గాని 'జగత్తుమిథ్య' అనఁగా లేనిదిగాన స్వేచ్ఛావిహారులై చార్వాకమతనిష్ఠులైన దేహాత్మవాదులవలెఁ జరింపవచ్చునని అద్వైతమతశాస్త్ర మెన్నఁడు నంగీకరింప జాలదు. ఉత్తమభూమికయగు బ్రహ్మనిష్ఠను బొందుటకుఁ బూర్వ

మెన్నియోజన్మము లెత్తి వానిలో స్వవర్ణాశ్రమధర్మముల వేద విధి ననుష్ఠించి పుణ్యకృత్యము లెన్నియోకోట్లకొలది నొనర్చి, తపస్సుల నాచరించి, ఉపాసన లొనర్చి తత్సిద్ధి బొంది యమనియమాసనప్రాణాయామాది బహువిధవిజ్ఞానసాధనము లొనర్చి సగుణనిర్గుణసమాధినిష్ఠల నభ్యసించి యందారితేరినజితేంద్రియులకు సన్న్యాసము కర్తవ్యముగాని చిత్తశుద్ధిగల్గునంతవరకు కామ్యాధికారి కామ్యకర్మముల నుత్తమాధికారి నిష్కామకర్మముల యథావిధి నాచరించితీరవలయుననియు అద్వైత సిద్ధాన్తము. మానవజన్మము మోక్షప్రయత్నమునకు సాధనము గాన నయ్యది దేవతాలోకవాసముకంటె నుత్తమమని విజ్ఞలూహింతురు. బ్రహ్మభావమును బొందినజ్ఞాని దృష్ట్యా ఈ లోకము మిథ్య యనియు, బ్రహ్మముకంటె నన్యముకాదనియు బ్రహ్మమే అజ్ఞానదశయందు జగద్రూపమున రజ్జువుసర్పము వలె గాన్పించినట్లు గాన్పించెననియు నిశ్చితజ్ఞానమున నుండును కాని యాభూమిక కీషణ్మాత్రమైనను తక్కినభూమికయందున్నమానవుల కందఱకును భూలోకమేగాక; పదునాలుగు లోకములును సత్యములేగాని మిథ్యాభూతములుగానేరవు. ఆలోకములలోని ధర్మములును సత్యములే. ఇయ్యది యుపనిషత్సిద్ధాన్తము. దీనిని పాశ్చాత్యతత్త్వవేత్తలు చక్కగ గ్రహించి నట్లు కానుపించదు.

6. యూరపుతత్త్వవేత్తలు శబ్దప్రమాణము నంగీకరింపరు. మనవేదములోవలె పవిత్రగ్రంథములులేవు. బైబిలు పాశ్చాత్యులకు కేవలమతగ్రంథమేగాని తత్త్వవేత్తలు దానిని

ప్రమాణముగ నంగీకరింపరు. భారతీయతత్త్వవేత్తలకు వేదము పరమప్రమాణము.

## ప్రపంచ సృష్టి (Creator)

పాశ్చాత్యవిజ్ఞానవాదులు (Western Scientists) నామరూపాత్మకమగు సర్వప్రపంచము కేవలపరమాణుసంయోగజనితపరిణామ మనితలంతురు. భారతదర్శనములలోని న్యాయమతము ననుకరింతురు. ఉభయులును అచేతనము లగుపరమాణువులకు బ్రప్రథమమున క్రియాశక్తి యెట్లుకలిగె ననుప్రశ్నకు సమాధాన మీయజాలరైరి. విజ్ఞానశాస్త్ర మెప్పుడును ప్రకృతి (Nature) యెట్లు పరిణామమును బొందుచున్నదో వివరింపయత్నించునుగాని యది యెందు కట్టిపరిణామమునుబొందుచున్నదో జెప్పుట వారిపనికాదు. అయ్యది తత్త్వవేత్తలకుగాని మతప్రవక్తలకుగాని వదలవలసిన విషయ మనిభావింతురు.

క్రైస్తవబైబిలునందు "ప్రపంచమంతయు సృష్టికి పూర్వము పృథ్వీరూపమున లేదనియు మహాజలార్ణవముగనుండి యంధకారబంధురముగ నుండెననియు భగవంతు డాజలము నుండి భూలోకమును సృజించెననియు" చెప్పబడినది. భారతదర్శనములందు వేదాన్తులు సృష్టినిగూర్చి విపులముగ జర్చించిరి. నామరూపాత్మకమగునీసకలప్రపంచము జడమయమనియు చేతనత్వములేకపోవుటవలన దాని చేతనుడగుజగత్కారణుడు సృజించెననియు ననిరి. ఏతన్మాత్రమున నిమిత్తకారణు డీశ్వరుడు గావచ్చును. కాని యీశ్వరుడే పదార్థమునుండి జగత్తును

సృజించెను? అనగా నుపాదానకారణ (Material cause) మెయ్యది? 'సదేవసౌమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్' అని యుపక్రమించి "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజో అసృజత" అని ఛాందోగ్యోపనిషత్తు సృష్టికిపూర్వ మద్వితీయ పరబ్రహ్మమొక్కటియే సద్రూపమున నుండెననియు నాబ్రహ్మము 'తా ననేకమగుదునని' సంకల్పమాత్రముననే నామ రూపాత్మకమగు ప్రపంచమును సృజించెననియు నాసంకల్పమే తపస్సని తైత్తిరీయము 'సతపోఽతప్యత, సతపస్తప్త్వా ఇదంసర్వము సృజత' అని వివరించెను. జగత్తును సృజించి తత్సృష్ట్వా త దేవానుప్రావిశత్" అని జీవరూపమున తానందు ప్రవేశించె ననియు జెప్పబడుచున్నది. ఈవిధమున బ్రహ్మమే జగత్తున కభిన్ననిమిత్తోపాదానకారణమని నిరూపింపబడియెను. ఐంద్ర జాలికుడు తన యింద్రజాలముచే నిర్మింపబడిన పదార్థముల నెల్లను సత్యములని తనమాయాశక్తివలన నేవిధమున మనకు తోచు నట్లు జేయునో నిత్యసత్యస్వరూపుడగు పరబ్రహ్మము తనమాయా శక్తిచే నీయనిర్వచనీయమును, అవిచారితరమణీయము కేవలనామరూపాత్మకమాత్ర మగుజగత్తును తనసంకల్ప మాత్రమున కల్పించి సత్యమువలె కనుపింపజేయుచుండెననియు బ్రహ్మనిష్ఠులై యథార్థసత్యస్వరూపసాక్షాత్కారావగతిని బొందువరకు మానవులకీజగత్తు సత్యముగ (అనగా వ్యావహా రికదృష్ట్యా సంపూర్ణసత్యస్వరూపము కలదిగ) నే కనుపించుననియు ప్రబోధానంతరమందే దానిమిథ్యాస్వరూప మవగతమగుననియు సన్నిహితులందు నయ్యది వాస్తవముగ బ్రహ్మాభిన్నమనియు నద్వైతులభావము

ఇచట మాయావాదమునుగూర్చి యించుక విచారించె దను. జగత్తు మాయాకల్పిత మన్నచో మాయకు ప్రత్యేక సత్తా లేదు. మాయ నిర్గుణబ్రహ్మమునందు నిగూఢముగ (potential state) నున్నదొకానొక అఘటనాఘటనసమర్థ మగుశక్తివిశేషము. అది బ్రహ్మమున కనన్యము. జగత్కల్పన యందు బహిర్గత (kinetic) మగును. ఆస్థితియందు నిత్యశుద్ధ బుద్ధముక్తస్వభావము, సర్వజ్ఞము, సర్వశక్తిసమన్విత మగు బ్రహ్మమే మాయాశబలితమై, జగత్కారణుడైన యీశ్వరు డగును. ఆమాయాశక్తివలననే బ్రహ్మము అవిద్యావశు లైన వారికి ప్రపంచరూపమున ద్యోతక మగును. శ్రీశంకరా చార్యులు విశ్వము దర్పణదృశ్యమాననగరీతుల్యమనియెను. నేటి చలనచిత్రదృశ్యములన్నియు నొక శుభ్రవస్త్రమందే (screen) గాంచుచున్నాము. నిజముగ చిత్రములన్నియు నొకానొకశక్తిచే నన్యదేశమునుండి యావస్త్రముమీద కల్పింపబడి అంతటే చలించుచున్నట్లు కానుపించుచున్నను చూచునప్పుడు చలనచిత్రదృశ్యమంతయు వస్త్రప్రదేశమునందే ఉన్నట్లు కానుపించును. అట్లే బ్రహ్మము నిజాంతర్గత మగు ప్రపంచమును మాయాకలనవలన బహిర్గతమగునట్లు కాను పింపజేయును. ప్రపంచసృష్టికీమాయాశక్తియే కారణము. నేటిభౌతికశాస్త్రవేత్తలు పరమాణువుల నింకను పరిశోధించి ఎలెక్ట్రాను, ప్రోటాను అనుశక్తివిశేషమువలన నవి యుద్భ వించెననియు. నాశక్తియే జగత్కారణమనియు నద్వైతవాద మునకు దరిజేరుచున్నారు. ఆశక్తి ఎవరిశక్తి యనుప్రశ్నను వెంటనే వేసికొనవలసివచ్చును. ఆశక్తిని కనుగొనుట కష్టతర

మని "మమమాయాదురత్యయా" అని శ్రీకృష్ణభగవానుడు నుడివి సర్వధర్మములను పరిత్యజించి మాయాధిపుడైన శ్రీకృష్ణ పరబ్రహ్మమునే తనస్వస్వరూపముగను, సర్వాత్మరూపముగను సాక్షాత్కారమును బొందినవారే ఆమాయను తరించెద రనియెను.

ఈగతిపృథక్పథములం దత్యంతపరస్పరభిన్నతలున్నను వివిధ సమన్వయపఱచి ఉభయతత్త్వములలోనిసారమును గ్రహించి నవీనతత్త్వవేత్తలు ప్రపంచమునకంతకు సత్యస్వరూప మొక్కటియే భావ్యముగాని భిన్నసత్యము లుండజాలవని ప్రపంచైకతత్త్వమును (World Philosophy) నిర్ణయించుటకు ప్రబలప్రయత్నము లొనర్చుచున్నారు.

భారతదర్శనములలో నుత్తమమగునుత్తరమీమాంసాదర్శనము బ్రహ్మవిద్యాబోధకము ఉపనిషత్తులు తత్త్వరహస్యములకు గనులు. అయ్యవి ప్రతివేదమునందును తుదిభాగములుగ నున్నవి. వేదముల తాత్పర్యనిర్ణయ మొనరించునవిగాన నయ్యవి వేదాంతములనియు, నందలిరహస్యములు జన్మజరామరణాదిదుఃఖముల సంపూర్ణముగ నాశనమొనర్చి బ్రహ్మమును బొందించునుగాన నుపనిషత్తులనియు వ్యవహరింపబడెను. ఆయుపనిషత్తులు అనేకము లున్నను అందు శ్రీశంకరభగవత్పాదులు ప్రధానబ్రహ్మవిద్యాబోధకములుగ నెంచిన ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయైతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకము లనుదశోపనిషత్తులకును భాష్యముల రచించిరి. ఆరహస్యమంతయు గీర్వాణభాషనుండుటవలన పండితసాధ్యమేకాని తదితరుల కసాధ్య

ములుకాని నాపదియుపనిషత్తులకును భాష్యములలోని రహస్యవివరణములతోఁగూడ నాంధ్రభాష గద్యరచనలనొనర్చి అద్వైతమతమును సప్రమాణముగ సవిమర్శకముగ నిరూపించి మృదుమధురశైలిని జిజ్ఞాసువుల కందిచ్చి తృప్తికరమగు గద్య రచనలరూపమున తెల్గుబాసలో నుపనిషత్తులు లేని లోపమును తీర్చిన నీగ్రంథకర్త కనేకనమస్కృతులు.

ఈభారతపాశ్చాత్యతత్త్వవివేకరూప మగుదొలిపలుకు నాగురువర్యు లగుగ్రంథకర్తయానతిని వ్రాసితిని. వేదాన్తపారీణ బ్రహ్మశ్రీ రాయప్రోలు లింగనసోమయాజిగారు గీర్వాణాంధ్రాంగ్లభాషాకోవిదులు పంచదశిగ్రంథమునకు స్వతంత్ర వ్యాఖ్యాన మొనరించి బరోడాసంస్థానపండితమండలిచే మన్ననల బడసిరి. తైత్తిరీయవార్తికమునకు ప్రస్తుతమున్నవ్యాఖ్య సంక్షేపముగనున్నదనులోపమును గ్రహించి విపులవ్యాఖ్యను రచించిన పండితోత్తములు. వారియుపనిషద్గ్రంథము లాంధ్రలోకమునను పరమోపకారకము లగునుగాత.

ఇట్లు

'వేదాన్తపారీణ' డాలిపర్తి దుర్గాప్రసాదరావు

శ్రీగురుభ్యోనమః

# ఉపనిషచ్చంద్రిక

## ప్రథమ మయూఖము

## తైత్తిరీయోపనిషత్తు

### ఉపోద్ఘాతము

మనుజులు స్వభావముచేతను, ప్రవర్తనాదులచేతను, నామరూపాదులచేతను విభిన్నులయి ప్రత్యేకవ్యక్తిత్వమును బొందియున్నారు. ప్రతిమనుజుడు తనను తాను "నేను, నేను" అని చెప్పుకొనుచున్నాడు. మనుజులందరియందు 'నేను' అను శబ్దము సామాన్యవాచక మగుచున్నది. ఈ 'నేను' అను శబ్దమున కర్థమేమి? ఆ శబ్దముచే నెవరు చెప్పబడుచున్నారు? 'నే నాలోచించుచున్నాను'; 'నేను చూచుచున్నాను'; 'నే నుద్యోగము చేయుచున్నాను'; 'నే ననుభవించుచున్నాను' మొదలగు ప్రయోగముల ననుదినము మనము వాడుకొనుచున్నాము. ఈ ప్రయోగముల వలన నాలోచించుట, చూచుట, ఉద్యోగము సేయుట,

నేనన నెవరు?

అనుభవించుట మొదలగు కర్మలను జేయువాడును, వాని ఫలము ననుభవింపువాడు నొక డున్నాడనియు, అతనికి యాలోచనాదిక్రియలకు మనస్సు నేత్రములు కరచరణములు మొదలగు నిన్ద్రియములు సహాయభూతము లగుచున్నవనియు, యీ యిన్ద్రియములు కర్మల నాచరించుచు వాని ఫలము ననుభవించువానికంటె వేరనియు తేలుచున్నది. అనగా నతడు కర్మాచరణసాధనములగు మనశ్చక్షురాదీన్ద్రియముల కునికి పట్టగు దేహములో నున్నను దానికంటె భిన్నుడనియు కర్తృత్వము భోక్తృత్వము మొదలగు గుణములు గల్గియున్నాడనియు తెలియుచున్నది. వివిధావయవోపేతమగు నీదేహ మచేతనము. 'నేను' అను నత డచేతనమగు నీదేహములోనుండి దాని సహాయముచే చేతనసాధ్యములగు వివిధకర్మల నాచరించుచున్నాడు. కనుక నతడు చేతనుడు గావలయును. రథమును నడిపించు సారధివలెనే నీ శరీరరథమును నడిపించునతడు చేతనాత్మకుడు గానిచో నది నడువలేదు. "నే"నను నీ చేతన వస్తువు దేవనరాదిసమస్తశరీరములయందుండి వానిని నడిపించుచున్నది. మేల్కొనియుండునప్పుడు పదార్థములన్నియు నిన్ద్రియసహాయముచే ప్రత్యక్షముగ ననుభవింపబడుచున్నవి. స్వప్నమునం దిన్ద్రియము లుపరమావస్థను జెందియున్నకాలమునగూడ నీపదార్థము లనుభవింపబడుచున్నవి. సుషుప్తి (నిద్దుర) యందు మన స్సిన్ద్రియములతోగూడ నుపరమించినను సుఖమనుభవింపబడుచున్నది. విభిన్నమగు నీయవస్థాత్రయము నందునుగూడ నీచైతన్యమే యుపస్థితమయి విషయములను గ్రహించుచున్నది. సర్వవిషయగ్రహణకారణమగు నీచైతన్యము

జాగ్రదాద్యవస్థాత్రయముకంటెను, అక్కాలములయందు గ్రాహ్యములగు పదార్థములకంటెను భిన్నమయి తీరవలయును. మఱియు నీ చేతనపదార్థము వివిధశరీరములయందుండి 'నేను' అనుశబ్దముచే వ్యవహరింపబడుచు నాయాయింద్రియముల ద్వారా బాహ్యమునకు స్ఫురించుచున్నది. ఈ చేతనపదార్థమునకు వ్యవహారమునందు మనస్సు ముఖ్యసాధనము.

చేతనుడనబడునతడు మనస్సు సంకల్పించిన ప్రకారము వ్యవహరించుచున్నాడు. మనస్సు సంకల్పింపక ఊరకయుండునట్టి గాఢనిద్ర మొదలగు సమయములయం దతడు నిర్వ్యాపారముగ నున్నాడు. మనస్సుయొక్క స్వభావమునుబట్టి అతడు చేయు పనులుగూడ మారుచున్నవి. ఒకడు శాంతుడు, సత్కర్మనిరతుడు, మేధావంతుడు; మఱియొకడు ధూర్తుడు, దురాచారుడు, మందబుద్ధియునగు చున్నాడు. జనసామాన్యమునందు మంచి చెడుగుణములు మిశ్రితము

జీవుడు

లయి కాన్పించుచున్నవి. బహువిధమగు నిట్టి బాహ్యప్రవృత్తికి మనుజుని మానసికస్వభావమే కారణమగుచున్నది. దేహమునందున్న ఈ చైతన్యవస్తువు మనస్సంయోగము నొంది తదనురూపమగు ప్రవృత్తి నవలంబించుచున్నది. బహువిధమగు మానసికస్వభావముచే రంజితమయి తదనురూపముగ ప్రవర్తించుచు చక్షురాదీంద్రియములద్వారా బయటికి నభివ్యక్తమగుచున్న ఈ చేతనవస్తువే జీవుడని చెప్పబడుచున్నాడు. అతడు ధర్మాధర్మాదివివిధకర్మల నాచరించుచు వాని ఫలము ననుభవించుచున్నాడు. "నేను చేయుచున్నా"

ననునహంభావమును చెందియున్నాడు. మనశ్చక్షురాదీన్ద్రియముల సహాయముచే వివిధవిషయజ్ఞానమును సంపాదించుచున్నాడు. వివిధపదార్థముల ప్రకాశింపచేయు సూర్యకాంతి వలె విషయముల ప్రకాశింపచేయు నీ చైతన్యము ప్రకాశస్వరూపము గావలయును. కనుక జీవుడు దేహాతిరిక్తుడు, చేతనము, ప్రకాశస్వరూపుడు, మనఃసంబంధముచే కర్తృత్వము భోక్తృత్వము మొదలగు గుణములు గలవాడగుచున్నాడు.

**ఆత్మ**

గాఢనిద్రయందువలెనే అతనికి మనఃసంయోగము లేనపు డతడు సర్వక్రియారహితుడగుచున్నాడు. అపుడు ధర్మాధర్మరూపమగు క్రియాచరణమునకను దాని ఫలానుభవమునకు నతడు దూరుడగుచున్నాడు. దేహాతిరిక్తము సర్వధర్మశూన్యము సర్వక్రియారహితము ప్రకాశస్వరూపము నగు నీ చైతన్యమే యాత్మ యని చెప్పబడుచున్నది. మనఃసంబంధము కలిగినపుడు మానసికములగు కర్తృత్వభోక్తృత్వాదిగుణము లద్దాని నావరించుచున్నవి. కనుక ఆత్మ స్వయముగా సర్వగుణవిరహితుడనియు మనస్సంబంధముచే నతనికి వివిధగుణములు తాత్కాలికముగ సంభవించుచున్నవనియు స్పష్టమగుచున్నది. ఆత్మయే మనస్సుచే నారోపింపబడిన గుణములతో కూడుకొని యున్నపుడు జీవుడగుచున్నాడనియుగూడ పర్యవసానము తేలుచున్నది. ఆత్మ దుష్యంతపాత్రను ధరించిన గోపాలునివలె జీవునికంటె నన్యము గాదు. ఇట్టిజీవుడే నేనని వ్యవహరింపబడుచున్నాడు.

సృష్టిమొదలు నింతవరకీయాత్మ నిర్వికారమయి సర్వ ప్రాణికోటియందు ప్రకాశించుచున్నది. ఇకముందు నటులనే యుండగలదు. కాలమునుబట్టి దానియం దెట్టిభేదమును సంభవించుటలేదు. గడిచిపోయినట్టియు, ముందు రాగలిగినట్టియు యుగసహస్రములయందుగూడ నద్దాని కేమార్పును రాలేదు, రాదు. కాలత్రయము నందును నిర్వికారముగ నుండగల్గుటచే నాత్మ నిత్యమగుచున్నది. ఈ యాత్మచైతన్యము బ్రహ్మము మొదలు కీటపర్యంతము జీవరూపమున మహత్తమమధ్యమపరిణామములుగల వివిధశరీరములయం దాయాపరిమాణముల

ఆత్మ సర్వవ్యాపి. నిత్యము

గలిగియున్నటుల నభివ్యక్తమగుచున్నది. కనుక నది సర్వవ్యాపి యగుచున్నది. ఆత్మ సర్వవ్యాపి యయినపుడే వివిధపరిమాణములు గల దేహములలో నద్దాని యభివ్యక్తి సాధ్యమగును. మహాకాశము సర్వవ్యాపి యగుటచేతనే పరిమితపరిమాణములు గల ఘటశరావాదులలో వాని పరిమాణపరిమితిని బొందినట్లగుపడుచున్నది. ఘటశరావాదులు విచ్ఛిన్నములయినపు డవ్వానియందు పరిమితముగ గాన్పించుచునుండి యున్న యాకాశము మహాకాశములో నైక్యమొందుచున్నది. ఘటశరావాదికృతభేదము కనుపడదు. అటులనే సర్వవ్యాపి యగు నాత్మ దేహాదివివిధోపాధులచే పరిమితమయినట్లగుపడినను, దేహములంతరింప మరల తనయపరిమితత్వమును బొందుచున్నది.

ఆత్మ సర్వవ్యాపిగనుక నదిలేనిచోటు లేదు; నిత్యము గనుక నదిలేనికాలము లేదు. అందువలన మఱియొకవస్తు

వెక్కడను యెప్పుడు నుండవీలులేదు. అనగా నాత్మ యద్వితీయ మనదగుచున్నది. ఇట్లాత్మచేతనాత్మకము, నిత్యము, నిర్వికారము, శుద్ధము, జ్ఞాన ప్రకాశస్వభావము, నిర్ధర్మము, నిష్క్రియము జీవునికంటె ననన్యమని సిద్ధమగుచున్నది. మనస్సను నుపాధిసంబంధముచే నద్దానికి జీవుడను వ్యవహార మేర్పడుచున్నది. ఈయాత్మచైత న్యము మనస్సు, కర్మజ్ఞానేన్ద్రియములు మొదలగువానిద్వారా నభివ్యక్తమగుచున్నది. ఆత్మచైతన్యము ప్రకాశించు ప్రసంతు లన్నియు నద్దాని యుపాధులనంబడును. ఆత్మచైతన్యము స్వయముగా నామరూపాదిగుణవిశేషరహితమయినను ఉపాధి గుణములచే సంస్పృష్టమయి యాతూాగుణములను గల్గి యున్నట్లు కాన్పించును. వీణ, నాగస్వరము, ఫిడేలు మొద లగు వాద్యములు గానముసేయుబడు శంకరాభరణరాగ మొక్కటియేయయినను నుపకరణభేదముచే నాదభేదము నొందుచున్నది. ఈయాత్మయే శరీరసంబంధముచే చెప్పవలసి వచ్చినపుడు ప్రత్యగాత్మయనియు సృష్టిసంబంధముచే చెప్ప వలసివచ్చినపుడు బ్రహ్మము, పరబ్రహ్మము లేక పరమాత్మ యనియు బిలువబడుచున్నాడు.

ఆత్మలక్షణము

మన కన్నులకగుపడుచున్న జగత్తు సృష్టికి పూర్వ మదృష్టము; ప్రస్తుతము దృష్టము; లయము తరువాత నష్టము. కుమ్మరివానిచేత చేయుబడు ఘటమువలె నదియు నొక కార్యమగుచున్నది. కనుక దానికి కుమ్మరినిబోలు నొక కారణముండవలెను. మానవ

జగత్తు కార్యము

బుద్ధి శతీతమగు విచిత్రరచనావైభవముతో నొప్పారు నీ జగత్తుయొక్క కారణము సర్వజ్ఞము సర్వశక్తిమంతము కావలయును. పరబ్రహ్మమే యిట్టి సర్వజ్ఞము సర్వశక్తిమంతము నగు జగత్కారణము. మనస్సు మొదలగు నుపాధులచే నారోపితము, నహంకారనిమిత్తమునై కర్తృత్వభోక్తృత్వాదులచే నుపలక్షితమునగు జీవభావ మాత్మయం దారోపింపబడినదని గుర్తెరింగి యతనినుంచి యాధర్మములను నూతనముగా ధరించిన దుష్యంతవేషమువలె తొలగించి నిత్యత్వము అద్వితీయత్వము సర్వవ్యాపకత్వములచే సూచింపబడు ఆత్మయే స్వస్వరూపమని తెలిసికొని అద్దానిసాక్షాత్కారము చేసికొనుటయే మోక్షము. ఇట్టి జ్ఞానమును బోధించుటయే సర్వోపనిషత్తాత్పర్యము.

బ్రహ్మము
జగత్కారణము

జన్మమునకు మోక్షము పరమావధియని మతకర్తలందరంగీకరించియున్నారు. మోక్షశబ్దము ముక్తిపదమునకుం బర్యాయము. జననమరణాత్మక మగు సంసారబంధము వీడిపోవుటయే ముక్తి. నిద్ర లేచినదిమొదలు పరుండువఱకు మనము మానసికవాచికకాయికములలో నేదియోయొక కర్మము నాచరించుచుందుము. జనసామాన్యమునకు కేవల మూరకుండుట సులభము కాదు. కర్మము ధర్మాధర్మరూపమగుటంజేసి తనకనురూపమగు పుణ్యపాపఫలము నిచ్చుచు జన్మాంతరమునకుం గారణమగుచున్నది. రమణీయకర్మాచరణులు రమణీయయోనులను, దుష్కర్మాచరణులు సూకరాది యోనులను బొందుదురు. జన్మాంతరమనునది శ్రుత్యనుభవ

సిద్ధము. సుకృతదుష్కృత ఫలము ననుభవించుటకొఱకే మఱి యొకజన్మము గల్గుచున్నది. ఈజన్మమున ననుభవింపబడుచున్న న్యూనాధికస్థితులకంబూర్వజన్మకర్మమే కారణము. పూర్వ జన్మకర్మఫలములేక యీజన్మము కలుగనేరదు. పూర్వజన్మ ఫలము పుణ్యాపాపమిశ్రితమగుటచేతం బ్రబల ఫలము దుర్బలఫలము నరికట్టి దాని ననుభ వించుటకుం దగుజన్మము నిచ్చును. జన్మనిమిత్త మగు ఫలాను భవము పూర్తియయినపు డాజన్మము ముగియును. దీనినే మరణమనుచున్నాము. శేషకర్మానుభవముకొఱకు తిరిగి జన్మము నెత్తుచున్నాము. జననమరణపరంపరానిబద్ధమైన యవ స్థయే సంసారమని చెప్పబడుచున్నది. సంసారనివృత్తియే మోక్షము.

మోక్షశబ్దార్థము

మోక్షము జన్మముయొక్క పరమావధియని మతకర్త లంద రంగీకరించినను దాని స్వరూపమునుగూర్చి వారికభి ప్రాయభేదము గలదు. తత్త్వవిమర్శకులగు వివిధమతకర్తలు తమతమ బుద్ధివైశద్యమున కనుకూలముగ మోక్షస్వరూపము ననేకవిధముల నిరూపించిరి. వీరిసిద్ధాంతములను ప్రదర్శించు నిబంధనగ్రస్థములు దర్శనములని చెప్పబడుచున్నవి. స్వాత న్త్ర్యమను మరణము మోక్షమని చార్వాకులు తలంతురు. ఆత్మోచ్ఛేదమే మోక్షమని శూన్యవాదులు వాదించెదరు. నిర్మలజ్ఞానోదయము మోక్షమని మరికొందఱు బౌద్ధులు చెప్పుదురు. కర్మకృతమగు దేహస్వరూపమయిన యావరణము లేనపుడు జీవునియొక్క

మోక్షస్వరూపము

ఊర్ధ్వగమనము మోక్షమని జైనులభిప్రాయపడుచున్నారు. సర్వకర్తృత్వవ్యతిరిక్తమగు సర్వజ్ఞత్వాదిపరమాత్మగుణావాప్తియు భగవత్స్వరూపానుభవము మోక్షమని రామానుజీయులూహించుచున్నారు. దుఃఖముచే సంపూర్ణమగు నసంస్పృష్టత్వము, జగత్కర్తృత్వము, లక్ష్మీపతిత్వము, శ్రీవత్సలాంఛనము లేనట్టి సంపూర్ణసుఖమే మోక్షమని మాధ్వులమతము. గుణవిశేషవినాశనమే మోక్షమని వైశేషికులు, ఆత్యంతికమగు దుఃఖనివృత్తియే మోక్షమని నైయాయికులు, స్వర్గసుఖము మోక్షమని మీమాంసకులు నిర్వచింతురు. ప్రకృతిపురుష వివేకముచే పురుషుడు స్వస్వరూపమున నుండుటయే మోక్షమని సాఙ్ఖ్యులరాద్ధాన్తము. మూలాజ్ఞానము తొలగుటచే నగు స్వస్వరూపస్థానప్రాప్తియే మోక్షమని యద్వైతసిద్ధాన్తము.

మోక్షస్వరూపమును దెలిసికొనుటయే తత్త్వమును దెలిసికొనుట. జ్ఞానసాధనములు ప్రమాణము లనబడుచున్నవి. వివిధమతకర్త లంగీకరించిన ప్రమాణములు మోక్షమునందువలెనే తత్ప్రమాణముల యందుగూడ వివిధదర్శనప్రవర్తకులకు మత వైవిధ్యము కన్పట్టుచున్నది. ప్రమయన యథార్థజ్ఞానము. దానికిసాధనము ప్రమాణము. ప్రమాణముచే దెలియదగిన విషయము ప్రమేయము. చార్వాకులు ప్రత్యక్షప్రమాణము నొక్కదానినిమాత్రమే ప్రమాణముగ గ్రహించెదరు. చక్షురాదీన్ద్రియములచే ప్రత్యక్షముగ గ్రహింపబడు దేహమే ఆత్మయనియు దేహనాశనమే మోక్షమనియు వీరిమతము. బౌద్ధులు ప్రత్యక్షానుమానములను ప్రమాణములుగ నంగీకరించిరి.

సాంఖ్యులు రామానుజీయులు, మాధ్వులుగూడ ప్రత్యక్షాను మానశబ్దముల ప్రమాణములుగ నొప్పుకొనిరి. నైయాయికు లకు ప్రత్యక్షానుమానశబ్దోపమలు నాలుగును ప్రమాణములే. మీమాంసకుల కర్థాపత్త్యనుపలబ్ధులను మఱిరెండుప్రమాణ ములుగూడ నభిమతములు.

చక్షురాదిజ్ఞానేన్ద్రియములైదును జ్ఞానోత్పత్తిహేతువగు సాక్షాద్వస్తుమనస్సంయోగమునకు ద్వారములై ప్రత్యక్షజ్ఞాన మును కలుగజేయుటంజేసి యవి ప్రత్యక్షప్రమాణములనంబడు చున్నవి. జ్ఞాతపూర్వమగువస్తుచిహ్నమును మఱియొకచోట జూచి యచటనావస్తువున్నదని యూహించుచున్నాము. పొగ యగ్నియునికిందెల్పుటకు తప్పనిగుర్తని యనుభవముచేత మనకు తెలియును. పొగయున్నచోట్లనెల్ల నగ్నియుండునను నిశ్చ యము మనకు గలదు. దూరమునుండి కొండమీద పొగను చూచి యచట నగ్నియుండునని యూహించెదము. ఇట్లూ హించుట యనుమానము. ఈయూహచే పర్వతముమీదికి వెళ్ళి యచట నగ్నిని ప్రత్యక్షముగ జూచెదము. కాశీనగర మును దానిమాహాత్మ్యమును మనము స్వయముగా నెఱుగక పోయినను దానినెఱిగినట్టి యాప్తునివాక్య మును విశ్వసించి యచటికిబోవుదుము. ఇది శబ్దప్రమాణము. విషయబోధసేయుటకు సామ్యమును చూపు దుము. ఇది యుపమానప్రమాణము. అనన్యథాసిద్ధమగు నొకానొకలింగవిశేషముచే అనుక్తమగు వ్యాపారాదికమును బోధించునది యర్థాపత్తి. ఈబలిసిన దేవదత్తుడు పగటిపూట

ప్రమాణవివరణము

భుజింపడనిచెప్పగా బలియుటయనునది భోజనేతరముచే సంభవింపదుగావున నీవాక్యమర్థాపత్తిచే నతని రాత్రిభోజనము బోధించుచున్నది.

శబ్దప్రమాణములన్నిటిలో వేదములు సర్వోత్కృష్టములు. అవి స్వయంభవములగుటచే నపౌరుషేయములు. సృష్టికి బూర్వమే మానుషనిశ్వసితములవలె నప్రయత్నముగ ప్రవృత్తములైన భగవన్నిశ్వసితములగు వేదములను బ్రహ్మదేవుడు వినివానిని లోకముల కందజేయుటచే వానికి శ్రుతులను పేరు గల్గెను. ప్రత్యక్షాదిప్రమాణములచే మానుషబుద్ధికందరాని యజ్ఞాతవిషయముల నవి మనకు దెలియజేయుచున్నవి.

వేదములు స్వతఃప్రమాణములు

వేదములు స్వతఃప్రమాణములు. ప్రమాణేతరములన్నియు పరతఃప్రమాణములు. భూతభౌతికవస్తుసముదాయమంతయు ప్రత్యక్షాదిప్రమాణములకు విషయములగుచున్నది. అనుమానాదిప్రమాణముల ప్రామాణ్యము ప్రత్యక్షప్రమాణమువిూద నాధారపడియున్నది. వానిచే తెలిసికొనబడువిషయము ప్రత్యక్షముగ ననుభూతముగానిచో నవిప్రమాణములుగా నేరవు. ప్రత్యక్షప్రమాణముమాత్రము ప్రమాణాన్తరమును దేనిని నాధారముచేసికొనదు. మనయనుభవమే ప్రత్యక్షప్రమాణము యొక్క ప్రామాణ్యమున కాధారమగుచున్నది. స్వానుభవము మఱియొకప్రమాణము నపేక్షింపదు. అట్లుకానిచో వాదము నకునిలకడలేక యనవస్థాదోషము సంభవించును. మనయనుభవమునమ్మలేమన్న జ్ఞానమసంభవమగును. భూతభౌతిక

జ్ఞానముపట్ల ప్రత్యక్షప్రమాణము స్వతఃప్రమాణము, బుద్ధికిం గోచరమగు విషయములయెడ శబ్దప్రామాణ్యము ప్రత్యక్షము నాధారముచేసికొనినను తర్కమునకగోచరములగు నాధ్యాత్మికవిషయములనుగూర్చి శబ్దప్రమాణము స్వతఃప్రమాణమగుచున్నది. వేదములు స్వతఃప్రమాణములు. అవి పురుషకర్తృకములని చెప్పుటకుం దగునాధారములు కానరావు. వేదములు పురుషకర్తృకములైనచో వానినెవరు రచించిరి? ఆరచయిత యొక్క వ్రాతలకేమి ప్రామాణ్యము? ఆప్రామాణ్యమునకు ప్రమాణమేమి? ఇట్టియనవస్థాప్రసంగము సంభవించి జీవితమగతికమగును. కావున వేదప్రామాణ్యము నెన్నటికిని సందేహింపవలనుపడదు. కాగా నట్టిస్వతఃప్రమాణములగు వేదములచే నుపదేశింపబడుచున్న బ్రహ్మాత్మైకము తద్ద్రష్టులగుమహర్షులచే సాక్షాత్కారముచేసికొనబడి వారియనుభవము మనకు ప్రసాదింపబడినది. వేదోపదిష్టమగు తత్త్వరహస్య మపరోక్షానుభవయోగ్యమగుచున్నది. ఇట్లు శాబ్దప్రమాణైకగోచరమగు బ్రహ్మాత్మైక్య మనుభవసిద్ధముగూడనగుచున్నది.

ఆస్తిక నాస్తిక దర్శనములు

ప్రమాణయుక్తివాదములచే విషయనిశ్చయము చేయబడును. అజ్ఞాతపూర్వమగు నాధ్యాత్మికతత్త్వమునుగూర్చి శ్రుతులు ప్రమాణము. కొందఱు దర్శనకర్తలు శ్రుతిప్రామాణ్యమును ప్రధానము చేసికొని తదనుకూలమగు యుక్తివాదమును తత్త్వనిశ్చయముకొఱకుం బరిగ్రహించిరి. ఇట్టివారిదర్శనములాస్తికదర్శనములు. పూర్వోత్తరమీమాంసాశాస్త్రకర్తలగు

జైమినిబాదరాయణాచార్యులు, వ్యాకరణసూత్రకారులగు పాణిన్యాచార్యులు మొదలగువారిమతము లాస్తికమతములు. శ్రుతివిరుద్ధమగు నర్థమతిప్రయాసముచే యుక్తిసహము గావింపబడినను ఆస్తికులకది ప్రమాణాభాసము మాత్రమేయగును. ఇతరదర్శనకర్తలు యుక్తిప్రధానవాదులు. వారివాదమునకనుకూలమైనంతవఱకు శ్రుతి వారికంగీకార్యము. సాంఖ్యయోగవైశేషికనైయ్యాయికదర్శనము లీకోటిలో జేరును. చార్వాకులు ప్రత్యక్షైకశరణ్యులు. శ్రుతిప్రామాణ్యమును ప్రధానముగా నంగీకరింపనివారందరు నాస్తికులుగా నెన్నబడుచున్నారు.

వేదము లనంతములు. వ్యాసవిభాగానుసారము ప్రస్తుతము నాలుగువేదములు ప్రచారములోనున్నవి. ప్రతివేదము

కర్మజ్ఞానకాండములు

యొక్క మొదటిభాగము కర్మమును రెండవభాగము జ్ఞానమును బోధించుచున్నవి. కర్మభాగము కాయికమనియు, మానసికమనియు రెండుభాగములు. సోమాదిక్రియాకలాపము కాయికము. ఉపాసనము మానసికము. సోమాదికర్మలచేత చిత్తశుద్ధియు, ఉపాసనముచే చిత్తైకాగ్ర్యము కలుగును. ఈరెండును జ్ఞానమున కావశ్యకములగు పూర్వాంగములు. చిత్తశుద్ధిలేక చిత్తైకాగ్ర్యము కుదురదు. చిత్తైకాగ్ర్యములేక జ్ఞానాధికారముబ్బదు. కర్మకాండమీవిధమున జ్ఞానకాండమున కుపకారకమగుచున్నది. అందుచేతనే వేదములయందది మున్ముందు వివరింపబడినది.

ఆత్మజ్ఞానము కర్మకాండముచే పరోక్షముగను జ్ఞానకాండముచే ప్రత్యక్షముగను బోధింపబడుచున్నది. ఇట్టి జ్ఞాన

కాండము వేదములయొక్క యంతిమభాగమున గన్పట్టుటం జేసియు, సమస్తవేదములయొక్క నిశ్చితార్థమగుటంజేసియు వేదాంతమని ప్రసిద్ధింగాంచెను. వేదాంతముల కుపనిషత్తులని గూడ నామాంతరముగలదు. అవిద్యనుబోగొట్టి బ్రహ్మాత్మ

ఉపనిషచ్ఛబ్దార్థము

జ్ఞానమును బోధించుటయందే సర్వోపనిషత్కదంబమునకు తాత్పర్యము. ఉప, ని, యను రెండుపసర్గలతో జేరినషదౢధాతువునుంచి యుపనిషచ్ఛబ్దము వ్యుత్పన్నమగుచున్నది. 'ఉప' యనగా సమీపమర్థము; 'ని' యనగా తీసికొనిపోవుట. షదౢధాతువునకు ఛేదించుట, అంతమొందించుట, తెలియచేయుట యనుమూడర్థములుగలవు. ప్రత్యగాత్మపరమాత్మలకభేదమును తెలియజేసి గర్భజన్మాది సంసారదుఃఖమును ఖండించినాశనముచేయునదని యుపనిషచ్ఛబ్దమునకర్థము. జిజ్ఞాసువును బ్రహ్మసమీపమునజేర్చి యబాధితము నిరతిశయమునగు బ్రహ్మమునుపొందింపజేయు సాధనములగుటచే వీనికానామమన్వర్థమగుచున్నది. ఇట్టిబ్రహ్మవిద్యనుపపాదించు గ్రన్థములకుంగూడ నాపేరు కలిగెను. బ్రహ్మాత్మానన్యత్వజ్ఞానము నుపదేశించుటతో సర్వోపనిషచ్ఛాస్త్రము చరితార్థమునొందుచున్నది. బ్రహ్మాత్మదర్శన మనుభవైకవిషయము, చిరకాలాభ్యాససాధ్యము. బ్రహ్మాత్మానన్యత్వజ్ఞానము తగినగురువునొద్ద నుపనిషచ్ఛాస్త్రశ్రవణముచే లభింపగలదు. సాక్షాత్కారము మననాదిక్రియలచే ననుభవనీయమగుచున్నది. విషయము ననుభవమునకు తెచ్చుకొనుట సాధకునియధీనము. మావటివాడు మహాగజమును నీటియొడ్డునకు తీసికొపోగలడు గాని దానిని నీరుత్రాగింపలేడు. అది ఏనుగు చేయువలసినపని.

ఉపనిషత్తు లసంఖ్యేయములు. వీనిలో ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్య, శ్వేతాశ్వతర, నృసింహోత్తరతాపనీయము లుత్తరమీమాంసాశాస్త్రమునందు ప్రమాణములుగా గ్రహింపబడుటచే ముఖ్యములగుచున్నవి.

ఉపనిషద్విభాగము

వీనికే శ్రీశంకరభగవత్పాదులు భాష్యమును రచియించిరి. వీనిలో కఠతైత్తిరీయశ్వేతాశ్వతరములు కృష్ణయజుర్వేదాన్తర్భాగములు. ఈశబృహదారణ్యములు శుక్లయజుర్వేదములోనివి. ఐతరేయము ఋగ్వేదాన్తర్గతము. ప్రశ్నముండక మాండూక్య నృసింహతాపిను లథర్వణవేదములోనున్నవి. కేనఛాందోగ్యములు సామవేదీయములు. ఆన్ధ్రబ్రాహ్మణులలో నధికసంఖ్యాకులు కృష్ణయజుర్వేదశాఖకు చెందినవారు. తైత్తిరీయమునందువలె మఱియేయుపనిషత్తునందైనను బ్రహ్మతత్త్వమంతస్పష్టముగను, సంక్షేపముగను, ప్రసన్నముగను వివరింపబడినట్లు గానంబడదు. కావుననే శ్రీభగవత్పాదులు ప్రప్రథమమున తైత్తిరీయమునే వివరించియుందురని యూహించుటగూడ సమంజసము. అందువలన నీయుపనిషదర్థమునే మున్ముందు వివరింపయత్నించుచున్నాము.

తైత్తిరీయోపనిషత్తునకుం బూర్వభాగమగు బ్రాహ్మణమున వివిధకర్మలు వివరింపబడినవి. అవి కామ్యములు, నైమిత్తికములు, నిత్యములని మూడువిధములు.

పూర్వగ్రన్థవిమర్శనము

కర్మముల నాచరింపుడని శాస్త్రమెవ్వరిని నియోగింపదు. మనుజునకుం గర్మాచరణము సహజరాగ

ప్రాప్తము. కామన ప్రవృత్తికి ముఖ్యకారణము. కామనాను రూపముగ మనుజుడు ప్రవర్తించి యద్దానిఫలము ననుభవించును. సహజసిద్ధములగు కోరికలను బడయుమార్గమును మాత్రము శాస్త్రముపదేశించుచున్నది. అభీప్సితార్థములగు స్వర్గాదిసుఖములకు సాధనములగు సోమాదియాగములను విధించియు ననిష్టములు నరకాదిదుఃఖహేతువులునగు పాపకృత్యములను నిషేధించియు శాస్త్రము లుపకరించుచున్నవి. ఇష్టప్రాప్తిసాధనములగు సోమాదులు కామ్యములు. పుత్రజన్మాదినిమిత్తమును బురస్కరించుకొని చేయబడు పౌష్టిక శాంతికర్మలు నైమిత్తికములు. కామనలేక కామ్యములేదు. నిమిత్తములేని నైమిత్తిక మప్రసక్తము. సన్ధ్యావన్దనాదికర్మలు నిత్యములు. అవి యవశ్యమనుష్ఠేయములు. దురితక్షయ మవ్వానిఫలము. నిత్యకర్మానుష్ఠానమునకు విహితమైన సమయమున దానినిమాని యకాలమందుంజేయబడు మఱియొక సత్కర్మగూడ దురితమునకు హేతువేయగును.

బ్రహ్మమొకటియే మోక్షసాధనము

కామ్యప్రతిషిద్ధములు జన్మాన్తరకారణములు. కామము లేనివాడు కామ్యకర్మ నాచరింపడు. అనిష్టమగుటచే ప్రతిషిద్ధమున ప్రవేశింపడు. అవశ్యకర్తవ్యమగు నిత్యకర్మానుష్ఠానమువలన దురితక్షయమగుచున్నది. ఇట్టివానికి పునర్జన్మమున కవకాశములేదు. జన్మాన్తరము లేకుండుటయే మోక్షము. అయ్యది యీవిధమున లభించుచుండ నాత్మజ్ఞానముతో పనిలేదని కొందఱు తలంతురు. ఇది సరికాదు. ఈజన్మమున కర్మాచరణము

మానినంతమాత్రముచేత పునర్జన్మము తొలగనేరదు. సంచిత ఫల మనుభవింపకతప్పదు. పూర్వసంచితఫలములలో కొన్ని బహుజన్మభోగ్యములు. బ్రహ్మహత్యాశ్వమేధాదివిరుద్ధఫలము లొకజన్మమునం దనుభవయోగ్యములుగావు. బ్రహ్మహత్యచే కలుగు నరక మశ్వమేధముచే గలుగును త్తమలోకము నొకే జన్మమునం దనుభవింప శక్యముకాదు. నిత్యకర్మానుష్ఠానముచే

తైత్తిరీయవల్లీత్రయము

బూర్వదురితక్షయ మగునుగాని పూర్వ పుణ్యకర్మఫలము నశింపదు. అందుకొఱ కైనను తిరిగిజన్మము నెత్తుటయవసరము. యాగాదిసత్కర్మ ఫలమగు స్వర్గము నిత్యముకాదు. అది క్రియాజన్యముగనుక నశ్వరము. నిత్యముగాని మోక్షము నెవరునాసింపరు. సర్వ కర్మసన్యాసముచే సంపాద్యమగు బ్రహ్మవిద్యయే మోక్షైక సాధనము. స్వస్వరూపావస్థానమే మోక్షము. బ్రహ్మమును తెలిసికొనినవాడు బ్రహ్మయే యగుచున్నాడు(1). బ్రహ్మమే స్వస్వరూపము. కనుక బ్రహ్మవిద్యోపదేశ మీయుపనిషత్తునం దుపక్రమింపబడుచున్నది. తైత్తిరీయోపనిషత్తు శిక్షావల్లి, బ్రహ్మానన్దవల్లి, భృగువల్లి యని మూడుభాగములుగ నున్నది. ఇందు బ్రహ్మజ్ఞానోపదేశికలగు చివరరెండువల్లులు ముఖ్య ములు. బ్రహ్మవిద్యకు దేవర్ష్యాదులుగూడ విఘ్నకారులగు చున్నారు. అట్టివిఘ్నము లుపశమించుటకును చిత్తైకాగ్ర్యము లభించుటకు నుపయోగించు కొన్ని యుపాసనములు శిక్షావల్లి యం దుపదేశింపబడినవి. ఉపాసన మనామమయిన చిత్తైకా

---

(1) బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి (ముం 3-2-9)

గ్ర్యహేతువగును. సకామమయిన అనురూపఫలము నిచ్చును. ఈవిషయము చతుర్థాష్టమానువాకములలో వివరింపబడినది. ఉపాసనము మానసికకర్మ విశేషమగుటంజేసి కర్మకాండాన్తర్గతమనియు, జ్ఞానాంగమగుటంజేసి జ్ఞానకాండాన్తర్గతమనియుఁగూడ జెప్పందగు. అందువలననే యుపాసనమును బోధించు శిక్షావల్లి కర్మజ్ఞానకాండముల మధ్యమున వివరింపబడియున్నది.

---

# తైత్తిరీయోపనిషదర్థ సంగ్రహము

## శిక్షావల్లి

విద్యలలోకెల్ల నుత్కృష్టతమమగు బ్రహ్మవిద్య ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములగు నన్తరాయములు లేకుండ కొనసాగుటకై గురుశిష్యుల క్షేమమునుగోరి శిష్యునిచే మున్ముందు శాన్తిపాఠము పఠింపబడుచున్నది. ముఖ్యప్రాణాధిదేవతయు, ఆరోగ్యప్రదాతయు, ఓజస్కరుడునగు సూర్యభగవానుడును, ప్రత్యవయవపాటవమునుగోరి తత్తదధిదేవతలగు వరుణార్యమేన్ద్రబృహస్పతివిరాట్పురుషులును, సర్వవ్యాపియగు బ్రహ్మము యొక్క ప్రత్యక్షస్వరూపమగు వాయుదేవతయు సూత్రబ్రహ్మస్వరూపమున నామస్మరణము జేయబడుచున్నారు.

పూర్వకాండమునందు కర్మలు వివరింపబడినవి. వాని ఫలము చిత్తశుద్ధి. చిత్తశుద్ధితోపాటు చిత్తైకాగ్ర్యముగూడ లేనిది బ్రహ్మజ్ఞానమబ్బదు. అందుకొఱకును దేవర్ష్యాదికృతములగు మఱికొన్ని అంతరాయములు దొలగుటకును కొన్ని యుపాసనములు శిక్షావల్లియం దుదాహరింపబడినది. కేవల వేదాధ్యయనపరులగువారికి సుగమములగు సంహితోపాసనము, శ్రీమేధాసిద్ధ్యర్థ మోంకారోపాసనము, వ్యాహృత్యుపాసనము, మనోమయత్వాదిగుణకబ్రహ్మోపాసనము, పృథివ్యాద్యుపాధికబ్రహ్మోపాసనము లిచట చేర్కొనబడినవి. ఓంకారోపాసనము సగుణనిర్గుణబ్రహ్మల బొందుసాధనము. వేదములన్నిటిలో నది సారిష్టతమము. శబ్దజాలమంతయు నోంకారమువలన బయలుదేరుచున్నది. ఓంకారశబ్దము నుచ్చరించి సర్వవ్యాప

హార మారంభింపబడుచున్నది. భూః, భువః, సువః, మహః యనునవి వ్యాహృతిచతుష్టయము. బ్రహ్మమహఃశబ్దములకు సర్వవ్యాపకత్వ మర్థము గనుక మహఃశబ్దము బ్రహ్మపరమగు చున్నది. ఇతరవ్యాహృతులు మహఃశబ్దమున కంగములగు చున్నవి. బ్రహ్మము సర్వవ్యాపియయినను ముకుళితపద్మమును బోలి బుద్ధిస్థానమగు హృదయముకంబలి యాకాశమున యుప లబ్ధమగుచున్నది. అద్దాని యుపలబ్ధికి మనస్సు సాధనమగుటం జేసి బ్రహ్మము మనోమయమని చెప్పబడుచున్నది. అది మరణరహితము, జ్యోతిర్మయము. హృదయమునుంచి బయలు దేరు నూటయొక్కనాడులలో నొకనాడి కంఠమధ్యమున క్రిందనాలుకసమీపమున బోయి శిరఃకపాలమును భేదించుకొని బయటికి బోవుచున్నది. ఇది బ్రహ్మప్రాప్తిమార్గము. దీనినే సుషుమ్నానాడి యందురు. ఇంతవరకు నాదిమాష్టానువాక ములు సంగ్రహింపబడినవి. వేదాధ్యయనాధ్యాపనములు, సత్యము, అన్తర్బహిరిన్ద్రియనిగ్రహము, అగ్నిహోత్రాతిథి పూజనములు లౌకికసంవ్యవహారము, పుత్రపౌత్రప్రాప్తి యివి యన్నియు చేయుచు వీనితోపాటు తప్పక స్వాధ్యాయప్రవచన ములుగూడ చేయవలయునని నవమానువాకమున నుపాసక ధర్మము లుదాహరింపబడినవి. విశుద్ధసత్త్వసంపత్ఫలమగు బ్రహ్మజ్ఞానము సర్వసంసారచ్ఛేదనపూర్వకమగు మోక్షహేతు వని దశమానువాకమున స్తుతియింపబడినది. వేదాభ్యాసము పూర్తియయినతరువాత స్నాతకు డాచరింపవలసిన ధర్మము లేకాదశమున విచారింపబడినవి.

* *

## బ్రహ్మానన్దవల్లి

బ్రహ్మస్వరూపము రెండవవల్లియందును నద్దాని సాక్షాత్కారము జేసికొను మార్గము మూడవవల్లియందు నుపదేశింపబడినవి. విషయ మొకటియేయగుటచే నీరెండువల్లు లేకవాక్యత గలిగి సంపూర్ణ బ్రహ్మజ్ఞానబోధకము లగుచున్నవి. కామనాచోదితుడయి యనిత్యఫలప్రదమగు కర్మజాలమున దగుల్కొనిన వాని నచటినుండి మరల్చి వాని కాశలూరునట్లు మున్మందు బ్రహ్మజ్ఞానము నిరతిశయఫలావాప్తిహేతువని యుపదేశింపబడినది. బ్రహ్మావాప్తియే నిరతిశయఫలము. బ్రహ్మజ్ఞానమద్దాని సాధనము. బ్రహ్మజ్ఞాని దానికి యధికారి. బ్రహ్మము సత్యము, జ్ఞానము, అనంతమని స్వరూపలక్షణము నిరూపింపబడినది. సత్యమనగా వికారరహితము గనుక నిత్యము. జ్ఞానమన ప్రకాశస్వరూపము. చక్షురాదులచే గలుగు రూపాదివిషయ జ్ఞానముకంటె భిన్నము. ఆశబ్దము 'జ్ఞా' యను ధాతువునుంచి యుత్పన్నమయిన క్రియారూపమగు విషయ జ్ఞానము గాదు. ధాత్వర్థముగాకుండుటచే దానికి సాధారణముగ క్రియలకుండు కర్తగాని కర్మగాని లేవు. రూపాదులు సామాన్యమగు 'జ్ఞా' ధాతువునకు కర్మలయినట్లీజ్ఞానమునకు కర్మలు లేవు. ఈజ్ఞానము కర్తృక్రియాకారములు లేనిది. సూర్యకాంతివలె నది సర్వప్రకాశకము మాత్రమగుచున్నది. చక్షురాదులకు గోచరమగునదిమాత్రమే బుద్ధికి గోచరమగును. బ్రహ్మము చక్షురాదులకు గోచరముగాకుండుటచే బుద్ధికిగూడ గోచరముగాదు. బ్రహ్మము జ్ఞానకర్తగూడ గాదు. అనంతమగుటచే కాలముచేతను, దేశముచేతను, వస్తుప్రభేదము చేతను నవచ్ఛిన్న

పరిమితముగాకున్నది. బ్రహ్మశబ్దమునకు మహత్త్వమర్థము. అనగా దేనికంటె మహత్తరమగునది మఱియొకటి లేదో యది బ్రహ్మమని తాత్పర్యము. బ్రహ్మము మహత్తమమని పర్యవసన్న మగుచున్నది.

బ్రహ్మము పరోక్షముగ దెలియబడక పోయినను ప్రతి వానికిని 'నేను' అనురూపమున దెలయబడు నాత్మకంటె భిన్నముగాక యారూపమున దెలియబడుచున్నది. సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మము అను నాలుగుపదములకు ప్రత్యేకప్రత్యేకమగు నర్థము గలదు. సత్యాదిపదములు బ్రహ్మశబ్దమునకు విశేషణము లగుటయేగాక నద్దాని లక్షణ మునుగూడ జెప్పుచున్నవి. కాని యవి సాక్షాత్తు బ్రహ్మమును బోధింపలేవు. బ్రహ్మమును జేరుమార్గమును మాత్రము సూచించుచున్నవి. సత్యశబ్దముముచేత బ్రహ్మము నిర్వికారము, నిత్యమనియు, జ్ఞానశబ్దముచేత నది చేతన స్వరూపమనియు, అనంతశబ్దముచేత నద్దానికి దేశకాలవస్తునిమిత్తమగు పరిమి తత్వము లేనిదనియు నర్థము తెలియుచున్నది.

బ్రహ్మస్వరూపమును దెలిపిన తరువాత హృదయాకాశ మది దాఁగుకు స్థలమనియు, నద్దాని దెలిసికొనిన బ్రహ్మజ్ఞాని బ్రహ్మస్వరూపమగుటచే సర్వానందముల ననుభవించుచున్నా డనియు చెప్పి బ్రహ్మజ్ఞానఫలము బ్రహ్మమగుటయే యని స్థిరపఱుపబడినది. పరోక్షముగ నిర్దేశింపబడిన బ్రహ్మ మపరోక్షమగు నాత్మకంటె భిన్నముగాదు. బ్రహ్మము సత్య మనుటచే తదితరమగు నదంతయు అనగా నీ జగత్తంతయు సత్యముగాక యనిత్యమని యర్థము తేలుచున్నది. జగత్తంతయు

బ్రహ్మమునుంచి యుత్పన్నమయిన దానివలె కన్పించుట చేతను ఘటమువలె కార్యరూపమున నుత్పన్నమయినదంతయు యనిత్యమగుటచేతను జగత్తు కార్యమని చూపబడుచున్నది. జగదాత్మకమగు నాకాశవాయ్వగ్నిజల భూమ్యాద్యన్న పురుషులు క్రమముగ బ్రహ్మవివర్తమగు పూర్వపూర్వము నుంచి యుత్తరోత్తరము బుట్టుచున్నది. ఇట్లాకాశాదిపురుషాంతమయి పరిదృశ్యమానమగుచున్న నీ జగత్తంతయు కార్యరూపము అనిత్యము నగుచున్నది. బ్రహ్మము నిర్వికారమగుటచే నిజముగా దానినుంచి ఆకాశాదు లుత్పన్నములు కాకపోయినను త్రాడునందు సర్పము కాన్పించునట్లు మాయామోహితమగు నజ్ఞానిజనమునకు బ్రహ్మమునుంచి జగత్తుత్పన్నమయినట్లు కాన్పించుచున్నది.

జగత్తంతయు నసత్యమనియు, బ్రహ్మము హార్దాకాశమున సాక్షాత్కారయోగ్యమనియు దెలుపబడినది. కాని యజ్ఞానవిమోహితము 'ఇది నేను', 'ఇది వాది', 'భార్యాపుత్రవిత్తాదులు నావి' యను తాదాత్మ్యభావమును బొంది యున్న జనసామాన్యమున కిట్టిసాక్షాత్కారము నుసాధము గాదు. అన్నమయాదిపంచకోశములలో నన్యతమ మాత్మయని భావించువా రనేకులున్నారు. అనాత్మపదార్థముల యందజ్ఞానులకు గల యాత్మభావమును క్రమముగ తొలగించి బాహ్యమున నాత్మభావముచే లగ్నమయిన బుద్ధిని మరల్చి క్రమముగ నొకకోశమునుంచి సూక్ష్మతరము నాంతరమునగు మరియొక కోశమునం దన్తఃప్రవిష్టము జేసినగాని యిట్టి యనాత్మలయందాత్మత్వబుద్ధి తొలగనేరదు. బాహ్యములగు భార్యాపుత్ర

విత్తాదులయందు లగ్నమయిన బుద్ధిని ముందు మరల్పవలసి యున్నది. అందుకొరకు శరీరాత్మకమగు నన్నమయకోశమే యాత్మయని భావించినచో భార్యాదులాత్మకావని తలంచి వారలనుండి దొలగి శరీరమునందు లగ్నమగుచున్నవి. ఈ భావము స్థిరమయినతరువాత శరీరమాత్మకాదనియు దాని కంటె నాంతరమగు ప్రాణమయకోశ మాత్మయని భావించు టచే శరీరమునం దాత్మభావము దొలగి ప్రాణమయకోశము నందు లగ్నమగును. ప్రాణమయకోశ మాత్మయనుబుద్ధి మనో మయకోశ మాత్మయను భావనచే తొలగుచున్నది. ఇదే తీరున బుద్ధి మనోమయకోశమునుంచి విజ్ఞానమయకోశమునందు విజ్ఞానమయకోశమునుంచి యానందమయకోశమునందును, యచటనుండి హార్దాకాశమునను ప్రవేశపెట్టబడుచున్నది. ఆత్మ సాక్షాత్కారముకొరకై పూర్వపూర్వకోశము ననాత్మత్వ బుద్ధిచే త్రోసిబుచ్చి క్రమముగా నాత్మత్వబుద్ధిని యన్తఃప్రవి ష్టముచేసి తుదకు హార్దాకాశమున జేర్చుప్రణాళిక ద్వితీయాది పంచమాన్తానువాకముల వివరింపబడినది.

సర్వప్రతిష్ఠాభూతము, నిరుపాధికమునగు బ్రహ్మము యొక్క అస్తిత్వజ్ఞానము విచారణాపూర్వకముగ స్థిరము చేయవలసియున్నది. బ్రహ్మము లేదని తెలిసికొనినవాడు స్వయముగా లేనివాడే యగుచున్నాడు. ఉన్నదని తెలిసికొనిన వాడు సత్పురుషుడని జెప్పబడుచున్నాడు. ఈసందర్భమున బ్రహ్మమనునది యున్నదా? లేదా? (2) బ్రహ్మజ్ఞానము లేని వాడద్దాని బొందునా? బొందడా? (3) అతడద్దాని బొందినచో జ్ఞానిగూడ దానిబొందునా? పొందడా? యను ప్రశ్నలు విచార

ణీయముగుచున్నవి. ఇట్టి విచారణ మీ త్తరగ్రంథమున చేయ బడుచున్నది. తానవేకముగా గావలయును, పుట్టవలయునని బ్రహ్మ కోరి యావిధానము నాలోచించి జగత్తు సృంజి యించెను. మఱియు తానే అందు ప్రవేశించెను. బ్రహ్మము సృష్టికారణమగుటచే నవశ్యముండి తీరవలయును. సృష్టిని గురించిన యతనికోరిక నతసిని బాధించనేరదు. అతడు స్వతంత్రుడు. బ్రహ్మమనేకములగు నామరూపములతో నభి వ్యక్తమగుటయే సృష్టియనబడును. నామరూపముల నభివ్యక్త కాలమునందుగూడ బ్రహ్మము స్వీయమగు రూపమును బరిత్య జింపలేదు. సృష్టికి బూర్వము తరువాతగూడ బ్రహ్మమునందే మియు భేదములేదు. సృష్టికి బూర్వము నామరూపముల నభివ్యక్తములు. తరువాత నవి యభివ్యక్తములు. సృష్టిపూర్వ పరములకిదియే భేదము. బ్రహ్మమే నామరూపముల నభివ్యక్త మగుటచే నతడే జగత్తున కుపాదకారణము, నిమిత్తకారణము గూడ నగుచున్నాడు. పరబ్రహ్మము నిర్విశేషముగ నెచట నుపలబ్ధముగాదు. బుద్ధిగుహాయందు ద్రష్ట, శ్రోత, మంత విజ్ఞాత మొదలగు విశేషస్వరూపముల దెలియవచ్చుచున్నాడు. ఇదియే ప్రవేశశబ్దార్థము. బ్రహ్మము శరీరమును సృష్టించి దానియందు తానే భోక్తయగు జీవస్వరూపమున బ్రవేశించెనని యనుటచే జీవబ్రహ్మములు కనన్యత్వము జెప్పబడుచున్నవి. భోగ్యజాతము మూర్తామూర్తరూపమునగు ప్రపంచమంతయు నామరూపాత్మకమగు నతని యభివ్యక్తియే యనుటచే భోగ్య భోక్తృజాతమంతయు బ్రహ్మస్వరూపమని తేలుచున్నది. బ్రహ్మము రసస్వరూపము. ప్రాణిజాతమంతయు నాబ్రహ్మ

నందరసమును బొంది యానందము గలదగుచున్నది. జిజ్ఞాసువులు బ్రహ్మమును ప్రీతిపూర్వకముగ దెలిసికొనుచున్నారు. ఆనందము లేనిపట్ల ప్రీతి కలుగనేరదు. తత్త్వవిదుడు రసస్వరూపమగు బ్రహ్మమును బొంది సుఖియగుచున్నాడు. అందువలన నా పరమార్థవస్తు వుండితీరవలయును. బ్రహ్మము ప్రాణనాదిక్రియాహేతు వగుచున్నది. ఇట్టి పరబ్రహ్మమద్వితీయము. దానియం దెంతమాత్రము భేదబుద్ధి కలిగినను నది భయకారణమగును. కేవలాద్వైతబుద్ధిగలవానికి అభయప్రతిష్ఠ కలుగును. ఇది షష్ఠస ప్తమానువాకముల సంగ్రహము.

ఇట్టి బ్రహ్మానందము స్రగాదివిషయజన్యమగు నానందముకంటె భిన్నము. విషయజన్యములగు లౌకికానందములు కృత్రిమములు. విషయము లున్నంతకాలముమాత్ర మవి యుండును. బ్రహ్మానందము నిర్విషయానందము, అలౌకికము. అవిద్యానిమిత్తమగు విషయసుఖేచ్ఛ సంపూర్ణముగ నశించినపుడే బ్రహ్మానందము సంసిద్ధమగును. విషయానందములన్నియు బ్రహ్మానందాంశము లగుచున్నవి. విద్యాసాధనముచే విషయసుఖేచ్ఛనుండి బుద్ధి యెంతెంత మరలునో యంతంత సన్నిహితముగ బ్రహ్మానందము సమకూరును. ఇట్లు లౌకికానందము బ్రహ్మానందప్రాప్తికి ద్వారభూతమగును. ఇట్టి బ్రహ్మానందప్రాప్తికి శ్రోత్రియత్వము, అకామహతత్వము, ఋజుమార్గవర్తిత్వము ననివార్యములగుచున్నవి. నిరుపాధికమగు పరబ్రహ్మ ముపాధిగతమయినంతమాత్రముచేత భేద మెంతమాత్రము నొందదు. సూర్యాదిదేవతోపాధియందు ప్రకాశించుచున్న బ్రహ్మతేజస్సు హార్దాకాశమున నపరోక్షముగ సాక్షా

త్కారముచేసికొనబడు తేజస్సు ఉపాధిభేదముచే విభిన్నముగ కాన్పించుచున్నను ఉపాధులను తొలగించినపు డొకటియే యగుచున్నది. వివిధములగు గాజుకుప్పెలలో ప్రకాశించుచున్న విద్యుత్కాంతి యొకటియే యగుచున్నది. ఇట్టి బ్రహ్మజ్ఞానమును బొందినవా డీలోకమునుంచి బయలుదేరి క్రమముగా నన్నమయాదిపంచకోశములలో నొకదానినుండి మఱియొకదానిలో నుపసంక్రమించి చివరకానందమయకోశమునుంచి బ్రహ్మత్వమును బొందును. పైన నుదాహరింపబడిన కామయిత్రృత్వము, స్రష్టృత్వము, ప్రవేశనము సత్త్యాదిభవనము మొదలగుకార్యములచేతను ఆనందరసలాభము. ప్రాణనము, అభయప్రతిష్ఠానము, అభయదర్శనమను వివిధోపపత్తులచేతను బ్రహ్మాస్తిత్వము సిద్ధముచేయబడినది. అద్వితీయము, సత్యము, జ్ఞానము, అనంతము నగుబ్రహ్మము తానేయని దెలిసికొనినవాడు సర్వకర్మఫలేచ్ఛ తొలగినవాడయి పంచకోశములయం దభిమానమును దాటి హార్దాకాశమున బ్రహ్మసాక్షాత్కారమును బొందును. అవిద్వాంసు డద్దాని బొందలేడు. ఇట్టి బ్రహ్మసాక్షాత్కారమును బొందుటయే సంక్రమణశబ్దమున కర్థము. ఇది యష్టమానువాకార్థము. ఇట్టి పరబ్రహ్మము నిర్గుణము, అద్వితీయము, నిష్క్రియము నగుటచే లౌకికవిషయమువలె ప్రత్యక్షాదిప్రమాణములకుగాని చక్షురాదీన్ద్రియములకుగాని బుద్ధికిగాని గోచరముగాదు. అందువలన శబ్దముచే నది వర్ణింపసలవిగాదు. సర్వోపనిషచ్ఛాస్త్రముయొక్క నఖండార్థముమాత్రమది యగుచున్నది. అది ప్రకాశాత్మకమయి సూర్యకాంతివలె సర్వవ్యవహారమునకు సాక్షి

మాత్రమగుచున్నది. ఆపరబ్రహ్మ తేజస్సత్యంతము సన్నిహిత ముగానున్న బుద్ధియందు ప్రతిఫలిత మగుచున్నది. అట్టిప్రతి ఫలితచైతన్యముచే సర్వవ్యవహారము సాగుచున్నది. ఇది నవ మానువాకార్థము.

## భృ గు వ ల్లి

గురువుచే నుపదేశింపబడిన బ్రహ్మజ్ఞానము సాక్షా త్కారము జేసికొను మననప్రకార మాఖ్యాయికారూపమున మూడవవల్లియందు వివరింపబడినది. భృగువను నొకబ్రహ్మ జిజ్ఞాసువు బ్రహ్మమును తనకువదేశింపుడని తండ్రియగు వరు ణుని గోరెను. "అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు వాక్కు" "దేనివలన నీప్రాణజాత ముత్పన్నమగునో పుట్టిన ప్రాణజాత మెద్దానియందు స్థితిని బొందుచున్నదో దేని యం దది లయమగుచున్నదో అది బ్రహ్మమని తపస్సుచే దెలిసికొనుమ"ని వరుణుడు కుమారుని కుపదేశించెను. ఇచట వినబడు మొదటివాక్యము బ్రహ్మమును బొందుద్వారము. రెండవవాక్యము బ్రహ్మముయొక్క తటస్థలక్షణము. ఈలక్ష ణముచే బైకి బ్రహ్మముగా కాన్పించు నన్నమయాదికోశముల యాపాతబ్రహ్మత్వమును మననముజేసి, వానియందు కాన్పించు చున్న జడత్వలయత్వక్షణికత్వాదిదోషములచే నవి బ్రహ్మము లుగా నేరవని నిశ్చయించి పంచకోశములాత్మ గావని భృగువు త్రోసిపుచ్చి చివరకు హార్దాకాశమున బ్రహ్మమును సాక్షా త్కారము జేసికొనెను. మొదటివాక్యముచే భోగ్యభోక్తృ భోగసాధనభూతములగు సర్వభూతములు బ్రహ్మోపలబ్ధిసాధన

ములే యని యుపదేశింపబడుచున్నది. ఇట్లు వరుణుడు భృగువున కుపదేశించిన విద్య వారుణీవిద్యయనియు, భార్గవీవిద్య యనియు బిలువబడుచున్నది. ఇది ప్రథమాదిషష్ఠాన్తానువాక తాత్పర్యసంగ్రహము. తరువాత నాలుగనువాకములలో బ్రహ్మ ద్వారమగు నన్నోపాసనముయొక్క మహిమ వివరింపబడినది. బ్రహ్మము దుర్విజ్ఞేయమగుటచే నద్దాని దెలిసికొనుట కధ్యారోపాపవాదములను రెండుమార్గములు శాస్త్రమునందవలంబింపబడినవి. లేనిదానియం దొకగుణము నారోపించి బుద్ధి యచట లగ్నమగునంతవర కద్దానిని యీభావముతో మననముసేయుట యధ్యారోపమార్గము. శాఖాచంద్రన్యాయము ననుసరించు నీమార్గముపాసనలకు ముఖ్యముగా నాధారమగుచున్నది. అభ్యాసబలముచే నచట స్థిరమయినబుద్ధిని యచటనుండి బ్రహ్మదరికి జేర్చుట యపవాదము. అధ్యారోపమునకుం జెందిన యుపాసనము లపవాదమార్గమున దశమానువాకమున ప్రదర్శింపబడినవి, ఆదిత్యునియందును. మనుజునియందును ప్రకాశించుచున్న తేజస్సు ఉపాధిభేదముచే భిన్నముగా గాన్పించుచున్నను, నా యుపాధులను దొలగించి నపుడది యొకటియే యనునపవాదమార్గము తుదకుపదేశింపబడినది. అన్నోపాసనమను నధ్యారోపమార్గమున బ్రహ్మసామీప్యమును జేరి యపవాదమార్గమున నద్దాని సాక్షాత్కారము జేసికొనినవాని నిరతిశయానందభరము నతడు మూడులోకముల చాటుచు బ్రహ్మజ్ఞానోపదేశముం జేయుమార్గమును వివరించుటతో నీ యుపనిషత్తు సమాప్తము నొందింపబడినది. ప్రత్యగాత్మ పరమాత్మల కభేదమును దెలియజేసి గర్భజన్మాదిసంసారదుఃఖ

మును ఖండించి నాశనముచేయు జ్ఞాన ముపనిషచ్ఛబ్దమున కర్థము. అట్టిజ్ఞానమును బోధించు గ్రన్థముగూడ నుపనిషచ్ఛబ్దముచే చెప్పబడుచున్న ది.

తైత్తిరీయోపనిషదర్థసంగ్రహము

సమాప్తము

——

శ్రీ గురుభ్యోనమః

# తైత్తిరీయోపనిషత్తు

## శిక్షావల్లి

అవతారిక:-ఈవల్లియందు పంౘ్రెండనువాకములు గలవు. అందాద్యన్తానువాకములు, శాన్త్యనువాకములు. రెండుమూడనువాకములయందు శిక్షాసంహితోపాసనములు, నాల్గవదానియందు మేధాసంపత్కరములగు జపహోమమన్త్రములు, అయిదవదానియందు వ్యాహృత్యుపాసనము, ఆరవదానియందు మనోమయత్వాదిగుణక బ్రహ్మోపాసనము, ఏడవదానియందు మన్త్రాధికారికుపయోగించుపృథివ్యాద్యుపాధికబ్రహ్మోపాసనము, ఎనిమిదవదానియందోంకారోపాసనము వివరింపబడినవి. నవమానువాకమునందుపాసకధర్మము లుదాహరింపబడినవి. స్వాధ్యాయము వలన విశుద్ధసత్త్వునికి గలుగుజ్ఞానోదయవైభవము, దశమానువాకమున వర్ణింపబడినది. గురుకులావాసానన్తరము బ్రహ్మచారియొక్క భావికర్తవ్య మేకాదశమునందుపదేశింపబడినది.

విషయవిభాగము

### ప్రథమానువాకము

(శాన్తిపాఠము)

మూలం:- హరిః ఓమ్ । శం నో మిత్రః శం వరుణః । శం నో భవత్వర్యమా । శం న ఇన్ద్రో బృహస్పతిః । శం నో విష్ణురురుక్రమః । నమో బ్రహ్మణే । నమస్తే వాయో । త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి । త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి । ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి । తన్మామవతు । తద్వక్తారమవతు । అవతు మామ్ । అవతు వక్తారమ్ । ఓమ్శాన్తిః శాన్తిః శాన్తిః॥

టీక:- మాకు సూర్యుడు సుఖంకరుడగుగాక! వరుణుడు సుఖంకరుడగుగాక! అర్యముడు సుఖంకరుడగుగాక! ఇన్ద్రబృహస్పతిదేవతలు సుఖంకరులగుగాక! సర్వవ్యాపియగు విరాట్పురుషుడు సుఖంకరుడగుగాక! బ్రహ్మమునకు నమస్కారము. ఓ వాయుదేవతా! నీకు నమస్కారము. ప్రత్యక్షమగు బ్రహ్మము నీవే! నిన్నే ప్రత్యక్షమగుబ్రహ్మముగా చెప్పుచున్నాను! నిన్ను ఋతముగా చెప్పుచున్నాను. నిన్ను సత్యముగా చెప్పుచున్నాను. నన్ను నీవు రక్షింతువుగాక! ఆచార్యుని రక్షింతువుగాక! నన్ను రక్షింతువుగాక! ఆచార్యుని రక్షింతువుగాక! శాన్తిః శాన్తిః శాన్తిః॥

తాత్పర్యవిశేషములు:- బ్రహ్మవిద్యాభ్యాసమునకు దేవర్ష్యాదులుగూడ విఘ్నకారులగుచున్నారు. అట్టివిఘ్నోపశాన్తికొరకీ శాన్తిపాఠము పఠింపబడుచున్నది.

వివిధదేవతారూపమున నున్న సూత్రబ్రహ్మమునకు నమస్కారములు

ముఖ్యప్రాణాధిదేవతయు, సర్వకర్మాచరణయోగ్యమగు పగటికాలమునందు కనపడునట్టియు, ఆరోగ్యభాగ్యప్రదాతయు, ఓజస్కరుడును నగు సూర్యభగవానుడు మాయెడ మిత్రభావమును వహించి మాకు సుఖమును కలుగచేయునుగాక యని యా దేవత మిత్రశబ్దముచే ప్రప్రథమమున నాహ్వానము జేయబడుచున్నది. అన్తఃకరణమునకు సంబంధించిన సుఖసంపత్తి నాశించినతరువాత ప్రత్యవయవపాటవమును గోరి తత్తదధిదేవతలామన్త్రణము జేయబడుచున్నారు. మనస్స్థైర్యమునకు గారణ మగునపానవృత్తి

కభిమానదేవతయగు వరుణుడు, చక్షురిన్ద్రియాభిమానదేవత యగునర్యముడు, బాహుబలాధిదేవత యగునిన్ద్రుడు, బుద్ధ్యధి దేవత యగుబృహస్పతి పాదాదికృత్స్న దేహాభిమానియు, సర్వ వ్యాపియు నగువిరాట్పురుషుడు మొదలగుదేవతలు మాకు సుఖంకరులగుదురుగాక! అని వీరి యామన్త్రణముయొక్క తాత్పర్యము. వీరందరు ప్రసన్నులగుచుండగా సర్వవిఘ్నములు శాంతించును. ఇచట వివిధదేవతాస్వరూపమునొందిన సూత్ర బ్రహ్మమే ఆమన్త్రణముసేయబడుచున్నది. శాస్త్రోపదిష్టమై సుపరినిశ్చితమగునర్థమే ఋతమనియు నట్టిది వాక్కుచేనుచ్చ రింపబడినపుడును, కరచరణాదులచే ననుష్ఠింపబడినపుడును సత్యమనియు చెప్పబడుచున్నది. ఋతసత్యములు రెండును వాయుదేవతాధీనములు. ఆదేవతయే సర్వవ్యాపియగుబ్రహ్మము యొక్క ప్రత్యక్షస్వరూపము. వాయుస్వరూపము నొందిన బ్రహ్మము వక్తృత్వసామర్థ్యసంయోజనముచే నాచార్యుని నవి ఘ్నమగు నభీప్సితార్థసిద్ధివిద్యాసంయోజనముచే తనను గూడ సంరక్షించుగాకయని శిష్యుడు వాయుదేవతకు నమస్క రించుచున్నాడు. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములగు త్రివిధ విఘ్నము లుపశమించుటకై శాన్తిశబ్దము మూడువర్యాయ ములు పఠింపబడుచున్నది. జ్వరాదు లాధ్యాత్మికములు. దేవాద్యుపద్రవము లాధిదైవికములు. యక్షరాక్షసాద్యుప ద్రవము లాధిభౌతికములు.

ప్రథమానువాకము సమాప్తము

---

## ద్వితీయానువాకము
## (శిక్షాధ్యాయము)

అ॥ ఉపనిషత్తులన్నియు నర్థప్రధానములు గనుక వానిని పఠించునప్పు డశ్రద్ధయు నుచ్చారణాదిస్ఖాలిత్యములు లేకుండు టకుగాను శిక్షాధ్యాయము మున్ముందారంభింపబడుచున్నది.

మూ: శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః । మాత్రా బలమ్ । సామ సంతానః । ఇత్యుక్తశ్శీక్షాధ్యాయః॥

టీ:- శిక్షను వ్యాఖ్యానము సేయుచున్నాము. వర్ణము లనియు, స్వరములనియు, మాత్రలనియు, బలమనియు, సామ మనియు సంతానమనియు శిక్షాధ్యాయమీప్రకారము చెప్ప బడినది.

తా. వి :- అకారాదిక్షకారాంతములగునవి యక్షర ములు. ఉదాత్తానుదాత్తస్వరితములు స్వరములు. హ్రస్వదీర్ఘ ప్లుతములు మాత్రలు. అక్షరములనుచ్చరించుటకు చేయు ప్రయత్నవిశేషము బలము. అతివేగమతిమందముగాక మధ్యమ వృత్తిగా నొక్కతీరున నక్షరములనుచ్చారణముసేయుట సమత. అక్షరములను విలంబనములేక నుచ్చరించుట సంతానము. ఈ యారువిషయములను గమనించి వేదాధ్యయనముచేయవలెను. స్వరభేదముచే నర్థభేదముగూడ గల్గుచున్నది. కర్మమునాచ రించునపుడు సంభవింపగల స్వరాదివ్యత్యయదోషమునకు ప్రాయశ్చిత్తము కలదు. జ్ఞానకాండమునందట్టి వ్యత్యయముచే పురుషార్థహాని కలుగగలదు. స్వరవ్యత్యయముచేగల్గు నన్యథా జ్ఞానము ప్రాయశ్చిత్తముచే నశింపనేరదు. బ్రహ్మజ్ఞానోపదేశిక

లగు నుపనిషత్తుల యర్థానిశ్చయముతో పఠించుటకుగాను మొదటనే యీయధ్యాయము చెప్పబడినది.

ద్వితీయానువాకము సమాప్తము

---

## తృతీయానువాకము

(సంహితోపాసనము)

అ॥ వేదాధ్యయనము ప్రయత్నపూర్వకముగ చేయవలసిన యావశ్యకతనుచూపినతరువాత సంహితోపాసనమును శ్రుతి వివరింపుచున్నది.

మూ:- (1) సహ నౌ యశః । సహ నౌ బ్రహ్మవర్చసమ్ । అథాత స్సగ్ంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః । పంచస్వధికరణేషు । అధిలోకమధిజ్యౌతిషమధివిద్యమధిప్రజమధ్యాత్మమ్ । తా మహాసగ్ంహితా । ఇత్యాచక్షతే । అథాధిలోకమ్ । పృథివీ పూర్వరూపమ్ । ద్యౌరుత్తరరూపమ్। ఆకాశస్సంధిః॥

(2) వాయుః సంధానమ్ । ఇత్యధిలోకమ్ । అథాధిజ్యౌతిషమ్।అగ్నిః పూర్వరూపమ్ । ఆదిత్య ఉత్తరరూపమ్ । ఆపస్సంధిః । వైద్యుతస్సంధానమ్। ఇత్యధిజ్యౌతిషమ్ । అథాధివిద్యమ్ । ఆచార్యః పూర్వరూపమ్॥

(3) అన్తేవాస్యుత్తరరూపమ్ । విద్యా సన్ధిః । ప్రవచనగ్ం సంధానమ్ । ఇత్యధివిద్యమ్ । అథాధిప్రజమ్ । మాతా పూర్వరూపమ్ । పితోత్తరరూపమ్ । ప్రజాసన్ధిః । ప్రజననగ్ం సన్ధానమ్॥

(4) అథాధ్యాత్మమ్ । అధరా హనుః పూర్వరూపమ్ । ఉత్తరా హనురుత్తరరూపమ్ । వాక్సంధిః । జిహ్వా సంధానమ్ । ఇత్యధ్యాత్మమ్ । ఇతీమా మహాసగ్ంహితాః । య ఏవమేతా మహాసగ్ంహితా వ్యాఖ్యాతా వేద । సంధీయతే । ప్రజయా పశుభిః । బ్రహ్మవర్చసేనాన్నాద్యేన సువర్గ్యేణ లోకేన॥

టీ:- ఉపాసనముల తెలిసికొనుటవలన గలిగెడుకీర్తి శిష్యాచార్యుల మగుమాయిద్దరికిని గలుగుగాక! ఉపాసనవలన గలిగెడుబ్రహ్మతేజస్సు మాయిద్దరికిని కలుగుగాక!

వర్ణాదిశిక్షానంతరము సంహితోచ్చారణమునందే బుద్ధి త్వరగాప్రవేశించునుగనుక లోకములందును, తేజస్సులందును, విద్యలందును, ప్రజలందును, దేహమునందును పంచాశ్రయములచేత సంహితయొక్కయుపాసనమును సువిశదముగ వ్యాఖ్యానించుచున్నాము. ఆ అయిదువిషయములు గొప్పసంహితలని పెద్దలు చెప్పుచున్నారు.

ఇక లోకసంహితావిషయము చెప్పబడుచున్నది. సంహితయొక్క పూర్వాక్షరము భూమియనియు, ఉత్తరాక్షరమంతరిక్షమనియు; సంహితయొక్క పూర్వోత్తరాక్షరముల యొక్క సంధి యాకాశమనియు, ఆయక్షరములసంధానము వాయువనియు యీవిధముగా లోకము నాశ్రయించినయుపాసనము.

అటుతరువాత జ్యోతిస్సంహితావిషయము చెప్పబడుచున్నది. సంహితయొక్క పూర్వాక్షరమగ్ని, ఉత్తరాక్షరము సూర్యుడు, వీనిసంధి ఉదకము, వీనిసంధానము మెరుపుతీగె; ఈవిధముగా జ్యోతిరుపాసనము.

పిదప విద్యావిషయము చెప్పబడుచున్నది. సంహితయొక్క పూర్వాక్షర మాచార్యుడు ఉత్తరాక్షరము శిష్యుడు, వీనిసంధి విద్య, సంధానము ప్రవచనము; ఈవిధముగ విద్యావిషయోపాసనము.

అటుపిమ్మట ప్రజావిషయము చెప్పబడుచున్నది. సంహితయొక్క పూర్వాక్షరము తల్లి, ఉత్తరరూపము తండ్రి, ఈ యక్షరముల సంధి సంతానము, వీనిసంధానము ప్రజననము; ఈవిధమున ప్రజావిషయోపాసనము.

అనంతర మాధ్యాత్మవిషయము చెప్పబడుచున్నది. సంహితయొక్క పూర్వాక్షరము క్రిందిపెదవి, ఉత్తరాక్షరము పైపెదవి, వీనిసంధి వాక్కు, సంధానము నాలుక; ఈవిధముగ దేహవిషయోపాసనము.

ఈవిధముగా చెప్పబడిన నీమహోపాసనముల నెవడీవిధముగ తెలిసికొనుచున్నాడో వాడు సంతానముతోడను, పశువులతోడను, బ్రహ్మవర్చస్సుతోడను, అన్నము మొదలగు భోగ్యజాతముతోడను స్వర్గముతోడను సంధానము చేయబడుచున్నాడు.

తా. వి:- వర్ణములయొక్క పరస్పర మత్యన్తసామీప్యము సంహితయనబడును. 'ఇషే త్వా' యనువాక్యమునందు ఇషే త్వా యను రెండువిడిపదములు గలవు. షేయను నక్షరమునందలి ఏకారము పూర్వాక్షరము. త్వాయనునక్షరము నందలి తకార ముత్తరవర్ణము. ఈఏకారతకారముల మధ్య భాగముసంధి. షేత్వాయను రెండక్షరములును కలిపి ఉచ్చరించునపుడు కన్పట్టుచున్న రెండవతకారము సంధానము. ఈరెంటిని కలిపిఉచ్చరించగా 'ఇషేత్త్వా' యను వాక్యమేర్పడుచున్నది. వేదాధ్యయన ముపాసనమున కవశ్యముగ పూర్వాంగమగుచున్నది. అట్టి యధ్యయనసౌష్ఠవముకొఱకే

శిక్షాధ్యాయము మున్ముందు చెప్పబడినది. కేవలవేదాధ్యయన పరుల కుపాసనారహస్య మొక్కమాఱుగ తెలియనేరదు. కనుక వారలకు పరిచితమగు సంహిత నాలంబనముగా గ్రహించి ధ్యానముచేయగల కొన్ని యుపాసనము లిచట బేర్కొనబడినవి. లోకజ్యోతిర్విద్యాప్రజాదేహములను పైదుసంహితోపాసనము లిచట వివరింపబడినవి. లోకోపాసనమునందు ఇషేత్వాయను చోట పూర్వాక్షరమగు ఏ యనుస్థానమున పృథివిని త్వా అను నుత్తరాక్షరమగు తకారస్థానమున ద్యులోకమును నీ రెంటికిమధ్యనున్న అవకాశమునందు వాయువు వీనిసంధాన మనియు భావించి లోకసంహితోపాసనమును చేయవలెను. పృథివీద్యులోకసంహిత ముపాస్యముగాని యన్యతరలోకము లుపాస్యములుగావు. ఇటులనే జ్యోతిర్విద్యాప్రజాదేహో పాసనములయందు క్రమముగా నగ్న్యాచార్యమాతృధరోష్ఠ ములు పూర్వరూపముగను, ఆదిత్యాన్తేవాసిపిత్రుత్తరోష్ఠము లుత్తరరూపముగను, జలవిద్యాప్రజావాక్కులు సంధిరూపము గను, విద్యుత్ప్రవచనప్రజననజిహ్వలు సంధానముగను భావించి సంహితోపాసనముచేయుతగు. సమాహితచిత్తోపేతమగు సం హితోపాసనము సకామమైనచో నీలోకమున ప్రజాపశ్వన్నాది సమృద్ధికిని మఱణానన్తర ముత్తమలోకప్రాప్తికిని కారణమగు చున్నది. నిష్కామమైనచో బ్రహ్మవిద్యోపకారకమగుచున్నది.

తృతీయానువాకము సమాప్తము

———

## చతుర్థానువాకము

### (మేధాసిద్ధ్యర్థములగు మన్త్రములు)

మూ:- యశ్ఛన్దసామృషభో విశ్వరూపః ఛన్దోభ్యోఽధ్యమృతాత్సంబభూవ । స మేన్ద్రో మేధయా స్పృణోతు । అమృతస్య దేవధారణో భూయాసమ్ । శరీరం మే విచర్షణమ్ । జిహ్వా మే మధుమత్తమా । కర్ణాభ్యాం భూరి విశ్రువమ్ । బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః । శ్రుతం మే గోపాయ ।

ఆవహన్తీ వితన్వానా కుర్వాణా చీరమాత్మనః । వాసాꣳసి మమ గావశ్చ । అన్నపానే చ సర్వదా । తతో మే శ్రియమావహ । లోమశాం పశుభిః సహ స్వాహా ।

ఆ మా యన్తు బ్రహ్మచారిణః స్వాహా । వి మా యన్తు బ్రహ్మచారిణః స్వాహా । ప్ర మా యన్తు బ్రహ్మచారిణః స్వాహా । దమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా । శమాయన్తు బ్రహ్మచారిణః స్వాహా ।

యశో జనేఽసాని స్వాహా । శ్రేయాన్ వస్యసోఽసాని స్వాహా । తం త్వా భగ ప్రవిశాని స్వాహా । స మా భగ ప్రవిశ స్వాహా । తస్మిన్త్సహస్రశాఖే ని భగాహం త్వయి మృజే స్వాహా । యథాఽపః ప్రవతా యన్తి యథా మాసా అహర్జరం । ఏవం మాం బ్రహ్మచారిణః । ధాతరాయన్తు సర్వతః స్వాహా । ప్రతివేశోఽసి । ప్ర మా భాహి ప్ర మా పద్యస్వ । వితన్వానా శమా యన్తు బ్రహ్మచారిణః స్వాహా । ధాతరాయన్తు సర్వతఃస్వాహా ॥

టీ:- ఏది వేదములకు ప్రధానమో ఏది సర్వరూపమయినదో అట్టిప్రణవ మమృతస్వరూపములగు వేదములలో నావిర్భూతమయి సారభూతముగ ప్రకాశించుచున్నది. పరమేశ్వరస్వరూపమగు నాప్రణవము నన్ను ప్రజ్ఞచేతను, జ్ఞాపకశక్తిచేతను బలపరుచుగాక ! ప్రకాశాత్మకమగు నోప్రణవమా!

నేనమృతహేతువగు బ్రహ్మజ్ఞానమును ధరించువాడనగుదును గాక !

నాయొక్క శరీరము యోగ్యమయినది. నాజిహ్వా మధుర భాషణము గలదియగుగాక! కర్ణములచేతవిస్తారముగా శ్రవణము చేయువారమగుదుముగాక, నీవు పరమాత్మకు వరవలెనున్నావు. సామాన్యలౌకికప్రజ్ఞచే కప్పబడుచున్నావు. నాచేశ్రవణము చేయబడిన యాత్మజ్ఞానాదికమును రక్షించుదువుగాక !

మేధను కలుగజేసినతరువాత నాకు వస్త్రములను గోవులను అన్నపానీయములను ఎల్లప్పుడుసంపాదించునట్టియు, సంపాదించినదానిని విస్తరింపచేయునట్టియు విస్తరింపజేసినదానిని దీర్ఘకాలముండుదానిగా చేయునట్టియు అజాదివిశిష్టమయినట్టియు సంపదను పశువులను నాకు ప్రసాదింపుము !

విద్యార్థులగు బ్రహ్మచారులు నన్నుగూర్చి వచ్చెదరు గాక! బ్రహ్మచారులు నన్నుగూర్చి విశేషముగవచ్చెదరుగాక! బుద్ధిమంతులు శమదమాదిసంపన్నులునగు బ్రహ్మచారులునన్ను గూర్చి ప్రకర్షముగవచ్చెదరుగాక ! నన్ననుగ్రహింతురుగాక! లోకమునందు యశస్సుగలవాడనగుదునుగాక ! ధనికులలో శ్రేష్ఠుడ నగుదునుగాక! పూజ్యమయినయోప్రణవమా! బ్రహ్మ మున కుపలబ్ధిస్థానమగు నీవునాలో ప్రవేశింపుము! సహస్రశాఖ లుగా గనంబడునీయందు నాపాపములనన్నిటిని నశింపచేసికొను చున్నాను. ఉదకములు పల్లమునకుపోయినట్లు మాసములు సంవత్సరములో నదృశ్యములయినట్లు బ్రహ్మచారులంతటనుంచి నన్నుగూర్చి వచ్చెదరుగాక! నీవు శ్రమాపనయనస్థానమగు

చున్నావు. నన్నుగూర్చి నీవు సాక్షాత్కరింపుము. నన్ను నీస్వరూపముగ చేయుము. నన్ను నీవు పొందుదువుగాక!

తా. వి:- ఈయనువాకమునందు మేథాకామునిచే నుపాస్యమగు నోంకారముయొక్క మహిమయు, నభీప్సితార్థ సిద్ధికింజేయదగు హోమవిధానము వివరింపబడినవి. ఓంకారమునందు సమస్తవాగ్జాలము దబ్బనమునందు పర్ణములవలె కూర్పబడియుండుటంజేసి వేదత్రయమునకది ప్రధానమగుచున్నది. నిత్యములగు వేదములకన్నిటిలో నిదిసారిష్టతమమై ప్రజాపతికి భాసించెను. బ్రహ్మోపాసనమున కిది ముఖ్యమగునాలంబనము. ఓంకారమనునది బ్రహ్మమే. శాస్త్రజన్యజ్ఞానవిహీనులగు సామాన్యప్రజ్ఞ లీరహస్యమును గ్రహింపలేకున్నారు. సర్వకామేశుడగు పరమేశ్వరు డోంకారశబ్దవాచ్యుడగుచున్నాడు. అమృతత్వహేతువగు బ్రహ్మజ్ఞానమద్దానియధీనము.

ఓంకారశ్రైష్ఠ్యము

ఇట్టిఓంకారోపాసనమువలన రోగాద్యాతంకవిశలము, విద్యాభ్యాసయోగ్యమునగు శరీరపాటవము, బుద్ధిప్రసన్నత మధురభాషణము, ఆత్మజ్ఞానోపయోగియగు వేదాన్తవాక్యములయొక్క బహుశ్రవణము లభించునుగాక. శ్రుతమగు వేదార్థమబ్బుటకు, అబ్బినయర్థము రాగద్వేషాదిసంకీర్ణమై విస్మృతముకాకుండుటకును ఓంకారోపాసకు డద్దానిజపింపవలయును.

ఓంకారజపఫలము

శ్రీకాముడాచరింపవలసిన హోమవిధానము వివరింపబడుచున్నది. మున్ముందు వేదార్థవిజ్ఞానము, తరువాత నన్న

పానాదులను వస్త్రములను గవాదిపశువులను సంపాదించి వృద్ధి బొందించి చిరస్థాయిగాచేయుటకు తగిన శ్రీని యోంకారము మాకొసంగుగాక! దైవమానుషవిత్తఫలములను గోరు బ్రహ్మచారులను మాగృహమున నభీప్సితార్థసిద్ధి యగుగాక! వారి వలన నేను సాటివారలలో నుత్తమశ్లోకుడనగుదును గాక! ఇట్లు కోరి మన్త్రపూర్వకముగ స్వాహాయని హోమము చేయవలెను.

శ్రీకాముడాచరింపదగు హోమవిధానము

ఓంకారముయొక్క యానుషంగికఫలము చెప్పబడినది. ఇక నాత్యంతికఫలముదాహరింపబడుచున్నది. ఓంకారాత్మకమగు పరబ్రహ్మముకంటె తాననన్యమని ధ్యానించువానిని పరబ్రహ్మ మావరణభావముతో ననుపాలనముచేసి యుభయులకుగల భేదజ్ఞానమును నశింపచేయును. పాపరహితమగు నతని యందు తాదాత్మ్యమునొందుటచే నుపాసకుని పాపములు నశింపగలవు. పరబ్రహ్మము సర్వదుఃఖాపనోదనస్థానము గనుక నిమ్నప్రదేశమునకు జలములవలె నుపాసకులచటికి సత్వరముగజేరి మాసములు సంవత్సరములో నదృశ్యమైనట్లు వారు బ్రహ్మములో నిమగ్నులగుదురు. ఇట్టిఫలమునిచ్చుటకై యా పరబ్రహ్మము ప్రకాశించునుగాక! పాదరసము బంగారమైనట్లుపాసకుడు పరబ్రహ్మమయుడగును.

ఓంకారముయొక్క ఆత్యంతికఫలము

చతుర్థానువాకము సమాప్తము

## అష్టమానువాకము(1)

## ప్రణవోపాసనము-శుద్ధబ్రహ్మోపాసనము

## (ఉత్తమాధికారి)

మూ:- (1)ఓమితి బ్రహ్మ । ఓమితీదగ్ం సర్వం । ఓమిత్యేతదనుకృతి హ స్మ వా అప్యోశ్రావయేత్యాశ్రావయన్తి । ఓమితి సామాని గాయన్తి । ఓగ్ంశోమితి శస్త్రాణి శగ్ంసన్తి । ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి ॥ ఓమితి బ్రహ్మా ప్రసౌతి । ఓమిత్యగ్నిహోత్రమనుజానాతి । ఓమితి బ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ—బ్రహ్మోపాప్నవానీతి । బ్రహ్మైవాపోప్నతి॥

టీ:- ఓం అనుశబ్దమును పరబ్రహ్మముగ నుపాసించవలయును. పరిదృశ్యమానమగు నీప్రపంచమంతయు నోంకారమని భావింపవలయును. ఈయోంకారమనునది యనుకరణమని సుప్రసిద్ధముగదా! మఱియు సోమాదియాగములయందు బ్రహ్మ యితరఋత్విక్కులను ఓం అనుశబ్దముచే ప్రోక్షణాది క్రియలయందు చోదనచేయును. ఓం అనియే సామమన్త్రములను గానముచేయుచున్నారు. ఓగ్ం శోం అని శస్త్రమన్త్రములను చెప్పుచున్నారు. ఓం అని యధ్వర్యుడు ప్రతిగరమును బదులపలుకుచున్నాడు. ఓం అని బ్రహ్మ అనుజ్ఞనిచ్చును. ఓం అని హోమమునకనుజ్ఞయివ్వబడుచున్నది. ఓంకారశబ్దముతో వేదాధ్యయనము చేయబడుచున్నది. బ్రాహ్మణుడు వేదమును ప్రవచనముచేయదలచి ఓం అనుశబ్దము నుచ్చరించు

(1) చతుర్థాష్టమానువాకములకుగల విషయసామ్యముచే నష్టమానువాకమపకర్షచే నిచటచేర్చబడినది.

చున్నాడు. ఓంకారముచే బ్రహ్మమును పొందగోరుచున్నాడు. పొందుచున్నాడు.

తా. వి:- చతుర్థానువాకమున మందమధ్యమాధికారియు, శ్రీమేధాకాముడు నగు నుపాసకుని ప్రయోజనమున కనుకూలించు నోంకారోపాసనము జపహోమవిధానము వివరింపబడినవి. అష్టమానువాకమున నుత్తమాధికారి నుద్దేశించి శుద్ధబ్రహ్మోపాసనము వివరింపబడుచున్నది.

చిరకాలము విషయవ్యావృత్తములగు దేహాదులే యాత్మయనుభ్రాన్తిచే వ్యాకులితమగు చిత్తమొక్కమారుగ నిష్కలము నిష్క్రియము నిర్గుణమునగు పరబ్రహ్మము నర్థము చేసికొనలేదు. అట్టిమందాధికారుల కుపాసనము బ్రహ్మావగమనమార్గముగ నుపదేశింపబడుచున్నది. శాస్త్రోపదిష్టమగు నేదోయొక నికృష్టవస్తువునం దుపాస్యమగు నుత్కృష్టవస్తువును భావించి అద్దాని నితరవస్తుచింతనముచే ననంతరితముగ ననవరతము ధ్యానించుట యుపాసనమనంబడును. ఇతరవృత్తులచే

ఉపాసనాశబ్దార్థము

నంతరితము గాకుండునటులు చిత్తమును నిరోధించుటయే యుపాసనముయొక్క ముఖ్యలక్షణము. ఆలంబనయోగ్యములగు వస్తువులు శాస్త్రము నందు పేర్కొనబడినవి. సాలగ్రామమునందు విష్ణుభావనము, ప్రపంచమునందు బ్రహ్మభావనము మొదలగు నుపాసనావిధానము లచ్చటచ్చట చూపబడినవి. ఉపాసనమున కాలంబనమగు నికృష్టవస్తువు ప్రతీకయని చెప్పబడుచున్నది. ప్రతీక మెపుడును నికృష్టము, ఉపాస్యదేవత యుత్కృష్టమునగును.

రాజబుద్ధిచే రాజపురుషు నాశ్రయించి యభీప్సితార్థము సాధింపవచ్చును. రాజపురుషబుద్ధిచే రాజునాశ్రయించిన నపకారముకలుగును.

ఉపాస్యమగు నుత్కృష్టపదార్థము విష్ణువు గణపతి మొదలగు దేవతలు కావచ్చును. లేకసగుణములగు హిరణ్యగర్భాదులు కావచ్చును. లేక నిర్గుణమగు పరబ్రహ్మము కావచ్చును. ఉపాసనాప్రకారమునం దుపాస్యమగు నుత్కృష్టవస్తువు, ఉపాసకుడు, ఆలంబనమగు నికృష్టవస్తువు, ఉపాసనమను మానసిక్రియ మొదలగుభేదము లుండుటచే నుపాసనము ద్వైతవిశిష్టమగుచున్నది. ద్వైతవిశిష్టమగు నుపాసనావిధానముచే నద్వయము నిర్గుణమునగు పరబ్రహ్మ ముపాస్యము కానేరదని తలంపవనిలేదు. ఏనిర్గుణస్వరూపమున బ్రహ్మము సాక్షాత్కారము చేసికొనబడుచున్నదో ఆరూపముననే నదియుపాస్యముగూడనగుచున్నది. అద్వితీయమగు పరబ్రహ్మ ముపాధిసంబంధముచే నుపాస్యముగను నిరుపాధికసంబంధముచే జ్ఞేయముగను వేదాన్తములయం దుపదేశింపబడుచున్నది. ఉపాసనము ధ్యానస్వరూపమగుటచే నితరసమయములయం దుపాస్యవస్తువు బుద్ధియందు నిలువనేరదు. తానేబ్రహ్మమను జ్ఞానము, దృఢమయినతరువాత, విలయమును చెందనేరదు. ఆలంబనస్థానమగు నికృష్టవస్తువుపాసకుని యిష్టానుసారము నిశ్చయింపవచ్చును. పరబ్రహ్మము సిద్ధపదార్థమగుటంజేసి యున్నదియున్నటులమాత్రమే తెలిసికొన

నిర్గుణబ్రహ్మముపాస్యము గూడ నగుచున్నది

దగియుండును. ప్రత్యక్షముగ కనబడుచున్న ఘటమును ఘటాకారముగనే తెలిసికొనగలుగుదుము గాని పటాకారముగ దెలిసికొనలేము. చిత్తవృత్తినాధారముచేసికొనునది యుపాసనము. అది మానసికక్రియ. వస్తువుయొక్క యథార్థస్థితినిబట్టి జ్ఞానము కలుగుచున్నది. జ్ఞేయమగు యథార్థస్థితికి భిన్నముగ నద్దాని గ్రహించుట యజ్ఞానమే యగును. ఇట్టినిర్గుణబ్రహ్మోపాసనము నృసింహోత్తరతాపనీయము, ప్రశ్నోపనిషత్తు, కాఠకము మొదలగు నుపనిషత్తులయందు ప్రస్తావింపబడినది. చిత్తశుద్ధిలేని యుపాసనము నిరర్థకము.

ఉపాసన ముపాసకుని చిత్తవృత్త్యనురూపమగుటంజేసి నిర్గుణసగుణనిష్కామసకామభేదముచే ననేకవిధములగుచున్నది.

ఉపాసనాఫలము

నిష్కామనిర్గుణబ్రహ్మోపాసనము పరిపక్వమైనపు డవిద్యావినాశము, దానివలన బ్రహ్మజ్ఞానము, దానిచే జీవన్ముక్తిలక్షణమగు మోక్షము కలుగును. అపక్వనిర్గుణోపాసకుడు మరణానంతరము బ్రహ్మలోకమును పొంది ముక్తుడగును. బ్రహ్మజ్ఞానములేక మోక్షమెప్పుడును కలుగనేరదు. సకామనిర్గుణోపాసనాబలముచే బ్రహ్మలోకప్రాప్తియు నచటబ్రహ్మోపదిష్టమగు జ్ఞానమువలన కల్పాంతమున బ్రహ్మతో గూడ ముక్తియు లభించును. నిష్కామమగు సగుణబ్రహ్మోపాసనమునకు గూడ బ్రహ్మలోకప్రాప్తియే ఫలము. సగుణబ్రహ్మోపాసనము సకామమైనచో నణిమాద్యైశ్వర్యసిద్ధిహేతు వగుచున్నది. సాలగ్రామాదిప్రతీకోపాసనాపేక్షితమగు నితరదేవతోపాసనలచే తత్తద్దేవతానుగ్రహను

రూపమగు ఫలము లభించును. అవసానసమయమునందు చిత్తము దేనియందు నిలుచునో అదియే మరణానన్తరము శరణ్యమగును. బ్రహ్మతత్త్వవిచారణము చేయలేని మందమధ్యమాధికారుల కుపాసనము క్రమముక్తిసాధనమగును.

బ్రహ్మసాక్షాత్కారము బ్రహ్మజ్ఞానైకసాధ్యము

బ్రహ్మజ్ఞానమొకటియే స్వస్వరూపసాక్షాత్కారసాధనమని చెప్పబడినదిగదా! ఇదియే జీవన్ముక్తి. జీవన్ముక్తుడీశరీరము నిలిచియుండగనే బ్రహ్మసాక్షాత్కారమును బొంది సర్వసంసారబంధములనుంచి ముక్తుడగును. అతనిబుద్ధియందు సర్వప్రపంచము మిథ్యామాత్రమగుచున్నది. ప్రారబ్ధానుభవము పూర్తియయినవెంటనే యతనిశరీరము రాలిపోవును. జీవన్ముక్తుడు శరీరమునందు ప్రాణధారణము జేయుచున్నట్లు కాన్పించినను దానిచే సంస్పృష్టుడుగాడు. మజ్జిగచిలికి తీసిన వెన్నముద్ద తిరిగి నీటిలోగాని మజ్జిగలోగాని కలియదు. జీవన్ముక్తుని సంచితమంతయు నశించును గనుక తత్కృతమగు పునర్జన్మమతనికి లేదు. ఇట్టిజీవన్ముక్తికి సంపూర్ణవైరాగ్యము శ్రవణమననపూర్వకమగు బ్రహ్మస్వరూపవిచారముచే లభ్యమగు నాత్మజ్ఞానము ననివార్యములగుచున్నవి. వైరాగ్యము బ్రహ్మవిచారము పరిపక్వములైనపుడే జీవన్ముక్తి లభ్యమగును.

విచారము పరిపక్వమై సంపూర్ణవైరాగ్య మబ్బనిచో పుణ్యలోకప్రాప్తియు, నచట భోగక్షయానంతరము శిష్టాచారసంపన్నము, ఉభయకులపవిత్రము శ్రీమంతమునగు కులమున జన్మయు సంప్రాప్తమగును. శ్రద్ధావైరాగ్యాదికల్యాణగుణో

హేతువయినను విచారపరిపాకములేని జిజ్ఞాసు వవసానసమయమున నిరీహుడైనచో, దేహపాతానంతరోత్తరక్షణమునందే తత్త్వవిచారకుశలులు బ్రహ్మవిద్యావంతులునగు వారివంశమున జన్మించును. ఇట్టిమహాభాగ్యము శుకాదిమహర్షుల సుకృతభాగధేయము.

బ్రహ్మవిచారము నిష్ఫలముగా నేరదు

పౌర్వదైహికవిచారవాసనాబలసముపేతమగు పూర్వాభ్యాసపాటవముచే నతడు తత్త్వవిచారమార్గమున కాకృష్టుడై జ్ఞానపరిపాకముచే జీవన్ముక్తు డగును. విచారణాజన్యమగు జ్ఞానము సాక్షాన్మోక్షహేతువగుచున్నది. జ్ఞానమునకావశ్యకమగు నేకాగ్రతనిచ్చు ఉపాసనము మోక్షమునకు పరంపరాసాధనము. ఇట్లుపాసనము క్రమముక్తికిని, జీవన్ముక్తికిని కారణమగుచున్నది. బ్రహ్మజ్ఞానము విద్యయనియు విజ్ఞానమనియుగూడ బిలువబడుచున్నది. విద్యాశబ్దముపాసనాపరముగ నచ్చటచట వాడబడుచున్నది. ఉపాసకు డెన్నడును దుర్గతిని జెందడు. ఉన్నదానికంటె హీనజన్మమునొందడు.

ఉపాసన ముపాసకోపాస్యాదిద్వైతనిబద్ధము. బ్రహ్మజ్ఞాన మద్వితీయబ్రహ్మవిషయము. కనుక నీరెంటికిని సముచ్చయము కుదరనేరదు.

కర్మజ్ఞానసముచ్చయము కుదరదు

శీతోష్ణములు, చీకటివెలుగులు మొదలగు ద్వంద్వములకెప్పుడును సహావస్థానము సంభవముకాదు. అటులనే కర్మజ్ఞానములకుగూడ సముచ్చయము సాధ్యముకాదు. కర్మోపాసనములు రెండు నవిరుద్ధములై పరస్పరసహాయకము లగుటంజేసి వానికి సముచ్చయము కుదురును. కాని యీరెంటికిని

గూడ నేకకాలికముగ సముచ్చయము సాధ్యముకాదు. ఒకే వ్యక్తి ముందు కర్మాచరణముచే చిత్తశుద్ధిని బొంది తరువాత నుపాసనముచే చిత్తైకాగ్ర్యమును గాని క్రమముక్తినిగాని బొందును. ఇదియే కర్మోపాసనాసముచ్చయమున కర్థము. ఇట్టి కర్మ గూడ నిష్కామమే గాని సకామముగా కూడదు. సకామ కర్మాచరణముచే నభీప్సితార్థసిద్ధిమాత్ర మబ్బును. నిష్కామ కర్మాచరణముచే మృత్యురూపమగు సంసారమును దాటి సగుణోపాసనముచేత బ్రహ్మలోకమున కేగును. కర్మసముచ్చితమగు నన్యదేవతోపాసనము బ్రహ్మలోకప్రాప్తికి సాధనము కాదు. కర్మాచరణములేని కేవలోపాసన మేవిధమైన ఫలము నివ్వదు. కర్మాచరణములేమిం జేసి చిత్తశుద్ధి కుదరదు. చిత్తశుద్ధిలేని యుపాసనము వ్యర్థము. అట్టివాడు కర్మోపాసనా ఫలముల రెంటికిని చెడినవాడగును.

పరాపరబ్రహ్మలుభయములును ప్రణవోపాసనావిషయము లగుచున్నారు. సామాన్యముగ ప్రణవోపాసనములన్నియు నిర్గుణబ్రహ్మపరములే యగుచున్నవి. కాని దేహమే యాత్మయను చిరంతనభ్రాంతిచే వ్యాకులితచిత్తులగు మందబుద్ధులకు జీవబ్రహ్మాత్మాభేదము సుగమము కానేరదు. అట్టివారలకు ఓంకారముఖమున సగుణోపాసనము మున్ముందు విధింపబడినది.

పరాపరబ్రహ్మలు ఓంకారోపాసనా విషయములు

శబ్దాత్మకమగు నోంకారముచే ప్రతిపాదితమగు పరబ్రహ్మమే యిచట నుపాస్యవస్తువు. సర్వము శబ్దముచేతనే

వాచ్యమగుచున్నది. శబ్దజాలమంతయు నోంకారమునుంచియే బయలుదేరుచున్నందున వాచ్యమగు సర్వము నోంకారశబ్ద వాచ్యమై తదాత్మకమగుచున్నది. అందుచే నోంకారము సర్వోత్కృష్టమగుచున్నది. ఓం అను శబ్దముచే నితరుల కనుజ్ఞ యివ్వబడుచున్నది. ఓం అనుశబ్దముచేతనే నగ్నీధ్రుని సంబోధనజేసి యాశ్రావణప్రత్యాశ్రావణములు జేయబడుచున్నవి. సామాదిగానములయందు బ్రహ్మ ఋత్విక్కులను ప్రణవపురస్సరముగ ననుజ్ఞ నిచ్చుచున్నారు. ఈశబ్దముచే బ్రహ్మప్రాప్తి కోరబడుచున్నది. ఓంకారముయొక్క సార్వాత్మ్యమిచట సామాన్యముగ వర్ణింపబడినది. విశేషమును దెలిసికొనగోరువారు మాండూక్యోపనిషత్తును చూడగలరు.

ఓంకారముయొక్క యుత్కృష్టత

---

## పంచమానువాకము

### (వ్యాహృత్యుపాసనము)

మూ:- భూర్భువః సువరితి వా ఏతాస్తిస్రో వ్యాహృతయః । తాసాము హస్మైతాం చతుర్థీం । మాహాచమస్యః ప్రవేదయతే । మహ ఇతి । తద్బ్రహ్మ । స ఆత్మా । అఙ్గాన్యన్యా దేవతాః ।

భూరితివా అయం లోకః । భువ ఇత్యన్తరిక్షం । సువరిత్యసౌ లోకః । ఆదిత్యేన వావ సర్వే లోకా మహీయన్తే ।

భూరితి వా అగ్నిః । భువ ఇతి వాయుః । సువరిత్యాదిత్యః । మహ ఇతి చన్ద్రమాః । చన్ద్రమసా వావ సర్వాణి జ్యోతీగ్ంషి మహీయన్తే । భూరితి వా ఋచః । భువ ఇతి సామాని । సువరితి యజూగ్ంషి ।

మహ ఇతి బ్రహ్మ । బ్రహ్మణా వావ సర్వే వేదా మహీయన్తే । భూరితి వై ప్రాణః । భువ ఇత్యపానః । సువరితి వ్యానః । మహ ఇత్యన్నం । అన్నేన వావ సర్వే ప్రాణా మహీయన్తే । తా వా ఏతాశ్చతస్రశ్చతుర్ధా । చతస్రశ్చతస్రో వ్యాహృతయః । తా యో వేద స వేద బ్రహ్మ । సర్వేఽస్మై దేవా బలిమావహన్తి॥

టీ:- భూః, భువః, సువః అనునవి మూడును వ్యాహృతులు. నాల్గవదియగు మహః యను వ్యాహృతిని మహాచమస్యుడు తెలిసికొనెను. ఆనాల్గవవ్యాహృతి బ్రహ్మము. అదియే ఆత్మ. ఇతరములగు దేవత లంగములు.

భూః అనువ్యాహృతి యీభూలోకము. భువః అను వ్యాహృతి యంతరిక్షలోకము. సువః అనువ్యాహృతి స్వర్గలోకము. లోకములన్నియు నాదిత్యునిచేత వృద్ధినిపొందుచున్నవి.

భూః అనువ్యాహృతి అగ్ని; భువః అనువ్యాహృతి వాయువు; సువః అనునది ఆదిత్యుడు; మహః అనునది చంద్రుడు; సమస్తజ్యోతిస్సులు చంద్రునిచేత వృద్ధినిపొందుచున్నవి.

భూః అనువ్యాహృతి ఋక్కులు; భువః అనునది సామములు; సువః అనునది యజుస్సులు; మహః అనునది ఓంకారము. వేదములన్నియు నోంకారముచేత వృద్ధినిపొందుచున్నవి.

భూః అనువ్యాహృతి ప్రాణవాయువు; భువః అనునది అపానవాయువు; సువః అనునది వ్యానవాయువు; మహః అనునది అన్నము; సర్వప్రాణులు అన్నముచేత వృద్ధినిపొందుచున్నవి.

ఆయీనాలుగువ్యాహృతులు నాల్గువిధములుగ నున్నవి. వ్యాహృతులు నాల్గేసినాల్గేసి యగుచున్నవి. వానినెవ్వడుపాసించునో వాడు బ్రహ్మమునుపాసించుచున్నాడు. ఇట్లెఱింగిన వానిని దేవతలు పూజించుచున్నారు.

తా.వి:- పంచమానువాకమున వ్యాహృత్యుపాసనము వివరింప బడుచున్నది. భూః, భువః, సువః, మహః అనునవినాలుగు. వీనిలో మహః యనునది మహాచమస్యుడు యోగదృష్టిచే గ్రహించెను. ఈమహో వ్యాహృతి బ్రహ్మపరము. బ్రహ్మశబ్దము నకు నిరతిశయమగువృద్ధి యనియర్థము. మహః అనుశబ్దమునకు గూడ నదియేయర్థము. మహఃశబ్ద మాత్మపరముఃగూడ నగు చున్నది. ఆత్మశబ్దమునకు వ్యాపించుట యనియర్థము. మహః శబ్దముగూడ సర్వవ్యాపకార్థకము. కావున బ్రహ్మాత్మమహః శబ్దము లేకార్థకము లగుచున్నవి.

వ్యాహృతి చతుష్టయము

మహోవ్యాహృతి సర్వవ్యాపకముగనుక అంగి అనగా ప్రధానము. ఇతరవ్యాహృతులు దానికంగములు. సూర్యచంద్ర బ్రహ్మాన్నముల రూపము మహోవ్యాహృతి. పృథివ్యన్తరిక్షద్యులోకము లాదిత్యవ్యాప్తములు. అగ్నివాయ్వా దిత్యదేవతలు చంద్రవ్యాప్తములు. ఇట్లు లోకదేవవేదప్రాణా త్మకములగు నితరవ్యాహృతులు ఆదిత్యచంద్రమస్బ్రహ్మాన్న భూతమగు మహోవ్యాహృతిచే వ్యాప్తములగుటంజేసి యీ వ్యాహృతి అంగియనియు భూరాదీతరవ్యాహృతు లంగము లనియు వర్ణింపబడినవి. బ్రహ్మకును మహోవ్యాహృతికిని నిరతి శయమగువృద్ధి సామాన్యధర్మము. ఆత్మకును మహోవ్యాహృ తికిని వ్యాపకత్వము సామాన్యధర్మము. అందుచే నీవ్యాహృతి రూపమున బ్రహ్మాత్మ లుపాస్యము లగుచున్నవి.

మహోవ్యాహృతికిని బ్రహ్మాత్మలకు సామ్యము

## షష్ఠానువాకము

### (మనోమయత్వాదిగుణక బ్రహ్మోపాసనము)
### (కించిత్ సూక్ష్మదర్శిమధ్యమాధికారి)

మూ:- స య ఏషో౽న్తర్హృదయ ఆకాశః । తస్మిన్నయం పురుషో మనోమయః । అమృతో హిరణ్మయః ।

అన్తరేణ తాలుకే । య ఏష స్తన ఇవావలమ్బతే । సేన్ద్రయోనిః । యత్రాసౌ కేశాన్తో వివర్తతే । వ్యపోహ్య శీర్షకపాలే ।

భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి । భువ ఇతి వాయౌ । సువరిత్యాదిత్యే । మహ ఇతి బ్రహ్మణి । ఆప్నోతి స్వారాజ్యమ్ । ఆప్నోతి మనసస్పతిమ్ । వాక్పతిశ్చక్షుష్పతిః ।

శ్రోత్రపతిర్విజ్ఞానపతిః । ఏతత్తతో భవతి । ఆకాశశరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణారామమ్ మన ఆనన్దమ్ । శాన్తిసమృద్ధమమృతమ్ । ఇతి ప్రాచీనయోగ్యోపాస్స్వ॥

టీ:- హృదయపుండరీక మధ్యభాగమునందు ఏయీ ఆకాశము కలదో ఆయాకాశమునందు మనోమయుడును మరణ ధర్మరహితుడును జ్యోతిర్మయుడును నగునాయీ పురుషుడు గలడు.

తాలుకలమధ్యభాగమునం దేయీసుషుమ్నానాడి స్తన మువలే వ్రేలాడుచున్నదో, ఎచ్చట ఈ కేశములయొక్క మొదలు విభాగమగుచున్నదో శిరఃకపాలములను విభజించి వెలుపలికి వెడలుచున్నదో అది పరమాత్మను బొందుటకు మార్గము.

ఈవిధమున పరమాత్మప్రాప్తిమార్గమును పొందిన విద్వాంసుడు భూః అనువ్యాహృత్యాత్మకమగు నగ్నియందు ప్రతిష్ఠను బెందును; భువః అనువ్యాహృత్యాత్మకమగు వాయువునందు

ప్రతిష్ఠితుడగుచున్నాడు; సువః అనువ్యాహృత్యాత్మకమగు నాదిత్యునియందు ప్రతిష్ఠితుడగును; మహః అనువ్యాహృత్యాత్మకమగు బ్రహ్మమునందు స్థిరముగనుండును.

స్వారాజ్యభావమును బొందును; సర్వమనస్సుల యాధిపత్యమును బొందును; అందరివాక్కులకు నధిపతియగును; నేత్రముల కధిపతియగును; శ్రవణముల కధిపతియగును; విజ్ఞానముల కధిపతియగును.

తరువాతనిట్లు సంభవించును. ఆకాశమువలె సూక్ష్మశరీరము కలిగినట్టియు, మూర్తామూర్తస్వరూపమైనట్టియు ప్రాణములయందు క్రీడించునట్టియు ఆనందాత్మకమగు మనస్సుగల్గినట్టియు, సర్వోపశమసమృద్ధమైనట్టియు అమరణధర్మమైనట్టియు బ్రహ్మమే యగుచున్నాడు. ఓయి! ప్రాచీనయోగ్య! ఈవిధముగ నుపాసింపుము.

తా. వి:- మహోవ్యాహృతిరూపమున నుపాస్యముగా పంచమానువాకమున జేర్కొనబడిన పరబ్రహ్మముయొక్కయుపలబ్ధిస్థానము తన్మార్గమిచట వివరింపబడుచున్నది. మనుజుని హృదయము ముకుళితపద్మమును బోలిన యాకృతిగలిగి స్వాంగుష్ఠపరిమితమగుచున్నది. అందలి యాకాశము బుద్ధిస్థానము.

హార్దాకాశము బ్రహ్మోపలబ్ధిస్థానము

ఇచట నుపాసనాలభ్యమగు చిత్తైకాగ్ర్యముచే పరబ్రహ్మ మపరోక్షముగ తెలియబడగలదు. పరబ్రహ్మము సర్వవ్యాపియయినను నద్దానిసాక్షాత్కారముకొరకు హృదయకుహరము నిర్దేశింపబడినది. బ్రహ్మోపలబ్ధికి మనస్సు సాధనమగుటంజేసి యతడు

మనోమయుడని వర్ణింపబడుచున్నాడు. ఆతడు మరణరహితుడు, జ్యోతిర్మయుడు.

హృదయమునుంచి నూటయొక్క-నాడులు బయలుదేరు చున్నవి. వానిలోనొకటి మూర్ధప్రదేశమునకు పోవుచున్నది. ఇదియే సుషుమ్నా నాడి. ఈనాడి హృదయమునుండి కంఠమధ్యముగుండ కొండనాలుకకు సమీపముగాబోయి శిరఃకపాలమును భేదించుకొని శరీరమునుంచి వెలుపలికి వినిర్గతమగు చున్నది. కొండనాలుకచే నీసుషుమ్నానాడీస్థానమును గుర్తింపగలము. ఈనాడియే పరబ్రహ్మప్రాప్తిమార్గము. సృష్ట్యనంతర మీనాడీద్వారమున సృష్టికర్త శరీరమును ప్రవేశించెను. ఆమార్గముననే నిర్గమనముగూడ చెప్పబడినది.

సుషుమ్నా నాడి బ్రహ్మోపలబ్ధిమార్గము

ఆత్మదర్శియగు విద్వాంసు డీనాడీద్వారమున బయటికి నిష్క్రమించి భూర్వ్యాహృతిరూప మగు నగ్నిస్వరూపమునను, భువర్వ్యాహృతిరూప మగువాయురూపమునను, సువర్వ్యాహృతిరూప మగువాదిత్యస్వరూపమునను, మహోవ్యాహృతిరూపమై యంగిభూతమైన బ్రహ్మమును బొందును. మరియు స్వారాట్టునగును. అతని కితరదేవతలందరు బలి నిచ్చెదరు. సమష్టిస్వరూపమగు విరాడ్భావమునొంది మానసికభావమును తానే బొందును. అటులనే సర్వవాక్చక్షుః శ్రోత్ర విజ్ఞానభావము నొందును. ఇట్లు వ్యాహృత్యుపాసకుడు సర్వాత్మత్వభావము నొందునని భావము,

వ్యాహృత్యుపాసనము యొక్క యానుషంగికఫలము

ఇంతకంటె నుత్కృష్టతమము నాత్యంతికము నగు ఫలము బ్రహ్మభావము. ఎవనివలన మనః ప్రాణములు, సర్వేన్ద్రియము లుత్పన్నములగుచున్నవో, మనస్సు విషయానందవిముక్తుడగు నెవని యందు రమించుచు పరమానందము

వ్యాహృత్యుపాసనము యొక్క ఆత్యంతికఫలము

నొందుచున్నదో, ఎవ్వనియందు నిర్వికల్పసమాధియని బిలువ బడు అద్వితీయమునగు శాన్తి యొసగుచున్నదో, కూటము వలె నిర్వికారము ప్రశాంతము, అమరణము నగునట్టి బ్రహ్మ భావమును జ్ఞానియగువాడు శరీరమునుంచి సుషుమ్నాద్వార మున నిష్క్రమించుచు పొందుచున్నాడు. ఇది క్రమముక్తి విషయము.

---

## సప్తమానువాకము

### పృథివ్యాద్యుపాధికబ్రహ్మోపాసనము

### (మన్దాధికారి)

మూ:- పృథివ్యన్తరిక్షం । ద్యౌర్దిశోఽవాన్తరదిశః । అగ్నిర్వాయు రాదిత్యశ్చన్ద్రమా నక్షత్రాణి ఆప ఓషధయో వనస్పతయ ఆకాశ ఆత్మా । ఇత్యధిభూతమ్ ।

అథాధ్యాత్మమ్ । ప్రాణో వ్యానోఽపాన ఉదానః సమానః । చక్షుః శ్రోత్రం మనో వాక్త్వక్ చర్మ మాగ్ంసగ్ం స్నావాస్థిమజ్జా । ఏతదధి విధాయ ఋషిరవోచత్ పాఙ్క్తం వా ఇదగ్ం సర్వం పాఙ్క్తేనైవ పాఙ్క్తగ్ం స్పృణోతీతి । సర్వమేకం చ॥

టీ:- పృథివి అన్తరిక్షము, ద్యులోకము, దిక్కులు అవాన్తరదిశలు - ఇవి లోకపాఙ్క్తము. అగ్ని, వాయువు,

సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు- ఇవి దేవతాపాఙ్క్తము. జలములు, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, విరాడ్భూతము - ఇవి భూతపాఙ్క్తము. ఈవిధముగ భూతపాఙ్క్తము చెప్పబడినది.

ఇక దేహవిషయకమగు పాఙ్క్తత్రయము చెప్పబడు చున్నది. ప్రాణవాయువు వ్యానము, అపానము, ఉదానము, సమానము—ఈవాయుపంచకము వాయుపాఙ్క్త మనబడును. నేత్రములు, శ్రోత్రములు, మనస్సు, వాక్కు, త్వక్కు—ఇవి యింద్రియపాఙ్క్తము. చర్మము మాంసము సన్నరములు, ఎముక, క్రొవ్వు—ఇవి ధాతుపాఙ్క్తము. ఈవిధముగ ఈవిషయము నెఱింగినమహర్షియొకడు విభాగముచేసి పరిదృశ్యమానమగు ప్రపంచమునంతయు పాఙ్క్తమే యనియు నాధ్యాత్మికపాఙ్క్తత్రయముచేతనే బాహ్యపాఙ్క్తత్రయమును నింపుచున్నదని పలికెను. లేదా వేదమిట్లు పలికెనని చెప్పవచ్చును.

తా. వి:- సప్తమానువాకమునందు మందాధికారుల నుద్దేశించి పృథివ్యాదిభౌతికోపాధిక బ్రహ్మోపాసనము విస్తరింపబడినది. జగత్తంతయు నాధిభౌతికము. ఆధ్యాత్మికమని విభజింపబడినది. ప్రతివిభాగము తిరిగి మూడేసి భాగములగుచున్నది. ఇట్లు జగత్తంతయు నుపాసనార్థ మారుభాగములుగ విభజింపబడినది. ఈయారు భాగములలోని ప్రతిభాగము పంచావయవాత్మకముగ జెప్పబడినది. ప్రతిభాగమునందు పంచావయవములుండుటచే నది

పాఙ్క్తోపాసనము

పాఙ్క్తమని పిలువబడుచున్నది. పాఙ్క్తశబ్దమున కైదవయ వయములుగలది యని యర్థము.

ఆధిభౌతికపాఙ్క్తము లెవ్వియన:-

1. పృథివి, అంతరిక్షము, ద్యులోకము, దిక్కులు, అవాన్తర దిక్కులు - కలిసి లోకపాఙ్క్తమగుచున్నది.
2. అగ్ని వాయువు, ఆదిత్యుడు, చంద్రుడు, నక్షత్రములు కలిసి దేవతాపాఙ్క్తమగుచున్నవి.
3. జలము, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, విరాట్టు కలిసి భూతపాఙ్క్తమగుచున్నది. పూవుపూచి కాయలు కాచునవి యోషధులు, పూవులేకనే కాయకాచునవి వన స్పతులనబడును.

ఆధ్యాత్మికపాఙ్క్తవిభాగము:-

4. ప్రాణాదివాయుపంచకము వాయుపాఙ్క్తము.
5. చక్షురాదిజ్ఞానేన్ద్రియపంచక మింద్రియపాఙ్క్తము.
6. చర్మమాంసఅస్థిమజ్జస్నాయువులను ధాతుపంచకము.

ఈవిధముగ పాఙ్క్తషట్కాత్మకమగు జగత్తు బ్రహ్మ స్వరూపమని భావనచేసి యుపాసనముచేసిన పంచీకృతపంచ మహాభూతముల కార్యస్వరూపమగు విరాడ్భావము సిద్ధించును. జగత్తంతయు విరాట్స్వరూపమగుటంజేసియు విరాడ్భావము పాఙ్క్త్యుపాసనమగుటంజేసియు, షడ్విధపాఙ్క్తములయొక్క సమష్ట్యుపాసనమిచట ఉపదేశింపబడినట్లు కాన్పించుచున్నదిగాని ప్రత్యేకపాఙ్క్తోపాసన ముద్దేశింపబడినట్లులేదు.

## నవమానువాకము

## (ఉపాసకధర్మములు)

మూ:-ఋతం చ స్వాధ్యాయప్రవచనే చ । సత్యం చ స్వాధ్యాయప్రవచనే చ । తపశ్చ స్వాధ్యాయప్రవచనే చ । దమశ్చ స్వాధ్యాయప్రవచనే చ । శమశ్చ స్వాధ్యాయప్రవచనే చ । అగ్నయశ్చ స్వాధ్యాయప్రవచనే చ । అగ్నిహోత్రం చ స్వాధ్యాయప్రవచనే చ । అతిథయశ్చ స్వాధ్యాయప్రవచనే చ । మానుషం చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజనశ్చ స్వాధ్యాయప్రవచనే చ । ప్రజాతిశ్చ స్వాధ్యాయప్రవచనే చ ।

సత్యమితి సత్యవచా రాథీతరః । తప ఇతి తపోనిత్యః పౌరుశిష్టిః । స్వాధ్యాయప్రవచనే ఏవేతి నాకో మౌద్గల్యః । తద్ధి తపస్తద్ధితపః । ప్రజా చ స్వాధ్యాయప్రవచనే చ షట్ చ॥

టీ:- శాస్త్రీయమయిన దర్శపూర్ణమాసాదికర్మజాతము వేదాధ్యయనాధ్యాపనములు చేయదగినవి. సత్యము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సు స్వాధ్యాయప్రవచనములు చేయతగినవి. అన్తరింద్రియనిగ్రహము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. బహిరింద్రియనిగ్రహము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. అగ్నులు స్వాధ్యాయప్రవచనములు చేయతగినవి. అగ్నిహోత్రములు స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. అతిథిపూజనము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. లౌకికసంవ్యవహారము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. సంతానమునుకనుట స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి. ఋతుకాలమునందు భార్యాసంగమము స్వాధ్యాయప్రవచనములు చేయదగినవి.

పౌత్రోత్పత్తినిమిత్తము పుత్రునకు వివాహము, స్వాధ్యాయ ప్రవచనము చేయదగినవి.

రథీతరగోత్రజుడగు సత్యవచసుడను మహర్షి సత్యమును పలుకటయే యాచరణీయమనియు పురుశిష్టికుమారుడగు తపోనిత్యుడను మహర్షి తపస్సే యాచరణీయమనియు, ముద్గల పుత్రుడగు నాకమహర్షి స్వాధ్యాయప్రవచనములే యాచరణీయములనియు, స్వాధ్యాయప్రవచనములే తపస్సనియు వచించిరి.

తా.వి.—ఉపాసనముచేతనే స్వారాజ్యము లభించునట్లు షష్ఠానువాకమున చెప్పబడినది. అందువలన శ్రౌతస్మార్తకర్మలనర్థకములైనట్లు తోచవచ్చును. అట్టి యపోహను తొలగించి వాని పురుషార్థసాధకత్వమును బ్రదర్శించుట కీయనువాకము ప్రవర్తించుచున్నది. అధికారియగు ప్రతిమనుజుడును స్వాధ్యాయమున నధ్యయనముచేయవలెను. వేదాధ్యయనమే స్వాధ్యాయము. సంపూర్ణ వేదాధ్యయనము సాధ్యముకానపుడు స్వశాఖాధ్యయనమైనను తప్పక చేయవలెను. వేదమును తానధ్యయనముచేయుటయే గాక నద్దాని నితరుల కధ్యాపనముచేయవలెను. ఋతసత్యములు, కృచ్ఛ్రాదితపస్సు, దమమనగా బాహ్యేంద్రియనిగ్రహము, శమమనగా నన్తరింద్రియనిగ్రహము, త్రేతాగ్నులు, హోమములు, అతిథిపూజనము, వివాహాదులయందు బాంధవాదిసత్కారములు, నియమితకాలమున భార్యాగమనము, పుత్రపౌత్రాదిసంతానము మొదలగు ధర్మములు స్వాధ్యాయముతోపాటనుష్ఠేయములు. ఈకర్మములన్నియు చేయు

ఉపాసకధర్మములు

చున్నను పరప్రాప్తికి సర్వమూలమగు స్వాధ్యాయమును మానరాదు. స్వాధ్యాయాధీన మర్థజ్ఞానము. అర్థజ్ఞానాధీనము పరప్రాప్తి. గ్రంథము విస్మృతిరాకుండుటకును ధర్మవృద్ధికొఱకును ప్రవచనము చేయుచునే యుండవలెను.

మతభేదములు

సత్యమే యనుష్ఠేయమని రాథీతరుడు తలంచెను. శాస్త్రోపదిష్టమయినది ఋతము. అదియే యనుష్ఠానరూపము నొందినపుడు సత్యమనబడును. తపస్సే చేయదగునని పౌరుశిష్టి యభిప్రాయపడెను. తపః స్వాధ్యాయములే యనుష్ఠేయములని మౌద్గల్యుడు వచించెను. తపశ్శబ్దముచే కృచ్ఛ్రచాన్ద్రాయణాదివ్రతములు చెప్పబడుచున్నవి. యోగశాస్త్రమునందు హితము, మితము, మేధ్యము నగు నాహారము తపస్సనబడుచున్నది. ఇవి చేతకానివానికి ధనదానము తపస్సుగా విధింపబడినది. వీనియన్నిటికంటెను నుత్కృష్టతమమగుటచే స్వాధ్యాయప్రవచనములు తపస్సని నిర్వచింపబడినది.

---

## దశమానువాకము

### (బ్రహ్మజ్ఞానప్రకాశకము)

మూ:- అహం వృక్షస్య రేరివా । కీర్తిః పృష్ఠం గిరేరివ । ఊర్ధ్వపవిత్రో వాజినీవ స్వమృతమస్మి । ద్రవిణగ్ం సవర్చసమ్ । సుమేధా అమృతోక్షితః। ఇతి త్రిశఙ్కోర్వేదానువచనమ్॥

టీ:- నేను సంసారవృక్షమునకు ప్రేరకుడను. నాయొక్క కీర్తి పర్వతముయొక్క శృంగమునవలె వెలయుచున్నది. పర

మాత్మభూతుడను, పవిత్రుడను, జ్ఞానప్రకాశ్యుడను, సూర్యుని యందువలె విశుద్ధమయిన ఆత్మతత్త్వస్వరూపుడ నగుచున్నాను. దీప్తిగలధనము నేనగుచున్నాను. సర్వజ్ఞత్వలక్షణమయిన బుద్ధి గలవాడనగుచున్నాను. మరణములేనివాడను అక్షతుడను అగుచున్నాను. ఈవిధముగ త్రిశంకు మహర్షి వచించెను.

తా. వి:- త్రిశంకుమహర్షియొక్క అనుభవజ్ఞానకథన పురస్సరముగ నశేషవేదాన్తసారభూతము సకలసంసారసము న్మూలనసమర్థమునగు జ్ఞాన మీయనువాకమున విద్యానిమిత్తము స్తుతింపబడుచున్నది.

బ్రహ్మజ్ఞానఫలము

విశుద్ధసత్త్వసంపన్నునికి స్వాధ్యాయమువలన బ్రహ్మజ్ఞానోదయము గల్గును. అట్టి జ్ఞానకుఠారముచేతనే యశేషసంసారవృక్షచ్ఛేదము సాధ్యమగుచున్నది. పృథివ్యాదిపంచభూతములయందన్తర్యామిరూపమున నాపరబ్రహ్మమే యుండుచున్నను తెలియబడనివాడై వానిని నియమించుచున్నాడు. సంసారవృక్షచ్ఛేదసక్షమమగు నీకీర్తి స్వర్గలోకమునకు గూడవ్యాపించుట చేత నీపురుషార్థము నన్యథాచేయుటకు దేవతలకు గూడ సాధ్యముకాదు. ఇట్టి యాత్మజ్ఞానము దేవతలకు గూడ స్పృహణీయమగుచున్నది. బ్రహ్మవిదుడు సంసారముచే నసంస్పృష్టుడై పరబ్రహ్మమే యగుచున్నాడు. జ్ఞానమొక్కటియే దీనికి సాధనము. అజ్ఞానమనునావరణము నశించినపుడు గలుగు నఖండబ్రహ్మసాక్షాత్కార మిచట జ్ఞానశబ్దముచే చెప్పబడుచున్నది. ఇట్టిజ్ఞాని విశుద్ధమగు నాత్మతత్త్వమును పొంది ప్రకాశించును. అతడు మరణరహితుడు. స్వాధ్యాయమునందస

మస్థులగు నితరులుగూడ నీను స్త్రిజపముచే కృతకృత్యులగు చున్నారు.

---

## ఏ కా ద శా ను వా క ము

### (అనుశాసనము)

అ॥ బ్రహ్మజ్ఞానమునకవశ్యమగు చిత్తైకాగ్ర్యమునకు సాధనములగు కొన్ని యుపాసనములు ద్వితీయాద్యష్టమానువాకములయం దుపదేశింపబడినవి. ఉపాసనములవలన కర్మల యందశ్రద్ధ చేయరాదని నవమానువాకమున హెచ్చరిక చేయ బడినది. అశేషసంసారవృక్షచ్ఛేదమే స్వాధ్యాయఫలమని దశమానువాకమున ప్రదర్శింపబడినది. గురుకులావాసమునుంచి సమావర్తనము చేయుటకుపూర్వ మవసరమగు ధర్మజిజ్ఞాస వివరింపబడవలసియున్నది. గురుకులమును వదలిపోవు బ్రహ్మచారి కోరినచో వివాహము చేసికొనవచ్చును. వివాహేచ్ఛలేక వైరాగ్యము సంపూర్ణముగ కుదరనివాడు నైష్ఠికబ్రహ్మచర్యమున కాలముగడుపును. ఉభయాశ్రమముల కనుకూలమగు ధర్మము లీయనువాకమున పేర్కొనబడుచున్నవి.

మూ:- వేదమనూచ్యాచార్యోఽన్తేవాసినమనుశాస్తి । సత్యం వద । ధర్మం చర । స్వాధ్యాయాన్మాప్రమదః ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః ।

సత్యాన్న ప్రమదితవ్యమ్ । ధర్మాన్న ప్రమదితవ్యమ్ । కుశలాన్న ప్రమదితవ్యమ్ । భూత్యై న ప్రమదితవ్యమ్ । స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ । మాతృదేవో భవ । పితృదేవో భవ । ఆచార్యదేవో భవ । అతిథిదేవో భవ ।

యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని । నో ఇతరాణి । యాన్యస్మాకగ్ం సుచరితాని తాని త్వయోపాస్యాని । నో ఇతరాణి ।

యేకే చాస్మచ్ఛ్రేయాగ్ంసో బ్రాహ్మణాః తేషాం త్వయాసనేన ప్రశ్వసితవ్యమ్ । శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయాఽదేయమ్ । శ్రియా దేయమ్। హ్రియా దేయమ్ । భియా దేయమ్ । సంవిదా దేయమ్ ।

అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్తవిచికిత్సా వా స్యాత్ । యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామాః స్యుః । యథా తే తత్ర వర్తేరన్ । తథా తత్ర వర్తేథాః । అథాభ్యాఖ్యాతేషు యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః । యుక్తా అయుక్తాః అలూక్షా ధర్మకామాః స్యుః । యథా తే తేషు వర్తేరన్ తథా తేషు వర్తేథాః ।

ఏష ఆదేశః । ఏష ఉపదేశః । ఏషా వేదోపనిషత్ । ఏతదనుశాసనమ్ । ఏవముపాసితవ్యమ్ । ఏవము చైతదుపాస్యమ్ ।

స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ । తాని త్వయోపాస్యాని । విచికిత్సావాస్యాత్తేషువర్తేరన్సప్తచ॥

టీ:- ఆచార్యుడు వేదమును అధ్యాపనముచేసి శిష్యుని శాసించుచున్నాడు. సత్యమును పలుకుము. ధర్మము నాచరింపుము. అధ్యయనమునుగూర్చి ప్రమాదమును పొందకుము. ఆచార్యునికొఱకు ప్రియమైనధనమును తెచ్చియిచ్చి (ఆతనిచే ననుజ్ఞాతుడవై) పుత్రసంతతిని విచ్ఛేదము నొందింపకుము.

సత్యమునుగూర్చి ప్రమాదమును పొందకుము. ధర్మమునుగూర్చి ప్రమాదమును పొందకుము. ఆత్మసంరక్షణమునుగూర్చి ప్రమాదమును పొందకుము. మంగళప్రయోజనములనుగూర్చి ప్రమాదమును పొందకుము. అధ్యయనాధ్యాపనములనుగూర్చి ప్రమాదమును పొందకుము. దేవపితృకార్యములగూర్చి ప్రమాదమును చెందకుము.

తల్లియే దైవముగా భావింపుము. తండ్రియే దైవముగా భావింపుము. ఆచార్యుడే దైవముగా భావింపుము. అతిథియే దైవముగా భావింపుము.

ఏపనులు నింద్యములుకావో యవియే నీకు సేవింపతగినవి. తదితరములు సేవ్యములుకావు. మాయొక్క ఏసుచరితములు గలవో అవియే నీకనుష్ఠేయములు. తదితరములుకావు.

ఏ బ్రాహ్మణులు మాకంటె శ్రేష్ఠులో యట్టివారిశ్రమము నాసనాదులనిచ్చి పోగొట్టవలయును.

శ్రద్ధతో దానము చేయవలయును. అశ్రద్ధతో నివ్వ తగదు. సంపదకుతగినట్లు దానముచేయవలెను. లజ్జతో నివ్వవలెను. భయముతో నివ్వవలెను. గుర్తెఱింగి యివ్వవలెను.

నీకెప్పుడైనను కర్మనుగూర్చిగాని, ఆచారమునుగూర్చిగాని సందేహము గల్గినయెడల ఆదేశకాలములయందు విమర్శనాసమర్థులు, ఆసక్తిగలవారు, ప్రయోగస్వతంత్రులు, అక్రూరులు, ధర్మపరులు నగు బ్రాహ్మణు లావిషయమునం దేవిధముగా ప్రవర్తించెదరో ఆప్రకారముగా నీవును ప్రవర్తింపగలవు.

ఇకదోషులని శంకింపబడువారినిగూర్చి యాయాదేశకాలములయందు విమర్శనాకుశలులు ఆసక్తిగలవారు స్వతంత్రులు, అక్రూరులు ధర్మపరులు నగు బ్రాహ్మణు లావిషయమున నెట్లు ప్రవర్తించెదరో ఆప్రకారమే నీవును ప్రవర్తింపగలవు.

ఇదియే విధి. ఇదియే యుపదేశము. ఇది వేదరహస్యము. ఇది ఈశ్వరవాక్యము. ఈవిధముగా నుపాసనము చేయదగును.

తా.వి:- ఏకాదశానువాకమునందు బ్రహ్మజిజ్ఞాసోదయమునకు పూర్వ మవశ్యముగ కర్మము చేయదగినదని యనుశాసింపబడుచున్నది. జ్ఞానోత్పత్తికి పూర్వ మవశ్యము కర్మము కర్తవ్యమగుటంజేసి దానినతిక్రమించిన దోషముగల్గును. కర్మాచరణముచే పూర్వోపచితదురితక్షయము, అందువలన విద్యోత్పత్తియు లభించును. నవమానువాకమున స్వారాజ్యసిద్ధికొఱకు ఋతసత్యాదు లుపదేశింపబడినవి. ఇపుడవి జ్ఞానోదయమునకవశ్యమగు పూర్వాంగముగ నుపదేశింపబడుచున్నవి. వేదాధ్యయనమైనపిదప దారపరిగ్రహముం జేసుకొనినవాని కుచితములు ననుశాసనము చేయబడుచున్నది.

కర్మాచరణము జ్ఞానమునకు పూర్వాంగము

ఇతరుల కుద్వేగకరము దుష్టమునగు సంభాషణమును మానవలయును. ధర్మము నాచరింపవలయును. స్వాధ్యాయముపట్ల నెపుడును ప్రమాదముసేయరాదు. ఆచార్యునికి ప్రియమయినట్టియు యతనియాశ్రమమున కుచితము యినట్టియు న్యాయ్యమయినట్టియు దక్షిణను సమర్పింపవలయును. వివాహేచ్ఛగలిగినచో నాచార్యుని యనుజ్ఞబొంది యనురూపమగు దారపరిగ్రహము జేసి సంతానము విచ్ఛేదము కాకుండునటుల సంరక్షింపవలయును. ఇచట ప్రజాతంతుశబ్దముచే విద్యావంశము ధ్వనించుచున్నదని కొందఱు

గృహస్థధర్మములు

తలంచుచున్నారు. దేవపితృకార్యములయందు ద్రప్రమత్తతతో మెలంగవలయును. తల్లిని దైవభావముతో జూడవలయును. అటులనే పితాచార్యాతిథులను భావింపవలయును. అనిందితములగు శిష్టాచారముల నాచరింపవలయును. ఇతరములను వదలి వేయవలయును. ఆచార్యునియొక్క శాస్త్రసమ్మతమగు ప్రవర్తన ననుకరింపవలయును. గృహాగతులగు బ్రాహ్మణశ్రేష్ఠుల నన్నపానాద్యతిథిసత్కారములచే శ్రమాపనయనము చేయవలయును. వారు ప్రసంగించునపు డేమియుచెప్పక వారుచెప్పుదాని సారమునుమాత్రము గ్రహింపవలయును. శ్రద్ధాపూర్వకముగను, నిజవైభవానుసారముగను, స్వల్పముగా నిచ్చితినను లజ్జతోను, భయముతోను, మిత్రభావముతోను దానముచేయవలెను.

సందేహస్థలముల ప్రవర్తింపవలసిన మార్గము

ఇట్లు ప్రవర్తించునపు డెప్పుడైనను, శ్రౌతస్మార్తకర్మల విషయమైగాని, యాచారవిషయమైగాని సందేహముగల్గినచో యాయా దేశకాలములయందు విచారదక్షులు, ఋజుమార్గప్రవర్తకులు, అక్రూరులు, స్వలాభవర్జితులు, ధర్మకాములు నగు బ్రాహ్మణోత్తము లాయాసందేహస్థలములయందెట్లు ప్రవర్తించెదరో యట్లే ప్రవర్తింపవలెను. నేరము మోపబడినవారి విషయముకూడ నీవిధముగానే ప్రవర్తింపవలయును. ఇదియే యాదేశము. ఇదియే తండ్రులు పుత్రులకు చేయునుపదేశము. ఇదియే సర్వవేదరహస్యము. అందువలన నియతముగా నిది యనుష్ఠేయమగుచున్నది. ఇదియే ఈశ్వరాజ్ఞ.

జ్ఞానకర్మలస్వరూపవిశేషము తెలియుటకై యిచట నొకచిన్నవిచారణచేయందగు.

మోక్షమెట్లు లభించును? (1) కేవలకర్మములవలననా? (2) కర్మప్రధానమగు జ్ఞానమువలననా? (3) కర్మజ్ఞానముల సమ్మేళనమువలననా? (4) జ్ఞానప్రధానమగు కర్మమువలననా? లేక (5) కేవలజ్ఞానమువలననా?

ఆత్మజ్ఞానబోధకములగు నశేషవేదములు నర్థసహిత ముగ ద్విజుడు పఠింపవలయునని విధింపబడినంతమాత్రముచేత కర్మలే జ్ఞానైకసాధనము లనవీలు లేదు.

మోక్షమెట్లు కలుగును? కేవలకర్మవలననా?

మోక్షము నిత్యముగనుక నెల్లపుడు సిద్ధముగనున్నది. దానికి యుత్పత్తివినాశ ములు లేవు. కర్మఫలము కర్మచేపుట్టుచున్నది. అది కార్య రూపము. కర్మాచరణమునకు పూర్వమది లేదు. అనుభవముచే నశించును. అది నిత్యముగాదు. కామన లేనపుడు కామ్యకర్మా చరణము లేదు. నరకభీతిచే నిషిద్ధము నాచరింపడు. నిత్యాను ష్ఠానముచే ప్రత్యవాయము పుట్టదు. కనుక తిరిగి జన్మము లేదు. జ్ఞానముతో పనిలేకనే మోక్షము కలుగుచున్నదని కొందరు తలంచుచున్నారు. ఇది సరికాదు. తిరుగజన్మము లేకుండుటయే మోక్షమని యీవాదతాత్పర్యము. నిరుక్తప్రవర్తనముచే జన్మాన్తరము లేకున్న లేకుండుగాక. పూర్వసంచితమగు శేష కర్మానుభవముకొరకు తిరిగి జన్మమనివార్యమగుచున్నది. నిత్య కర్మానుష్ఠానము దురితమును నశింపజేసినను సత్కర్మఫలమును నశింపచేయలేదు. సంచితసత్కర్మానుభవముకొరకైనను తిరిగి

జన్మమవశ్యమగుచున్నది. కేవలకర్మాచరణముచే చిత్తశుద్ధి గల్గును గాని బ్రహ్మజ్ఞానమున కావశ్యకమగు చిత్తైకాగ్ర్యము కలుగదు. అది యుపాసనాప్రాప్యము.

దధ్యాదు లజీర్ణకారణములయినను శర్కరాదిమిశ్రితము లైనపుడు, పథ్యములైనట్లు కర్మముపాసనతో కూడినపుడు మోక్షహేతువు గావచ్చునన వీలులేదు. కర్మముపాసనాసంమిశ్రితమైనను నద్దాని ఫలము జన్యమగుటచే నది నిత్యముగానేరదు.

కర్మప్రధానజ్ఞానము వలననా?

కర్మము మోక్షమున కనుపయోగియయినచో పుణ్యలోకాదిగమనము, అచట స్త్రీయానాద్యైశ్వర్యానుభవము మొదలగునుత్తమఫలములను బోధించు శ్రుతివాక్యములన్నియు నిరర్థకములుకావలసివచ్చును గనుక కర్మోపాసనాసమ్మిశ్రణముచే మోక్షము సంభవింపవచ్చుననిగూడ చెప్పవీలులేదు.

కర్మజ్ఞానసముచ్చయమువలననా?

అద్వైతమతమున స్వస్వరూపమగు బ్రహ్మను సాక్షాత్కారము చేసికొనుటయే మోక్షము. అట్టిపరబ్రహ్మము సర్వగతుడు, అద్వితీయుడు లోకాంతరములకేగువానికంటె నన్యుడు నగుచున్నాడు. కనుక తత్ప్రాప్తికి లోకాన్తరగమనము నిరర్థకము. లోకాన్తరములుగూడ మిథ్యామాత్రములే యగుచుండ నచటికిబోవుట పరమార్థము గానేరదు. పరబ్రహ్మము ఏకమేవాద్వితీయము, సర్వవ్యాపి, సర్వసాక్షి. దానిని చూడ గలవాడెవ్వడును లేడు. విద్యాకర్మము లన్యోన్యము విరుద్ధములు. వానిసముచ్చయము తేజస్తమస్సులవలె యసంభవము.

గుహలోని చీకటిని దీపముచే చూడలేము. కర్మలు కర్తృక్రియా కారకములను భేదముగల్గియున్నవి. జ్ఞానమునకిట్టి త్రిపుటిలేదు. త్రిపుటియంతయు ద్వైతము, మిథ్య, మృత్యుపరంపరాకారణము. బ్రహ్మమున కవయవములులేవు. కనుక స్వగతభేదము లేదు. అటువంటిది మరియొకటిలేదు గనుక సజాతీయభేదము లేదు. దానికంటె వేఱయినది మరియొకటిలేదు. కనుక విజాతీయభేదము లేదు. ప్రపంచము బ్రహ్మముకంటె వేరు కాదు. కర్తృక్రియాదిభేదములేని స్థితియందు కర్మ సాధ్యముకాదు. కర్మము వేదవిహితము గనుక నుల్లంఘనీయ మనవీలులేదు. కర్మమును నియమించు శ్రుతులు పురుషార్థసాధకములు. సంసారమునుండి తొలిగించి మోక్షమార్గమును చూపుటయందే యశేషజ్ఞానశ్రుతులకు తాత్పర్యము. ఉపాత్తదురితక్షయము కొఱ కావశ్యకమగు కర్మలను శాస్త్రముపదేశించుచున్నది. కర్మజ్ఞానశ్రుతులు భిన్నఫలములను బోధించుచున్నవి. కనుక వానికి పరస్పరము విరోధములేదు. అజ్ఞానము నశించినపుడు జ్ఞానోదయము, అందుచే నాత్యంతికమగు సంసారనివృత్తియు కలుగును. కర్మకలాపమంతయు నాత్మకు భిన్నమగు స్వర్గాదులనుగూర్చి చెప్పును. స్వర్గాదిసుఖము కామనాచోదితము. ఆత్మకంటెవేరు మఱియొకటి లేదుగనుక నది కామనావిషయము కాదు. ఈప్రకారము జ్ఞానకర్మలు భిన్నఫలకములగుటచే వానిసముచ్చయము కుదరదు.

ఈరెంటికిని విరోధముండుటచేతనే జ్ఞానము సిద్ధించుటకు కర్మము నెంతమాత్రమపేక్షింపదు. జ్ఞానప్రతిబంధకమగు పూర్వోపాత్త దురితమును తొలగించుటకు మాత్ర

జ్ఞానప్రధానకర్మము వలననా?

ముపచరించుటచేతనే జ్ఞానోపదేశమునకు పూర్వము కర్మములీప్రకరణమున ప్రస్తావింపబడినవి.

కేవల జ్ఞానము చేతనా?

కనుక కేవలజ్ఞానముచేతనే కైవల్యము లభించునని సిద్ధమగుచున్నది. కర్మలు జ్ఞానసాధనములు, గృహస్థాశ్రమయోగ్యములు గనుక సన్న్యాసాశ్రమ మప్రసక్తమగుచున్నదని చెప్పవీలులేదు. అగ్నిహోత్రప్రజననాది కర్మల కుచితమగు గృహస్థాశ్రమమునకును తదితరాశ్రమములకును శమదమాహింసాదులు సమానములు. ఇవి గృహస్థాశ్రమకర్మములతో నసంకీర్ణములై వానివలెనే విద్యోత్పత్తిసాధనము లగుచున్నవి. పూర్వపుణ్యమువలన గృహస్థాశ్రమమునకు పూర్వమే సంపూర్ణవైరాగ్యము కలిగి జ్ఞానోదయమైనవారనేకులు గలరు. కర్మోపచితములగు స్వర్గాదిపుణ్యలోకములవలన నీప్సితార్థసిద్ధి కలుగక గృహస్థాశ్రమమునందును, నచటికర్మజాలమునందును ప్రయోజనమును కానక విరక్తులై నివృత్తిమార్గము నాశ్రయించిన గృహస్థులును గలరు. కామన లనేకములు. అందువలన కర్మం యందు యత్నగౌరవమధికము. అందుచేనవి మోక్షసంపాదకములు కానేరవు. జ్ఞానమునకు కర్మమొకటియే సాధనము కాదు. ఈశ్వరప్రసాదము తపస్సు, ధ్యానము, అహింసాబ్రహ్మచర్యాదులు మున్నగు కారణాన్తరములుగూడ గలవు. శ్రవణమనననిదిధ్యాసనములు జ్ఞానమునకు సాక్షాత్సాధనము లగుచున్నవి. అందువలన నాశ్రమాన్తరము లవశ్యము సిద్ధములగుచున్నవి. జ్ఞానము సంపాదించుటకందరికిని యధికారము కలదు,

కాని కైవల్యముమాత్రము జ్ఞానైకసాధ్యము. అందులకు మరి యొకమార్గము లేదనిస్పష్టము.

---

## ద్వాదశానువాకము

### (శాన్తిపాఠము-ఉపకారపరామర్శమన్త్రము)

మూ:- శం నో మిత్రః శం వరుణః। శం నో భవత్వర్యమా। శం న ఇన్ద్రో బృహస్పతిః। శం నో విష్ణురురుక్రమః। నమో బ్రహ్మణే। నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి। త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మావాదిషమ్। ఋతమవాదిషమ్। సత్యమవాదిషమ్। తన్మామావీత్। తద్వక్తారమావీత్। ఆవీన్మామ్। ఆవీద్వక్తారమ్। ఓంశాన్తిః శాన్తిః శాన్తిః॥ సహనావవతు। సహనౌ భునక్తు। సహవీర్యం కరవావహై। తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై। ఓంశాన్తిః శాన్తిః శాన్తిః॥

ఇచటి ప్రథమమంత్రమునకు టీక మొదటియనువాకమున వ్రాయబడినది.

తా. వి:- ప్రారంభింపబడినవిద్య అవిఘ్నముగ పూర్తి యయినందుకు గ్రన్థారంభమున తదర్థమై ప్రార్థింపబడిన మిత్రేన్ద్రవరుణవాయ్వాదిదేవత లొనర్చిన యుపకారము కృతజ్ఞతాపూర్వకముగా నీయనువాకమున స్మరింపబడుచున్నది. అందుచేతనే మన్త్రమునందలి తుదియేడువాక్యములందు భూతకాలక్రియలుపయోగింపబడినవి.

ఉపకారస్మరణము

విద్యాభ్యాసకాలమునందు గురుశిష్యులకన్యోన్య మనాదరణమువలనగాని న్యాయమతిక్రమించినచేతలవలనగాని కలిగిన ద్వేషము శాంతించుటకును నింతవరకు కలిగిన నుపకారమునకు కృతజ్ఞతను చూపుటకును నికముందుపదేశింపబడబోవు శ్రేష్ఠతమ

నిర్గుణబ్రహ్మవిద్యా నిమిత్తశాన్తి

మగు బ్రహ్మవిద్యగూడ నవిఘ్నముగ సాగుటకును నిర్గుణబ్రహ్మ విద్యాశాన్తిపాఠము శిష్యునిచే చేయబడుచున్నది. గురుశిష్యులకు మాయిద్దరిని బ్రహ్మము రక్షించుగాక! మేమిద్దరము కలిసి భుజింతుముగాక! విద్యాభ్యాసఫలము మాయుభయులకు కలుగుగాక! మేమభ్యసించినవిద్య అర్థజ్ఞానయోగ్యమగుగాక! మేముభయులము తేజోవంతుల మగుదుముగాక! మేముభయుల మొకరినొకరము ద్వేషింపకుందుముగాక! అని ముందభ్యసింపదలచిన బ్రహ్మవిద్యాగౌరవమును బట్టియు, ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములగు సంభావితానేకవిఘ్నములప్రశమనమును గోరియు త్రివారమిాశాన్తి చెప్పబడుచున్నది. ఆచార్యుడారోగ్యవంతుడై ప్రసన్నుడైనపుడే శిష్యునకు విద్యాపరిపాకము తత్రాపి ఆధ్యాత్మికవిద్యాపరిపాకము కాగలదు.

గుర్వనుగ్రహము సంపూర్ణముగ నుండినగాని యాధ్యాత్మికవిద్య యలవడదు. తండ్రికంటెను గురువెక్కువవాడు. తండ్రి భౌతికజన్మకు కారణము. గురువాధ్యాత్మికశ్రేయస్సునకు కారణము. అతడు జ్ఞానోపదేశముజేసి తానుపదేశించిన జ్ఞానమును పెంపొందించును. దానివలననే నిశ్శ్రేయసావాప్తి గల్గును. అందుకనే గురువు త్రిమూర్త్యాత్మకమని స్తోత్రము చేయబడుచున్నాడు. కనుక గురువుయొక్క క్షేమమునుగూడగోరి శిష్యునిచే నీశాన్తిపాఠము చెప్పబడుచున్నది.

శిక్షావల్లి సమాప్తము

---

శ్రీగురుభ్యోనమః

# బ్రహ్మానన్దవల్లి

## (బ్రహ్మవిద్యాప్రకాశకము)

### ప్రథమానువాకము

అవతారిక:- తైత్తిరీయోపనిషత్తుయొక్క చివరరెండు భాగములు బ్రహ్మానన్దవల్లి, భృగువల్లి యనుప్రత్యేకనామములచే వ్యవహరింపబడుచున్నవి కాని యీవల్లీద్వయమున మోక్షమునకు సాక్షాత్సాధనభూతమగు వారుణీవిద్యయని ప్రసిద్ధిగాంచినబ్రహ్మవిద్యయే ప్రతిపాదింపబడుటచే రెంటికిని విషయమొక్కటియే యగుచున్నది. పాఠసౌకర్యమునకుమాత్ర మధ్యాపకులచే ప్రత్యేకవల్లులుగ పరిగణింపబడుచున్నది.

బ్రహ్మభృగువల్లుల విషయైక్యము

శిక్షావల్లియందు కర్మకవిరుద్ధములగు సంహితాదివిషయములు కర్మసముచ్చితములగు నుపాసనలు వివరింపబడినవి. అనంతరము వ్యాహృతిరూపమున సోపాధికాత్మదర్శనము బోధింపబడినది. స్వారాజ్యము దీనిఫలము. ఇంతమాత్రముచేత సంసారబీజ మశేషనాశన మొందనేరదు. ఉపాసనము కామనావిరుద్ధము కాదు. దానిచే కర్మమువలెనే యుపాసనముగూడ మోక్షహేతువుగాదు. అజ్ఞానము సంసారకారణము. అది నశించుటచే మోక్షమబ్బును. అజ్ఞానవినాశనసమర్థ మగు బ్రహ్మాత్మజ్ఞాన ముత్తరగ్రంథమున వివరింపబడుచున్నది.

పూర్వోత్తర గ్రన్థసంగతి

అజ్ఞానము సహజసిద్ధము. "శరీరము నేను - భార్యాపుత్రాదులు నావి" యను స్వాభావసిద్ధమగులోకవ్యవహారము సుప్రసిద్ధము. మనము కూర్చున్న రైలుబండి నిలిచియుండి ప్రక్కనమరియొకబండి పోవుచుండగా మనముకూర్చున్నబండియే బోవుచున్నట్లు ప్రత్యక్షముగ కనబడును. ఇట్టి యజ్ఞానమునకు కారణము విచారించి ప్రయోజనము లేదు. దానిని బోగొట్టుకొను మార్గమును మాత్ర మన్వేషింపవలయును. సంసారబీజమగునీయజ్ఞానము బ్రహ్మజ్ఞానముచేతనే తొలగిపోవును. మరియొకత్రోవ లేదు.

అజ్ఞానము బ్రహ్మజ్ఞానముచే నశించును

కర్మఫలము నశ్వరమని శాస్త్రముచేతను, యుక్తిచేతను ప్రత్యక్షముగనుగూడ తెలియుచున్నది. కర్మోపచితములగు స్వర్గాదిలోకములను పరీక్షించి వానిచే స్వతఃసిద్ధమగుమోక్షము కలుగనేరదని ముముక్షువు నిర్వేదమొందుచున్నట్లు శాస్త్రము(1) చెప్పుచున్నది. ఘటాదులవలెనే కృతకము లన్నియు ననిత్యములు. కర్మకార్యమగుస్వర్గము గూడ ననిత్యమేయనునూహా యుక్తిసహమగుచున్నది. నరకస్వర్గములు మొదలగునవి కర్మఫలములగుటంజేసి దానిచే నుత్పన్నమగుచున్నవి. కర్మకు పూర్వమవి లేవు. ఏది పుట్టుకకు బూర్వము లేదో, ఏది పుట్టి నశించునో యది లేనిదేయగుచున్నది. ఆద్యంతములయందు

మోక్షమునుగూర్చి కర్మనిరర్థకము

(1) పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన (ముండక 1-2-12)

లేనివస్తువు వర్తమానమునందుగూడ లేనిదనియే భావింపనగును. సృష్టికిబూర్వము జగత్తు లేదు. ప్రలయమున నది నశించు చున్నది. మధ్యకాలమున నున్నట్లుకనుపడినను నది నిత్యము గానేరదు. మోక్ష మెల్లపు డున్నవస్తువు. దానికి యుత్పత్తి వినాశములులేవు. నిజముగా నది లేనిచో కర్మము నిత్యమగు మోక్షమును పుట్టింపలేదు. కర్మచే పుట్టుఫలము నిత్యము కానేరదు. ఆకాశపుష్ప మెంతప్రయత్నించినను లభ్యముగాదు. నిత్యమగుమోక్ష మున్నయెడల కర్మాచరణమునకు పూర్వమే యుండుటచే నది కర్మచేనుత్పాద్యము గానేరదు. ఉన్నదానిని పుట్టింప నేరికిని సాధ్యముగాదు. కనుక మోక్షమునకు కర్మ మెంతమాత్రము సాధనముగాదు. మోక్షము సిద్ధపదార్థమైనను నజ్ఞానముచే నది తెలియరాకున్నది. అజ్ఞానము పోయినపుడది ప్రత్యక్షముగ తెలియగలదు. అంతకుపూర్వము సిద్ధమైనను తెలియబడని యమెరికాదేశమును వెతికికనుగొనినారేగాని దానినెవరును పుట్టించలేదు. అటులనే సిద్ధమగుమోక్షమును కనుగొనవలెను. అజ్ఞాననాశనమే మోక్షము. బ్రహ్మజ్ఞాన బోధకములగు వేదాన్తములను యోగ్యుడగు గురుముఖమున విశ్వాసభావముతో శ్రవణముచేయుటచే నీయజ్ఞానము నశించును. సర్వసంసారబీజకారణమగునజ్ఞానమును బోగొట్టి బ్రహ్మజ్ఞానోపదేశము సేయుటకు బ్రహ్మవల్లి ప్రారంభింపబడుచున్నది.

మూ:- బ్రహ్మవిదాప్నోతి పరమ్ ।

టీ:- బ్రహ్మవిదు డుత్కృష్టపదవిని పొందును.

తా. వి:- అజ్ఞానమును తొలగించి సంసారము నత్యంతము నశింపజేయుగల బ్రహ్మవిద్యయొక్క ప్రయోజనాధికారి సాధనముల మూడింటిని 'బ్రహ్మవిదుడు పరమును బొందునను' వాక్యముచే గ్రంథారంభముననే సూత్రప్రాయముగా శ్రుతి బోధించుచున్నది. ఈమూడును తెలిసినపుడే దానియందు ప్రవృత్తి గలుగును. సూత్రప్రాయమగు నీవాక్యమునందు (1) బ్రహ్మ (2) విదుడు (3) పరము (4) పొందును—అను నాలుగుపదములు వినబడుచున్నవి. దేనికంటె నుత్కృష్టతరమగువస్తువు మఱియొకటి లేదో అదియే యిచట 'పరం' అని చెప్పబడుచున్నది. అర్థబలమువలన నది నిరపేక్షమగుమోక్షము లేక నిశ్శ్రేయస్సగుచున్నది. ప్రతిముముక్షువు గోరునదదియే. ఇట్టి పరమార్థమును బొందతగినవాడు బ్రహ్మవేత్త. అతడే దీనికధికారి. బ్రహ్మవేత్తయనగా శ్రవణమనననిధిధ్యాసపూర్వకముగ బ్రహ్మజ్ఞానమును బొందినవాడని తాత్పర్యము. దీనిచే బ్రహ్మమనునది యొకటి కలదనియు, పరప్రాప్తికి బ్రహ్మజ్ఞానము సాధనమనియు తెలియుచున్నది. బ్రహ్మజ్ఞాని బ్రహ్మవిషయికజ్ఞానమును బొందునుగాని విషయాన్తరజ్ఞానమును బొందలేడు. తర్కశాస్త్రము జదివినవానికి వేదాన్తశాస్త్రమలవడదు. బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మము దెలియును. బ్రహ్మజ్ఞాని పరమును బొందునని సూత్రవాక్యము చెప్పుచున్నది. కనుక బ్రహ్మమే పరమని యర్థబలముచే తేలుచున్నది. అనగా బ్రహ్మమే యుత్కృష్టఫలమని పర్యవసానము. అందువలన

ప్రయోజనాధికారి సాధన సంబంధకథనము

బ్రహ్మమును బొందుటయే పరమని వర్ణింపబడినది మోక్షమే యని యర్థమగుచున్నది. అది బ్రహ్మజ్ఞానముచే లభించును. దానిని బొందునధికారి బ్రహ్మజ్ఞాని. అనగా మోక్షము ప్రయోజనము, బ్రహ్మజ్ఞాని దానియధికారి, బ్రహ్మజ్ఞాన మద్దాని సాధనమని పైవాక్యమునకర్థము. పొందదగినపరమార్థమునకును, అద్దానిని పొందు బ్రహ్మజ్ఞానికిని ప్రాప్యప్రాప్తృత్వరూప సంబంధము పర్యవసన్నమగుచున్నది.

ముందుగా బ్రహ్మజ్ఞాన ఫలకథనమునందు తాత్పర్యము

ప్రతిమనుజుడును నవిద్యాప్రయుక్తమగు కామనచే చోదితుడై అత్యంతఫలాధిక్యమును గోరుట సహజము. కర్మల నాచరించుటకు మహాప్రయత్నము చేసిన నవి నిత్యమగు మోక్షము నీయజాలవని దెలిసికొని నిర్విణ్ణుడగుచున్నాడు. అత్యంత ఫలతృష్ణ యింకను నతనిని వదలలేదు. సంసారమును చూచి భయము నొందుచున్నాడు. బ్రహ్మజ్ఞాన ముత్కృష్టఫలప్రదమని వినుచున్నాడు. కనుక మోక్షస్వరూపవిశేషము నెఱుంగనివాడైనను అత్యంతఫలతృష్ణ యను సంకశముచే నీడ్వబడి బ్రహ్మజ్ఞానప్రాప్తికొఱకు పూర్వముకంటె నధికముగ పాటుబడును. అందుచేతనే శ్రుతి బ్రహ్మజ్ఞానఫలమును మున్ముందు చెప్పి దానియందాశను గల్పించుచున్నది. బ్రహ్మజ్ఞానప్రయత్నమునకు దూషితమగు ఫలతృష్ణయే కారణమైనను సాధ్యమని ప్రయత్నించిన బ్రహ్మమునకును దాని సాధనమగు జ్ఞానమునకును నొకటియే తత్త్వమని గ్రహించినపుడా దోషబుద్ధి నశించును.

ఒకడు మరియొకవస్తువును పొందుట యని ప్రాప్తిశబ్దార్థము. అందువలన పొందువాడు పొందబడుదానికంటె నన్యమగుచున్నాడు. పరబ్రహ్మము సర్వగతము. అది పొందువాని స్వరూపమే నని యద్వైతసిద్ధాంతము. తనను తాను పొందలేడు. కనుక బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మమును బొందుటయసంగతముగ కన్పట్టుచున్నది.

**ప్రాప్తిశబ్దార్థము**

ఈసందేహము సహేతుకము కాదు. ప్రాప్తిశబ్దమిచట తెలిసికొనుట యనునర్థమున వాడబడినది. తాను బ్రహ్మము కాను. శరీరమే తానను యజ్ఞానమునందుండుటచే మనుజుడు తానే బ్రహ్మమని తెలిసికొనలేకున్నాడు. ఇట్టియజ్ఞానము తొలగినపుడు తానే బ్రహ్మమను జ్ఞానము కలుగును. ఇట్టిజ్ఞానోపలబ్ధియే బ్రహ్మప్రాప్తియని ప్రాప్తిశబ్దముచే చెప్పబడుచున్నది. కంఠమునందున్న హారమును తెలిసికొనలేక పోయినదని విచారపడుచుండ నీకంఠమునందే హారమున్నదని చూపబడి యది నూతనముగా ప్రాప్తమైనదానివలె మనము సంతసించుచున్నాము. ఇచట అలబ్ధలాభమునందు ప్రాప్తిశబ్దము వాడబడుటలేదు. అజ్ఞాతజ్ఞాపకమునందుమాత్రమే యీశబ్దముపకరించుచున్నది. బ్రహ్మవిషయికాజ్ఞానమును తత్ఫలితమగు నన్యథాభావమును నిరసించుటమూలకముగా బ్రహ్మజ్ఞానమిచట నుపదేశింపబడుచున్నది.

అ॥ బ్రహ్మవిదుడు పరమును బొందునని బ్రహ్మానందవల్ల్యర్థమంతయు సూత్రప్రాయముగ మొదటివాక్యమునందుదాహరింపబడినది. అట్టిబ్రహ్మమును తెలిసికొనుటకు ధ్యాని

లక్షణమును చెప్పవలసియున్నది. రాబోవువాక్యముచే బ్రహ్మ లక్షణావతరణము చేయబడుచున్నది.

మూ:- తదేషాభ్యుక్తా.

టీ:- ఈవిషయమై ముందురాబోవు మన్త్రము చెప్ప బడుచున్నది.

ఆ॥ ఆమన్త్ర మెద్దియన?

మూ:- సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ.

టీ:- బ్రహ్మము సత్యము; బ్రహ్మము జ్ఞానము; బ్రహ్మ మనంతము.

తా. వి:- ఇచట సత్యము, జ్ఞానము, అనంతము అను మూడుశబ్దములు బ్రహ్మశబ్దముతో ప్రత్యేకప్రత్యేకముగా జోడింపబడి యద్దానిలక్షణమును బోధించుచున్నవి. ఈమూడు శబ్దములు పరస్పర మొకదానితో మరి యొకదానికి సంబంధము లేదు. ఈపద ములు కేవలవిశేషణములుగాక బ్రహ్మ లక్షణద్యోతకములుగూడ నగుచున్నవి. ఒకజాతిలో చేరిన యనేకవస్తువులలో కొన్నిటికి మరికొన్ని విశేషలక్షణము లుండు టంజేసి యవి యాజాతిలో జేరిన యితరవస్తువులనుండి ప్రత్యే కము లగుచున్నవి. ఇట్టివిశిష్టవస్తువు లితరసజాతీయములనుండి విశేషగుణములను బోధించు విశేషణములచే విడదీయబడు చున్నది. కలువపుష్పము లన్నియు కొన్నిసమానధర్మములు గలిగి కలువజాతికి చెందుచున్నవి. కలువజాతికి చెందిన పుష్ప ములలో కొన్ని రక్తవర్ణములు కలవి మరికొన్ని నీలాదీతరవర్ణ

సత్యాదిశబ్దములయొక్క విశేషణార్థము

ములు కలవి గలవు. ఈపుష్పములన్నిటికి కలువజాతిలక్షణము లన్నియు నుండగా నీలరక్తవర్ణములు వాని విశేషధర్మము లగుచున్నవి. నీలంపుగలువయనుటచే నీలపురంగుగాని యితర కలువపుష్పము లన్నిటియుండి యీనీలపుష్పము ప్రత్యేకింపబడు చున్నది. సజాతీయవస్తువులలోనుండి విశిష్టధర్మములులేని వస్తువులను త్రోసిపుచ్చుటయే విశేషణముయొక్క లక్షణము. ఇటులనే సత్యము బ్రహ్మము అనుచోట సత్యశబ్దమును విశేషణముగా గ్రహించినచో సత్యవిదూరములగు నితరబ్రహ్మముల నుంచి ప్రకృతబ్రహ్మము సత్యమనువిశేషణముచే వ్యావర్తింపబడుచున్నది. అదేవిధముగ జ్ఞానానంతవిశేషణములచే వానికి విరుద్ధార్థకములగు జడస్వరూపములు దేశకాలవస్తుపరిచ్ఛిన్నములు నగుబ్రహ్మలు ప్రకృతబ్రహ్మమునుంచి ప్రత్యేకింపబడు చున్నట్లు తోచుచున్నది.

సత్యాదిశబ్దములు లక్షణార్థప్రధానములగు విశేషణములు

లక్షణము వస్తుస్వరూపనిరూపణము చేసి దానిప్రత్యేకవ్యక్తిత్వమును వ్యక్తీకరించును. లక్షణముచే లక్షితమగు ప్రతి వస్తువు సజాతీయవిజాతీయములగు నితర వస్తువులన్నిటినుండి లక్షణముచే వ్యావర్తింపబడుచున్నది. అవకాశము నిచ్చుట యాకాశలక్షణము. ఈ లక్షణముచే నాకాశమితరవస్తువులనన్నిటినుండియు వ్యావర్తింపబడుచున్నది. సజాతీయవస్తువులలోనుండి విశిష్టధర్మములుగల కొన్నిటిని మాత్రము వ్యావర్తింపజేయునది విశేషణము. ఒకవస్తువు నితర వస్తువులనుండి వ్యావర్తింపజేయునది లక్షణము. వస్తువిశేష

మును చెప్పుటచే లక్షణముగూడ నొకపక్షమున విశేషణము-గూడ నగుచున్నది. సత్యాదిశబ్దములు బ్రహ్మముయొక్క-లక్షణమును చెప్పుటచే లక్షణములగుచున్నవి. ప్రకృతబ్రహ్మమును విశేషించుటచే నవి విశేషణములుగూడ నగుచున్నవి. కాని బ్రహ్మమొకటియే గనుక విశేషణముచే ప్రత్యేకింపదగ్గ యితర బ్రహ్మములు లేవు. కనుక సత్యాదిశబ్దములు విశేషణములుగ భాసింపుచున్నను అవి లక్షణప్రధానములే యగుచున్నవి.

ఏపదార్థ మేరూపమున నిశ్చితము కాబడుచున్నదో ఆ రూపమునకు మార్పులేనప్పు డది సత్యమనబడును. నిశ్చితమగు దేనిరూపము మార్పును చెందునో అది యసత్యము. రూపము మారుచున్నదనగా నా రూపము వికారమును చెందుచున్నదని భావము. వికారమంతయు నసత్యము, అన్పృతము. వికారము లేనిది సత్యము. బ్రహ్మము సత్యమనుటచే నది నిర్వికారము నిత్యమనియు తదితరములగు సవికారములు బ్రహ్మము కావనియు తేలుచున్నది. బ్రహ్మము సత్యము నిర్వికారమనుటచే తదితరములన్నియు సవికారములనియు, కార్యాత్మకములనియు చెప్పక చెప్పినట్లగుచున్నది. అపుడు ఘటాదికార్యములకు కారణమగు మృదాదులవలెనే సర్వకారణమగు బ్రహ్మముగూడ నచేతనము కావలసివచ్చుచున్నదను సందేహము కలుగుచున్నది. ఈసందేహమును తొలగించుటకై జ్ఞానశబ్దము వాడబడుచున్నది. జ్ఞానశబ్దమిచట జ్ఞప్తి యనగా తెలిసికొనుట యను భావార్థమున(Knowledge)

సత్యశబ్దార్థము

జ్ఞానశబ్దార్థము

వాడబడుచున్నది. ఈశబ్దమునకు జ్ఞానకర్త అనగా తెలిసికొను వాడర్థము కాదు. జ్ఞానకర్తృత్వమే దానియర్థమయినచో జ్ఞానకర్తృత్వముతోపాటు జ్ఞేయము, జ్ఞానమనువిభాగము లేర్పడుచున్నవి. అపుడు బ్రహ్మము సవికారము జ్ఞేయము, జ్ఞానకర్త మొదలగురీతిని ప్రవిభక్తముగూడ కావలసివచ్చును. అట్టిబ్రహ్మము సత్యము అనంతము కానేరదు. ప్రవిభక్తమగు నది యనంతము కానేరదు. బ్రహ్మమునకు ఛాందోగ్యమున చెప్పబడినభూమలక్షణమునకు[1] గూడ భంగ మాపాదించును. ఎచట తెలిసికొనదగినది, చూడదగినది, వినదగినది మఱియొకటి లేదో అది భూమమనియు, తదితరమంతయు నల్పమనియు భూమ లక్షణము చెప్పబడుచున్నది. ఈయర్థమే బ్రహ్మము, సత్యము, జ్ఞానము అనంతమను వాక్యముచేతగూడ చెప్పబడుచున్నది.

బ్రహ్మభూమశబ్దము లేకార్థకములు

తెలిసికొనబడునది మఱియొకటి లేకపోయి నను తన్నుతాను తెలిసికొనవచ్చును గనుక జ్ఞానశబ్దమునకు జ్ఞానకర్తృత్వ మర్థము చెప్పవచ్చుననవీలులేదు. బ్రహ్మము ఏకము అనగా సజాతీయభేదములేనిది గనుక నిరంశమగుచున్నది. నిరంశమగు బ్రహ్మమునందు తెలిసికొనుభాగము తెలియబడుభాగమని యంశవిభాగ మసంభవము. బ్రహ్మముగూడ ఘటాదులవలె జ్ఞానసామాన్యవిషయమే యయినయెడల నట్టిజ్ఞానోపదేశము మోక్షోపకారకము గానేరదు. మఱియు జ్ఞానశబ్దము జ్ఞాన

(1) యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా. (ఛాందోగ్య 7-24-1)

కర్తృపరమయినచో జ్ఞాతృజ్ఞానజ్ఞేయవిభాగము సంభవించుటచే బ్రహ్మముయొక్క అస్తితామాత్రమును బోధించుశ్రుతికిని[1] భంగము కలుగును. కనుక సత్యానంతశబ్దముల సాహచర్యముచే జ్ఞానశబ్దమునకు జ్ఞప్తిరూపకమగు భావార్థమే చెప్పవలెను. కాని జ్ఞానకర్తృత్వము చెప్పశక్యముగాదు. జ్ఞానశబ్దము సామాన్యముగ ఘటజ్ఞానము, పటజ్ఞానము మొదలగు విశేషజ్ఞానములవలెనే పరిమితమగు నర్థముగలది యగునను సందేహము నివారించుటకై బ్రహ్మ మనంతమని మూడవవిశేషణము వాడబడినది. దేశకాలవస్తువులచే పరిమితముకానిది యనంతము.

బ్రహ్మము ఘటాదులవలె సుప్రసిద్ధవస్తువయినయెడల విశేషణముచే దానివిశేషస్వరూపము తెలియును. కలువపువ్వు సుప్రసిద్ధము. నీలశబ్ద మద్దానివిశేషస్వరూపమును తెలుపుచున్నది. బ్రహ్మము ప్రసిద్ధముగాక పోవుటచే సత్యశబ్దము దానివిశేషస్వరూపమును దెలియజేయ లేదు. అర్థబలముచే బ్రహ్మమనృతము, జడము పరిచ్ఛిన్నముమాత్రము కాదని తెలిసికొనుచున్నాము. సత్యాదివిశేషణములు బ్రహ్మవ్యతిరిక్తములగువానిని త్రోసిపుచ్చుచున్నవేగాని సాక్షాత్తుగ దానిని చెప్పలేకున్నవి. కనుక పైశబ్దములకు శూన్యార్థత్వము చెప్పనగునా? గొడ్రాలిబిడ్డడు మరుమరీచికలయందు స్నానముచేసి యాకాశపుష్పాలంకృతుడయి శశవిషాణరూపమగు ధనస్సును

సత్యాదిశబ్దముల లక్షణార్థకత్వము

---

(1) సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్ (ఛాం. 6-2-1)

ధరించి వచ్చుచున్నాడను వాక్యమువలెనే "సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మము"నువాక్యమునకుగూడ మాటలపొందిక యున్నను నర్థశూన్యము కారాదాయను నాక్షేపణసరిగాదు. సత్యాదిపదములు విశేషణములయినను బ్రహ్మలక్షణమును తెలియజేయుటయందే వానిముఖ్యతాత్పర్యము. లక్ష్యము శూన్యమయినయెడల విశేషణము నిరర్థకమగును. ఇచట లక్షణమనగా స్వరూపలక్షణమని తెలియవలెను. బ్రహ్మశబ్దమునకు వృద్ధియని యర్థము. వృద్ధియనునది సుప్రసిద్ధము. సర్వమాత్మస్వరూపము. ఆత్మానన్యము బ్రహ్మము. ఆత్మాస్తిత్వము సుప్రసిద్ధము. ఆబాలగోపాలము ప్రతిమనుజుడును 'నేను' యని తనయాత్మత్వమును ప్రకటించుచున్నాడు. కనుక బ్రహ్మాస్తిత్వము గూడ నాత్మస్వరూపమున సుప్రసిద్ధమే యగుచున్నది. బ్రహ్మము శూన్యమే అయినచో సత్యాదిశబ్దములు విశేషణార్థకములుగాని లక్షణార్థకములుగాని గాజాలక నిష్ప్రయోజనములు కావలసివచ్చును. బ్రహ్మము భావపదార్థమయినపుడే యాశబ్దము లర్థవంతములగును. అనాత్మభూతములు ననృతములు, జడములు నగునన్నమయాదికోశములే యాత్మయని చార్వాకాదులు తలంచుచున్నారు. అవిద్యాదశయందనృతములు, జడములు, పరిచ్ఛిన్నములు నగుశరీరాద్యుపాధులచే మరుగుపరుపబడి యనృతత్వాదిధర్మవిశిష్టములగు నితరబ్రహ్మములు భాసించుచుండుటచేత శరీరాద్యనృతబ్రహ్మములనుండి ప్రకృతబ్రహ్మము సత్యాదిశబ్దములచే ప్రత్యేకింప

బడుచున్నది. ఈపక్షమున నీశబ్దత్రయమునకు విశేషణార్థత్వము సమకూరుచున్నది.

సత్యాదిశబ్దములకు లక్షణార్థముగూడ కుదరదు. ఇతర వస్తువులనుండి వ్యావర్తముచేయునది లక్షణము. బ్రహ్మమద్వితీయమగుటచే నద్దానినుండి వ్యావర్తింపజేయగల నితరవస్తువులే లేవు. కనుక సత్యాదిశబ్దములకు లక్షణార్థముగూడ పొసగదను యాక్షేపణగూడ సరికాదు. ద్రష్టృదృశ్యము, దర్శనము మొదలగు త్రిపుటిని వ్యావర్తముచేసి తద్రహితమైనది పరబ్రహ్మమని సత్యాదిశబ్దములచే లక్షింపబడుచున్నది. ఏది చక్షురాది కరణములచేత తెలియబడదో, దేనిని చూచువాడు మఱియొకడులేడో అది 'భూమ'యని ద్రష్టృదృశ్యదర్శనాదిత్రిపుటీ వ్యావర్తకమగు భూమలక్షణముచే బ్రహ్మము చూపబడుచున్నది. చూచువాడు చూచుటకుసాధనములు, చూచుటయనుక్రియ మొదలగువాని యన్నిటికంటెను బ్రహ్మము విలక్షణమని బ్రహ్మలక్షణము సత్యాదిశబ్దములచే నిర్వచింపబడుచున్నది. ఈవిధమున నీపదములకు లక్షణార్థము గూడ కుదురుచున్నది.

సత్యాదిశబ్దములు స్వార్థపరములు

సత్యాదిశబ్దము లనృతాదివిరుద్ధార్థములను త్రోసిపుచ్చుటచేతనుమాత్రమే అర్థవంతములగుటలేదు. స్వీయములగునర్థములు గలిగి యవి యన్వర్థములగువిశేషణము లగుచున్నవి. బ్రహ్మశబ్దము గూడ శూన్యవిషయముగాక భావపదార్థము (positive existance) నొకదానిని బోధించుచు నన్వర్థ

మగు విశేష్యములయినపుడే సత్యాదిశబ్దములు విశేషణములు కాగలవు. రాజ్యము-రాజు, భార్యా-భర్త మొదలగు జంట పదములవలెనే విశేషణవిశేష్యపదములుగూడ పరస్పరాపేక్షకములయి యర్థవంతము లగుచున్నవి. విశేష్యములేని విశేషణ ముండనేరదు. పుష్పమను విశేష్యమున్నపుడే దానిని వర్ణించు నీలరక్తాదివిశేషణము లన్వర్థములగుచున్నవి. ప్రకృతమున సత్యము, జ్ఞానము, అనంతమను మూడు పదములు విశేషణములు. బ్రహ్మపదము విశేష్యము. బ్రహ్మపదము వృద్ధిపరమనియు భూమపదపర్యాయమనియు పైనవివరింపబడినది. ఇదియే దాని స్వీయమగునర్థము. సత్యాదిశబ్దముల స్వీయమగునర్థముగూడ పైనవివరింపబడినది. అట్టిస్వార్థమే సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మమను సూత్రవాక్యమున సమన్వయమగుచున్నది. అనంతశబ్దమున కంతములేనిదని స్వీయమగునర్థము. అర్థబలముచే నీశబ్ద మంతవంతములగువానినన్నిటిని త్రోసిపుచ్చుచున్నది. సత్యజ్ఞానశబ్దములు రెండును స్వకీయార్థముచే నర్థవంతములు. సత్యశబ్దముచేత బ్రహ్మము నిర్వికారము, నిత్యమనియు; జ్ఞానశబ్దముచేత నది చేతనస్వరూపమనియు; అనంతశబ్దముచేత దేశకాలవస్తుకృతమగు పరిచ్ఛేదమద్దానికి లేదనియు బోధించుచు నీమూడు విశేషణము లన్వర్థములగుచున్నవి. ఈశబ్దములకు విరుద్ధార్థమును త్రోసిపుచ్చుట సహజమగునర్థము గాదు. అర్థాపత్తిచే విరుద్ధార్థములగునట్టి యనృతత్వజడత్వపరిచ్ఛిన్నత్వములు నివారింపబడుచున్నవి. రామునిఘుంట మూషికముల్ను

పదచతుష్టయమునకు స్వార్థసమన్వయము

విస్తారముగాగలవను వాక్యమునందలి చివరమూడుపదములచే నచటనున్న మూషికబాహుల్యమే ప్రధానముగ స్ఫురించుచున్నది. అర్థాపత్తిచే తద్విరుద్ధార్థమగు మార్జారాభావమూహింపబడుచున్నది. ఇట్లు సత్యాదిశబ్దములు స్వీయమగు విశేషణార్థముచే బ్రహ్మమును సూచింపుచున్నవి గాని అవాఙ్మానసగోచరమగు నాపరమార్థమును సాక్షాత్తుగ జెప్పలేవు. చతుష్పథమునందు మార్గప్రదర్శకమగు నంగుళిచిహ్నితఫలకముచేత సూచింపబడిన గమ్యస్థానమును జేరుచున్నాము. అటులనే సత్యాదిశబ్దసూచితమగుమార్గమున బ్రహ్మము నన్వేషించి సాక్షాత్కారమునొందగలము. ఈవిధమున సత్యాదిశబ్దములు సార్థములగువిశేషణములే గాక బ్రహ్మలక్షణద్యోతకములుగూడ నగుచున్నవి.

జ్ఞానశబ్దము బ్రహ్మ లక్షకము

బ్రహ్మమాత్మకంటె నన్యముగాదు. ఆబ్రహ్మస్వరూపమగు నీయాత్మవలన నాకాశము పుట్టినదని రాబోవువాక్యమున ఆత్మబ్రహ్మముల కనన్యత్వము చెప్పబడుచున్నది. "ఆనందమయమగునాత్మ నుపసంక్రమించుచున్నాడు." "బ్రహ్మ మీ శరీరమును సృజించి తానే దానిలో ప్రవేశించెను" అను మొదలగు నర్థమును బోధించు శ్రుతివాక్యములుగూడ బ్రహ్మాత్మైక్యము నుపదేశించుచున్నవి. కనుక జ్ఞాతయొక్క స్వరూపమే బ్రహ్మమగుచున్నది. ఈవిధముగ బ్రహ్మము సుప్రసిద్ధమగుచున్నది. బ్రహ్మాత్మలకభేదమును చెప్పుటచే నొకసందేహము గలుగవచ్చును. ఆత్మయే ఘటాదిసమస్తజ్ఞానములను

గ్రహించుచున్నాడు. అతడే సమస్తకోర్కెలు గలవాడు. కోర్కెలకు మూలము తత్తద్విషయికజ్ఞానము. అందువలన ఆత్మ జ్ఞానకర్తయగుచున్నాడు. ఆత్మకంటె వేరుగాని బ్రహ్మము జ్ఞానస్వరూపమను టయుక్తముగాదు. ఒకవేళ జ్ఞానస్వరూపమే బ్రహ్మమని యంగీకరించినను అద్దాని కనిత్యత్వము పరాధీనత గూడ ప్రాప్తమగుచున్నది. జ్ఞానశబ్దము 'జ్ఞ' తెలిసికొనుట యను ధాతువువలన కలుగుచున్నది. క్రియలన్నియు కర్త, సాధనము మొదలగువాని యధీనములగుటచే, ధాత్వర్థము లన్నియు పరాధీనములు అనిత్యములు నగుచున్నవి. కర్త సాధనము లేనిక్రియ యుండనేరదు. బ్రహ్మ మాత్మకంటె భిన్నము గాదనుటచే నతనికి జ్ఞానకర్తృత్వము, జ్ఞానస్వరూపమగుటచే ననిత్యత్వము, పరాధీనతయు సంప్రాప్తములగుచున్నవి. ఇది యొక యాక్షేపణ. ఈయాక్షేపణ సరికాదు.

ఆత్మ జ్ఞానస్వరూపము. జ్ఞానముకంటె వ్యతిరేకము గాదు. జ్ఞానము ప్రకాశాత్మకము. ఈజ్ఞానము విషయములను గ్రహించు మనస్సును వానిస్వరూపమును నిశ్చయించు బుద్ధినిగూడ ప్రకాశింపచేయుచున్నది. అవి రెండును జడములు.

జ్ఞానశబ్దము 'జ్ఞ' ధాత్వర్థముకంటె భిన్నము

చేతనావభాసితములు గానిచో నవి వ్యవహారవంతములుగా నేరవు. ఆత్మప్రకాశితమగుమనస్సు చక్షురాదీన్ద్రియముల ద్వారా బహిర్గతమయి ఘటాదివస్తుసంయోగముచే నాయా రూపముల బొందును. అపుడిది ఘటము, యిదిపటమని బుద్ధి నిశ్చయించును. ఇటులనే సర్వవిషయజ్ఞానము సంభవించు

చున్నది విషయములను తెలిసికొనునది యాత్మప్రకాశితమగు బుద్ధి. అదియే 'జ్ఞ' తెలిసికొనుటయనుక్రియకు కర్తయగు చున్నది. ఆతీరుననే అది సర్వక్రియాకర్తృత్వమును వహించి ఘటపటాదిసర్వజ్ఞానాధికారి యగుచున్నది. చక్షురాదిజ్ఞానేన్ద్రియములు, కరచరణాదికర్మేన్ద్రియము లద్దానికి జ్ఞానక్రియయందు సహాయభూతము లగుచున్నవి. మనోబుద్ధులు రెండును జడములగుటచే నాత్మప్రకాశము వానికి క్రియాచరణసామర్థ్యమును గలుగజేయుచున్నది. ఇట్లు బుద్ధి విషయములను తెలిసికొనుచున్నది. అనగా జ్ఞానకర్త యగుచున్నది. ఇంద్రియములు సాధనములు అనగా కరణములగుచున్నవి. విషయములు తెలిసికొనబడుచున్నవి అనగా జ్ఞానక్రియకు కర్మలగుచున్నవి. తెలిసికొనుట యనునది జ్ఞానక్రియ యగుచున్నది. జ్ఞానకర్త యగుబుద్ధికి యీసామర్థ్యము నాత్మప్రకాశ మొసంగుచున్నది. విషయములున్నచో బుద్ధి వానిని దెలిసికొనును. లేనిచో నూరకుండును. సూర్యకాంతిచే ప్రకాశింపబడుదర్పణమున కెదురుగ వస్తువున్నయెడల నద్దానినది ప్రతిబింబించును. లేనిచో సూర్యకాంతిచే ప్రకాశించుచుమాత్రముండును. దర్పణము లేకున్నను సూర్యకాంతి ప్రకాశించుచుండును. ఆత్మ ప్రకాశము సూర్యకాంతివంటిది. ఈతీరున ఘటపటాదిసామాన్యవిషయజ్ఞానము కర్తృక్రియాకరణము లనువిభిన్నభాగములుగలదై పరాధీనమగుచున్నది. ఆత్మప్రకాశము వీనికంటె భిన్నమయినపుడే బుద్ధికి విషయగ్రహణసామర్థ్యము నొసంగగలదు. అపుడే దానికి జ్ఞానకర్తృత్వము కలుగును. విద్యుచ్ఛక్తిచోదితములయి వివిధ

యంత్రములు వ్యాపారవంతములగుచున్నవి. అది యంత్ర ములకంటె భిన్నము. దానిశక్తిచే యంత్రములు ఛేదనాదిక్రియ లను జేయుచున్నవి. కాని ఛ్ఛేదనాదిక్రియల నాచరించుచున్న యంత్రములకును, వాని కాశక్తిని కల్పించుచున్న విద్యుచ్ఛక్తికి నభేదమును కల్పించి విద్యుచ్ఛక్తియే ఛేదనాదిక్రియలను జేయు చున్నట్లు చెప్పుకొనుచున్నాము. అదేతీరున ఆత్మప్రకాశిత మగుబుద్ధియొక్క కర్తృత్వము నాత్మయందవివేకముచే నారో పించి యాత్మయే జ్ఞానకర్తయగుచున్నదని పొరబడుచున్నాము. నిజముగానది జ్ఞానకర్తగాదు. ఘటాదివిషయజ్ఞానముకంటె భిన్నమయి సర్వవిషయజ్ఞానప్రకాశక మగుచున్నది. ఆత్మ జ్ఞానముకంటె భిన్నముగాదు. సూర్యకాన్తి సూర్యునికంటె భిన్నముగాదు. జ్ఞానమాత్మయొక్క నిత్యస్వరూపమగుట నది కారణాన్తరమును గోరదు. అదియే కాలాకాశాదిసర్వకార ణము, అత్యంతము సూక్ష్మము. కనుక దానికి అవిజ్ఞేయము, సూక్ష్మము, దూరము, భూతము, వర్తమానము, భవిష్యత్తు నగు మరియొక వస్తువేదియు లేదు. కనుక బ్రహ్మము సర్వ జ్ఞము. "బ్రహ్మము పాణిపాదములు లేనిది. కాని త్వరగా నడచి పోవును. విషయములను గ్రహించును. నేత్రములులేవు; చూచుచున్నది. శ్రోత్రములులేవు; వినుచున్నది. అది సర్వ మును తెలిసికొనుచున్నది. దానిని తెలిసికొనువాడెవ్వడును లేడు. అతడే మహాంతుడు, అగ్ర్యము నగుపురుషుడని బ్రహ్మ

విదులు చెప్పుచున్నార”ని శ్వేతాశ్వతరశ్రుతి[1] తెలియజేయు చున్నది. “విజ్ఞానమున కెపుడును విపరిలోపము లేదు. అది వినాశరహితము. దానికంటె ద్వితీయమగునది లేద”ని బృహదారణ్యకశ్రుతి[2] చెప్పుచున్నది. విజ్ఞానస్వరూపముకంటె భిన్నముకాకుండుటచేతను, కారణాదినిమిత్తము లేకుండుట చేతను బ్రహ్మము నిత్యమగుచున్నది. అందువలన సర్వవస్తుజ్ఞానకారణము ఆత్మస్వరూపమగు జ్ఞానము ‘జ్ఞ’ యనుధాత్వర్థము గానేరదు. అది క్రియారూపము గానేరదు. అందువలనదది జ్ఞానకర్తగానేరదు. బుద్ధిధర్మవిశేషబోధకమగుజ్ఞానశబ్దముచేత నది సూచింపబడుచున్నది. కాని యాశబ్దము సాక్షాద్బ్రహ్మమును చెప్పలేదు. దానియందు శబ్దముచే తెలియజేయబడు జాతిగుణాదిధర్మములు లేవు.

కేవలజ్ఞానాత్మకమగునాత్మజ్ఞానము జ్ఞానకర్త కానేరదు. అదేవిధముగ, సత్యశబ్దము గూడ బ్రహ్మలక్షకమగుచున్నది. కాని తద్వాచకముగాదు. బ్రహ్మసత్యమనగా నిర్వికారమనుటచే బ్రహ్మేతరమగు జగత్తంతయు వికారస్వరూపమని తెలియుచున్నది. జగత్తు కార్యము. కార్యమంతయు అనిత్యము. కారణములేని కార్యముండనేరదు. కనుక జగత్కా-

(1) అపాణిపాదో జవనో గ్రహీతా । పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః । స వేత్తి వేద్యం । న చ తస్యాస్తివేత్తా । తమాహురగ్ర్యం పురుషం మహాన్తమ్॥ (శ్వే 3-18)

(2) న హి విజ్ఞాతుర్విపరిలోపో విద్యతే అవినాశిత్వాన్నతు తద్ద్వితీయమస్తి॥ (బృ 4-3-30)

ర్థ్యము తనకారణమగుబ్రహ్మమును సూచింపుచున్నది. కాని సత్యశబ్దము సాక్షాత్తుగ బ్రహ్మమును చెప్పలేదు.

బ్రహ్మము సత్యమనుటచే బ్రహ్మేతరమగు జగత్తు వికారస్వరూపము, అనృతము గనుక నది బ్రహ్మము కాదనియు శ్రోసిపుచ్చబడుచున్నది. అపుడఖండమగు బ్రహ్మమొకటియే మిగిలియుండును. అయినను సవాస్తవమగుజగత్తుగూడ బ్రహ్మబోధకము కాగలదు. మిథ్యాభూతమగు ప్రతిబింబదర్శనముచే సత్యమగుబింబముయొక్క జ్ఞానము

సత్యాదిశబ్దములు బ్రహ్మ లక్షకములు గాని తద్వాచకములుగావు

కలుగుచున్నది. బ్రహ్మము నిర్ధర్మకము. ధర్మములన్నియు నసత్యములు. సత్యశబ్దబోధితమగుసత్యత్వధర్మముగూడ మిథ్యామాత్రమగుటచే నాశబ్దముచేతనే వ్యావర్తింపబడుచున్నది. మట్టినీటియందుపయోగింపబడు చిల్లగింజగంధము నీటియందలి మడ్డినిపోగొట్టి తానుస్వయముగా నివర్తించును. ఇట్లు సత్యత్వమిథ్యాత్వములు రెండునుతొలగినపుడు నిలిచియుండునది నిర్ధర్మకమగుబ్రహ్మమని సూచింపబడుచున్నది. ఈప్రకారము సత్యాదిశబ్దములు స్వార్థములగు సవిక్రియత్వచేతనత్వానంతత్వములను పరిత్యజింపకయే యర్థాపత్తిచేత విరుద్ధధర్మములగు నృత్వచేతనతత్వాపరిచ్ఛిన్నత్వములను నివర్తింపుచు విరుద్ధార్థకముచే కలుగుచున్న యజ్ఞానమును తొలగించుచు నీమార్గమున పరబ్రహ్మమును లక్షించుచున్నది. కాని సాక్షాత్తుగ నద్దాని చెప్పుటకు సమర్థములు కావు. బ్రహ్మవిదుడు పరమును బొందునను సూత్రప్రాయమగు బ్రహ్మవల్లిపిండితార్థమునకు

తరువాత గ్రన్థమంతయు ననువ్యాఖ్యానము మాత్రమగు చున్నది.

అ॥ సత్యాదిశబ్దములచే పరోక్షముగా లక్షితమయిన పరబ్రహ్మము నపరోక్షముగ నుపలబ్ధముకాగలస్థలమును తరువాత వాక్యము బోధించుచున్నది.

మూ:- యో వేద నిహితం గుహాయాం పరమే వ్యోమన్ । సో౽శ్నుతే సర్వాన్ కామాన్ సహ । బ్రహ్మణా విపశ్చితేతి॥

టీ:- (1) ఎవ్వడు శ్రేష్ఠమగుహార్దాకాశమందలి బుద్ధిగుహాయందు నిగూఢముగనున్నట్టి పరబ్రహ్మమును తెలిసికొనుచున్నాడో యతడు (2) బ్రహ్మవిత్స్వరూపమున (3) నొక్కమారుగ సమస్తముగుకోర్కెలను పొందగలడు.

తా. వి:- ఈయనువ్యాఖ్యానముయొక్క మూడుభాగములలో మొదటిభాగము 'విత్' అనుపదమునకును రెండవభాగము 'పరం' అనుపదమునకును, మూడవభాగము 'అప్నోతి' యనుపదమునకును వ్యాఖ్యానములగుచున్నవి.

జ్ఞానజ్ఞేయజ్ఞాతృపదార్థములన్నియును బుద్ధియందు నిగూఢముగ నుండుటచే నది గుహ యనిబిలువబడుచున్నది. గుహాశబ్దమునకు సంవరణ మర్థము. భోగాపవర్గములను పురుషార్థములీబుద్ధియం దుండుననిగూడ చెప్పవచ్చును. బుద్ధియందవ్యాకృతమగుపరమాకాశము నిహితమైయున్నది.

గుహాశబ్దార్థము

ఈపరమాకాశ మక్షరమగుబరమాత్మయందు పడుగుపేకవలె నేయబడియున్నది. అవ్యాకృతాకాశమే బుద్ధిగుహ యనిచెప్పవచ్చును. ఈయవ్యాకృతాకాశము బహు

సూక్ష్మమై సర్వకారణమగుటచే సమస్తపదార్థములు దానియం దిమిడియున్నవి. ఇట్టియవ్యాకృతాకాశమునందు బ్రహ్మము నిగూఢముగానున్నాడు. బ్రహ్మసాక్షాత్కారమున కంగముగా జెప్పబడుటచే హార్దాకాశమే పరమాకాశమని చెప్పుట న్యాయము. ఈహార్దాకాశమునందలి బుద్ధిగుహాయం దన్తర్ముఖులచే బ్రహ్మమపరోక్షముగ దెలియబడును.

బ్రహ్మము సర్వవ్యాపియయినను నద్దానిసాక్షాత్కారమునకు హార్దాకాశము ప్రత్యేకముగ నిర్దేశింపబడుచున్నది.

హార్దాకాశము సాక్షాత్కారస్థానము

సర్వమాలిన్యవిముక్తమై తడివస్త్రముతో దుడువబడినదర్పణమువలె విశుద్ధము, ఏకాగ్ర్యము, నివాతగతదీపమువలె నచంచలము నగుబుద్ధిచేతనే సమాధియం దీపరబ్రహ్మతత్త్వమును తెలిసికొనదగును. మనస్సుచేతనే తెలిసికొనబడవలయునని శ్రుతి(1) చెప్పుచున్నది. హార్దాకాశము బుద్ధిస్థానము. కనుక సత్యజ్ఞానానన్తాదిలక్షణములచే సూచింపబడుమార్గమున నిర్మలమగుచి త్తైకాగ్ర్యముతో సమాధియం దాపరమార్థతత్త్వమును విచారణముజేసినపుడది బుద్ధియందు భాసించుచున్నదని 'యో వేద నిహితం గుహాయాం' అనువాక్యమున కర్థము. శబ్దప్రసారకయంత్రమునుండి (Broadcasting) వెలువడుచున్న శబ్దజాలము సర్వవ్యాపియయినను, సునిశితము సుసంస్కృతము నగు రేడియోయంత్రమునందు సుగ్రాహ్యమగుచున్నది. 'నేను' యనుశబ్దముచే సర్వలోక ప్రతీతి నొందిన యాత్మ

(1) "మనసైవానుద్రష్టవ్యమ్" (కఠ 4-11)

హార్దాకాశమున దెలియబడుచున్నది. కనుక పరబ్రహ్మము హార్దాకాశమున నాత్మరూపమున దెలిసికొనదగియున్నదని 'యో వేద' యనువాక్యతాత్పర్యము. ఇట్లు సూచింపబడిన బ్రహ్మాత్మైక్యము రాబోవువాక్యమున స్పష్టముచేయబడుచున్నది. సాధ్యము, సాధనము, సాధకుడు, జ్ఞేయము, జ్ఞానము, జ్ఞాత మొదలగు భేదముదొలగి తనస్వరూపమే బ్రహ్మమను జ్ఞానము కలిగినవెంటనే భేదబుద్ధి నశించి యపరోక్షసాక్షాత్కారములభించును. అపుడు జీవునకు సంసారిత్వజ్ఞానము తొలగును.

అశేషభేదవినిర్ముక్తమగు బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే బ్రహ్మమును బుద్ధిగుహాయం దపరోక్షముగ దెలిసికొను జ్ఞాని సమస్తమగుకోరికల నొక్కమాఱుగ ననుభవించును. బ్రహ్మము నపరోక్షముగ దెలిసికొనినవాడు బ్రహ్మభావమును పొందినవాడగును. అతడు నిరుపాధికుడగుటచే నద్దానిసంబంధమగు సంసారధర్మములుగాని, జనసామాన్యమువలె సుఖసాధనములగు చక్షురాదీన్ద్రియములయొక్క యపేక్షగాని యతనికిలేదు. అతడానన్దస్వరూపుడు. బ్రహ్మానన్దము విషయములమీద నాధారపడదు. మన మనుభవించెడి నానాయానందములన్నియు విషయాధీనములు పరిచ్ఛిన్నములు నగుచున్నవి. బ్రహ్మానన్దము నిర్విషయము అపరిచ్ఛిన్నము. ఇతరానన్దములన్నియు బ్రహ్మానందాంశము లగుచున్నవి. బ్రహ్మవిదుడు బ్రహ్మానంద

బ్రహ్మవిదుని సర్వకామానుభవము

స్వరూపుడగుటచే సర్వానందములను తానొక్కమారుగ ననుభవించుచున్నాడని చెప్పబడుచున్నది. అతడాత్మకాముడు గనుక నవాప్తసర్వకాము డగుచున్నాడు. ఇందుచే నతనికి కామములున్నవని తలంపరాదు. సర్వకామములు నశించిన వాడుగాని బ్రహ్మజ్ఞానిగానేరడు.

బ్రహ్మవిదుడు సర్వకామముల నొక్కమారుగననుభవించుట కతడు బ్రహ్మానందస్వరూపుడగుటయే కారణము.

బ్రహ్మవిత్స్వరూపము బ్రహ్మస్వరూపము

బ్రహ్మజ్ఞాని బ్రహ్మస్వరూపు డగుచున్నాడు. అనగా నతడు సర్వజ్ఞుడు సర్వగతుడు, నిత్యబ్రహ్మాత్మస్వరూపుడు. అతని యానంద స్వరూపము ధర్మానపేక్షితము. చక్షురాదికరణానపేక్షితము. ఇదియే విపశ్చిచ్ఛబ్దమునకర్థము. అందువలననే అన్నర్ప్రాప్తిచే బుద్ధిగుహాయం దపరోక్షముగ బ్రహ్మమును దెలిసికొనినవాడు బ్రహ్మస్వరూపుడయి యశేషవాంఛల నొక్కమారుగ ననుభవించునని చెప్పబడినది.

బ్రహ్మము సత్యము సర్వకారణమనియు, జగత్తనృతము కార్యరూపమనియును పైన నుదాహరింపబడినది. దీనిని

అనంతశబ్దార్థము

సిద్ధాంతపఱచుట కనంతశబ్దార్థవిచారణ మావశ్యకమగుచున్నది. దేశమునుబట్టి కాలమునుబట్టి, వస్తువునుబట్టి యనంతత్వము త్రివిధము. ఆకాశ మంతటనుండుటచే నది దేశమునుబట్టి యనంతము. దానివలన నితరప్రపంచమంతయు నుత్పన్నమయినట్లు ముందు జెప్పబడుచున్నది. కాని యది కాలమునుబట్టియు, వస్తువును

బట్టియు ననంతముగాదు; అది కార్యస్వరూపము. సృష్టికిపూర్వ మదిలేదు. బ్రహ్మము సృష్టికిపూర్వ ముండుటచేత నది కాలమునుబట్టి యనంత మగుచున్నది. అదేప్రకారము వస్తువులను బట్టిగూడ నది యనంతమగుచున్నది. వస్తువు లనేకములు. ఒకదానిజ్ఞానము మరియొకదానిజ్ఞానముచే పరిచ్ఛిన్నమగుచున్నది. రెండవవస్తుజ్ఞానముచేత మొదటివస్తువుజ్ఞానము తొలగిపోవుచున్నది. కనుక వస్తుజ్ఞానమున కంతముగలదు. బ్రహ్మముకంటె భిన్నమగుపదార్థము మఱియొకటి లేదు. అందువలన నద్దానికి వస్తుపరిచ్ఛేదము లేదు. కాలాకాశాదీతరవస్తువులు సృష్టిలోఁజేరినవగుటంజేసి యవి కార్యములు అనృతములు, అంతవంతములగుచున్నవి. అవి కార్యములగుటంజేసి వానికి కారణమొకటి యుండితీరవలయును. ఆకారణమే బ్రహ్మము. కారణముకంటె కార్యము భిన్నముగాదు. కారణమగుసువర్ణముకంటె కార్యములగు నగలు వేరుగావు. నగలను చూచినపుడు బంగారమనుబుద్ధి నశించుటలేదు. అదేప్రకారము జగత్కార్యముచే తత్కారణమగుబ్రహ్మవిషయకమగు బుద్ధి తొలగనేరదు. సత్యవస్తుజ్ఞాన మసత్యవస్తుజ్ఞానముచే పరిచ్ఛిన్నముకానేరదు. ఆభరణజ్ఞానము సువర్ణజ్ఞానమును పరిమితము చేయలేనట్లే కార్యమగునాకాశజ్ఞానము కారణమగు బ్రహ్మజ్ఞానమును పరిచ్ఛిన్నముచేయలేదు. ఇట్లు బ్రహ్మకారణము కార్యములగు దేశకాలవస్తువులచే పరిచ్ఛిన్నముకానేరదు.

అ॥ సత్యజ్ఞానానంతములచే సూచింపబడిన మార్గమున బ్రహ్మము నన్వేషించువానికి హార్దాకాశముననే అపరోక్షముగ

దెలియబడునని చెప్పబడినది. అంతమాత్రముచే నద్దానిని దెలియ శక్యము కాదు. దుర్విజ్ఞేయమగు నీపరబ్రహ్మమును సువిజ్ఞేయముసేయుటకుగాను 'నేను' అనుసర్వనామముచే నాబాలగోపాలము సుప్రసిద్ధముగ దెలియబడుచున్న యాత్మతో నద్దానియనన్యత్వము రాబోవువాక్యముచే బ్రదర్శింపబడుచున్నది.

మూ:- తస్మాద్వా ఏతస్మాదాత్మనః ।

టీ:- ఆ, ఈ, ఆత్మశబ్దవాచ్యమగు బ్రహ్మమువలన

తా.వి:- సత్యాదిశబ్దములచే లక్షితము, సూత్రవాక్యోదాహృతమునగు బ్రహ్మమే యిచట 'ఆ' యనుశబ్దముచేత పరామర్శింపబడుచున్నది. 'ఈ' యనుశబ్దముచేత హార్దాకాశమునందు సుప్రసిద్ధమగునాత్మ రొమ్ముమీాద చేయివేసికొనియోయన్నట్లు వాస్తవిన్యాసపూర్వకముగ బ్రదర్శింపబడుచున్నది. 'ఆ', 'ఈ' యనునీరెండుశబ్దార్థముల సమన్వయము జేసి యర్థకల్పనము గావించినపు డేపరబ్రహ్మము తదవాప్తిసాధనముగను సత్యజ్ఞానానన్దాదిలక్షితముగను పరోక్షముగ సూత్రవాక్యాదులచే వివరింపబడినదో, ఆపరబ్రహ్మము, అద్దాని సాక్షాత్కారస్థానముగ బేర్కొనబడినహార్దాకాశమున నేను యనుశబ్దముచే నపరోక్షముగ సర్వలోకవిదితమయిన యాత్మయు నొకటియే యనునర్థము పర్యవసన్నమగుచున్నది.

ఇట్లు జెప్పుటచేత బ్రహ్మము స్వయముగా సుప్రసిద్ధము గాకపోయినను ఆత్మస్వరూపమున సువిదితముగాగలదని తాత్ప

ర్థము. సూత్రవాక్యమునందు పరోక్షముగ నుదాహృత మగుబ్రహ్మమే బుద్ధిగుహాయందపరోక్షముగ నాత్మస్వరూపమున సుగ్రాహ్యమగుచున్నదని పర్యవసానము తేలుచున్నది.

బ్రహ్మాత్మల యనన్యత్వము

అ॥ బ్రహ్మము సత్యమనుటచే తదితరమగు జగత్తంతయు నసత్యమని ప్రతిపన్నమగుచున్నయర్థము తరువాతవాక్యమున వ్యాఖ్యానింపబడుచున్నది.

మూ:- ఆకాశః సంభూతః । ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః । ఓషధీభ్యోఽన్నమ్। అన్నాత్పురుషః ।

టీ:- పూర్వవాక్యోదాహృతమగు నాత్మకంటె నన్యము గాని బ్రహ్మమునుండి యాకాశముత్పన్నమైనది. ఆకాశము నుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి జలము, జలమునుండి పృథివి, పృథివినుండి యోషధులు, ఓషధుల నుండి యన్నము, అన్నమునుండి పురుషుడును బుట్టినవి.

తా. వి:- సత్యశబ్దముయొక్క విశేషణార్థబలముచే బ్రహ్మేతరమంతయు నసత్యమని యింతకుముం దుదాహరింపబడినది. బ్రహ్మముగానిదంతయు జగత్తగుచున్నది. జగత్తన నాకాశాదిపృథివ్యన్తములగు పంచభూతములు తద్వికారములగు నోషధ్యన్నపురుషాదులును. సృష్టిజ్ఞానము పురుషార్థసాధకము గాదు. సృష్టియంతయు నసత్యము. బ్రహ్మమొక్కటి మాత్రము సత్యమను పరమార్థము నుపదేశించుటకె యిచట సృష్టివర్ణనము

సృష్టివర్ణనము పురుషార్థసాధకముగాదు

చేయబడినది. శృత్యైకాభిమతమగు బ్రహ్మోపదేశమును జేయువాక్యమునకును తరువాత వినబడుచున్న సృష్టివాక్యములకు నేకవాక్యతను కల్పించి యర్థసమన్వయము జేయవలయును.

సత్యాదిశబ్దములచే బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము పదేశింపబడినది. సృష్టివర్ణనముచే జగత్కారణమగు బ్రహ్మముయొక్క తటస్థలక్షణము వర్ణింపబడుచున్నది. లక్ష్యమున్నంతకాల మాలక్షణముండకపోయినను లక్ష్యమును తాత్కాలికముగ సూచించుచున్నది తటస్థలక్షణము. దీనిచే లక్ష్యస్వరూపమునందు భేదము గలుగదుగాని చెప్పదలచిన వస్తుజ్ఞానముమాత్రము గల్గును. కాకివాలినదే రామునిగృహమని యుద్దానిని చూపుచున్నాము. రామునిగృహమునకు కాకి తాత్కాలికలక్షణము. కాకి యచటనున్ననులేకున్నను నా గృహస్వరూపమునందు మార్పుగలుగదు. కాని యది తెలిసికొనవలసినగృహమును తెలుపుచున్నది. జగత్తు సర్వవిదితము. ఇది కార్యాత్మకము. బ్రహ్మము దాని కాత్యంతికకారణము. కార్యముఖమున కారణమగుబ్రహ్మ మిచట నుపదేశింపబడుచున్నది. సృష్టివర్ణనమున కిదియేప్రయోజనము. బ్రహ్మము జగత్కారణమెట్లగుచున్నదో యూరవ యనువాకమున వివరింపబడినది.

సృష్టి బ్రహ్మముయొక్క తటస్థలక్షణము

సృష్టినిగూర్చి యనేకవాదములు గలవు. వివిధపదార్థములయొక్క ప్రథమావస్థయగు పరమాణువుల యన్యోన్యసంయోగముచే సృష్టి యారంభమగుచున్నదని యారంభ

వాదులగు నైయ్యాయికులు చెప్పుచున్నారు. ప్రకృతియొక్క పరిణామముచే సృష్టి సంభవించుచున్నదని పరిణామ వాదుల వాదము. వీరు సాంఖ్యులు. బ్రహ్మము విశేషాకారమును బొందినట్లు భ్రాంతిచే దోచుట సృష్టియని యద్వైతులవివర్తవాదము.

వివర్తవాదము

ఆరంభపరిణామవాదులు బ్రహ్మేతరమగు మఱియొకవస్తువొకటి కలదనియు, దానివికారముచే సృష్టిగలుగుచున్నదనియు చెప్పుదురు. వివర్తవాదమునందు బ్రహ్మమద్వయమనియు, మార్పులేనిదనియు, చూపరులదృష్టిభేదముచే నదియే సృష్టియనుపేర వాడబడునవేకరూపముల కనుపట్టుచున్నదనియు జెప్పబడుచున్నది. బ్రహ్మము నిష్క్రియము, నిర్వికారము, రూపాది గుణరహితము. అయినను నది జగత్కారణమని చెప్పబడుచున్నది. పరబ్రహ్మశక్తియగుమాయయొక్క ప్రభావముచే నామరూపాదులు దానియందారోపింపబడుచున్నవి. బ్రహ్మము స్వయముగా మార్పుజెందక వివిధనామరూపముల గాన్పించుటయే సృష్టియనబడుచున్నది. మందాంధకారమున త్రాడు సర్పము మొదలగువిశేషాకారముల భాసించుచున్నది. అట్టి భ్రాంతికాలమునగూడ స్వయముగా త్రాటియం దేమియు మార్పులేదు. చూచువారలదృష్టిభేదముచే నాత్రాడే యొకరికి సర్పముగను, మఱియొకరికిదండముగను, ఇంకొకరికి జలధారగను కనుపట్టుచున్నది. త్రాడనునది యచటలేదేని వివిధమగు నిట్టిభ్రాంతిజ్ఞానము గలుగనేరదు. మందాంధకారముచే గప్పబడిన చూపరులదృష్టిభేదమే యుందులకు కారణము. నిర్వికార

మగు పరబ్రహ్మమే మాయావిమోహితమగు నజ్ఞానిజనమునకు వికారసహితమగు జగదాకారమున భాసించుచున్నది. త్రాడు లేనిది సర్పాదిభ్రాంతి కలుగనటులనే బ్రహ్మమును నధిష్ఠానము లేనిది జగద్భ్రాంతి కలుగనేరదు. అజ్ఞానమే యీభ్రాంతికి

ఆవరణవిక్షేపములు

కారణము. యథార్థమజ్ఞానముచే నావరింపబడినపుడు నిజస్వరూపము గాన్పింపదు. అపుడు బుద్ధి విక్షేపముచుజెంది యున్నవస్తువు నన్యథా గ్రహించును. ఆవరణముచే యథార్థస్వరూపము కప్పబడును. విక్షేపముచే యథార్థము మఱియొకరూపమున భాసించును. ఆవరణవిక్షేపములు రెండు నజ్ఞానస్వరూపములే యగుచున్నవి. చీకటిచే కప్పబడినపుడు త్రాడు త్రాటిరూపమున కనుపడుట లేదు. ఇది యావరణఫలము. విక్షేపముచే నది సర్పముగ భాసించుచున్నది. ఆటువలనే బ్రహ్మము స్వప్రకాశమయినను నజ్ఞానముచే నావరింపబడిన మనబుద్ధుల కది నిజస్వరూపమున గోచరముగాకున్నది. విక్షేపముచే బ్రహ్మమునందు జగద్భ్రాంతి గల్గుచున్నది. ఇదియే వివర్తవాదవిశేషము. ఆరంభపరిణామములకు వస్తువునందు గల్గుమార్పు కారణము. వివర్తవాదమునకు చూపరులభ్రాన్తదృష్టి కారణము. వివర్తవాదముచే బ్రహ్మముయొక్క సత్యత్వనిర్వికారత్వములు సమర్థింపబడుచున్నవి.

సృష్టియనునది సత్యముగాకున్నను కార్యరూపమున ప్రత్యక్షముగ ననుభూతమగుచున్నది. కారణము లేనికార్యము సంభవముగాదు, జగత్కార్యమునకు కారణమేది? అద్వి

బ్రహ్మముకంటె భిన్నమా? అభిన్నమా? భిన్నమయినచో, బ్రహ్మేతరమంతయు కార్యస్వరూపమగుటచే నాకారణము గూడ కార్యమే యగుచున్నది. కారణ

బ్రహ్మము జగత్తున కాత్యంతిక కారణము

మగు నీకార్యమునకు కారణమేది యను ప్రశ్న గల్గి యట్లనవస్థాదోషము సంప్రాప్తమగును. కనుక జగత్కారణము బ్రహ్మముకంటె భిన్నముగానేరదు. ఇచట కారణశబ్దముచే నాత్యంతికమగు మూలకారణము వివక్షితమగుచున్నది. జగత్తునకు మూలకారణము బ్రహ్మేతరమగునది మఱియొకటిచిక్కదు. బ్రహ్మము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమగుటవలన నద్దానికి సాక్షాత్తుగ జగత్కారణత్వ మాపాదింపవీలులేదు గనుకను, అది యొక్కటియే సత్పదార్థమగుటచేతను, జగత్కార్యమునకు సహేతుకమగు వేఱొక కారణము కాన్పించకుండుటచేతను, కారణము లేనికార్య మసంభవమగుటచేతను, పరమార్థముచే జగత్తనునది పరబ్రహ్మమునందు మాయచే గల్పింపబడి యాభాసమాత్రమగుచున్నదని చెప్పవలసివచ్చుచున్నది. నామరూపగుణక్రియాదివిశేషములులేని బ్రహ్మమే జగత్తను విశేషస్వరూపమున భాసింపుచున్నది. ప్రకృతి మాయాస్వరూపమాత్రమై క్రమముగ నాకాశాదిరూపమున నభివ్యక్తమగుచున్నది.

సృష్టిక్రమమున మొదటిది యాకాశము. ఆత్మానన్యమగు బ్రహ్మమువలన నిది బుట్టినట్లు మాయాప్రభావముచే భాసింపుచున్నది. ప్రతిధ్వని యాకాశగుణము, ఆకాశము

తరువాత వాయువు అగ్ని జలము, పృథివి యనునవి యొక దానివలన నొకటి సంభవించుచున్నవి. అనగా బ్రహ్మమే తత్త ద్భూతాకారమున వ్యాకృతమగుచున్నదని యర్థము. మాయచే నాకాశస్వరూపమును బొందినట్లగుపడుచున్న బ్రహ్మమునుండి వాయు వుత్పన్నమైనదని తాత్పర్యము. ఇటులనే యితరభూతములన్నిటియుత్పత్తియును తెలియవలెను. శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధ మనునవి వరుసగ యాకాశాదిపంచభూతములయొక్క స్వీయ గుణములు. ఈప్రత్యేకగుణములు పంచభూతములయొక్క ప్రత్యేకప్రత్యేక లక్షణములయి యొకభూతము రెండవభూతము నుండి వానిచే ప్రత్యేకింపబడుచున్నవి. పూర్వపూర్వభూతము నుండి యుత్తరోత్తరభూత ముత్పన్నమగుటవలన ప్రతిభూతము నందును స్వీయగుణముండగా నద్దాని కారణభూతభూతగుణము గూడ సంక్రమించుచున్నది. వాయువునందు స్వీయగుణమగు స్పర్శయు, నద్దాని కారణమగు నాకాశముయొక్క గుణమగు శబ్దమును కలిసి రెండుగుణము లేర్పడుచున్నవి. ఇట్లాకాశాది పంచభూతములు క్రమముగా నొకటి రెండు మూడు నాలు గైదుగుణములు గలవగుచున్నవి. కారణగుణములు కార్యము నందు సంక్రమించుట న్యాయమేకదా! అందువలన సర్వకారణ మగుబ్రహ్మస్వరూపమే జగద్రూపమున నవభాసింపుచున్నది. కార్యగుణము లెంతమాత్రము కారణమునందు సంక్రమింప నేరవు. కార్యములగు పంచభూతములయొక్క గుణములు బ్రహ్మమునందు జేరనేరవు. సినీమాపటమునందలి దోషములు

పంచభూతసృష్టి

చిత్రమాతృక (Film) వంటవు. ఇచట భూతపంచకసృష్టిక్రమ ముదాహరింపబడినది. ఈక్రమమితరయుపనిషత్తులయం దిచటి వలె సమగ్రముగ నుదాహరింపబడలేదు. క్రియవ్యత్యాసము గూడ వినబడుచున్నది. ఛాందోగ్యమునందు తేజోజలాన్న ములు వినబడుచున్నవి (6-2-3). ఐతరేయమునందు సత్య లోకాదులు, కిరణములు, పృథివి, ఆపో

సృష్టిజ్ఞానము పురుషార్థ సాధకముగాదు

లోకములు చెప్పబడుచున్నవి (1-2). ముండకమునందు (2-1-3) మఱియొకవిధ ముగా వినబడుచున్నది. పురుషార్థసాధకముగానట్టి యనృత రూపముగుసృష్టిని వివరించుట శ్రుతితాత్పర్యము గాదు. బ్రహ్మ మును బోధించుటమాత్రమే యద్దానియుద్దేశ్యము. బ్రహ్మము దుర్విజ్ఞేయము. విదితవస్తుసహాయముచే బోధింపబడినపుడు వస్తువు అవిదితమయినను సువిదితముగాగలదు. సర్వవిదితమగు జగత్తుయొక్క స్వరూపవివరణముచే దుర్విజ్ఞేయమగు బ్రహ్మ మిచట బోధింపబడుచున్నది. జగత్తనృతమయినను దాని జ్ఞాన ముచే సద్వస్తుజ్ఞానము కలుగగలదు. కంటికి కనుపడుచున్న సర్పము నిజముగా సర్పముగాదని తెలిసి త్రోసివేయబడినపుడు సర్పముగాకనుపడినది త్రాడనుయథార్థజ్ఞానము కలుగు చున్నది. సత్యజ్ఞానానన్తాదిశబ్దములచే బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము వివరింపబడుచున్నది. మాయాకల్పిత మగు జగత్కారణత్వముచే నద్దానితటస్థలక్షణము వర్ణింపబడినది.

ఇంతవరకు పంచభూతముల యపంచీకృతస్థితి యనగా వాని సూక్ష్మావస్థ వివరింపబడినది. సృష్టిప్రక్రియకు పూర్వ

పంచీకరణము

మీభూతములు పంచీకృతములుగ జేయబడి నవి. ప్రతిభూతము ముందు రెండుభాగములుగ విభజింపబడి యందులో నొకభాగము తిరిగినాలుగ స్తర్భాగములుగ విభజింపబడెను. ప్రతిభూతముయొక్క యవిభక్తమగు రెండవభాగముతో నితరములగు నాలుగు భూతములయొక్క ప్రవిభక్తములగు నాలుగ స్తర్భాగము లొక్కొక్కటిచొప్పున సమ్మిశ్రణముచేయగా ప్రతిభూత మద్దానియొక్క స్వీయమగు పెద్దభాగ మొకటి భూతేతరములయొక్క ప్రవిభక్తమగు నాలుగు చిన్న భాగములు మొత్తమైదుభాగములుగలదగుచున్నది. ఇట్లు పంచీకృతముకాగా స్థూలమగుపృథివియందు స్వీయమగు పెద్ద భాగ మొకటియు, నాకాశాదీతరనాలుగుభూతముల యొక్క ప్రవిభక్తభాగములు నాల్గున్ను కలిసి పృథివిపంచభాగాత్మక మగుచున్నది. ఇట్లేమిగిలిన నాలుగుస్థూలభూతము లేర్పడు చున్నవి. పంచీకృతమగు పృథివివలన నోషధులు బుట్టుచున్నవి. పంచీకృతమగు పృథివియందే మనము నివసించుచున్నాము. మూలమునందలి మొదటిపృథివి అపంచీకృతము సూక్ష్మము. రెండవపర్యాయము జెప్పబడిన పృథివి పంచీకృతము స్థూలము.

ఇట్లు పంచీకృతమైన పృథ్వినుండి యోషధులును, వీని నుండి యన్నమును పుట్టుచున్నవి. అన్నమునుండి రసలోహిత రేతస్సులనుకార్యములు క్రమముగా గలుగుచున్నవి. రేతస్సు నుండి శిరఃపాణ్యాద్యాకృతిగల పురుషశరీరముద్భవించుచున్నది. పురుషు డన్నవికారస్వరూపుడు. అతనిశరీరము పంచభూతాత్మకము. సమస్తప్రాణిజాతము బ్రహ్మవంశములో జేరినను పురు

షుడు ప్రధానుడు గనుక నిచట ప్రత్యేకముగ నుదాహరింపబడు చున్నాడు. ఆతడు కర్మజ్ఞానాధికారి; యుక్తాయుక్తవిచక్షణము నందు సమర్థుడు. పురుషార్థములఁ నర్థించు వాడు. అతని యందాత్మ యెక్కుడుస్వచ్ఛముగా బ్రకాశించుచుండును. అతడు జ్ఞానవంతుడు. లోకాలోకముల నెఱుగును. మృత్యువునుండి యమృతత్వమును గోరుచున్నాడు. అతనినే బ్రహ్మజ్ఞానముచే బ్రహ్మైక్యమును బొందింప శ్రుతి యనుగ్రహించుచున్నది. అట్టివాని యుత్పత్తి నెఱుంగజేయుటకుగూడ సృష్టివివరణము జేయబడినట్లు తోచుచున్నది.

పురుషోత్పత్తి

అ॥ పురుషుడు బ్రహ్మజ్ఞానాధికారియగుటం జేసి యతనికి జ్ఞానోపదేశము జేయుట కావశ్యకమగు భూమిక, తరువాత వాక్యమున నాయత్తముజేయబడుచున్నది.

మూ:- స వా ఏష పురుషోఽన్నరసమయః । తస్యేదమేవశిరః । అయం దక్షిణః పక్షః । అయముత్తరః పక్షః । అయమాత్మా । ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

టీ:- ఆయన్నరసమువలన బుట్టినట్టియు, జ్ఞానోపదేశమునకై శ్రుత్యనుగృహీతుడయినట్టియు నీపురుషు డన్నరసమయుడు. అతనికిదియే శిరస్సు; ఈకుడిచేయి, దక్షిణపక్షము; ఈయెడమచేయి యుత్తరపక్షము; ఈమధ్యభాగము ఆత్మ; ఈనాభికి దిగువభాగము ప్రతిష్ఠ. ఇందునుగూర్చి దిగువశ్లోకము చెప్పబడుచున్నది.

తా.వి:-బాహ్యములగుశరీరములు ప్రాణములు మనస్సు మొదలగునవి యాత్మయని భావించువారలనేకులు గలరు. బుద్ధి

కోశపంచకమునందాత్మత్వ బుద్ధిని మెలగించుటచే బ్రహ్మముపదేశింప బడుచున్నది

హార్దాకాశమునుజేరుటకు పూర్వము శరీరము, ప్రాణము, మనస్సు లాత్మయను నజ్ఞానకల్పితమగు నహోహ తొలగ వలసియున్నది. శరీరమునకు ప్రాణము లాత్మయని భావించుటచే శరీరమునం దాత్మత్వబుద్ధి తొలగుచున్నది. ఈవిధముననే ప్రాణాదులయం దాత్మత్వబుద్ధిని మరలించుప్రకరణమిచట ననుకరింపబడు చున్నది. తల్లి పిల్లవానికి చంద్రునిజూపిం మటకుముందు చెట్టు కొమ్మ చివరజూపి, బుద్ధియచటలగ్నమైనతరువాత నచటినుండి నద్దానిమరల్చి కొమ్మపైనున్నచంద్రుని జూపును. శరీర మన్న రసవికారమగు రేతస్సుయొక్క పరిణామమగుటచే పురుషుడన్న రసమయుడని వర్ణింపబడినాడు. శరీరమన్నమయమనియు, దీనియందు హృదయాదిసర్వావయవములు వరయందు కత్తివలె నంతర్హితములగుటంజేసి కోశమనియు జెప్పబడుచున్నది. శరీరాద్యనాత్మవస్తువుల యందాత్మత్వబుద్ధిని దొలగించుట కుపాసనము విధింపబడినది. ఉపాసనమున కాలంబన మవశ్యము.

అన్నమయకోశము

చయనమునం దిష్టకల నమర్చుపక్ష్యాకారము నిచట నాలంబనముగా గ్రహించి దానిపంచావయవములసామ్య మన్నమయకోశమునకు గల్పింపబడినది. పూర్వకాండకుశలులగు వైదికోత్తములకు చయనప్రకార మత్యంతముపరిచితమగుటచే నది ఇచటగ్రహింపబడినది.

ప్రతిమనుజుడును జ్ఞానమునకుఁ బూర్వము కర్మనాచరింపవలయు నని గూడనిచట ధ్వనివినబడుచున్నది. శిరస్సు దక్షిణోత్తర భుజములు, మధ్యభాగము, పృచ్ఛభాగమను సుప్రసిద్ధములగు పురుషునియొక్క నైదవయవములు. పక్షియొక్క శిరఆదిపంచావయవములుగా భావనకొఱకు వర్ణింపబడినవి. ఈప్రక్రియయే యితరకోశములగూర్చిగూడ నవలంబింపబడినది. ఇట్లు పంచకోశములదాటి బుద్ధి హార్దాకాశమునందున్న బ్రహ్మమును జేరుటకు ప్రథమోపాయమగు నన్నమయకోశోపాసనము వివరింపబడినది.

ప్రథమానువాకము సమాప్తము



## ద్వితీయానువాకము
### (ప్రాణమయకోశము)

అ॥ పూర్వానువాకమున నుదాహరింపబడిన యన్నమయకోశమను గూర్చిదిగువశ్లోకము గలదు.

మూ:- అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే । యాః కాశ్చ పృథివీగ్ంశ్రితాః । అథో అన్నేనైవ జీవన్తి । అథైనదపియన్త్యన్తతః । అన్నగ్ం హి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాత్ సర్వౌషధముచ్యతే । సర్వం వై తేఽన్నమాప్నువన్తి । యేఽన్నం బ్రహ్మోపాసతే । అన్నగ్ంహి భూతానాం జ్యేష్ఠమ్ । తస్మాత్సర్వౌషధముచ్యతే । అన్నాద్భూతాని జాయన్తే । జాతాన్యన్నేన వర్ధన్తే । అద్యతేఽత్తి చ భూతాని । తస్మాదన్నం తదుచ్యత ఇతి॥

టీ:-ఏయేస్థావరజంగమాత్మకములగు ప్రజలుగలరో వారందరన్నమువలన బుట్టుచున్నారు. మఱియు నన్నముచేతనే వృద్ధిని బొందుచున్నారు. తరువాత నీయన్నమునందు లయమును బొందుచున్నారు. అన్నము భూతములలో శ్రేష్ఠమైనది. అందువలన నది యందఱకు నౌషధమని చెప్పబడుచున్నది. అన్నమును బ్రహ్మముగా నుపాసించువారు సర్వాన్నములను బొందుచున్నారు. సర్వభూతములలో నన్నము జ్యేష్ఠము గనుక నది సర్వౌషధమని చెప్పబడుచున్నది. అన్నమును బ్రహ్మముగా నుపాసించువారు సమస్తాన్నములను బొందుచున్నారు. అన్నమువలన ప్రాణులు పుట్టుచున్నవి. పుట్టినప్రాణు లన్నముచేత వృద్ధిని జెందుచున్నవి. ప్రాణులచే నది భక్షింపబడుచున్నది; అది ప్రాణులను భక్షింపుచున్నది గనుక నది యన్నమని చెప్పబడుచున్నది. ఇట్లన్నకోశవివరణము సమాప్తము.

తా.వి:- శరీర మన్నవికారమగుటచే నన్నమయకోశమని బిలువబడినట్లు ప్రాణాత్మకమగునది ప్రాణమయకోశమని బిలువబడుచున్నది. మనస్సు చేయుపనిచే మూడువిధములగుచున్నది. మంచిచెడుగులను విచారించునపుడు. మనోమయకోశమనియు, విచారించినదాని పర్యవసానమును నిశ్చయించినపుడు విజ్ఞానమయకోశమనియు, నిశ్చయించినదాని ఫలమగునానందము ననుభవించునపు డానందమయకోశమనియు వ్యవహరింపబడుచున్నది.

బ్రహ్మోపదేశప్రణాళికయందు మున్ముందు తొలగింపదగినవి శరీరమునకు బాహ్యములగుభార్యాపుత్రాదులు, క్షేత్ర

కష్టములోనున్నపుడు తాను దుఃఖియనియు, వీరు సుఖముగా నున్నపుడు తాను సుఖియనియు భావించుచు ప్రతిమనుజుడును భార్యాపుత్రాదులయందు తాదాత్మ్యభావము ననుభవించుచున్నాడు. ఇట్టి తాదాత్మ్యభావమును నశింపజేయుటకై శరీరమే యాత్మయను నుపాసనము విధింపబడినది. ఇందుచేత శరీరమునకు బాహ్యమగువానియందనాత్మత్వబుద్ధి తొలగగలదు. ఇంతమాత్రమే దీనిప్రయోజనము.

బాహ్యప్రపంచాపనయనము

పృథివినాశ్రయించియున్న జంగమాత్మకములగు ప్రాణులు రేతోరూపరసాదిభావమున పరిణమించినయన్నము వలన బుట్టుచున్నారు. పుట్టినప్రాణికోటి యన్నముచేత ప్రాణధారణము జేసివృద్ధియగుచున్నది. మితిమీరిన యాహారముచే జాడ్యము మరణము సంభవించుచున్నవి. ఇది లయమని వర్ణింపబడుచున్నవి. వృక్షముయొక్క సూక్ష్మాంశములన్నియు నద్దాని కారణమగుబీజమునందే లయమగుచున్నవి. ఈవిధముగ నన్నము సమస్తప్రాణుల సృష్టిస్థితిలయకారణమగుటంజేసి యన్నము జ్యేష్ఠమగుచున్నది. హితము మితము నగునాహారము సంపూర్ణారోగ్యహేతువగుటచే నది సర్వౌషధమగుచున్నది. ప్రాణసంరక్షణముకొఱకు భుజింపబడునది యన్నమనబడును. వ్యష్టిస్వరూపులగు ప్రాణులయొక్కయు, సర్వప్రాణిసమష్టిస్వరూపుడగువిరాట్పురుషునియొక్కయు శరీరములుగూడ నన్నస్వరూపమే యగుచున్నది. అందుచే నీరెంటికి నభేదము

అన్నమయకోశోపాసనము

చెప్పబడుచున్నది. ఇట్లు బ్రహ్మసామ్యముగలయన్నమును బ్రహ్మముగ నుపాసించినవానికి శరీరబాహ్యములగుభార్యాదుల యందాత్మత్వభ్రాంతి తొలగి యన్నమయమగుశరీరమే బ్రహ్మమనుబుద్ధి కుదురును. ఇట్టియన్నోపాసనమునందు బుద్ధి నాకర్షించుటకై దానిజ్యేష్ఠ్యాదిగుణస్తోత్రము పుష్కలాన్న ప్రాప్తిఫలముగా చేర్కొనబడినవి.

అ॥ అన్న మాత్మయనుభావము స్థిరమైనతరువాత నద్దానినుండి బుద్ధిని మరల్చుటకై ప్రాణమయకోశవర్ణనము ప్రవేశపెట్టబడుచున్నది.

మూ:- తస్మాద్వా ఏతస్మాదన్నరసమయాత్ । అన్యోఽన్తర ఆత్మా ప్రాణమయః । తేనైష పూర్ణః । స వా ఏష పురుషవిధ ఏవ। తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః । తస్య ప్రాణ ఏవ శిరః । వ్యానో దక్షిణః పక్షః । అపాన ఉత్తరః పక్షః । ఆకాశ ఆత్మా పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

టీ:- ఆత్మగాభావింపబడుచు నశ్వరాదిస్వభావముచే ననాత్మభూతమగు నన్నరసమయాత్మకంటె భిన్నమగునది ప్రాణమయకోశము. అది యన్నమయముకంటె సూక్ష్మతరము. అట్టిప్రాణమయునిచే నీయన్నరసమయము పరిపూర్ణమగుచున్నది. ఈప్రాణమయాత్మగూడ పురుషాకారుడే. అన్నమయకోశసరణి ననుసరించి ప్రాణమయుడుగూడ పురుషాకారుడగుచున్నాడు. ప్రాణవాయువు శిరస్సు, వ్యానవాయువు దక్షిణపక్షము; అపానవాయువుత్తరపక్షము; సమానవాయువు మధ్యభాగము; భూమి యవస్థానభూతమగు పుచ్ఛము.

తా. వి:- బ్రహ్మభావనముచే నుపాసించుటకై ప్రాణమయకోశముయొక్క పురుషాకృతిత్వము ప్రదర్శింపబడుచున్నది. ప్రాణమయకోశము శరీరపిండముకంటె నన్యము సూక్ష్మతరము, అన్నమయకోశమును తనలో నిముడ్చుకొనియున్నది. అది వాయుమయము. దానిచే నన్నమయకోశ మాపాదమస్తకము నిండియున్నది. అన్నమయకోశమున కది యాత్మయగుచున్నది. ప్రాణవాయువులేక నయ్యది నిలువనేరదు. ప్రాణము క్రియాశక్తికార్యభూతము. ఈ ప్రాణము ప్రాణాపానవ్యానోదానసమానములను నయిదురూపముల మారి ప్రాణమయకోశ మగుచున్నది. అన్నమయకోశమునకు ప్రాణమయకోశ మాత్మయను స్థిరమగుభావనచే నన్నమయకోశమునం దాత్మత్వబుద్ధి తొలగును.

ప్రాణమయకోశము

మూసలో కఱగిపోసిన లోహమువలె నన్నమయకోశము నాశ్రయించి యాత్మభావముచే వర్తిల్లుచున్న ప్రాణమయకోశముగూడ పురుషాకారమున బ్రదర్శింపబడుచున్నది. శ్వాసరూపమగు ప్రాణవృత్తి ప్రాణమయకోశమునకు శిరస్సు. వ్యానవృత్తి దక్షిణపక్షము; అపానవృత్తియుత్తరపక్షము; శరీరమధ్యముననున్న సమానవృత్తి యాత్మ; పృథివీదేవత స్థితిహేతువగుటచే పుచ్ఛమగుచున్నది. పృథివి ప్రతిష్ఠాహేతువు కానిచో నుదానవృత్తిచే నూర్ధ్వగమనమో బరువుచే క్రిందపడుటయో సంభవించును. హృద్దేశమునుండి ముఖనాసికామూలమున

ప్రాణమయకోశోపాసనము

పైకిసంచరించుటచే ప్రాణవృత్తి శిరస్సనియు, నచ్చటనుండి సర్వనాడులయందును ప్రసరించుటచే వ్యానవృత్తియనియు, నధఃప్రసారముచే నపానవృత్తి పక్షములనియు, ఉదరమధ్యమున నాభిసమీపమునందుండుటచే సమానమాత్మ యనియు, దేహమునందు ప్రాణాదివృత్తులకు ప్రాణికోటికి పృథివివలె నవస్థితిహేతువగుటచే నుదానము పుచ్ఛమనియు కల్పింపబడినది. ఉదానవాయువు శరీరమునుండి యుత్క్రమించునంతవఱకు నచట ప్రాణాదివాయువులుండును. అందుచే నావాయువు ప్రతిష్ఠయనియు వర్ణింపబడినది. ఇట్లు కల్పింపబడిన రూపకముచే ప్రాణమయకోశోపాసనము సుగమమగుచున్నది.

ద్వితీయానువాకము సమాప్తము

---

## తృతీయానువాకము

## (మనోమయకోశము)

అ॥ పురుషాకారముచే పరిదర్శింపబడిన ప్రాణమయకోశముయొక్క శ్రైష్ఠ్యము దిగువ శ్లోకమున వర్ణింపబడుచున్నది.

ప్రాణం దేవా అనుప్రాణన్తి । మనుష్యాః పశవశ్చయే । ప్రాణోహి భూతానామాయుః । తస్మాత్సర్వాయుషముచ్యతే । సర్వమేవ త ఆయుర్యన్తి యే ప్రాణం బ్రహ్మోపాసతే । ప్రాణో హి భూతానామాయుః । తస్మాత్సర్వాయుషముచ్యత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య॥

టీ:-అగ్నిమున్నగు దేవతలు వాయ్వాత్మకుడును ప్రాణన శక్తియుక్తుడును నగు ప్రాణము ననుసరించి ప్రాణనకర్మ చేయుచున్నారు. ఇంద్రియములన్నియు ముఖ్యప్రాణమువలన చలించుచున్నవి. మనుజులు, పశువులు ప్రాణముననుసరించియే చలించుచున్నారు. ప్రాణము భూతములకాయువు. అందువలన నది యందఱకును జీవనమని చెప్పబడుచున్నది. వెనుక జెప్పబడినయన్నమయాత్మునకు శరీరమునందున్నయీప్రాణమే యాత్మ.

తా. వి:- సత్వగుణప్రధానులగు నగ్నీంద్రాదిదేవతలు రజోగుణప్రధానులగు మనుజులు, తామసప్రవృత్తములగు గవాశ్వాదిపశువులు స్వస్వదేహవర్తియగు ప్రాణవాయువుయొక్క సంచలనముచేతనే ప్రాణవంతములగుచున్నవి. ఇంద్రియములుగూడ దానివలననే చేష్టావంతములగుచున్నవి. శరీరమునందు ప్రాణవాయు వున్నంతవఱకు మాత్రమాయుష్యముండును. అదిలేచిపోయినపుడు మరణము సంప్రాప్తమగును. అందువలన నాత్మభూతమగు శరీరమునం దాత్మభావమును వదలి ప్రాణమే యాత్మయని యుపాసించువారు దీర్ఘాయుష్మంతులై యపమృత్యువునుండి తొలగింపబడుచున్నారు. ప్రాణమయకోశమునం దాత్మత్వబుద్ధి స్థిరమయినపు డన్నమయకోశమునందలి యాత్మత్వబుద్ధి తొలగును. సాధకుని కట్టిప్రాణమయోపాసనమునం దాశకల్పించుటకై ఫలముగూడ నిచటనిరూపింపబడినది.

ప్రాణమయకోశము

అ॥ ఇట్లు ప్రాణమయకోశమున లగ్నమైనయాత్మత్వ బుద్ధిని తదాన్తరమగు మనోమయకోశమునకు మరల్చుటకై ప్రాణమయకోశముయొక్క పురుషవిధత్వమును వర్ణించుట మూలముగ మనోమయకోశము ప్రవేశపెట్టబడుచున్నది.

మూ:- తస్మాద్వా ఏతస్మాత్ ప్రాణమయాత్ । అన్యోఽన్తర ఆత్మా మనోమయః । తేనైష పూర్ణః ।

స వా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః । తస్య యజురేవశిరః । ఋగ్దక్షిణః పక్షః । సామోత్తరః పక్షః ఆదేశఆత్మా అథర్వాఙ్గిరసః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

టీ:- అన్నమయకోశమున కాత్మగా ప్రదర్శింపబడినను నశ్వరమగుటచే నీప్రాణమయకోశము నిజమగునాత్మకాదు. ప్రాణమయకోశమునకంటె సూక్ష్మతరమగు మనోమయాత్మ యొక్క పురుషవిధానము చూపబడుచున్నది. ప్రాణమయాత్మ పురుషాకారము ననుసరించి యీమనోమయుని పురుషవిధాన మేర్పడుచున్నది. ఆమనోమయాత్మకు యజుస్సుశిరస్సు, ఋక్కు దక్షిణపక్షము, సామము త్తరపక్షము; బ్రాహ్మణము ఆత్మ. అథర్వాంగిరసునిచే గనుంగొనబడిన మంత్రబ్రాహ్మణములు ప్రతిష్ఠాస్థానమగుపుచ్ఛము.

తా.వి:- మనోమయకోశము ప్రాణమయకోశముకంటె సూక్ష్మతరము. అందుచే ప్రాణమయకోశము మనోమయ కోశముచే పూర్ణమగుచున్నది. మనోమయ కోశము ప్రాణమయకోశమున కాత్మయగు చున్నది. సంకల్పవికల్పాత్మకమగున న్తఃకరణము మనస్సు. తన్మయము మనోమయకోశము. సత్త్వరజ

మనోమయాదికోశ స్వరూపము

స్తమోగుణాత్మకమగు ప్రకృతియే జగత్కారణము. అన్నమయ కోశము తమః ప్రధానమగుటచే జాడ్యావిష్టమగుచున్నది. క్రియాజ్ఞానశక్తులచటగానరావు. ప్రాణమయకోశము రజోరూపమగుటచే నది క్రియాప్రధానమగుచున్నది. తమోమిశ్రితమగుసత్త్వగుణము మనోమయకోశకారణమగుటచే నాకోశము రాగద్వేషాదులకు స్థానమగుచున్నది. రజోమిశ్రితసత్త్వగుణము విజ్ఞానమయకోశమై యజ్ఞాదిశ్రౌతస్మార్తక్రియలయందు కృష్యాదిలౌకిక క్రియలయందును కర్తృత్వము వహించుచున్నది. శుద్ధసత్త్వగుణజన్యమగునానందమయకోశము ప్రియాదిసుఖవిశేషముల ననుభవించుచున్నది. జ్ఞానశక్తి స్వరూపముచే నొకటియైనను క్రియాశక్తి, కర్తృత్వశక్తి, భోగశక్తియని త్రివిధమగుచున్నది. క్రియాశక్తిజన్యమగుకామసంకల్పాదివృత్తిసమూహమే మనోమయకోశము.

మనోమయకోశము ప్రాణమయకోశముకంటె సూక్ష్మతరమై ప్రాణమయకోశమున సర్వత్రవ్యాపించి దానికి సన్నిహితముగానున్నది. మనోమయకోశమునందాత్మచైతన్య మభివ్యక్తమగుటవలన నది సర్వాన్తరమై ప్రాణమయకోశమున కాత్మయని చెప్పబడుచున్నది. ప్రాణశక్తివలెనే జ్ఞానశక్తికూడ శరీరమంతయు వ్యాపించియున్నది. ఇచట మనశ్శబ్దముచేత బాహ్యములగు కర్మేన్ద్రియపంచకము, జ్ఞానేన్ద్రియపంచకము కలిసిన దశావయవములుకూడ నవగతమగుచున్నవి. ఇవి మనోమయ

మనోమయకోశము సర్వాంతరము

కోశముయొక్క యన్తర్భాగము ను. ఈయుస్ద్రియములు ప్రాణముకంటె భిన్నములు.

మనోమయకోశమునకు యజుర్వేదము శిరస్సు; ఋక్కులు దక్షిణపక్షము; సామముత్తరపక్షము. బ్రాహ్మణమాత్మ; అధర్వణవేదము ప్రతిష్ఠారూపమగుపుచ్ఛము.

మనోమయకోశ పురుషవిశత్వము

యజుర్వేదమంత్రములు యాగాదులయం దధికముగా నుపయోగింపబడును. వానిచే స్వాహాకారపూర్వకముగ హవిస్సు హోమము చేయబడును. అందువలన యజుర్వేదము ప్రధానమై శిరస్సని వర్ణింపబడినది.

యజుస్సనునది యానామముతో వ్యవహరింపబడు శబ్ద విశేషరాశి. ఈశబ్దవిశేషరూపమగుమనోవృత్తివిశేషము యజుశ్శబ్దముచే సూచింపబడుచున్నది. విశిష్ట

యజురాదుల నిత్యత్వము

ములగు పదములు వాక్యములు ఉదాత్తాదిస్వరములు, తాల్వాద్యుత్పత్తిస్థానములు, ధ్వనివిశేషములు, అకారాదివర్ణములు, ఉచ్చారణాప్రయత్నములచే విశిష్టమగు వాక్యసమూహముచే ననురంజితమై శ్రోత్రవేద్యమై యీశ్వరజ్ఞానసంద్యబ్ధమై శ్రోత్రద్వారమున యజుస్సను ప్రత్యేకభావముతో గ్రహింపబడు మనోవృత్తులు యజుస్సన బడుచున్నవి. ఈవిధముననే ఋక్సామములకుగూడ విశిష్టలక్షణములు గ్రహింపనగు. ఇట్లు మన్త్రములన్నియు మనోవృత్తిరూపము లగుచున్నవి. మనోవృత్తులన్నియు నాత్మచైతన్యసముపేతములు గనుక యజురాదిశబ్దవాచ్యమగు శబ్దరాశి యాత్మవిజ్ఞానమే యగుచున్నది. అందువలన వేదములకు నిత్య

త్వము సిద్ధించుచున్నది. శాంతికపౌష్టికాది ప్రతిష్ఠలకు కారణమగుకర్మము ప్రధానమగుటంజేసి యథర్వాణవేదము పుచ్ఛమని ప్రస్తావింపబడినది.

తృతీయానువాకము సమాప్తము

---

## చతుర్థానువాకము

### (విజ్ఞానమయకోశము)

అ॥ కోశాత్మత్వబుద్ధిని క్రమముగ తొలగించు విద్యాప్రణాళికయందు మనోమయకోశము మూడవఘట్టము. మనోమయకోశ మాత్మయని యుపాసనముచే ప్రాణమయకోశమునం దాత్మత్వబుద్ధి తొలగుచున్నది. పూర్వానువాకాన్తమునం దుదాహరింపబడిన మనోమయమాత్మయని వర్ణించుశ్లోకమును శ్రుతి వివరించుచున్నది.

మూ:- యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ। ఆనందం బ్రాహ్మణో విద్వాన్ । న బిభేతి కదాచనేతి ।

తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య॥

టీ:- ఏ యానందస్వరూపుని బొందలేక వాక్కులు మనస్సుతోగూడ నతనినుండి మరలివచ్చుచున్నవో యట్టి బ్రహ్మముయొక్క స్వరూపభూతమగు నానందమునుగూర్చి మనోమయకోశోపాసకు డెప్పుడును భయపడఁడు.

పూర్వమగుప్రాణమయాత్మకు దానియందు పుట్టినమనోమయాత్మ యితడే.

తా. వి:- ఏపరబ్రహ్మమును బొందలేక శబ్దములు, మనస్సుగూడనివర్తించుచున్నవో యట్టి యానందస్వరూపమగు పరబ్రహ్మమును మనోమయోపాధివిశిష్టముగ నుపాసించువాడెప్పుడును భీతినిజెందడు. నామరూపాత్మకమగువస్తువులను మనస్సింద్రియసహాయముచే గ్రహింపగలదు. మనోవిషయములన్నియు శబ్దములచే వర్ణింపబడుచున్నవి. పరబ్రహ్మము నామరూపరహితమగుటంజేసి ఘటపటాదులవలె నద్దానిని మనస్సు తెలిసికొనలేదు. అందువలన దాని వాగాదీన్ద్రియములచే వర్ణింపనలవిగాదు.

మనోమయ కోశాత్మత్వము

మనోమయకోశము ప్రాణమయకోశమునంతటను వ్యాపించుటచే దానికది యాత్మయగుచున్నది. మనోమయబలముచే ప్రాణమయము క్రియావంతమగుచున్నది. అందువలన దానికది యాయుస్సగుచుసర్వాయువమని చెప్పబడుచున్నది.

అ॥ ఉపాసకుని మనస్సును మనోమయకోశమునుండి మరల్చి యన్తఃప్రవిష్టముజేయుటకై విజ్ఞానమయకోశము ప్రస్తావింపబడుచున్నది.

మూ:- తస్మాద్వా ఏతస్మాన్మనోమయాత్ । అన్యోఽన్తర ఆత్మా విజ్ఞానమయః । తేనైష పూర్ణః ।

సవా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః । తస్య శ్రద్ధైవ శిరః । ఋతం దక్షిణః పక్షః । సత్యముత్తర పక్షః । యోగ ఆత్మా । మహః పుచ్ఛం ప్రతిష్ఠా । తదప్యేష శ్లోకో భవతి॥

టీ:- ఆ ప్రాణమయుని కాత్మభూతుడయినమనోమయాత్మకంటె వేఱయినట్టియు, అభ్యంతరుడైనట్టియు మనోమయునకు ఆత్మభూతుడైనవాడు విజ్ఞానమయుడు. విజ్ఞానమయాత్మచేత నీమనోమయాత్మ పూర్ణుడగుచున్నాడు.

విజ్ఞానమయాత్మ పురుషవిధముగలవాడు. మనోమయాత్మపురుషవిధత్వము ననుసరించియే విజ్ఞానమయునిపురుషవిధత్వము చెప్పబడుచున్నది. విజ్ఞానమయునకు శ్రద్ధయే శిరస్సు, ఋతసత్యములు దక్షిణోత్తరపక్షములు. సమాధానమాత్మ; మహత్తత్త్వము పుచ్ఛము.

తా. వి:- విజ్ఞానమయకోశము మనోమయకోశముకంటె నభ్యంతరము, సూక్ష్మతరము. మనోమయకోశము విజ్ఞానమయునిచే పూర్ణమయియున్నది.

విజ్ఞానమయకోశస్వరూపము

మనోబుద్ధ్యహంకారచిత్తములని యన్తఃకరణము నాలుగువిధములు. సంశయాత్మకమగునది మనస్సు. మంచిచెడుగులనది వితర్కించును. నిశ్చయాత్మకమగునది బుద్ధి. ఇది మంచి యిదిచెడుగని బుద్ధి నిశ్చయించును. అభిమానాత్మకమగునది యహంకారము. చేతనాత్మకమగునది చిత్తము. మనస్సుచే మననముజేయుచున్నాము. బుద్ధిచే దెలిసికొని నిశ్చయించుచున్నాము. అహంకారముచే నహంకర్తృత్వమును వహించుచున్నాము. చిత్తముచే చైతన్యము ననుభవించుచున్నాము. ఈవృత్తిచతుష్టయము మనస్సుయొక్క వ్యాపారవిశేషమగుచున్న

సత్త్వగుణకార్యమగు జ్ఞానశక్తియందలి తమోమిశ్రభాగము రాగద్వేషాదిధర్మోపేతమై మనస్సైనట్లు రజోమిశ్రభాగము కర్తృత్వధర్మోపేతమై విజ్ఞానమగుచున్నది. ఈవిజ్ఞానమే 'నేను' కర్త యను విశిష్టవృత్తిజ్ఞానమును గ్రహించును. విజ్ఞానవికారమే విజ్ఞానమయకోశము.

విజ్ఞానమయ పురుషవిధత్వము

కర్తవ్యాదులను నిశ్చయించునది విజ్ఞానమయకోశము. యజురాదినిశ్చయజ్ఞానము విజ్ఞానమయుని కుండుటచేతనే, యతనికి కర్తృత్వము సిద్ధించుచున్నది. నిశ్చయజ్ఞానమున్నపుడే కర్తవ్యములయందు శ్రద్ధ గలుగును. కనుకనే శ్రద్ధ విజ్ఞానమయుని శిరస్సని వర్ణింపబడినది. యథాశాస్త్రీకజ్ఞానము ఋతము. కరచరణాదులచే శాస్త్రోక్తమునాచరించుట సత్యము. ఈరెండును విజ్ఞానమయునకు దక్షిణోత్తరపక్షములు. యోగ మన చిత్తవృత్తిసమాధానము. అదిలేని దేవిషయమును లెస్సగనాచరింపలేము. అందుచే నది యాత్మయని చెప్పబడుచున్నది. సర్వవిజ్ఞానములకు ప్రతిష్ఠాకారణమగు మహత్తత్త్వము పుచ్ఛమని పిలువబడుచున్నది.

చతుర్థానువాకము సమాప్తము

---

## పంచమానువాకము

### (ఆనందమయకోశము)

అ॥ విజ్ఞానమయబ్రహ్మోపాసనాఫలము దిగువశ్లోకముచే ప్రస్తావింపబడుచున్నది.

మూ:- విజ్ఞానం యజ్ఞం తనుతే । కర్మాణి తనుతేఽపి చ । విజ్ఞానం దేవాస్సర్వే । బ్రహ్మ జ్యేష్ఠముపాసతే । విజ్ఞానం బ్రహ్మచేద్వేద । తస్మాచ్చేన్న ప్రమాద్యతి । శరీరే పాప్మనో హిత్వా । సర్వాన్కామాన్ సమశ్నుత ఇతి । తస్యైష ఏవ శారీర ఆత్మా । యః పూర్వస్య॥

టీ:- విజ్ఞానము యజ్ఞమును చేయుచున్నది. మఱియు లౌకికకర్మల నాచరింపుచున్నది. దేవతలందఱు నన్నిటికంటె పెద్దదియగు విజ్ఞానబ్రహ్మము నుపాసించుచున్నారు. విజ్ఞానమును బ్రహ్మముగా తెలిసికొని యావిజ్ఞానబ్రహ్మమునుండి ప్రమాదముచెందనివాడు శరీరమునందుగలపాపములను వదలి సమస్తకోరికలను పొందుచున్నాడు.

ఇపుడు చెప్పబడుచున్న విజ్ఞానమయుడే మనోమయశరీరమునందు పుట్టినమనోమయాత్మ యగుచున్నాడు.

తా. వి:- విజ్ఞానవంతుడు శ్రద్ధాపురస్సరముగ యజ్ఞాది వైదికకర్మలను కృష్యాదిలౌకికకర్మల నాచరించుచున్నాడు.

విజ్ఞానమయబ్రహ్మోపాసనము

సమస్తక్రియాజాలము విజ్ఞానపూర్వకమగుటచే విజ్ఞానమయుడు మనోమయాత్మగా చెప్పబడుచున్నాడు. విజ్ఞానము సర్వప్రవృత్తులకు కారణమగుటచే సమస్తదేవతలద్దాని బ్రహ్మస్వరూపమున నుపాసించుచున్నారు. వారలందువలన జ్ఞానైశ్వర్యసంపన్నులగు

చున్నాడు. అన్నమయాదులాత్మకావు. విజ్ఞానమయుడే బ్రహ్మమని ప్రమాదరహితమగు జ్ఞానముగలిగి విజ్ఞానమయబ్రహ్మోపాసనము జేసినవానికి నేను బ్రాహ్మణుడను, గృహస్థుడను, కర్తనను మొదలగునామరూపాభిమానములు నశించి భావిజన్మరూపమగుదుఃఖమునకు హేతువులగు సమస్తపాపములు తొలగును. బ్రహ్మలోకమున సంకల్పమాత్రముచేతనే సంపాద్యములగు సర్వభోగములమరును. ఆలోకమున బ్రహ్మజ్ఞానోదయము గలిగి ముక్తుడగుచున్నాడు. ఈవిజ్ఞానమయుడు మనోమయుని కాత్మయగుచున్నాడు.

అ॥ విజ్ఞానమయునియందాత్మత్వబుద్ధిని తొలగించుటకై యానందమయుడు ప్రవేశపెట్టబడుచున్నాడు.

మూ:- తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాత్ । అన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః । తేనైష పూర్ణః । స వా ఏష పురుషవిధ ఏవ । తస్య పురుషవిధతామ్ । అన్వయం పురుషవిధః । తస్య ప్రియమేవ శిరః । మోదో దక్షిణః పక్షః । ప్రమోద ఉత్తరః పక్షః । ఆనంద ఆత్మా । బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా। తదప్యేష శ్లోకో భవతి॥

టీ:- మనోమయాత్మయగు విజ్ఞానమయునికంటె నితరుడు, అంతరుడునగువా డానందమయుడు. ఆనందమయుని చేత నీవిజ్ఞానమయుడు పరిపూర్ణుడైయున్నాడు. ఈయానందమయుడు పురుషవిధముగలవాడు. విజ్ఞానమయునియొక్క పురుషాకారత్వమునను సరించి యానందమయుడు పురుషవిధుడగుచున్నాడు. ఆనందమయునకు ప్రియముశిరస్సు; మోదప్రమోదములు దక్షిణోత్తరపక్షములు. ఆనందమాత్మ; బ్రహ్మము పుచ్ఛము.

తా.వి:- ఆనందమయకోశము విజ్ఞానమయకోశము కంటె నాంతరము సూక్ష్మము నగుచున్నది. వస్తువునాధారము చేసికొనని యానందము నిర్వికారము.

ఆనందమయము విజ్ఞానమునకాత్మ

అయినను అన్తఃకరణముయొక్క సత్త్వ ప్రధానమగు వృత్తులచేత ఘటాంతర్గతమగు నాకాశమువలె నియమితమైనపు డది ప్రియమోదాదిరూప ములచే వికారము నొందును. ఇట్టిప్రియమోదాదిసమూహమే యానందమయుడని చెప్పబడుచున్నది. ఆనందమయుడు విజ్ఞాన మయముకంటె భిన్నుడు. అతనికి కర్తృత్వము లేదు. అతడు భోక్తృస్వరూపుడు. విజ్ఞానమయ మానందమయునిచే నిండి యున్నది. శరీరమునందంతటను ప్రాణమయకోశము వ్యాపించి యున్నది. ప్రాణముతోగూడిన దేహమునందంతటను మనః కార్యభూతమగు చేతనజ్ఞానశక్తి వ్యాపించియున్నది. మనఃప్రాణ ములతోగూడిన శరీరమునందంతటను విజ్ఞానమయాత్మకమగు కర్తృత్వాభిమాన మావరించియున్నది. విజ్ఞానమనఃప్రాణ విశిష్టమగు నీకళేబరమునందంతటను హస్తపాదాదులయం దానందాత్మకమగు సుఖవిశేష మనుభవింపబడుచున్నది. ఇట్లన్నమయ ప్రాణమయ మనోమయవిజ్ఞానానందమయములలో నుత్తరోత్తరకోశము, పూర్వపూర్వకోశము నావరించి శరీ రమునందంతటను పూర్ణమైయున్నది. సుఖమువలెనే దుఃఖము గూడ ననుభవింపబడుచున్నది. కాని దుఃఖము మనోమయ ధర్మము. సుఖమానందమయధర్మము.

ఆనందము దుఃఖాభావము గాదు. అది భావరూపము. (Positive Existence). వీణానాదమును వినినపుడొక విలక్షణ మగు నానందానుభవము గల్గుచున్నది.

ఆనందము దుఃఖాభావముకాదు

దుఃఖాభావమే యానందమనునెడల వీణానాదము వినునపుడు పూర్వానుభూత దుఃఖజ్ఞానము స్మృతికి రావలయును. ఘటము లేనిసమయమున గూడ దృష్టపూర్వమగు ఘటము స్మరింపబడుచునే యున్నది. సుఖమునను భవించునపుడు పూర్వానుభూతదుఃఖము జ్ఞాపకమునకువచ్చుటలేదు. నిరతిశయానందము వస్త్వంతరముచే గలుగదు. లౌకికానందము వస్త్వధీనము. వస్తువు లేనపుడది యుండదు. అది నిరతిశయానందము కాదు. కాని దానియంశమాత్ర మగుచున్నది.

ఇట్టినిరతిశయానందస్వరూపము విచారింపనగు. బ్రహ్మాభిన్నమగునాత్మ యానందస్వరూపము. ఆత్మ యత్యంతము ప్రేమాస్పదము. ఆత్మార్థము భార్యాపుత్రాదులు ప్రియులగుచున్నారు. ఆత్మ

ఆనందస్వరూపము

యందలి ప్రేమ యన్యార్థముగాదు. ఆత్మేతరములయందలి ప్రేమ యాత్మకొరకగును. పసిబిడ్డ యేడ్చుచున్నను కఱకుగడ్డముతో నద్దాని తండ్రి ముద్దాడును. భూమపదార్థమే సుఖమని యుపదేశింపబడినది(1). నిరతిశయమగుపూర్ణత్వమే భూమశబ్దార్థము. అదియే బ్రహ్మశబ్దార్థము గూడనగుచున్నది. ఎచట ద్రష్ట దృశ్యము దర్శనము మొదలగు త్రిపుటిభేదము లేదో

(1) యో వై భూమా తత్సుఖం నాల్పే సుఖమస్తి. (ఛాం 7-2-41)

అదియే భూమము. అట్టి త్రిపుటీవిరహితమగు నద్వైతమే పర బ్రహ్మము. అది నిర్భయము. ద్వైతమెప్పుడును భయకారణమే యగును. నిర్భయమగుటచే నద్వైతము పరమసుఖము. స్వస్వరూపమే యద్వైతము. తనవలన తనకెన్నడును భయము గలుగనేరదు. ద్వైతము దుఃఖము ద్వైతభూయిష్ఠములగు జాగ్రత్స్వప్నములయందు దుఃఖానుభవము సుషుప్తియందలి కేవలసుఖానుభవము లోకవిదితము.

ఆనందమయుడు కార్యరూపము బ్రహ్మానందము కంటె భిన్నము

పుత్రకళత్రాద్యుపాధినాధారము చేసికొని ప్రవర్తించు చున్న యానందరూపమగు ప్రియమోదాదిసమూహ మానంద మయకోశము. అందువలన నానందమయ కోశము నిరుపాధికమగు సాక్షాదానంద స్వరూపము కానేరదు. ఇచట మయట్ శబ్దమునకు వికారమర్థము. ఆనందవికార మానందమయము. సృష్ట్యనంతర మీయానందమయునియందు సృష్టికర్త ప్రవేశించినాడని శ్రుతి(1) వినబడుచున్నది. ఆనంద మయుడే యాత్మయినచో తన్నుతాను ప్రవేశించుట యసంభ వము. గృహమునకు వెలుపలనున్నవాడు గృహమును ప్రవే శింపగలడుగాని గృహాన్తర్వర్తియగువా డద్దాని ప్రవేశింపలేడు. పరబ్రహ్మము నిర్గుణము బుద్ధికగోచరము. ఆనందమయుడు ప్రత్యక్షముగ భోక్తృరూపమున ననుభూయమానుడై 'ఇది బ్రహ్మము కాదు', 'ఇది బ్రహ్మము కాద'ని(2) త్రోసివేయ

(1) ఆనందమయమాత్మానముపసంక్రామతి (తై 2-8)
(2) నేతినేత్యాత్మా (బృ 3-9-26)

బడు చున్నాడు. ప్రత్యక్షముగ గోచరమగుచున్న యానంద మయునకు శిరము మొదలగునవయవకల్పనము సాధ్యముగాని యగోచరమగు బ్రహ్మమున కదిసాధ్యముగాదు. బ్రహ్మోపాసన మునకు ప్రతీకగా బోధింపబడుచున్న యానందమయుడు బ్రహ్మేతరము గావలయును. ఇంద్రియములకగోచరమగునది ప్రతీకగా నాలంబనార్హము కానేరదు. నిరుపాధికమగు పర బ్రహ్మ మొకటియే సమస్తజగత్తునకు ప్రతిష్ఠాస్థానము కాగల దని పరబ్రహ్మముయొక్క ప్రతిష్ఠానత్వము గూడ చెప్పబడినది.

విజ్ఞానమయునియందు లగ్నమైన యాత్మత్వబుద్ధిని తొలగించుటకై యుపాయముగ బోధింపబడిన యానందమయుని బ్రహ్మభావమున నుపాసించుటకై పూర్వము వలెనే యిచటగూడ నతనికి పురుషవిధత్వము రూపకముచే వర్ణింపబడుచున్నది.

ఆనందమయుని పురుషవిధత్వము

ఆనందమయుడు పూర్వోదాహృతములగు నన్నమయాదికోశములకంటె నాన్తరతము. విద్యాకర్మఫలములగు ప్రియమోదాదు లానందమయశబ్దమునందలి యానందశబ్దముచే నవగతములగుచున్నవి. ప్రియమోదములకు గలయాత్మసన్నికర్షముచే నానందమయు మితరకోశములకంటె నాన్తరతమమగుచున్నది. ఆనందమయునకు ప్రియము శిరస్సు. ఇష్టులగుపుత్త్రాదుల దర్శనముచే గలుగుసుఖము ప్రియము. ప్రియలాభముచే గలుగుసంతోషము మోదము. లభ్యమయినదాని యనుభవముచే గలుగు ప్రకృష్టమోదము ప్రమోదము. ఆనందమయునకు మోదప్రమోదములు దక్షిణోత్తరపక్షములు,

ఆనందమాత్మ. వివిధసుఖము లుపాధినిమిత్తములగుటచే విభిన్న స్వరూపకము లగుచున్నవి. ఆనందము వీనికన్నిటికిని సామాన్య రూపము. ప్రియమోదాదుల నదియనుసరించియున్నది. పర బ్రహ్మమే నిజమైనయానందము. అది నిరుపాధికము. నిరతి శయము. అది సోపాధికమగునప్పు డాచరింపబడు కర్మలతార తమ్యముచేతను, మనుష్యాదిభేదముచేతను ప్రసన్నమగు నన్తః కరణమున నదియభివ్యక్తమగును. కర్మఫల మగుస్వర్గాది సుఖముగూడ యానందాంశము, కర్మాధీనమగుటచే ననిత్యము నగుచున్నది. అన్తఃకరణము తమోవినాశకమగుతపస్సుచేతను, జ్ఞానముచేతను, బ్రహ్మచర్యముచేతను, శ్రద్ధచేతను నెంతెంత వరకునిర్మలమగుచున్నదో యంతంతవర కది ప్రసన్నమై యచట నానందవిశేషము విపులతరమగును. శ్రోత్రియత్వము, అకా మహతత్వము నిట్టినిరతిశయసుఖోన్నతికి పరమావధి యగు చున్నవి. ఆనందమయుని కాత్మయగునానందము తన్మయ కోశముకంటె భిన్నమే యగును. ఈయానందమే పరబ్రహ్మము. ఆపరబ్రహ్మమే ప్రకృతవల్లీవిషయమై సత్యాదిశబ్దములచే లక్షితమగుచున్నది. అది కోశపంచకేతరము. దానిచేతనే నీ కోశపంచక మాత్మవంతమగుచున్నది. దానినుపదేశించుట కొఱకే పంచకోశముల నొకదానితరువాతనొకదానిని యబ్ర హ్మాత్వప్రదర్శనముచే త్రోసిపుచ్చుటకుపాయముగా నిచట కోశోపాసనము బోధింపబడినది. పూర్వపూర్వకోశమున కుత్త రోత్తరకోశ మాత్మయని వర్ణించుటలో పూర్వపూర్వకోశము లాత్మగావని త్రోసిపుచ్చుటయందే తాత్పర్యముగాని యుత్త

రో త్తరకోశము నిజముగా యాత్మయని యుపదేశించుటయందు తాత్పర్యము గాదు. పరబ్రహ్మ మానందమయు డగుజీవునకు ప్రతిష్ఠాభూతమగు పుచ్ఛమగుచున్నది. అదియే యవిద్యాకల్పిత మగుసర్వద్వైతభావమునకు నవసానస్థానము.

పంచమానువాకము సమాప్తము

---

## షష్ఠానువాకము

అ॥ బ్రహ్మము సత్యజ్ఞానానంతాది లక్షణములచే సూచింపబడినది. దానిరెుుక- యాత్మానన్యత్వము హార్దాకాశమునం దద్దానియుపలభ్యమానత్వము ప్రదర్శింపబడినది. పంచకోశములే యాత్మయను నజ్ఞానకల్పితమగు నభినివేశమును తొలగించునుపాయము విపులీకరింపబడినది. బ్రహ్మమానంద స్వరూపము, సమస్తజగదాధారమనియు వినిపింపబడినది. ఇట్లు సర్వప్రతిష్ఠాభూతము నిరుపాధికమునగు బ్రహ్మజ్ఞానము మననముచే స్థైర్యమొందవలసియున్నది. అందుకొరకు బ్రహ్మాస్తిత్వము మరొకపర్యాయము దిగువశ్లోకమున నిగమనము చేయబడుచున్నది.

మూ:- అసన్నేవ స భవతి । అసద్బ్రహ్మేతి వేద చేత్ । అస్తి బ్రహ్మేతి చేద్వేద । సంతమేనం తతో విదురితి॥

టీ:- ఎవ్వడైనను బ్రహ్మము లేదని తెలిసికొనినవాడు స్వయముగా లేనివాడేయగుచున్నాడు. బ్రహ్మము గలదని యెవడయినను తెలిసికొనినయెడల నాకారణముచే నతనిని సత్పురుషునిగా దెలిసికొనుచున్నారు.

తా. వి:- బ్రహ్మము లేదనితలంచువాడు స్వయముగ నసత్పురుషుడై పురుషార్థమును గోల్పోవును. అన్నమయాది కోశము లాత్మయనుజ్ఞానము పోయిన

బ్రహ్మాస్తిత్వమును నమ్మిన వానికి తద్దర్శనమగును

దనుకొనినను సామాన్యజనునకు ప్రత్యక్ష ప్రమాణముచే మఱియొక బ్రహ్మమున్న దనుజ్ఞానము గలుగుటలేదు. తానే బ్రహ్మమనుజ్ఞానము కుదురుటలేదు. కనుక బ్రహ్మము లేదనుచున్నాడు. అట్టివాడుండినను లేనివాడే యగుచున్నాడు. "బ్రహ్మమనునది యొకటి యున్నది. త్రాటినాధారము జేసికొని సర్పభ్రాంతికలిగినట్లు బ్రహ్మము నాధారముజేసికొని జగద్భ్రాంతి గల్గుచున్నది; సర్వ ప్రవృత్తికి నదియే కారణము; అది నిర్విశేషము." ఇట్లు బ్రహ్మ స్వరూపమును తెలిసికొనినవా డాస్వరూపముననున్న సత్పురుషుడని బ్రహ్మవిదులు భావింపుచున్నారు. బ్రహ్మము లేదని భావించువాడు వర్ణాశ్రమాదివ్యవస్థాలక్షితమగుసన్మార్గమునకు దూరుడై నాస్తికుడగుచున్నాడు. అతడు బ్రహ్మమును పొందలేడు. అందుచే బ్రహ్మమున్నదనియే తెలిసికొనదగును. అదియే నాత్మోపలబ్ధికి ముఖ్యమగుమార్గము. లేదనుకొను వస్తువుకొరకు ప్రయత్నముచేయము. బ్రహ్మము లేదనుకొనిన వానికి నాధ్యాత్మికచింతన మసంభవము.

అ॥ బ్రహ్మాస్తిత్వబోధకమగు శాస్త్రశ్రవణముచే నద్దాని పరోక్షజ్ఞానము గుదురుచున్నది. దాని యపరోక్షజ్ఞానమునకు మననిదిధ్యాసము లవసరము. శ్రవణముచేసినదానిని శ్రుతి సమ్మతమగుయుక్తిచే విచారణము సేయుట మనన మనబడును. శ్రవణముచే నాపాదించినజ్ఞానము మననమువలన సర్వసంశయ విరహితమై స్థైర్యమునొందును. ఆత్మదర్శనమునకు శ్రవణము ప్రథమసోపానము. మననము ద్వితీయసోపానము. ఇట్టిమనన ప్రకారము రాబోవుగ్రన్థమున వివరింపబడుచున్నది.

మూః- అథాతోఽనుప్రశ్నాః । ఉతావిద్వా నముం లోకం ప్రేత్య । కశ్చన గచ్ఛతీ । ఆహో విద్వా నముం లోకం ప్రేత్య । కశ్చిత్సమశ్నుతా ఉ।

టీః- ఆచార్యోపదిష్టమగు బ్రహ్మముయొక్క పరోక్ష జ్ఞానముననుసరించి దిగువప్రశ్నలు గలుగుచున్నవి.

(1)అవిద్వాంసు డీలోకమునుంచిబోయి యీపరబ్రహ్మ మును బొందునా? లేక పొందడా? (2) విద్వాంసుడగువాడు మరణించి యీపరబ్రహ్మమును బొందునా? లేక పొందడా?

తా. వి:- పూర్వపూర్వకోశముయొక్క యనాత్మత్వ బుద్ధిచే నుత్తరోత్తరకోశమున బుద్ధిని ప్రవేశపెట్టి తుదకు సర్వ కోశము లాత్మగావని త్రోసిబుచ్చి బుద్ధిని హార్దాకాశమున నంతఃప్రవిష్టము జేసి బ్రహ్మదర్శనముచేయు నుపాసనారూపమగునుపాయము గడచిన వల్లీపంచకమున విస్తరింపబడినది. ఇట్టి యుపాసనము పరిపక్వము సంపూర్ణము కాకపూర్వమే మరణిం చినవానికి చేసినయుపాసనము వ్యర్థముకాదనియు దానివలన

ఉపాసనముయొక్క వివిధప్రయోజనములు

ప్రత్యేకఫలము గలదనియు చూపుటకు కోశబ్రహ్మోపాసనా ఫలము ప్రత్యేకముగ తెలియజేయబడినది. ఇట్టికోశబ్రహ్మోపాసనము బ్రహ్మదర్శనమునకు సహాయకారియగుచున్నది. నిశ్శేషవిశేషవిరహితమగు పరబ్రహ్మమును హార్దాకాశమున గుర్తెఱింగినతరువాత దానిస్వరూపము ననవరతము బుద్ధియందు నిలుపవలెను. ఇది చిరకాలాభ్యాససాధ్యము. ఇదియే నిదిధ్యాసనమనబడుచున్నది. బ్రహ్మదర్శనమునకు పరంపరాసాధనమగు నిట్టియుపాసనము క్రమముక్తిహేతువగు నిర్గుణబ్రహ్మోపాసనముకంటె భిన్నము. ఉపాసనాతత్త్వము శిక్షావల్లిచతుర్థానువాకమున విరళింపబడినది. చదువరులీసందర్భమున నా వివరణమును జ్ఞాపకమునకు తెచ్చుకొనగలరు.

శ్రవణానంతరముగలుగు ప్రశ్నలు

బ్రహ్మజ్ఞానోపదేశకమగు ప్రథమవల్లీపంచకమును శ్రవణముచేసినతరువాత మననకాలమునందీప్రశ్నలు విచారణీయములగుచున్నవి. (1) బ్రహ్మమను నదియున్నదా? లేదా? బ్రహ్మమన్నివస్తువులలో సమానమేగనుక (౨) బ్రహ్మజ్ఞానములేని వాడాబ్రహ్మమును బొందునా? పొందడా? (౩) అతడద్దాని బొందనిచో జ్ఞానిగూడ దానిబొందునా? పొందడా?

అ॥ ఈ మూడు ప్రశ్నలకు ప్రతివచనము సెప్పుటకై యుత్తరగ్రంథము ప్రవర్తించుచున్నది.

మూ:- సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా। ఇదగ్ం సర్వమసృజత। యదిదం కించ। తత్సృష్ట్వా

తదేవానుప్రావిశత్ । తదనుప్రవిశ్య । సచ్చ త్యచ్చాభవత్ । నిరుక్తం చానిరుక్తం చ । నిలయనం చానిలయనం చ । విజ్ఞానం చావిజ్ఞానం చ । సత్యం చానృతంచ సత్యమభవత్ । యదిదం కించ । తత్సత్యమిత్యాచక్షతే । తదప్యేష శ్లోకోభవతి॥

టీ:- నేననేకముగా కావలయును, పుట్టవలయు'నని యాబ్రహ్మము గోరెను. ఇట్లుకోరి యాబ్రహ్మము తపస్సుజేసెను. తపస్సుజేసి యీకనబడుచున్న సమస్తజగత్తును సృజియించెను. ఈకనుబడుచున్న దేదిగలదో దానినంతయు సృష్టించి సృజియించినదాని ననుసరించి తాను దానిని బ్రవేశించెను. సృజియింపబడిన ప్రపంచమును బ్రవేశించి మూర్తము, అమూర్తము అయ్యెను. అవియెవ్వనిన, నిరుక్తము, అనిరుక్తము, నిలయనము, అనిలయనము, విజ్ఞానము, అవిజ్ఞానము, సత్యము, అనృతములు. మూర్తామూర్తాదికమంతయు బ్రహ్మమేయని బ్రహ్మవేత్తలు పలుకుచున్నారు.

తా. వి:- బ్రహ్మస్తిత్వము సిద్ధమైనపుడుమాత్ర మితర ప్రశ్నముల కవకాశముగలదు. ప్రథమానువాకమున జేయబడినసృష్టిక్రమవర్ణనముచే నీప్రశ్నకుత్తరము గొంతవరకీయబడినది.

బ్రహ్మము జగత్కారణమగుటచే నుండితీరవలయును

బ్రహ్మముసత్యమని యచట జెప్పబడినది. సత్యాస్తిత్వములు రెండును బర్యాయపదములు. సత్యమగువస్తు వవశ్యముండితీరవలయును. బ్రహ్మము ప్రత్యక్షముగా లభ్యమగుటచే నది లేదని చెప్పవీలులేదు. బ్రహ్మమాకాశాదికారణమని 2-1 మంత్రమున జెప్పబడినది. ప్రత్యక్షముగ కనబడుచున్న జగత్కార్యము కారణములేక పుట్ట

నేరదు. కారణము శూన్యమైనచో దానివలననుత్పన్నమగు కార్యముగూడ శూన్యమయి యుపలభ్యముకాకపోవలయును. జగత్తు వ్యవహారమునం దుపలభ్యమగుటచే నద్దానికారణమగు బ్రహ్మమున్నదని చెప్పుటన్యాయము. ఇట్లనుటచే జగత్తు సత్యమని భ్రమపడవలదు. ఐంద్రజాలికవిద్యవలె ప్రత్యక్షముగ నుపలభ్యమానమగువస్తు వసత్యముగావచ్చును. జగత్తసత్యము, మాయాకల్పితము, భ్రమమాత్రమునగుచున్నది. అధిష్ఠానమున్నపుడే భ్రమ కవకాశము గలదు. త్రాడులేని సర్పభ్రాన్తి శక్యముగాదు. వ్యవహారమునందు భ్రాన్తికిగూడ నస్తిత్వలోపములేదు. కాని యాయస్తిత్వము పారమార్థికాస్తిత్వము గాదు.

బ్రహ్మాస్తిత్వమను బునాదిమీద నద్వైతసిద్ధాన్తసౌధము నిర్మింపబడినది. బునాది సుప్రతిష్ఠితమయినపుడే పయికట్టడము దృఢముగానుండగలదు. అందువలన సర్వప్రతిష్ఠాభూతమగు బ్రహ్మాస్తిత్వమింతకు పూర్వము కొంతవరకు వివరింపబడినను నిపుడది దృఢముజేయబడుచున్నది. ఘటాదికార్యమునకు మృదాదిద్రవ్యము, కులాలాదినిమిత్తము నను రెండుకారణములు గాన్పించుచున్నవి. జగత్కార్యమునకట్టి కారణద్వయము కాన్పించుటలేదు. బ్రహ్మమను నొక్కకారణముమాత్రము చెప్పబడుచున్నది. కనుక మృత్తువలె బ్రహ్మముగూడ నచేతనమగుచున్నదా యను సందేహము గల్గుచున్నది. సృష్టిజేసెద

సృష్టి బ్రహ్మమునకు కామనావిషయము

నని బ్రహ్మము గోరినట్లు శ్రుతి♦ జెప్పుచున్నది. కోరిక లచేత నములకుండనేరవు. బ్రహ్మము సర్వజ్ఞము గనుక దానికి కామయితృత్వముండవచ్చును. అస్మదాదులకోరికలు దోష హేతువులయి మనను కామమార్గముల ప్రవర్తింపజేయు చున్నవి. బ్రహ్మము సర్వస్వతంత్రము. కామనానిబద్ధము గాదు. బ్రహ్మము సత్యజ్ఞానాత్మకమగుటచే నద్దానికోర్కులు విశుద్ధములు. బ్రహ్మము వానిచే ప్రవర్తింపబడుటలేదు. పూర్వ కర్మానుసారముగ ప్రాణుల నది ప్రవర్తింపజేయును. బ్రహ్మము కామములనుగూర్చి స్వతంత్రమేగాక వానిని సాధనాపేక్ష లేకయే నెరవేర్చుచున్నది. కామయితృత్వాదిలక్షణములు గలిగి జగత్కారణమగుబ్రహ్మ మీశ్వరుడని బిలువబడు చున్నది. ఈశ్వరుడు మాయాశబలితశుద్ధసత్త్వప్రధానుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తియుతుడు. కేవలపరబ్రహ్మము నిర్గుణము.

పరబ్రహ్మము మాయాశక్తిచే నీశ్వరత్వము బొందిన ట్లగుపడుచు 'నామరూపములచే విస్తారముగ నభివ్యక్తము కావలయునని'గోరి యట్లభివ్యక్తమగుచున్నది.

**సృష్టిస్వరూపము**

ఇట్లు నామరూపములచే నభివ్యక్తియే సృష్టి యని బిలువబడుచున్నది. బ్రహ్మముకంటె వేఱయినది అనాత్మభూతమయినది, సూక్ష్మమయినది, సమీపమయినది, దూరమయినది, దేశకాలవస్తుపరిచ్ఛిన్నముకానిది, భూతభవి ష్యద్వర్తమానాదికాలభేదములేనిది మఱియొకవస్తువు లేదు గనుక స్వీయమగురూపమును పరిత్యజింపకయే యాత్మ నామ

---

♦ సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి (తై 2.6)

రూపాత్మకమగు బహుభవనమును పొందుచున్నది. నిరవయవ మగుటచే నద్దానికి మఱియొకవిధమున బహుభవనము సంభవముగానేరదు. నామరూపములన్నియు సర్వావస్థలయందును బ్రహ్మముచేతనే యాత్మభూతము లగుచున్నవి. బ్రహ్మము మాత్రము నామరూపాత్మకముగాదు. బ్రహ్మము బుద్ధ్యుపాధికమై జ్ఞాతయనియు, బుద్ధివృత్త్యుపాధికమై జ్ఞేయమనియు, నామోపాధికమై శబ్దములచే వాచ్యమనియు ననేకప్రకారముల వ్యవహరింపబడుచున్నది. బ్రహ్మమే పూర్వస్థితికంటె నధికముగ నామరూపములచే విస్తరించుటచే నీనామరూపములు బ్రహ్మమును వదలియుండలేవు. సముద్రజలము, తరంగములు, ఫేనము, బుద్బుదములు మొదలగు వివిధనామరూపములచే గన్పట్టుచున్నను నవి సముద్రజలముకంటె విభిన్నములుగావు. సృష్టికి బూర్వము నామరూపములు లేవు. సృష్టితరువాత నవి యభివ్యక్తములు. ఇదియే సృష్టికిపూర్వాపరములయందు గల భేదము. 'నేనే నామరూపములచే బహుభంగుల విస్తరించెదనని' బ్రహ్మము సంకల్పించినందున నామరూపములన్నియు నద్దాని స్వరూపములే యగుచున్నవి. బ్రహ్మముకంటె భిన్నమగు మఱి

బ్రహ్మము జగత్తునకు భయకారణము

యొకవస్తు వేదియు లేదు. బ్రహ్మము నిరవయవము గనుక నద్దాని యవయవములు జగద్రూపమున పరిణమించినవనిగాని పరమాణుసంఘాతముచే జగద్రచన మారంభమయినదనిగాని యనవీలులేదు. కనుక మృత్తికయే ఘటరూపమున భాసించుచున్నట్లు బ్రహ్మమే జగదాకారమున భాసింపుచున్నదని స్పష్ట

మగుచున్నది. ఇట్లనుటచే మృత్తిక ఘటమున కుపాదాన కారణమయినట్లు బ్రహ్మము జగత్తున కుపాదానకారణ మగుచున్నది. ఉపాదానకారణమనగా ద్రవ్యకారణమని చెప్పవచ్చును. మృత్సువర్ణములు ఘటాభరణముల కుపాదానకారణములగుచున్నది. ఘటమునకు కులాలుడను చేతనకారణము గలదు. బ్రహ్మము సృష్టిజేయగోరి ప్రపంచమును సృష్టించెనని శ్రుతిజెప్పుటచే బ్రహ్మమే జగత్తునకు కులాలునిబోలు నిమిత్త కారణ మగుచున్నది. ఇట్లు ఘటమున కుపాదాననిమిత్తకారణములు భిన్నములుగానున్నను జగత్తునకు బ్రహ్మమొక్కటియే యుపాదాననిమిత్తములను నుభయ కారణములగుచున్నది. బ్రహ్మమునాశ్రయించుకొనియున్న మాయాశక్తి జగత్తున కుపాదానకారణము, జ్ఞానాత్మకమునిమిత్తకారణము నగుచున్నది. బ్రహ్మము సర్వజ్ఞము సర్వశక్తిమంతమునగుటచే జగద్రచనయందతనికి సాధనమేమియు లేదనికూడ దెలియుచున్నది.

సృష్టికాముడగు నీశ్వరుడు తాను దలపెట్టినజగద్రచనారీతి నాలోచించెను. ఈయాలోచనమే తపస్సని వర్ణింపబడుచున్నది. ఈశ్వరుడు సృష్టివిధానము నాలోచించి ప్రాణికోటి కర్మానురూపముగ నరామరతిర్యగాదిస్వరూపము నగుజగత్తునంతను సృష్టించెను. బుద్ధికందరాని విచిత్రరచనావైభవముచే విరాజిల్లునీప్రపంచము నీశ్వరుడు సృష్టించి దానియందు తానేప్రవేశించెను. ప్రవేశశబ్దార్థ మిచట విచారింపనగు. సృష్టికర్త యేస్వరూపముతో సృష్టినిజేసెనో యా

ప్రవేశశబ్దార్థము
1. సృష్టించినవాడు ప్రవేశించినవాడు నొక్కడేనా ?

రూపముతోనే ప్రవేశించెనా? లేక మరియొకస్వరూపముతో ప్రవేశించెనా? (1) సృష్టిజేసిప్రవేశించెనని శ్రుతిచెప్పుటచే ముందుసృష్టించి తరువాతప్రవేశించెనని యర్థకల్పనము సమంజసమని స్థూలముగదోచుచున్నది. కాని యిదిసరిగాదు. బ్రహ్మమే సృష్టిరూపమున విస్తరించెనని మరియొకశ్రుతి ♦ పలుకుచున్నది. బ్రహ్మముకారణము, సృష్టికార్యము. కారణమే కార్యరూపమునొందినది. అందువలన సృష్టియయిన పిదప తిరిగిదానియందు ప్రత్యేకప్రవేశము సాధ్యముగాదు. పంచదారచిలుకలయందు కూజాలయందు మాధుర్యము పంచదారతోడనే ప్రవేశించుచున్నది. మృత్తే ఘటరూపమున మారుటచే ఘటోత్పత్తిసమయమునందే మృత్తుగూడ నచటనున్నదిగాని ఘట మేర్పడినతరువాత దానియందది ప్రవేశించుటలేదు.

(2) ఒకస్వరూపముతోసృష్టించి మఱియొకస్వరూపముతో ప్రవేశించెనని చెప్పవచ్చునా? ఉత్తరదేశమున మృత్తుతో రెండుసమానమగుపెంకులను జేసి యీరెంటినతికించి ఘటమును తయారుజేయుదురు. మృత్తు ముందు కపాలములయందు ప్రవేశించి తరువాత కపాలరూపమున ఘటమును ప్రవేశించుచున్నది.

2. రూపాన్తరముచే ప్రవేశము

అటులనే బ్రహ్మ మీశ్వరరూపమున సృష్టిజేసి జీవరూపమున నద్దాని బ్రవేశించెనని శ్రుతిసమన్వయము జేయవచ్చునా? అట్లు జేయవీలులేదు. బ్రహ్మమద్వయమగుటంజేసి యద్దానికి జీవేశ్వరులను రూపభేదము లేదు. జీవుడు బ్రహ్మ

♦ బహుస్యాం ప్రజాయేయ (తై 2-6)

నన్యము. బ్రహ్మము సర్వవ్యాపియగుటచే నది లేనిప్రదేశము లేదు. తానులేనిచోట తాను ప్రవేశింపగలడుగాని యున్నచోట బ్రవేశింపలేడు.

(3) ప్రవేశించెనని శ్రుతిపలుకుటచే దానిని సార్థకము జేయుటకై బ్రహ్మము సావయవమని యొకవేళ నంగీకరించి ముఖమునందు హస్తము బ్రవేశించినట్లు నామరూపకార్యములయందు జీవాత్మ రూపమున బ్రవేశించెనని యందుమా? అదియును వీలులేదు. బ్రహ్మముచే వ్యాప్తముగాని ప్రదేశము లేదు. పరమాత్మయే జగద్రూపమున మారుటచే నంతటను నతడే వ్యాపించియున్నాడు. కనుక నిదియు యుక్తిసహము గాదు.

3. బ్రహ్మమునకు ప్రవేశార్థము సావయవత్వాంగీకారము

(4) కార్యభూతుడైన జీవాత్మ కారణభూతుడైన పరమాత్మను ప్రవేశించెనని తలంచెదమా? ఘటము తిరిగి మృత్తును ప్రవేశించుచున్నదిగదా? ఇదియును సంభవముగాదు. జీవాత్మ పరమాత్మను బ్రవేశించినచో జీవరూపముబోయి పరమాత్మ రూపము వచ్చును. జగత్తును సృష్టించి దానినే ప్రవేశించెనని కార్యమునందలి ప్రవేశము శ్రుతియందు వినబడుచున్నది గాని కారణమునందు ప్రవేశము వినబడుటలేదు. కనుక కారణప్రవేశ మసంగతము.

4. కార్యమే కారణమునందు ప్రవేశము

(5) కార్యాన్తరమును బ్రవేశించెనని చెప్పుదుమా? జీవాత్మయగుకార్యము నామరూపాత్మకమగుమఱియొక కార్య

మును ప్రవేశించెనని చెప్పవచ్చునుగదా! ఈయర్థముగూడ పొసగదు. ఒకఘటము మరియొకఘటమును ప్రవేశింపలేదు.

5. కార్యాంతర ప్రవేశము

జీవాత్మకును నామరూపాత్మకమగుజగత్తున కును భేదమును బోధించుశ్రుతుల కీయర్థ కల్పనము విరుద్ధమగును. మఱియు జీవాత్మయే నామరూపాత్మక మగుజగత్తుగా మారిన యెడల మోక్షమే యసంభవమగును. సంసారాత్మకమగుజగద్బంధము వీడిపోవుటయే మోక్షము. అట్టిమోక్షమును గోరువాడాబంధమునే ప్రవేశింపగోరడు. శృంఖలములనుండి తప్పించుకొనగోరుచోరుడు విమోచనమునకు తన్నుబంధించు శృంఖలముల నాశ్రయింపడు.

(6) కారణమగుబ్రహ్మమే శరీరాదులుగను నందు బ్రవేశించు జీవాత్మగను మారెనని యూహింపగలమా? ఈ

6. కార్యాంతరము కార్యాంతరమును బ్రవేశించుట

యర్థముగూడ యనర్థకమగుచున్నది. గృహముననున్నవాని కచట ప్రవేశము శక్యముగాదు. ఆధారమగుశరీర మాధేయమగుజీవాత్మగా పరిణమించుట యనుభవ సిద్ధముగాదు.

(7) సూర్యుడు ప్రతిబింబరూపమున జలమునందు ప్రవేశించినట్లు బ్రహ్మము బుద్ధియందుప్రతిఫలించుటయే ప్రవేశమున

7. ప్రతిబింబరూపమున ప్రవేశము

కర్థమగునా? ఇదియును సరిగాదు. పరిచ్ఛిన్నములగుసూర్యకిరణాదులకు పరిచ్ఛిన్నములగుజలాదులయందు ప్రతిబింబమున

కవకాశముగలదు. బ్రహ్మము దేశముచే నవరిచ్ఛిన్నము అపరిమితము. దానియొక్క ప్రతిబింబమునకు యోగ్యమై దానికంటె దూరముననున్న వస్తువు మఱియొకటి లేకుంటుటంజేసి బ్రహ్మమునకు ప్రతిబింబరూపమున ప్రవేశ మయుక్తము.

ఏవిధముగాను ప్రవేశశ్రుతికర్థసమన్వయము కుదురుట లేదు. శ్రుతిమాత్రము జగత్తును సృజియించి దానిని ప్రవేశించెనని చెప్పుచున్నది. అతీన్ద్రియములగు విషయములను దెలిసికొనుటకు శాస్త్రమే ప్రమాణము. అట్టిశ్రుతి యనర్థమని పరిత్యజింపనుపీలులేదు. దానికి సరియగునర్థమును గల్పింపవలెను. అది యిపుడు వివరింపబడుచున్నది.

బ్రహ్మవేత్త పరమును బొందునని బ్రహ్మజ్ఞానఫలవాక్య ముపదేశింపబడినది. తరువాత సత్యము, జ్ఞానము, అనంతము, బ్రహ్మమని యద్దాని లక్షణము నిరూపింపబడినది. అటుపిమ్మట బుద్ధిగుహా తత్త్వావస్థానముగ నుదాహరింపబడినది. పరోక్షముగ దెలియబడిన బ్రహ్మమున కపరోక్షముగ

ప్రవేశశబ్దము గాణార్థకము

ననుభూతమగునాత్మతో నైక్య ముపపాదింపబడినది. ఈయాత్మయే బ్రహ్మమని* మరియొకస్థలమున జూపబడినది. ఇట్లు బ్రహ్మమున కనాత్మత్వము, మరియు నాత్మకబ్రహ్మత్వము నివారింపబడి యుభయుల కనన్యత్వము సిద్ధముచేయబడినది. అట్టి బ్రహ్మవిజ్ఞాన మిచట వివక్షితార్థమగుచున్నది. బ్రహ్మస్వరూపమును తెలుపుటకై యాకాశాద్యన్నమయాంతము సృష్టి

*అయమాత్మాబ్రహ్మ (బృ 4-4-5)

కార్యము ప్రదర్శింపబడినది. అన్నమయాదికోశత్రయము యొక్క యనాత్మత్వప్రదర్శనముచే విజ్ఞానగుహయందు బ్రహ్మము ప్రవేశపెట్టబడినది. ఇచటనే యానందమయాత్మక మగు నానందముయొక్క విశేషస్వరూప ముపపాదింపబడినది. అటుపిమ్మట నానందమయబ్రహ్మముచే దెలిసికొనదగినట్టియు సర్వపుచ్ఛభూతమైనట్టియు, సర్వవికల్పాస్పదమైనట్టియు, స్వయముగా నిర్వికల్పమైనట్టియు, పరబ్రహ్మ మీబుద్ధిగుహయందే పొందతగినదనియు చూపబడినది. ఈవిధముగ పరమాత్మకు బుద్ధిగుహయందు గౌణముగ ప్రవేశము కల్పింపబడినది. పరబ్రహ్మము విశేషవిధురముగ మఱియెచటగూడ నుపలబ్ధము గానేరదు. ఏదోయొకవిశేషముతో సంబంధించినపుడే యది యుపలబ్ధమగును. విద్యుచ్ఛక్తి గాజుకుప్పెలో తెలియబడు చున్నది. చంద్రసంబంధముగల్గినపుడే రాహూపలబ్ధి కలుగు చున్నది. బుద్ధిగుహాసంబంధముచేతనే అపరబ్రహ్మోపలబ్ధి కలుగగలదు. అది దానికత్యంతము సన్నిహితమైన యన్తఃకర ణమును బ్రకాశింపజేయుచున్నది. సూర్యకాన్తిసంబంధము చేత ఘటాదులు తెలియబడుచున్నవి. ఆత్మోపలబ్ధిహేతువగు నద్దాని గుహానిహితత్వమును బోధించువాక్యమునకు వ్యాఖ్యాన రూపముగ నిచట దానినిసృష్టించి దానిలోనే ప్రవేశించెనని వర్ణింపబడినది. ఏది ఆకాశాదికారణమో అదియే పురుషు డంతముగాగలజగత్తును సృష్టించి యందులో ప్రవేశించినదాని వలె బుద్ధిగుహయందు ద్రష్ట శ్రోత మంత విజ్ఞాత మొదలగు

విశేషస్వరూపములు గలదానివలె నుపలభ్యమగుచున్నది. ఇదియే ప్రవేశశబ్దార్థము.

భాష్యకారు లిట్లు ప్రవేశశబ్దమును వ్యాఖ్యానించిరి. మఱియొకవిధముగకూడ నాపదమున కర్థకల్పనము జేయుదగినట్లు గాన్పించుచున్నది. రాజసందర్శనమునకు రాజమందిరమువలె నాత్మదర్శనమునకు హార్దాకాశము బేర్కొనబడినది. అన్నమయకోశాది పంచప్రాకారముల దాటినగాని బుద్ధి యాంతరతమమగు హార్దాకాశమును జేరలేదు. బాహ్యములగు కోశము లాత్మ యను నపోహము ముందుగా తొలగవలెను. ఇందు కుపాయముగ పూర్వపూర్వకోశమున కుత్తరోత్తరకోశ మాత్మ యను భావనావిధానము శాస్త్రమునం దనుకరింపబడుచున్నది. ఇట్టి భావనచే ప్రత్యగాత్మత్వబుద్ధి క్రమముగా పూర్వపూర్వకోశమును దాటి యుత్తరోత్తరకోశమున ప్రవేశింపుచున్నది. అపుడు పూర్వకోశమాత్మ యనుబుద్ధి తొలగును. ఇట్లు కోశములను పంచప్రాకారములనుదాటి బుద్ధి యాత్మదర్శనార్థము హార్దాకాశమును బ్రవేశించును. పంచకోశముల యందజ్ఞానకల్పితమగు ననాత్మత్వబుద్ధిని నిరసించుక్రమ మొకకోశమును దాటిమఱి యొక కోశమును బ్రవేశించుటయని యుత్ప్రేక్షింపబడినది. కామయితృత్వము, పర్యాలోచనత్వము, స్రష్టృత్వము లను మూడు కారణములచేత బ్రహ్మాస్తిత్వము సిద్ధమగుచున్నది. కామయితృత్వాదిక్రియలు తత్ఫలమగుసృష్టియు, నిష్క్రియము నిర్వికారము నగు పరమాత్మయందు మాయచేకల్పింపబడినవి.

ప్రకారాంతరముచే ప్రవేశశబ్దార్థము

అజ్ఞానముచేతనే సర్పము రజ్జువునందు ప్రవేశించినట్లు తోచు చున్నది. రజ్జువుకంటె భిన్నముగ సర్పములేదు. నిజముగ ప్రవేశములేదు. అదేప్రకారముగ క్షేత్రజ్ఞుడగు జీవునకును నీశ్వరునకును నభేదముదెల్పుటకై పరమాత్మ నిజముగా నప్రవిష్టుడైనను ప్రవిష్టుడుగా వర్ణింపబడినాడు.

పరమాత్మ భోక్తయగు జీవస్వరూపమున దేహమును ప్రవేశించినాడని చెప్పుటమూలకముగ నతనియస్తిత్వము సాధింపబడినది. భోగ్యమగు ద్రవ్యజాతముద్వారాగూడ నతనియస్తిత్వమును సాధించుటకై యద్దానిసృష్టి వివరింపబడుచున్నది. పరమాత్మ దేహకార్యమును ప్రవేశించి మూర్తామూర్తస్వరూపమును బొందెను.

నామరూపములచే నభివ్యక్తమగు జగత్తంతయు బ్రహ్మస్వరూపమే

ప్రత్యక్షగోచరమగు పృథివ్యప్తేజోవాయువులు మూర్తద్రవ్యములు. ఇవి యనిత్యములు. వీనినే 'సత్' అనుశబ్దముచే వాడుదురు. పరబ్రహ్మబోధకమగు 'సత్' శబ్దముతో నీశబ్దమును పొరబడగూడదు. పరమాణువులనుంచి యుత్పన్నమగు వస్తువు మూర్తద్రవ్యమని చెప్పవచ్చును. ఆకాశ మమూర్తము. ఇది 'త్యత్' అనుశబ్దముచే జెప్పబడుచున్నది. ఇంతియుకాదు. ఆపరమాత్మ ప్రవేశానన్తరము నిరుక్తము, అనిరుక్తము, నిలయనము, అనిలయనము, విజ్ఞానము, అవిజ్ఞానము, సత్యము, అనృతము సృష్టియందు మరియునింకేమికలదో యదియంతయు తానే ఆయెను. సంపూర్ణలక్షణముచే నిర్వచనీయమయినది నిరుక్తము. సామాన్యాకారముచేతమాత్రము వర్ణించుటకు

యోగ్యమైనది. అనిరుక్తము, మాధుర్యము, సుగంధము మొదలగునవి అనిరుక్తములు. నిలయనమనగా నాధారము. తద్భిన్నమనిలయనము. పుష్పాదులు నిలయనములు. గంధరసాదులనిలయనములు. విజ్ఞానమనగ చేతనము-గవాశ్వాదులు. తద్విపరీతము లనగనవిజ్ఞానములు-కాష్ఠకుడ్యాదులు. వ్యవహారవిషయము సత్యము. శుక్తిస్థాణ్వాదులు. ఇచట నీశబ్దమునకు పారమార్థికసత్యత్వ మర్థముకాదు. తదన్యమన్మృతము-రజతచోరాదులు, సుఖదుఃఖాదులు, మానావమానములు మొదలగు సృష్టియందుగల జగద్విభాగములన్నియు నిచట నవగతములగుచున్నవి. ఈరూపమున పరిదృశ్యమానమగునదంతయు సత్యాదిలక్షితమగు పరబ్రహ్మమే యగును. నామరూపాదివికారములన్నియు బ్రహ్మముకంటె భిన్నములుకాక సర్వము బ్రహ్మస్వరూపమగుటచే బ్రహ్మము సత్యమని బ్రహ్మవిదులు పలుకుచున్నారు. ఇదియంతయు ప్రకృతవిషయమగు బ్రహ్మాస్తిత్వప్రశ్నకు ప్రతివచనముగా జెప్పబడినది. పరమాత్మయే స్వసంకల్పానుసారము సత్త్యత్తులక్షణమగు నాకాశాదిజగత్కార్యమును సృజియించి దానిలో బ్రవేశించి దర్శనశ్రవణమననాదికార్యముల నుపాధివిశేషముచే జేయుచు బ్రహ్మాభిన్నమగును. అందువలన నాకాశాదికారణమై హార్దాకాశమునందలి యుత్కృష్టాకాశమున నిహితమై యతనిజ్ఞానకాంతిచే ప్రకాశించుచున్న విశేషణములచే బ్రహ్మ ముపలభ్యమగుచున్నది. ఇట్లు విద్వదనుభవసిద్ధమగుబ్రహ్మము లేదనుట అయుక్తము. ఈవల్లి ప్రథమానువాకమున బేర్కొనబడిన

యాకాశాదిపురుషాన్తసృష్టియంతయు మాయాశబళితము శుద్ధసత్త్వప్రధానమునగు నీశ్వరరూపముననున్న పరమాత్మ యొక్క కామనాఫలమని యిచట వివరింపబడుచున్నవి.

షష్ఠానువాకము సమాప్తము

---

## సప్తమానువాకము.

ఆ॥ అద్వైతసిద్ధాన్తమున కాధారభూతమగు ముఖ్య బ్రహ్మముయొక్క యస్తిత్వమును రాబోవుగ్రంథమున విస్తరింపదలచి పూర్వానువాకాంతమున నుదాహరింపబడినశ్లోకార్థమును శ్రుతిమాత ముందుగా వివరింపుచున్నది.

మూ:-అసద్వా ఇదమగ్ర ఆసీత్ । తతో వై సదజాయత । తదాత్మానగ్ం స్వయమకురుత । తస్మాత్తత్సుకృతముచ్యత ఇతి । యద్వై తత్సుకృతమ్॥

టీ:- నామరూపాత్మకమగు నీప్రపంచము సృష్టికిముందు వ్యాకృతనామరూపవిశేషములులేని బ్రహ్మమే అయియుండెను. దానినుండి నామరూపములచే ప్రవిభక్తమగు జగత్తు వ్యక్తమయ్యెను. బ్రహ్మము నామరూపాత్మకమగు ప్రపంచముగ తనను తానుగాజేసికొనెను. అందువలన ఆబ్రహ్మమే స్వయంకర్తృకమని చెప్పబడుచున్నది.

తా. వి:-నామరూపవిశేషములచేత వాగ్బుద్ధిగోచరమగు నీజగద్రూపమున వ్యాకృతముకానపుడు బ్రహ్మమగుసద్రూప

మున నుండెను. వ్యాకృతములగు నామరూపములకంటె భిన్నమగునది యసత్తని చెప్పబడుచున్నది. అద్వితీయమగు బ్రహ్మమే నామరూపములుగ నభివ్యక్తమగుటచే నట్టి యభివ్యక్తికి పూర్వము బ్రహ్మముమాత్రమున్నదని తాత్పర్యము. నామరూపాభివ్యక్తికిపూర్వము నిర్విశేషముగ నుండిన బ్రహ్మమే యసచ్ఛబ్దవాచ్యమగుచున్నది. ఆకసమున నవ్యాకృతరూపమున నున్నసంగీతనినాదమే రేడియోముఖమున నభివ్యక్తమగుచున్నది. ఇట్లుచెప్పుటచే నసచ్ఛబ్దమునకు శూన్యార్థత్వము నివారింపబడుచున్నది. అసచ్ఛబ్దవాచ్య మగునీబ్రహ్మము విభిన్ననామరూపాత్మక మగు విశేషాకారమున తన్ను దాను జేసికొనెను. ఇచట ఛాందోగ్యము 6–2–1మంత్రము జూడనగును. తన్ను దాను జేసికొనెననుటచే నిష్క్రియమగుపరబ్రహ్మమునకు కర్తృత్వమాపాదించుట శ్రుతిసమ్మతముగాదు. పుట్టెను, చేసెను మొదలగు బ్రహ్మకు కర్తృత్వము నాపాదించుశబ్దములకు పుట్టినవానివలె, చేసినవానివలె కనుపడుచున్నాడని యాభాసమాత్రార్థమగు గౌణార్థమును చెప్పవలెను. అట్లుకానిచో బ్రహ్మము నిష్క్రియమునిష్కలమని చెప్పుశ్రుతులకు విరోధముగల్గును. బ్రహ్మమద్వయము గనుక సృష్టికి తానేకర్తయగుచున్నది. బ్రహ్మము స్వీయమగు స్వరూపముచేతనే సర్వమును కల్పించిన పుణ్యరూపముగనుక నది సుకృతమని చెప్పబడుచున్నది. లోకమునందు స్వర్గాదిఫలసంబంధమునకు కారణమగు బుణ్యముగూడ సుకృతమని సుప్రసిద్ధముగ వాడబడుచున్నది. చేతనమగు

నామరూపములు బ్రహ్మకు స్వయం కృతములు.

కారణములేక నాసుకృతత్వము సంభవింపదు. ఆకారణమే బ్రహ్మము, అదియే సుకృత మని ప్రసిద్ధిగాంచినది.

అ॥ బ్రహ్మాస్తిత్వమునకు రసత్వ మొక హేతువుగా వర్ణింపబడుచున్నది.

మూ:- రసో వై సః । రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి॥

టీ:- సుకృతమగు నాబ్రహ్మము రసస్వరూపము. ఈ ప్రాణిజాత మారసమునుబొంది యానందముగల దగుచున్నది.

బ్రహ్మము రసస్వరూపము

తా. వి:- సుకృతశబ్దవాచ్యమగుబ్రహ్మమే రసస్వరూపము. మధురాదిపదార్థముచేనానందము, దానిచేతృప్తి కలుగుచున్నది. తృప్తికారణమగు మధురాదిపదార్థము రసమని లోకములో సుప్రసిద్ధము. బ్రహ్మవేత్తలానందానుభవముచే కృతకృత్యులగుచున్నారు. అట్టి యానందమునకు బ్రహ్మమే కారణమగుటచేనది రసమని చెప్పబడుచున్నది. రసవంతములగు వేదాన్తవాక్యములవలన గలిగిన మనోవృత్తిరూపమగు జ్ఞానముచేత నాస్వాదనీయమగుటచే బ్రహ్మమునకు రసత్వసిద్ధి కలుగుచున్నది. ప్రీతిపురస్సరమగు రసగ్రహణమే యాస్వాదనము. జిజ్ఞాసువులు బ్రహ్మమును ప్రీతిపూర్వకముగ దెలిసికొనుచున్నారు. ఆనందము లేనిపట్ల ప్రీతికలుగనేరదు. అందువలన రసశబ్దముచే బ్రహ్మముయొక్క యానందరూపత్వము చెప్పబడుచున్నది. తత్త్వవిదుడు రసస్వరూపమగు బ్రహ్మమునుబొంది సుఖియగుచున్నాడు. బ్రహ్మము విద్వత్పరితోషహేతువగు నానందస్వరూపమగుటచేనాపరమార్థవస్తువున్నట్లంగీకరింపవలెను. శూన్య

మానందహేతువగుట యనుభవసిద్ధముగాదు. బ్రహ్మము లేనిచో నిట్టియానందము కలుగనేరదు. బాహ్యములగు సాధనము లెవ్వియును లేక ఏషణములుతొలగి నిరీహులగుబ్రహ్మవేత్త లానందపరవశులగుచున్నారు. వీ రనుభవించు నానందరసము నిశ్చయముగా బ్రహ్మానందరసమేయగుచున్నది. అందువలన వీరియానందకారణమగు బ్రహ్మముండియేతీరవలయును.

ఆ॥ బ్రహ్మాస్తిత్వమునకు మఱిరెండుకారణము లుదాహరింపబడుచున్నవి.

మూ:- కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్‌॥ య దేష ఆకాశ ఆనందో న స్యాత్‌ । ఏష హ్యేవానన్దయాతి ।

టీ:- ఈయానందము హృదయాకాశమునందు లేనియెడల ఎవ్వడపానచేష్టను చేయును? ఎవ్వడు ప్రాణనచేష్టను జేయును? ఈయాత్మయే లోకమును సుఖపెట్టుచున్నది.

తా. వి:- శరీరపిండము జీవించియున్న సమయమున ప్రాణవాయువు వలన యుచ్ఛ్వాసనిశ్వాసములను గలిగియున్నది. అదేప్రకార మపానాదీతరవాయువులుగూడ తమతమధర్మముల నెరవేర్చుచున్నవి. శరీరమునం దిట్లు వాయుసంబంధములు నింద్రియసంబంధములు నగుపనులు పరస్పరసమ్మేళనముచే జరుగుచున్నవి. ఇట్టి యిన్ద్రియవాయుసమ్మేళనము తదన్యమగుచైతన్యము లేనపుడు సాధ్యముకాదు. ప్రాణాదివాయువులు నింద్రియములుగూడ నచేతనములు. స్వయముగా నవి క్రియాక్షమములు గావు. ఈపనులను నిర్వహింపదగినది

బ్రహ్మము ప్రాణనాది క్రియాహేతువు

బ్రహ్మముదక్క మఱియొక చేతనపదార్థము గానరాదు. పర
మాత్మ స్వయముగ నసంగ మయినను విజ్ఞానమయకోశో
పాధిచే దానికి ప్రాణనాదిక్రియాకర్తృత్వముతటస్థించుచున్నది.
అది సర్వచేష్టాహేతువై యానందహేతువగుచున్నది. స్రగాది
విషయములు లభించినపుడనుభవముచే వానియందలి యిచ్ఛ
తాత్కాలికముగ మరలును. అంతవఱకు వానియందలియిచ్ఛా
రూపమగు మనోవృత్తి బహిర్ముఖముగ నుండును. ఇచ్ఛ నెర
వేరినపు డామనోవృత్తి యన్తర్ముఖమై యానందము ననుభ
వించును. అందుచేతగూడ బ్రహ్మాస్తిత్వమంగీకరింపవలసి
యున్నది.

అ॥ నిర్విషయానందాత్మకమగు పరబ్రహ్మమభయము
సర్వప్రతిష్ఠాభూతమునని చెప్పబడుచున్నది.

మూ:- యదా హ్యేవైష ఏతస్మిన్న దృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిల
యనేఽభయం ప్రతిష్ఠాం విందతే । అథ సోఽభయం గతో భవతి । యదా
హ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే । అథ తస్య భయం భవతి ।
తత్త్వేవ భయం విదుషోఽమన్వానస్య । తద ప్యేష శ్లోకో భవతి ॥

టీ:- ఈసాధకు డెప్పుడైతే కనబడనట్టియు శరీరరహితు
డైనట్టియు వికారరహితుడైనట్టియు నాధారరహితుడైనట్టియు
పరమాత్మయందు భయములేనిస్థితినిబొందుచున్నాడో అపుడత
డభయముం బొందును. ఎప్పుడయితే నతడీపరబ్రహ్మమునందు
స్వల్పముగానయినను భేదముభావించుచున్నాడో యపుడతనికి
భయముగల్గును. బ్రహ్మముతనకంటె భిన్నము గాదని తెలిసి
కొనలేనివాడు విద్వాంసుడయినను బ్రహ్మమతనికి భయకారణ
మగును.

తా.వి:- పరబ్రహ్మమునకు వికారాత్మకమగు రూపము లేదుగనుక చక్షురాదీన్ద్రియముల కగోచరము, అందువలన నదృశ్యము. అనగా ప్రత్యక్షప్రమాణమున కది యందనిదగు చున్నది. అందుచే నది యనిర్వాచ్యము. దానిని తెలియ జేయుచిహ్నము లేవియులేనందున నది యూహావిషయము గాదు. అనగా ననుమానప్రమాణముచే దానిని దెలిసికొన లేము. అది సర్వశబ్దాతీతమగుటచే ననిరుక్తము గనుక ఆగమముల కగమ్యమగుచున్నది. అది యశేషకార్యప్రపంచముకంటె విలక్షణము. సర్వప్రపంచమున కదియేఆధారము. అది సర్వవ్యాపియగు టచే దానికాధారము లేదు.

బ్రహ్మము ప్రమాణాద్యగోచరము.

ఇట్టి పరబ్రహ్మము ద్వైతరహితము. రెండవవాడుండినచో భయహేతువగును. ద్వైతరహితమగు పరబ్రహ్మమభయకారణమగుచున్నది. ద్వైతభావము పూర్తిగనశించినపుడభయప్రతిష్ఠ కలుగును. బ్రహ్మముకంటె తానువేరనుభావ మెంత స్వల్పముగానున్నను నదియే భయకారణమగును. బ్రహ్మమునుండి భేదభావమును బొందినవాడు తనకు దానే భయహేతువగుచున్నాడు. బ్రహ్మతో నద్వైతభావమునుబొందినవాడు మఱియొకదానిని చూడలేడు, వినలేడు, తెలిసికొనలేడు. అంతటను భయకారణమున్నను బ్రహ్మవిదులు నిర్భయముగనున్నారు. సర్వభయసంత్రాణమగుబ్రహ్మమే లేనిచో వీరు నిర్భయులు కానేరరు. వీరు నిర్భయులుగనున్నారుగనుక బ్రహ్మముండితీరవలయును.

బ్రహ్మమభయహేతువు

సాధకు డాత్మయం దెంతమాత్రము భేదబుద్ధిని పొందనంత వర కతడభయంగతుడగును. అవిద్యవలన తనకును, ఆత్మకును ఎంతమాత్రము భేదభానము జూపినను, అది భయకారణమే యగును. అజ్ఞానికి ఆత్మయే భయహేతు వగును. ఎవడద్వితీయమగునాత్మతత్త్వమును గ్రహింపలేడో యతడు విద్వాంసుడయినను నవిద్వాంసుడే యగుచున్నాడు. బ్రహ్మము వేద్యవేత్తృత్వాది త్రిపుటీశూన్యము. అట్టిబ్రహ్మము జ్ఞేయము నేనుజ్ఞాతయని భావించువానికి బ్రహ్మనే భయహేతు వగుచున్నది. ఎవడు బ్రహ్మమును పరిచ్ఛిన్నభావముతో దెలిసికొనడో యతడు బ్రహ్మమును దెలిసికొనినవాడగును. పరిచ్ఛిన్నభావముతో తెలిసికొన్నవాడద్దాని దెలిసికొననివాడే యగును. నిర్భయమగు బ్రహ్మమే సర్వభయమును నశింపజేయువాడు. జగత్తంతయు భయపీడిత మగుచున్నది. కనుక స్వయముగ నిర్భయమై జగద్భయకారణమగునది యొకటి యుండవలెను.

బ్రహ్మముయొక్క భయకారణత్వము

సప్తమానువాకము సమాప్తము.

---

## అ ష్ట మా ను వా క ము

అ॥ బ్రహ్మము నీషన్మాత్రమయినను భేదబుద్ధితో భావించువానికి బ్రహ్మమే భయకారణమగుచున్నదను విషయమునవలనగూడ బ్రహ్మాస్తిత్వము తెలియజేయుటకు దిగువ శ్లోకము దాహరింబడుచున్నది.

మూ:- భీషాఽస్మాద్వాతః పవతే । భీషోదేతి సూర్యః । భీషాఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమః ॥

టీ:- పరబ్రహ్మభయముచేతనే వాయువువీచుచున్నది; సూర్యుడుదయించుచున్నాడు, అగ్నియును ఇంద్రుడును స్వస్వవ్యాపారముల బ్రవర్తించుచున్నారు. అయిదవవాడగు మృత్యువుగూడ నతని భయముచేతనే స్వకార్యమునందు వ్యాపృతుడగుచున్నాడు.

తా.వి:- పూర్వజన్మమునందు జేసిన యుత్కృష్టమగు సుకృతమున కనురూపమగు దేవత్వమునొంది మహావీర్యవంతులు, స్వతంత్రులు, విక్రమశాలుర

ఆభేదజ్ఞానములేని సుకృతము గూడ భయహేతువగును

నగువాయువు సూర్యుడు, ఇంద్రాగ్నులు మృత్యువుమొదలగు దేవతలు గూడ బ్రహ్మమునుగూర్చి భేదబుద్ధికలిగియుండుటచేతనే రాజునకు భృత్యులవలెనేవడి బ్రహ్మమునకు వీరువశవర్తులై నియమితములు, శ్రమానహములు నగుస్వస్వకృత్యములననవహితచిత్తులయి నిర్వహించుచున్నారు. అందువలనగూడ బ్రహ్మాస్తిత్వము సిద్ధించుచున్నది.

అ॥ బ్రహ్మానన్యమగు నిర్విషయానందము యొక్క స్వరూప విచారణ జేయబడుచున్నది.

మూ:- సైషాఽఽనందస్య మీమాంసా భవతి । యువా స్యాత్సాధుయువాఽధ్యాయకః । ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః । తస్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనందః ।

తే యే శతం మానుషా ఆనందాః । స ఏకో మనుష్యగంధర్వాణామానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం మనుష్యగంధర్వాణామానన్దాః । స ఏకో దేవగంధర్వాణామానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం దేవగంధర్వాణామానందాః । స ఏకః పితౄణాం చిరలోకలోకానా మానందాః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం పితౄణాం చిరలోకలోకానామానందాః । స ఏక ఆజానజానాం దేవానామానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతమాజానజానాం దేవానా మానందాః । స ఏకః కర్మదేవానాం దేవానామానందః । యే కర్మణా దేవా నపియంతి । శ్రోత్రియస్య చాకామహతస్య ॥

తే యే శతం కర్మదేవానాం దేవానామానందాః । స ఏకో దేవానామానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం దేవానామానన్దాః । స ఏక ఇంద్రస్యానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతమిన్ద్రస్యానన్దాః । స ఏకో బృహస్పతేరానందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం బృహస్పతేరానన్దాః । స ఏకః ప్రజాపతేరానన్దః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

తే యే శతం ప్రజాపతేరానందాః । స ఏకో బ్రహ్మణ ఆనందః । శ్రోత్రియస్య చాకామహతస్య ।

టీ:- బ్రహ్మస్వరూపమగు నానందముయొక్క విచారణ మిపుడు చేయబడుచున్నది. యువకుడు, సాధువు, వేదాధ్యయనపరుడు, భోగవంతుడు, దృఢతమశరీరి, బలవత్తముడు నగువాని కీపృథివియంతయు దృష్టాదృష్టమగు నుపభోగసాధనముచేత బూర్ణమై వశమైనపుడు గలుగు నానందము మానుషానందమనబడుచున్నది. మనుష్యసంబంధములగు నానందములు నూరుకలసి మనుష్యగంధర్వానంద మగును.

మనుష్యగంధర్వుల నూరానందములు కలసి దేవగంధర్వానంద మగును. ఈయానంద మకామహతుఁడగు శ్రోత్రియునకే గలుగును. దేవగంధర్వులయొక్క నూరానందములు కలిసి పితృదేవతల యానందమగును. అదియు నకామహతుఁడగుశ్రోత్రియునియానందము. నూరుపిత్రానందములు కలిసి యాజానజులగు దేవతలయొక్క యానందమగును. అదియు నకామహతుఁడగు శ్రోత్రియునియానందము. ఆజానజదేవతల నూరానందములు కలసి కర్మాచరణముచే దేవత్వమునుబొందు కర్మదేవతలయొక్క యానందమగును. అది అకామహతుఁడగు శ్రోత్రియుని యానందము. నూరుకర్మదేవానందములు కలిసి దేవతలయొక్క యానందమగును. అది అకామహతశ్రోత్రియానందము. నూరు దేవతానందములు గలిసిన నింద్రానందమగును. అది అకామహతశ్రోత్రియానందము. ఇంద్రానందములు నూరుగలసినచో బృహస్పతి యానందమగును. అది అకామహతశ్రోత్రియానందము. నూరుబృహస్పతి యానందములు గలసిన ప్రజాపతి యానందమగును. అదియు అకామహతశ్రోత్రియానందము. నూరుప్రజాపతి యానందములు గలసినచో హిరణ్యగర్భానందమగును. అదియు నకామహతశ్రోత్రియానందమగును.

తా. వి:- ప్రకృతమగు బ్రహ్మానందము స్రగాదివిషయములు, వానిననుభవించు ననుభవిత ఈరెంటికిని గలసంబంధమువలన గలుగులౌకికానందమువలె కృత్రిమమా? లేక స్వభావసిద్ధమా? ఇదియే యిచట విచారణావిషయము. విషయానందములన్నియు బ్రహ్మానందముయొక్క యంశమాత్రములు.

లౌకికానందము విషయేన్ద్రియసంయోగము నపేక్షించును.

ఆనందమీమాంస

విషయము లనేకములు ననవస్థితములు గనుక తజ్జన్యమగునానందముగూడ ననవస్థితమగుటయేగాక అవిద్యాకల్పితముగూడ నగుచున్నది. బ్రహ్మానందము నిర్విషయము, విషయసుఖేచ్ఛావిదూరము. విషయసుఖేచ్ఛనుండి విద్యాసాధనముచే నెంతెంతవరకు బుద్ధి మరలునో బ్రహ్మానంద మంతంతసన్నిహితమగుచుండును. విషయసుఖేచ్ఛావిదూరతయొక్క తారతమ్యమునుబట్టి లౌకికానంద తారతమ్య మేర్పడుచున్నది. అవిద్యానిమిత్తమగువిషయసుఖేచ్ఛ సంపూర్ణముగా విద్యచే నశించినపుడు నిస్సాధనము, నిర్విషయమునగు బ్రహ్మానందము సంసిద్ధమగుచున్నది. ఈవిధముగ లౌకికానందము బ్రహ్మానందప్రాప్తికి ద్వారభూతమగుచున్నది. అందువలననే బ్రహ్మానందప్రకరణమున లౌకికానందముయొక్క వివిధకక్ష్యలు ప్రస్తావింపబడుచున్నవి.

లౌకికానందము బ్రహ్మానందద్వారము

విద్యయొక్క ప్రాబల్యదౌర్బల్యములచే గల్పింపబడిన విషయానందముయొక్క వివిధకక్ష్యలలో మొదటిది మానుషానందము. యువకుడు సాధుస్వభావుడు, వేదాధ్యయనసంపన్నుడు, భోగాసక్తుడు, క్షిప్రకార్యానువర్తి, మానసికకాయికబలోపేతుడు, సమస్తభోగ్యజాతసమృద్ధమైన పృథివి నేకచ్ఛత్రాధిపత్యమున బట్టాభిషిక్తుడును నగుచక్రవర్తియొక్కయానందము. (1) మానుషానందము. భోక్తృభోగ్యసమృద్ధమగు మానుషా

బ్రహ్మానందము సర్వానందాతీతము

నందము, సర్వానందములలో కనిష్ఠము. ఈ యానందము దుస్సాధము. కర్మవిద్యావిశేషముచే నీజన్మమునందే గన్ధర్వత్వము నొందువారనుభవించు (2) మనుష్యగంధర్వానందము మానుషానందముకంటె నూరుమడుంగులధికము. ఈప్రకారముగానే గంధర్వయోనియందు జన్మించిన (3) దేవగంధర్వులయానందము (4) చిరకాలస్థాయియగుపితృలోకానందము (5) స్మార్తకర్మవిశేషాచరణముచే లభ్యమగు దేవలోకానందము (6) సోమాదిక్రత్వాచరణలభ్యమగు కర్మదేవానందము (7) సోమాదులయందు హవిర్భాక్కులగుదేవతల యానందము (8) దేవప్రభువగు నింద్రుని యానందము (9) దేవేంద్రున కాచార్యుడగుబృహస్పతియొక్క యానందము (10) సమష్టిశరీరుడగు విరాట్పురుషుని యానందము (11) ప్రథమశరీరియగు హిరణ్యగర్భుని యానందము-ఇట్లు వివిధానందశ్రేణిలో పూర్వపూర్వానందముకంటె నుత్తరోత్తరానందము నూరుమడుంగు లధికమగుచున్నది.

శ్రోత్రియత్వాదులు మూడును బ్రహ్మానందమున కనివార్యములు

మొదటిరెండుతప్ప మిగిలినయానందములకన్నిటికిని శ్రోత్రియత్వముఋజుమార్గవర్తిత్వము అకామహతత్వము లనివార్యములుగ నుండవలసిన యోగ్యతలు. మానుషానందము నభిలషించువాడు మనుష్యవిషయభోగకామనచే బీడితుడగుచున్నాడు. అవిద్యావినాశముచే నిట్టి భోగకామననశింపవలెను. అది నశించినకొలది తదనురూపముగ బూర్వపూర్వానందముకంటె శతగుణాధికమగు నుత్తరోత్తరానందము లభించును. అకామహతత్వము సమగ్రమయినపుడు కేవల బ్రహ్మా

నందానుభవము ప్రాప్తమగును. బ్రహ్మానందము మనస్సునకును వాక్కునకును నందదు. ఇతరానందములన్నియు గంభీరమగు బ్రహ్మానందసముద్రముయొక్క బిందువులతో దుల్యములని బోధించుట కిచట నితరానందములు వర్ణింపబడినవి. సముద్ర జలబిందువులు ప్రవిభక్తములయినపుడు ప్రత్యేకముగా గనుపడినను నవి సముద్రజలాంశములయి దానితో నైక్యమును బొంది స్వస్వరూపనాశనమును బొందుచున్నవి. బ్రహ్మేతరానందము లన్నియు గర్మసాధ్యములు. కర్మాచరణముచే దత్తదుచితములగు జన్మములబొంది యాయానందముల ననుభవించిన ననుభవింపవచ్చును. ఈయానందము లొకదాని కంటె నొకటి గొప్పవి. కాని అనిత్యములు. శ్రోత్రియత్వము, ఋజువార్గవర్తిత్వము, అశేషావిద్యావినాశఫలమగు నకామహతత్వ మను నీమొదలుగుణములచే నొప్పారు మహాభాగ్యశాలి యీ జన్మమునందే నిర్విశేషమగు బ్రహ్మానందమున నైక్యమై స్వస్వరూపోపలబ్ధి నపరోక్షముగ గాంచును. అపుడానందము, దాని ననుభవించునదియను భేదము తొలంగును. బ్రహ్మమునుగూర్చి నీషన్మాత్రముగానైనను భేదభావము నొందు మందబుద్ధి జీవానన్యబ్రహ్మానంద రసాస్వాదనమునకు నోచుకొననేరదు. మనస్సు శ్రోత్రియత్వాకామహతత్వాదుల సతతాభ్యాసపాటవముచే విషయానందేచ్ఛనుండి క్రమముగా మరలి నిర్విష యానందోన్ముఖము కాగలదు.

అ॥ నిరుపాధికమగు పరబ్రహ్మ ముపాధినశమయినంత మాత్రముచేత భేదమునొందదని చూపబడుచున్నది.

మూ:- స యశ్చాయం పురుషే । యశ్చాసావాదిత్యే । స ఏకః ॥

టీ:- పురుషునియం దానందస్వరూపముగ నేపరబ్రహ్మ మున్నదో అదియు సూర్యమండలమునందున్న పరబ్రహ్మము నొక్కడేయగుచున్నాడు.

తా. వి:- స్వరూపసమర్పణపరములగు సత్యాదిశబ్దము లచే బ్రహ్మము పరోక్షముగ నుపలక్షితము చేయబడినది. అట్టి పరబ్రహ్మమున కాకాశాదిపురుషాంతము సృష్టికర్తృత్వము, సృష్టమగుజగత్తునందు ప్రవేశము నాపాదించి హార్దాకాశమున నపరోక్షోపలబ్ధి యుపదేశింపబడినది. శ్రోత్రియత్వాకామహతత్వములు తదుపలబ్ధిసాధనములుగ బ్రదర్శింపబడినవి. బుద్ధిగుహోపాధివిశిష్టమగు పరబ్రహ్మమే సూర్యబింబమునగూడ బ్రకాశించుచున్నది. పరబ్రహ్మ మద్వితీయమును, సర్వవ్యాపియునై యున్నది. అయినప్పటికి నుపాధివిశేషముచే విభిన్నముగ గాన్పించుచున్నది. ఆకాశ మొక్కటియయ్యును ఘటశరావాద్యుపాధిభేదముచేత విభిన్నముగా గాన్పించుచుండును. విభిన్నరూపములగు ఘటశరావాద్యుపాధులు దొలగినపుడు తద్గతమగునాకాశము మహాకాశముతో నైక్యమగును. అదేవిధమున హార్దాకాశమున నపరోక్షముగనున్న బ్రహ్మానందమును, ఆదిత్యమండలమున పరోక్షముగ ననుభూతమగు బ్రహ్మతేజస్సు నీరెండు నొకటియే యగుచున్నవి. హార్దాకాశమును సూచించు 'ఈ' యనుపదముచేత ప్రత్యక్షములగు నాధ్యాత్మికాధిభౌతికోపాధులన్నియు జెప్పబడుచున్నవి. ఆదిత్యమండలబోధకమగు

వివిధోపాధివిశిష్టమగు బ్రహ్మానందైక్యము

'ఆ' యను పదముచేత సజాతీయములగు సమస్త దేవతోపాధులవగతములగుచున్నవి. పై వాక్యముచే నాధ్యాత్మికాధిభౌతికోపాధిగతమగు బ్రహ్మానందమును, ఆధిదైవికోపాధిగతమగు బ్రహ్మానందముంగూడ నొకటియే యని పర్యవసన్నమగుచున్నది. ఉపాధి వినాశమగుచుండగా ఘటాశరావాదుల యందలి మహాకాశమునలెనే, ఈబ్రహ్మానందము న్యూనాధిక భేదములు వీడిపోయి నిరతిశయానందరసఘనస్వరూపమున భానముకాగలదు. వివిధోపాధిగతమగు పరబ్రహ్మమునకభిధానమగు భూమశబ్దముచే బోధితమగుచున్న మహత్త్వము గూడ ద్యోతితమగుచున్నది. బ్రహ్మము నిర్గుణము ఇన్ద్రియాగోచరము. కాని యదియే నామరూపాత్మకము లగుసూర్యబింబాది వివిధోపాధులయందు సగుణముగ నభివ్యక్తమగుచున్నది. నీటియావిరి యదృశ్యము. అదియే మంచుగడ్డగను జలముగను దృశ్యమగుచున్నది. వీనియందున్న జలతత్త్వమొకటియే. భగవద్గీతయందలి ఏకాదశాధ్యాయమునందు విరాట్స్వరూపవర్ణనముచే నీయర్థమే స్ఫుటముచేయబడుచున్నది. చైతన్యము మహత్త్వము నభివ్యక్తమగుచున్నచోట్లనెల్ల నాపరమార్థము కాన్పించుచున్నదని బోధించుటకచట సుప్రసిద్ధములగు ననేకోదాహరణములు చేర్చ్బడినవి. ఇట్టి యానందరసఘనభానమునకు ఘటశరావాదులనువలెనే వివిధోపాధులను గ్రమముగ దొలగించుకొనుట యవసరము. ఇది శ్రోత్రియత్వము, అకామహతత్త్వముగలిగి ఋజుమార్గముల బ్రవర్తించువానికి సాధ్యము. సర్వకామవినాశముచే

జీవునకుజీవత్వము దొలగును. అందులకై పంచకోశములయం దాత్మత్వభావము నశించు ప్రణాళిక తొలువాల్ల వివరింపబడి నది. ఇట్లు మానుషానందాతిశయానందము నిరతిశయానంద బ్రహ్మానందమునకు ద్వారమని వర్ణింపబడినది. సమస్త ప్రపంచ మిట్టియానందమునందే ప్రతిష్ఠితమగుచున్నది. కామయితృత్వము స్రష్టృత్వము, ప్రవేశనము, సత్త్యాజాదిభవనము మొదలగుకార్యములచేతను, ఆనందరసలాభము, ప్రాణనము, అభయప్రతిష్ఠానము, అభయదర్శనము లనువివిధోపపత్తులచేతను బ్రహ్మాస్తిత్వము సిద్ధముచేయుబడినది. ఇట్లు షష్ఠానువాకమునందుదాహరింపబడిన మూడుప్రశ్నలలో మొదటిప్రశ్నకు సమాధానము చెప్పబడినది.

అ॥ ఇట్టి యద్వితీయబ్రహ్మప్రాప్తిఫల ముదాహరింపబడుచున్నది.

మూ:- స య ఏవంవిత్ । అస్మాల్లోకాత్ ప్రేత్య । ఏతమన్నమయమాత్మానముపసంక్రామతి । ఏతం ప్రాణమయమాత్మానముపసంక్రామతి । ఏతం మనోమయమాత్మానముపసంక్రామతి । ఏతం విజ్ఞానమయమాత్మానముపసంక్రామతి । ఏతమానందమయమాత్మానముపసంక్రామతి । తదప్యేష శ్లోకో భవతి ॥

టీ:- ఎవ్వడీవిధముగా దెలిసికొనుచున్నాడో యతడీ లోకయినుండి మఱలి క్రమముగా నీయన్నమయుడగునాత్మను బొందుచున్నాడు; ఈ ప్రాణమయాత్మను బొందుచున్నాడు; ఈ మనోమయాత్మను బొందుచున్నాడు; ఈవిజ్ఞానమయాత్మను బొందుచున్నాడు; తుద కీయానందమయాత్మను గూడపొందుచున్నాడు.

తా. వి:- మిగిలిన ప్రశ్నద్వయమునకు బ్రత్యుత్తరము చెప్పవలసియున్నది. వానిలో విద్వాంసుడు పరబ్రహ్మమును బొందునా లేదా యనుప్రశ్నకు సమాధానము ముందు చెప్పబడుచున్నది. ఉత్తరాపకర్షలు లేనట్టియు, నద్వైతము, సత్యము, జ్ఞానము, అనంతము నగుబ్రహ్మము తానేయని యెవఁడు దెలిసికొనునో అతఁడు జ్ఞానదార్ఢ్యముచేత సర్వకర్మఫలేచ్ఛ తొలగినవాఁడయి దృష్టాదృష్టవిషయసంకుల మగునీ జగత్తునందును, స్థూలాదిశరీరత్రయమునందును నభిమానము వదలినవాఁడునై అన్నమయాదిపంచకోశములను గ్రమముగా నొకదానితరువాత నొకదానియందు బ్రవేశించి తుట్టతుదకు అదృశ్యము, అనాత్మ్యము అనిరుక్తము, అనిలయనము, అభయము, ప్రతిష్ఠారూపము నగుబ్రహ్మమును బొందును. ఇట్లు బ్రహ్మమును దెలిసికొనిన విద్వాంసు డద్దాని బొందునని చెప్పుటచేత నవిద్వాంసుడు దానిని బొందలేడనిగూడ సిద్ధమగుచున్నది. తనకును బ్రహ్మమునకు ననన్యత్వమును గ్రహించిన విద్వాంసు డభయమగు బ్రతిష్ఠను బొందుననియు నుభయులకు నీషణ్మాత్రమయినను భేదము కల్పించునజ్ఞానికి బ్రహ్మమే భయహేతువగుననియు చెప్పుటచేతగూడ నీప్రశ్నద్వయమునకు సమాధానము వచ్చుచున్నది.

మిగిలిన రెండుప్రశ్నలకు సమాధానము

ఇచట రెండువిషయములు విచారింపనగు. పైన తెలిపిన విధముగ బ్రహ్మమును దెలిసికొని కోశపంచకమును సంక్రమించినవాఁడెవఁడు?

సంక్రమణశబ్దార్థము

అతఁడు పరమాత్మకంటెనన్యమా? అనన్యమా? అన్యానన్యమా? సంక్రమణ మేవిధమున సంభవించుచున్నది? సంక్రమణకర్త బ్రహ్మేతరుడయినచో బహుశ్రుతివిరుద్ధమగును. 'తాను వేఱు, బ్రహ్మము వేఱని తెలిసికొనినవాఁడు నిజముగా నిజమును దెలిసికొననివాఁడే యగును'[1] 'బ్రహ్మమొకటియే రెండవదిలేనిది'[2] 'ఆబ్రహ్మమే నీవు అయితివి'[3] అను మొదలగు బ్రహ్మానన్యత్వమును బోధించు శ్రుతివాక్యములకు విరోధముగలుగును. ఇద్దరు నొకరనుటకూడ నసంభవము. 'ఆనందమయాత్మను దాను బ్రవేశించుచున్నాఁడ'ని[4] మఱియొకశ్రుతి చెప్పుచున్నది. ఆనందమయుఁడగుజీవుఁడును బ్రహ్మము నొకటియేయయినయెడల తన్నుదాను బ్రవేశించుట యసంభవము. పరబ్రహ్మమునకు జీవుని సంసారమైనను సంభవింపవలెను. అట్లుకానిచో జీవుని కంటె నాపరమార్థము వేఱుగాదుగనుక పరమార్థము లేకనే పోవలెను. ఇట్లుభయపక్షములుగూడ దోషగ్రస్తములగుచున్నవి. భిన్నము అభిన్నము ననుమూడవపక్షముగూడ నసంగతము. అతీంద్రియమగు నీసమస్య తర్కవిషయముగా నేరదు. శాస్త్రమొక్కటియే శరణ్యము. శాస్త్రైకసమధిగమ్యమగు నద్వైతసిద్ధాన్తమున నీప్రశ్నమునకు దావులేదు. జీవబ్రహ్మములకనన్యత్వము నంగీకరించినపుడే యీప్రశ్నమునకు సదుత్తరము దొఱకును. యుక్తిప్రధానములగు ద్వైతవాదములు శ్రుతిసమ్మతములుగానట్టి ప్రతిభచే సమర్థితములగుటంజేసి యవి

1. అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద (బృ 1-4-10) 2. ఏకమేవాద్వితీయమ్ (ఛాం 6-2-1) 3. తత్త్వమసి (ఛాం 6-8-7) 4. ఆనందమయమాత్మానముపసంక్రమతి (తై 8)

వివిధములగుచున్నవి. వానిలోనెద్దాని స్వీకరింపవలెనో నిర్ణయించలేక ముముక్షువు నిస్పృహ జెందుచున్నాడు. అద్వైతసిద్ధాన్తమున నిట్టివివిధవాదముల కవకాశము లేదు. కనుక నదియవశ్యమంగీకార్యమగుచున్నది. అద్వైతము సహజసిద్ధము. ద్వైతములన్నియు మానుష శేముషీకల్పితములు. ఇదియే అద్వైతసిద్ధాన్తప్రాశస్త్యము.

సంక్రమణకర్త బ్రహ్మానన్యము

సంక్రమణకర్త పరబ్రహ్మమే యగుచున్నది. జీవబ్రహ్మములిద్దరికి నన్యత్వముగాని, యన్యత్వానన్యత్వముగాని చెప్పవీలులేదు. వీరలయనన్యత్వమే శ్రుతితాత్పర్యము. కనుక నే బ్రహ్మవేత్త పరమును బొందునని మున్ముందుగా శ్రుతిబోధించినది. ఏవస్తువయినను విద్యమానస్థితియందుగాని, నాశావస్థయందుగాని తనకంటెభిన్నమగు మఱియొకవస్తువుతో నైక్యమును జెందనేరదు. ఘటముండగాగాని, నాశనమయినతరువాతగాని పటము కానేరదు. జీవబ్రహ్మముల నైక్య మనన్యముగాని యభిన్నముగాదు. విభిన్నములగు రెండుపదార్థము లొకానొకపుడు ధర్మసామ్యముచే నభిన్నములుగావచ్చును. అంతమాత్రముచే నవియనన్యములుగావు. రెండిక్షుఖండములు ధర్మసామ్యముచే నభిన్నములయినను అనన్యములుగావు. హరిశ్చంద్రవేషధారియగు గోపాలుడు నిజమగుగోపాలునికంటె నన్యుడుగాడుగదా. జీవబ్రహ్మములు నిజముగా ననన్యములయినచో, వీరియైక్యజ్ఞానము కలుగకపూర్వముగూడ నీయైక్యము సిద్ధమైయున్నది, వీరియైక్యజ్ఞానము పోల్చబడిన తరువాత వీరిద్దరైక్య

మును బొందుచున్నారనుటగూడ సరికాదని తర్కించుట సమంజసముగాదు. నిజముగా జ్ఞానోదయమునకు బూర్వము గూడ జీవుడు బ్రహ్మానన్యమే. కాని విపులనదీజలముల దాటినపదిమందిని లెక్కింపబూని తన్ను మఱచిశోకించు పది యవవానివలె నవిద్యావృతుడగు జీవుడు దానేబ్రహ్మమని గ్రహింపలేకున్నాడు. అనాత్మభూతములగు భార్యాపుత్రాదులు అన్నమయాదిపంచకోశము లాత్మయను నజ్ఞానకల్పితమగు భ్రమను దొలగించుటకై యివియన్నియు నాత్మలు గావని త్రోసిపుచ్చి యుభయమును ప్రతిష్ఠాస్థానమునగు బ్రహ్మాత్మను బుద్ధిగుహాయం దపరోక్షముగ దెలిసికొనుటకు దగిన జ్ఞానోపదేశమును మనకు శ్రుతిమాత యనుగ్రహించినది. విద్యచే నవిద్య నశించును. అవిద్యావినాశమునకు విద్యతప్ప మరియొకప్రతీకారము కాన్పించదు. నేను బ్రహ్మమునుకానను నజ్ఞానము నశించినవెంటనే జీవబ్రహ్మానన్యత్వజ్ఞానము స్వయముగా గల్గును. ఆవరణముదొలగిన యుత్తరక్షణమే దీపదర్శనమగుచున్నది. అపుడు దీపమును జూచుటకు నేత్రము మాత్రమనశ్యమగును. మఱియొకసాధన మవసరములేదు. బ్రహ్మమును దెలిసికొనుట కజ్ఞాననాశనమొక్కటియే యవశ్యము. సాధనాంతర మక్కరలేదు. నిజస్వరూపము నావరించిన వేషము దొలగినవెంటనే గోపాలుడు స్వీయాకారమున గనుపడుచున్నాడు. సాక్షాత్కారమున కాటంకము గలుగజేయుచున్నయజ్ఞానమును బారద్రోలు నుపాయముచేతనుమాత్రమే బ్రహ్మజ్ఞానమిచట బోధింపబడుచున్నది. కర్మ స్వయముగా

గాని జ్ఞానసముచ్చితమయినపుణ్యముగాని స్వతస్సిద్ధము నిత్యము నగుబ్రహ్మమును దెలిసికొనుటకు సాధనముగాదని యింతవఱకు బూర్వము వివరింపబడినది. జగత్తును సృష్టించి దానిలో దాను బ్రవేశించెనని శ్రుతిబలుకుచున్నది. కనుక సృష్టిజేసినవానికిని నద్దానిబ్రవేశించినవానికి నైక్యము సిద్ధమగుచున్నది.

జీవబ్రహ్మైక్యము నంగీకరించినపుడే బ్రహ్మమునం దభయమగు బ్రతిష్ఠాత్వము సిద్ధించును. తనకంటె మఱియొకడు లేడనుస్థిరజ్ఞానము గుదిరినపు డభయము గల్గును. రోగనిపీడితము కానికంటికి ద్వితీయచంద్రుడు కనుపడనపుడు మాత్రమే చంద్రుడొకడే యని చెప్ప

జీవబ్రహ్మైక్యమునందు మాత్రమే అభయప్రతిష్ఠ సిద్ధించును.

గలము. ద్వైతము సత్యమయినచో సుషుప్తిసమాధులయందది తెలియబడవలెను. కాని యట్లగుపడుటలేదు. ద్వైతము జాగ్రత్స్వప్నములయం దనుభూయమానమగుచున్నంతమాత్రము చేత నది సత్యమని చెప్పవీలులేదు. జాగరితమునందు వస్తువులను బ్రత్యక్షముగ ననుభవించుచున్నాము. స్వప్నమునం దవి ప్రత్యక్షముగ లేకున్నను వానియనుభవము గల్గుచున్నది. ఈ సమయములయందు పంచకోశాదు లాత్మ యను భ్రాన్తి జ్ఞానముగలదు. సుషుప్తియం దీభ్రాన్తికవకాశములేదు. భ్రాన్తికారణమగుద్వైతము సుషుప్తియందు భాసించుటలేదు. సంపూర్ణమగు సుఖముమాత్ర మక్కాలమున భాసించుచున్నది. 'నాకేమియు దెలియదు. సుఖముగా నిద్రించితి'నని నిద్రలేచి నిద్రాసుఖమును స్మరించుచున్నాము. సుషుప్తి సహజము, నిర్విశేషము, నిర్వికారము నగుస్థితి. వికారకారణమగు

ద్వైతమకాలమున ననుభూతము గాకుండుటయే యిందుకు కారణము.

జీవునికంటె నీశ్వరుఁడు వేరు, జగత్తు వేరని తలంచువానికి భయనివృత్తి కలుగనేరదు. పరబ్రహ్మముకంటె భిన్నముగ నీశ్వరుఁడనువాఁడొకఁడు నిజముగానున్నచో నతఁడెప్పుడు నుండవలసివచ్చును. యథార్థముగనున్నవస్తు వెన్నఁడును నాశనమును బొందనేరదు. అనృతమగువస్తు వెన్నఁడు నుత్పన్నముకానేరదు. కుందేటికి కొమ్మెంత ప్రయత్నించినను పుట్టదు. ఈశ్వరుఁడనువాఁ డన్యుఁడుండినచో నభయస్థితి యసంభవము. ఈశ్వరుఁడు స్వయముగా భయకారణుఁడుగాఁడు; జీవులధర్మాధర్మానురూపముగ నతఁడు ఫలము నిచ్చుటచే ధర్మాధర్మములు భయకారణములగుచున్నవి; విద్వాంసునకు ధర్మాధర్మాచరణము లేదుగనుక నీశ్వరుఁడు భయకారణుఁడుగాఁడనువాదము సయుక్తికముగాదు. ఇట్టివాదముసేయువారు ధర్మాధర్మములుగూడ పరమార్థసత్యములని యంగీకరించుచున్నారు. ఈశ్వరునకు, నతనికిని సహాయభూతములగు ధర్మాధర్మములకునుగూడ వీరి మతమునందు నాశనము లేదుగనుక నభయప్రతిష్ఠ యసంభవమగుచున్నది. జీవబ్రహ్మలకనన్యత్వపక్షమున జీవుఁడు లేఁడు; జీవుఁడు లేకుండుటచే నవిద్యాకల్పితమగు సంసారము లేదు; సంసారము లేకుండుటచే ధర్మాధర్మములు లేవు. అపుడు భయనివృత్తి కలిగి యభయప్రాప్తి కలుగుచున్నది. అజ్ఞానమువలననున్నట్లు గాన్పించు సంసారమున కునికిలేములు చెప్పశక్యము గాదు,

ఈశ్వరుఁడుగూడ భయకారణమగుచున్నాఁడు

జబ్బుకంటివాని కగపడు రెండవచంద్రునియునికి లేములు రెండును లేవు. సంసారమవిద్యాకార్యము. విద్యచే నవిద్య నశించును. దానితోపాటు సంసారము ధర్మాధర్మములుగూడ నశించును. సంసారము నశించిన వెంటనే జ్ఞాని బ్రహ్మమునందభయమగు బ్రతిష్ఠను జెందును. బ్రహ్మము దెలియునంతవఱకు సర్వత్రభయహేతువు, దానిని దెలిసికొనినపు డభయము గలుగుచున్నది.

భయహేతువగు నవిద్యయు, తన్నివారకమగువిద్యయు నాత్మధర్మములన వీలులేదు. అవిరెండు నంతఃకరణధర్మములని ప్రత్యక్షముగ దెలియుచున్నది. నేను మూఢుడను, నాకు విజ్ఞానోదయముగాలేదని యజ్ఞులు సెప్పగా వినుచున్నాము. శిష్యుడు గురువువలన జ్ఞానమును గ్రహించి యితరుల కుపదేశించుచున్నాడు. గ్రహించినదాని నవధారణము సేయుచున్నాడు. కనుక విద్యావిద్యలురెండు నన్తఃకరణధర్మములగుచున్నవి. అన్తఃకరణము నామరూపాత్మకమగుటచే విద్యావిద్యలురెండును నామరూపములకు సంబంధించినవే యగుచున్నవి కాని యాత్మధర్మములు గానేరవు.

విద్యావిద్యల న్తఃకరణ ధర్మలు

జీవుడేబ్రహ్మమగుటచేతను, బ్రహ్మము సంసారముచే నసంస్పృష్టమగుటవలనను జీవునకు స్వయముగా సంసారిత్వము లేదు. కనుక సంసారనాశనముచే నతనికి బ్రయోజనములేదు. శృంఖలాబద్ధుడగువానికి బంధవిమోచనముగాని, తదితరునకు కాదను

జీవుని సంసారమ వాస్తవము

వాదముగూడ సహేతుకముగాదు. నేను సుఖముగానున్నాను. నేను శ్యామవర్ణము గలవాడను–మొదలగు శారీరకమానసిక ధర్మములు జాగ్రత్స్వప్నములయందు నందర మనుభవించు చున్నాము. సుషుప్తియందు నాకేమియు దెలియలేదను సర్వ విషయాజ్ఞానము సుప్రసిద్ధము. అజ్ఞానదశయందు కర్తృత్వాది విశిష్టమగు సంసారము సంప్రాప్తమగుచున్నది. సంసారహేతు వగు నీయజ్ఞానము దొలగుటకై జ్ఞానమవశ్యము. జ్ఞానముచే నాత్మయం దారోపితమగు కర్తృత్వాదిసర్వధర్మము లతని నుండి తొలగుచున్నవి. ఇట్టిజ్ఞానోపదేశముకొఱకే మోక్ష శాస్త్రము ప్రవర్తించుచున్నది.

జీవు డానందమయాత్మకమగు నాత్మను సంక్రమించు చున్నా డని చెప్పబడుచున్నది. జీవబ్రహ్మముల కభేదపక్షములో సంక్రమణము సాధ్యముగాదు. తనలోదాను ప్రవేశింపలేడు. కనుక నభేదవాదము యుక్తి సహము గాదని కొందఱు సెప్పునట్టి యాక్షేప

సంక్రమణశబ్దము జ్ఞానపరము

ణము నిలువనేరదు. ప్రకరణసందర్భమునుబట్టి సంక్రమణ శబ్దమున కర్థకల్పనము జేయవలెను. సంక్రమణశబ్దమిచట ప్రవేశమనుముఖ్యార్థమును బోధింపదు. ఆ శబ్దమునకిచట విజ్ఞానమని యర్థముజెప్పవలయును. శ్రుతిబోధితమగు సంక్ర మణప్రణాళికయం దన్నమయాదిపంచకోశములయందనుక్రమ ముగా సంక్రమణశబ్దము బ్రయోగింపబడినది. ప్రప్రథమమున జీవుడు భార్యాపుత్రాదిరూపమగు బాహ్యప్రపంచమును వదలి యన్నమయకోశమునందు సంక్రమించినట్లు అనగా బ్రవేశించి

నట్లు వినబడుచున్నది. ఇచట సంక్రమణశబ్దమునకు ప్రవేశాత్మకమగు ముఖ్యార్థము సాధ్యముగాదు. వెలుపలినుండి యింటిలోనికివలె భార్యాపుత్రాదులను వదలి యన్నమయకోశమును ప్రవేశించుట లోకములో గానరాదు. భార్యాపుత్రాదులయం దాత్మభావమును బారదోలి యన్నమయకోశ మాత్మయని భావించుటయే ఆవాక్యమునకు సమంజసమగు నర్థము. బుద్ధి నొకదానినుండి మరల్చి మరియొకదానియందు ప్రవేశ పెట్టుటయే సంక్రమణము. పంచకోశములే యాత్మయనుతాదాత్మ్యాభిమానమును నివర్తింపజేయుటయే ప్రయోజనముగా గలవ్యాపారము సంక్రమణమని చెప్పబడుచున్నది. బ్రహ్మాకారమును బొందినయన్తఃకరణవృత్తియే జ్ఞానశబ్దార్థము. తాదాత్మ్యాభిమాననివృత్తి జ్ఞానవిషయము. తాదృశాభిమానకారణమగునజ్ఞానమును బారద్రోలుటయే నివృత్తి. అనాత్మభూత మగునన్నమయాద్యానందమయాన్తము గల కోశపంచకమునం దాత్మత్వభ్రాన్తిని గ్రమముగవిడనాడి బుద్ధిగుహాయందు స్వయంప్రకాశమగు నాపరమాత్మ ననుసంధానముచేసికొనగల వివేకజ్ఞాన మిచట సంక్రమణశబ్దముచే గౌణముగ వివక్షితమగుచున్నది. ఆ శబ్ద మవిద్యావిభ్రమనాశనమునందుపచరించుచున్నది. అట్లుగానిచో సర్వగతమగునాత్మకు సంక్రమణము మరియొకవిధముగ సమకూరనేరదు. అతడు ప్రవేశింపగల మరియొకవస్తువేదియు లేదు. తనలోదాను ప్రవేశించుట యసంభవము. సత్యము, జ్ఞానము, అనంతము అనుశబ్దములచేత సూచింపబడిన పరమాత్మయొక్క ప్రతిపత్తికొఱకు

బహుంభవనము, జగత్సర్జనము, తత్ప్రవేశనము, రసలాభము, అభయత్వము, సంక్రమణము మొదలగు వ్యవహారములు దాని యందు గల్పింపబడినవి. పరమార్థముగుటచే దానియం దెట్టి వికల్పము సంభవము గాదు. జ్ఞానియగువా డిట్టినిర్వికల్పకమగు పరమాత్మయందు పై చెప్పినరీతి నుపసంక్రమించి దేనివలనను భయము జెందక సభయమగుప్రతిష్ఠను బొందుచున్నాడు. ఇదియే ఆనందవల్లికంతకును దాత్పర్యభూతమగు నర్థము.

అష్టమానువాకము సమాప్తము

---

నవమానువాకము

అ॥ పూర్వానువాకమున పంచకోశాతీతమని నిర్దిష్టమయిన బ్రహ్మానందము మనోవాగగోచరమని నవమానువాకమున జూపబడుచున్నది.

మూ:- యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ॥

టీ:- సర్వకారణము నిర్వికల్పము నగునానందస్వరూపమును బొందలేక నద్దానినుండి శబ్దములన్నియు మనస్సుతో గూడ మఱలుచున్నవి.

తా. వి:- ఆనందవల్లి యంతకును సారభూతము ఆనందాత్మకము నగు బ్రహ్మము వికల్పరహితము నిష్క్రియము అద్వితీయము నగుటంజేసి వాగ్బుద్ధులకది యతీతమగుచున్నది.

పరమాత్మ మనో వాగగోచరుఁడు

బ్రహ్మము బుద్ధియందు బ్రతిఫలించి చిదాభాసు డనునామముతో సర్వవ్యవహారములను నిర్వహించుచున్నది. దర్పణమునందలిప్రతిబింబము చేతనే మనముఖమును మనము చూచుకొనియలంకరించుకొనుచున్నాము. మనముఖమును మనము సాక్షాత్తుగ జూడలేము. చిదాభాసునిచే నవభాసితమగు నన్తఃకరణము జ్ఞానేన్ద్రియముల ద్వారా తత్తద్విషయసంయోగమును బొంది తత్తద్విషయాకారమును బొందుచున్నది. అన్తఃకరణముయొక్క వివిధవిషయాకారములు బుద్ధివృత్తులనిబిలువబడుచున్నవి. బుద్ధిజడము గనుక బుద్ధివృత్తులుగూడజడములే. కాని యవిచిదాభాసునిచే నవభాసితములైనపుడు విషయజ్ఞానము గలుగుచున్నది. జ్ఞానేన్ద్రియవిషయము లగుశబ్దస్పర్శరూపరసగంధాదు లన్నియు చిదాభాసవిషయములు. ప్రమేయములన్నియు బ్రమాతయెదుట నుండుటంజేసి 'ఇదం'అనగా "ఈ"యనుశబ్దముచే జూపబడుచున్నవి. ప్రమేయములను దెలిసికొనుప్రమాతయే చిదాభాసుడు. అతడు విజ్ఞానమయస్వరూపుడు.

లౌకిక జ్ఞానోత్పత్తి సాధనములు

ప్రమేయములను దెలిసికొనుటకు ప్రమాతకు మనస్సుజ్ఞానేన్ద్రియములు సాధనములగుచున్నవి. ఈసాధనములు బ్రత్యక్షములు. జ్ఞానసాధనములగుటచే నవిప్రమాణములనబడుచున్నవి. ప్రమాణశబ్దమునకు జ్ఞానసాధనమని యర్థము. ఈజ్ఞానము యదార్థజ్ఞానముగానిచో భ్రమయనబడును. త్రాడును త్రాడుగ దెలిసికొనుట ప్రమయగును. దానినిసర్పముగ దెలిసికొనుట భ్రమయనబడును. ప్రమభ్రమలు రెండును

జ్ఞానస్వరూపములే గాని యొకటి యథార్థజ్ఞానము. రెండవది అయథార్థజ్ఞానము. ఇట్లు ప్రమాతృప్రమాణప్రమేయజాతమంతయు చిదాభాసునిచే నవభాసితమగు వృత్తికరణవృత్తి భేదమై యొకదానితో నొకటి కలియకుండ విడివిడిగానుండును. వేద్యముల శబ్దస్పర్శాదులు బుద్ధిచేత దెలిసికొనబడినపు డాజ్ఞానము నితరులకు దెలియజేయుటకు శబ్దజాల ముపకరించుచున్నది. ఘటమును చక్షుస్సుచే మనస్సు చూచినపుడు ఘటజ్ఞానముగలుగుచున్నది. అపుడు ఘటమర్థముగాగల ఘటశబ్దముచే నాజ్ఞాన మితరులకు సంక్రమింపజేయుచున్నాము. ఈవిధముగ లౌకికవ్యవహారమంతయు చిదాభాసప్రసాదముచేతనే సాగుచున్నది. బుద్ధి ప్రసరించుచోట్లనెల్ల జ్ఞేయవిషయమున కవకాశము గలదు, జ్ఞేయవిషయమున్నయెల్లపట్ల శబ్దప్రవృత్తికవకాశము గలదు. బుద్ధిప్రసరించనపుడు వస్తు జ్ఞానముండదు. వస్తుజ్ఞానము లేనపుడు శబ్దము ప్రవర్తింపదు. సర్వజ్ఞేయ ప్రకాశకుడగుచిదాభాసుని కీశక్తి సాక్షిగానున్న యాత్మప్రకాశముచే గలుగుచున్నది. ఆత్మనిష్క్రియుడు, సర్వవ్యవహారమునకు సాక్షిమాత్రుడు. వ్యవహారమునం దతని కెంతమాత్రము ప్రసక్తి లేదు. అతనికాంతిప్రసారముచే మంచిచెడుగు

ఆత్మ కేవలము సాక్షిమాత్రుడు

వ్యవహారములన్నియు జరుగుచున్నవి. సూర్యకాంతియున్నపుడే సర్వవ్యవహారము సాధ్యమగును. అట్టి వ్యవహారమునందు సూర్యకాంతి కేమాత్రము ప్రసక్తి లేదు. ఇద్దరు వ్యక్తులు వ్యవహారమును సాగించునపు డెదుటనున్న మఱియొక డద్దానియందు స్వయమసంబద్ధుడయి చూచుచుండును. ఇదియే సాక్షిశబ్దమున కర్థము. తనను ప్రకా

శింపజేయునాత్మచైతన్యమును చిదాభాసుడు ప్రకాశింపజేయ లేడు. ప్రతిబింబము తనబింబమును ప్రకాశింపజేయలేదు. చిదాభాసుడే యాత్మచైతన్యమును ప్రకాశింపజేయలేనపుడు చిదాభాసునిచే నవభాసితములగుబుద్ధివృత్తులు గాని తదభివ్యంజకములగుశబ్దములుగాని యాత్మచైతన్యమును ప్రకాశింపజేయలేవని వేరుగ జెప్పనక్కరలేదు. పరమాత్మ నామరూపాది రహితము, అదృశ్యము, అనిర్వాచ్యము, అనిలయము, నిష్క్రియము, నిష్కలము. బుద్ధిచే గ్రహింపదగు లక్షణము లేవియు నద్దానియందు లేకుండుటచే నది బుద్ధికప్రాప్యమగుచున్నది. బుద్ధికప్రాప్యమగుటచే శబ్దమునకవాచ్యమగుచున్నది. పరబ్రహ్మము లింగరహితమగుటచే బరిణామస్వభావము లగుబుద్ధి వృత్తులకు విషయముగాదని తెలుపుటకు పైవాక్యమున మనః శబ్దముపయోగింపబడినది. వేదాన్తవాక్యములయొక్క యఖండార్థమే పరబ్రహ్మముగాని యది వానిప్రతిపదార్థసమన్వయముచే బోధింపబడుటలేదనిచెప్పుటకు వాచః అని ప్రయోగింపబడినది. పరబ్రహ్మము కంటిచేతగాని వాక్కుచేతగాని యితరేన్ద్రియములచేతగాని లభ్యముగాదని మఱియొకశ్రుతి* వినబడుచున్నది.

శబ్దముల యఖండార్థము బ్రహ్మము

పరబ్రహ్మము శబ్దముల కతీతమగుటచే శబ్దప్రమాణము వలన దానిని దెలిసికొనలేము. అంతమాత్రముచే బ్రహ్మజ్ఞానమునుగూర్చి శబ్దములు నిరర్థకములని తలంపవీలులేదు. పరమాత్మ నపి సాక్షాత్తుగ దెలియజేయలేవుగాని తద్విషయక

* న చక్షుషా గృహ్యతే నాపి వాచా (ముండ 3.1.7)

మగు నజ్ఞానమును బోగొట్టుచున్నవి. అజ్ఞానముచే నేనేవి బ్రహ్మమని మనము భావించుచున్నామో యవియన్నియు బ్రహ్మముకానేరవని శబ్దాత్మకమగు వేదాంతశాస్త్రము త్రోసి పుచ్చుచున్నది. ఇట్లు శాస్త్రసహాయముచే బ్రహ్మముగాని దానినంతయు ద్రోసిపుచ్చగా మిగిలియున్నది బ్రహ్మమని తెలియును. శబ్దముచే నజ్ఞాననాశనము,తద్ద్వారా బ్రహ్మజ్ఞానము కలుగుచున్నది. ఆవరణము తొలగినవెంటనే దీపకాంతి కనబడుచున్నది. ఇదియే శబ్దమాహాత్మ్యము. నిద్రించుచున్న మనుష్యుని "గోపాల! నిద్రలెమ్ము" అని కేకవేయగా నతడు నిద్రలేచుచున్నాడు. నిద్రాసమయమున ప్రయోగింపబడిన శబ్దములకును వానియర్థములకును గలసంబంధములను నిద్రించుచున్న గోపాలుడు గ్రహింపలేడు. అయినను శబ్దములచే నతని నిద్ర నశించుచున్నది.అదేవిధముగా శబ్దముచే బ్రహ్మవిషయకాజ్ఞానము నశించును. అజ్ఞానమునశించినవెంటనే 'నేను బ్రహ్మము' ననుజ్ఞానము స్వయముగా భాసించును. 'నీవు బ్రహ్మమయియున్నావ'*ను వాక్యమునందలిపదములకు బ్రత్యేక ప్రత్యేకముగ నర్థమున్నను వానియొక్క పరస్పరార్థసంబంధముతో నవసరములేకయే వాక్యముయొక్క యఖండార్థరసగ్రహణముచే బరబ్రహ్మమునందు బుద్ధిలగ్నమగును. శబ్దమే ముందుగ బ్రహ్మవిషయకాజ్ఞానమును బోగొట్టి తరువాత 'నేను బ్రహ్మము'నను జ్ఞానము నఖండార్థముగ గలుగజేయుచున్నది.ఈజ్ఞానముగూడ నజ్ఞానముతో బాటు నశింపగా కేవల

---

* తత్త్వమసి (ఛాం 6.1)

స్వయంప్రకాశస్వరూపము నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావమునగు పరమాత్మమాత్రము మిగులుచున్నది. చిల్లగింజ తాను నశింపజేయు జలమాలిన్యముతోఁ బాటు తానుగూడ నశించును. పరమాత్మ సిద్ధపదార్థమగుటచే క్రియాసాధ్యముగాదు. కనుక నది విధికి విషయము గాదు. 'సంధ్యావందనము జేయుము-యజ్ఞమును జేయుము' అను మొదలగు స్థలములయందువలె కర్తవ్యమును విధించు నాజ్ఞారూపకములగు క్రియలకచట బ్రసక్తి లేదు. 'ఆత్మసాక్షాత్కారము చేసికొనదగినది'*యను ప్రయోగమునందు వినబడుచున్న 'చేసికొనదగినది' యనుక్రియ నియోగపరము గాదు. విధిబోధకక్రియలన్నియు నియతముగ కర్మాచరణపరములు. కర్మాచరణఫలము కార్యరూపమగుటచేత ననిత్యము దానిచే నిత్యమగు మోక్షము సిద్ధింపనేరదు. ఆత్మజ్ఞానమును విధించుక్రియలన్నియు నన్యమార్గమున బ్రవర్తించు సహజమగు మానుషప్రవృత్తి నట్టిమార్గమునుంచి మరలించి యాత్మోన్ముఖములుగ జేయుటకుమాత్ర ముపకరించును.

బ్రహ్మము విధి విషయము గాదు

ఋజుమార్గవర్తియు, సర్వైషణావినిర్ముక్తుడు నగు శ్రోత్రియునియొక్క యాత్మభూతము నిర్విషయము, స్వభావసిద్ధము, నిత్యము, రసఘనము నగు నా బ్రహ్మానందమును యథోక్తమార్గమున సాక్షాత్కారము జేసికొనిన బ్రహ్మవిదుడు బ్రహ్మమే యగుచున్నాడు. ద్వైతమతని

బ్రహ్మజ్ఞానమునకును బ్రహ్మానందమునకును నన్యవధానము

* ఆత్మా వా అరే ద్రష్టవ్యః (బృ 4)

భానమునకు దూరముగనుక నతనికి భయకారణము లేదు. బ్రహ్మజ్ఞానమునకును బ్రహ్మానందమునకు నెంతమాత్రము వ్యవధి లేదు. అజ్ఞానము నశించి జ్ఞానము కుదిరినకొలది బ్రహ్మానందావాప్తి యెక్కువగుచుండును. ఆకలిగొన్నవాని కన్నము తినినకొలది ఆకలి తీరి తృప్తిగలుగుచుండును. మనోమయకోశోపాధికముగ బ్రహ్మము నుపాసించుటచే నీజన్మమునగాని జన్మాన్తరమునగాని భయము లేదని మనోమయప్రకరణమున జెప్పబడినది. ఆమంత్రముచేతనే అద్వితీయబ్రహ్మానందము నొందినవానికి భయకారణము లేదని యీప్రకరణమున పేర్కొనబడినది.

అ॥ బ్రహ్మజ్ఞానికి వేదచోదితమగు విధినిషేధమార్గము నతిక్రమించుటవలన నెంతమాత్రము భయముకలుగదని చెప్పబడుచున్నది.

**మూ:-** ఆనందం బ్రహ్మణో విద్వాన్ । న బిభేతి కుతశ్చనేతి । ఏతగ్ం హ వావ న తపతి । కిమహగ్ం సాధు నాకరవమ్ । కిమహం పాపమకరవమితి । స య ఏవం విద్వానేతే ఆత్మానగ్ం స్పృణుతే । ఉభే హ్యేవైష ఏతే ఆత్మానగ్ం స్పృణుతే । య ఏవం వేద । ఇత్యుపనిషత్ ॥

టీ:- మనోవాగతీతమగు బ్రహ్మముయొక్క యానందమును దెలిసికొనినవాడు దేనివలనను భయమునొందడు. అవసానసమయమున 'నేను పుణ్యకర్మల నేల జేయకపోతిని? పాపకర్మము నేలజేసితిని?' అను మొదలగు చింత బ్రహ్మవిదుని తపింపజేయలేదు. ఎవ్వడీవిధముగా దెలిసికొనునో అతడాత్మను బలపఱచుకొనుచున్నాడు. ఎవ్వడీవిధముగా దెలిసికొను

చున్నాఁడో అతఁడు పుణ్యపాపముల రెంటిని ఆత్మనుగూర్చి బలపఱచుచున్నాఁడు.

తా. వి:- విధినిషేధములు ధర్మాధర్మములు పుణ్యపాపములు మొదలగునవి ప్రవృత్తిమార్గప్రవిష్టులైనవానిని గూర్చి నిర్దేశింపబడినవిగాని యవి నివృత్తిమార్గమున నుత్తీర్ణుఁడయిన బ్రహ్మజ్ఞానివిషయములు గావు. బ్రహ్మజ్ఞానికి తద్విషయమగు చింతమరణకాలమునగాని యంతకుపూర్వముగాని యెంతమాత్రి ముండనేరదు. అట్టివిచారముచే నతఁడెంతమా త్రము నుద్వేగము నొందఁడు. అవిద్వాంసునికి బ్రహ్మజ్ఞానికి సాధ్వాచరణచింత నము లేమ మాత్రమది సంతాపహేతువగును. ఈసంతాపము కర్మాచరణమునకు సహజము, అహంకర్తృత్వాభిమాననిమిత్తము నగుచున్నది. విద్వాంసుఁడు సాధ్వసాధుకర్మహేతువగు నవిద్యను అహంకారమునుగూడ జ్ఞానాగ్నియందాహుతిజేయుటచే కర్మలతనికి ఆచరణీయములుగావు. "నేనుబ్రహ్మము" నను దృఢజ్ఞానమతనికి పుష్టినిగలుగజేయును. ఆత్మ స్వయముగాబలిష్ఠమైనను నవిద్యాక్రాంతమగుటచే నిగుఱుగప్పిన నిప్పువలె బలహీనమయినట్టుల గాన్పించును. జ్ఞానముచే నజ్ఞానపరాగము వినష్టమగుచుండగా నాత్మ సహజరూపమున బ్రకాశించును. బ్రహ్మజ్ఞానికి సర్వము బ్రహ్మమే గనుక శుభాశుభములుగూడ నతనికి బ్రహ్మానన్యములే యగుచున్నవి. ఆత్మభావమున భావింపబడు పుణ్యపాపములు నిర్వీర్యములయి జ్ఞానికి సంతాపహేతువులుగాని జన్మాన్తరకారణములు గాని గానేరవు.

ఇట్లధికారిసాధనపురస్సరముగ బ్రహ్మమే నిశ్శ్రేయస మని ప్రప్రథమమున యాశలూర నుపదేశింపబడినది. అట్టి బ్రహ్మముయొక్క యుపలబ్ధిస్థానము, బ్రహ్మ త్మానన్యత్వము, అనాత్మభూతమగుకోశపంచ కమునుండి యాత్మనువివేకించుమార్గము ప్రదర్శింపబడినది.

సింహావలోకనము

తరువాత వివిధోపపత్తిప్రదర్శనముచే బ్రహ్మాస్తిత్వము సిద్ధము చేయబడినది. సర్వానందములకంటె బ్రహ్మానంద ముత్కృష్ట తమమని వర్ణింపబడినది. అట్టిబ్రహ్మ మభయము సర్వప్రతి ష్ఠానమనియు నిరూపింపబడినది. బ్రహ్మానందము నొందినవానికి పుణ్యాపాపనిమిత్తమగుసంతాపహేతువు లేమింజేసి జన్మాంతరము లేకుండుటచే నిశ్శ్రేయసాత్మకమగుమోక్షావాప్తి సంసిద్ధమని మొదట నుపదేశింపబడినబ్రహ్మజ్ఞానఫలము నిగమనము చేయ బడినది. ఈవిధముగ బ్రహ్మజ్ఞానము సర్వసంసారోచ్ఛేదన సాధనమయి బ్రహ్మావాప్తికి హేతువగుటచే దానికిని దానినుపదే శించుగ్రంథమునకును గూడనుపనిషచ్ఛబ్దమన్వర్థమగుచున్నది.

నవమానువాకము సమాప్తము

బ్రహ్మానన్దవల్లీ సంపూర్ణము

---

శ్రీగురుభ్యోనమః

# భృగు వల్లి

అ॥ శ్రవణమనననిదిధ్యాసనము లనుమూడు నాత్మసాక్షాత్కారోపాయములుగ నుపదేశింపబడినవి.* వీనిలో మొదటిదియగు శ్రవణము వేదములయందు సంపూర్ణవిశ్వాసముగలిగి గురుసన్నిధియందు జేయదగినది. అందువలన బ్రహ్మముయొక్క పరోక్షజ్ఞానమబ్బును. గురుసన్నిధిని శ్రవణముజేసిన వేదాన్తవాక్యార్థమును శ్రుతిమతతర్కానుసారముగ చింతనముసేయుట మననమగును. దీనిచే సందేహములు వీడిపోయి దృఢజ్ఞానము గుదురును. మననమవశ్యకర్తవ్యము. అదియొకవిధమగుతపస్సు. బ్రహ్మవల్లియందు బ్రహ్మవిద్యావిచారము సమగ్రముగ శ్రుతముచేయబడినది. తదనంతరము జేయవలసిన మననాత్మకమగు తపస్సు భృగువల్లియందుపదేశింపబడుచున్నది. మననఫలము నిదిధ్యాసనాసౌష్టవము. మననముచే నిశ్చితమయిన నిర్గుణబ్రహ్మాత్మస్వరూపమును మనమునందునిలిపి బ్రహ్మైకమగు స్వస్వరూపమున ననవరతము భావించుటయే నిదిధ్యాసనము. బ్రహ్మవిద్యయే బ్రహ్మభృగువల్లీద్వయమునందు వివరింపబడినది. ఉపదేశాత్మకము బ్రహ్మవల్లి. అనుభవాత్మకము భృగువల్లి. వల్లీద్వయమున కీవిధమున నేకవాక్యతగల్గుచున్నది. విషయగ్రహణసౌలభ్యము కొరకీ మననప్రకార మొకయాఖ్యాయికారూపమున ప్రవేశపెట్టబడుచున్నది.

వల్లీద్వయముయొక్క యేకవాక్యత॥

---

* ఆత్మావా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః (బృ 4-5-6)

## ప్రథమానువాకము.

మూ:- భృగుర్వై వారుణిః । వరుణం పితర ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తస్మా ఏతత్ప్రోవాచ । అన్నం ప్రాణం చక్షుః శ్రోత్రం మనో వాచమితి। తగ్ం హోవాచ। యతో వా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి । యత్ప్రయన్త్యభిసంవిశన్తి । తద్విజిజ్ఞాసస్వ । తద్బ్రహ్మేతి । స తపోఽతప్యత। స తపస్తప్త్వా॥

టీ:- వరుణపుత్రుడగు భృగువనువాడు "ఓపూజ్యుడవగు తండ్రీ! నాకు బ్రహ్మమునుపదేశింపుడు" అని తండ్రిని సమీపించి ప్రార్థించెను. అపుడు 'అన్నము ప్రాణము చక్షుస్సు శ్రోత్రము మనస్సు వాక్కు' అని వరుణుడు పుత్రునికుపదేశించెను. మఱియు దేనివలన నీభూతము లుత్పన్నములగుచున్నవో, ఉత్పన్నములయినభూతములు దేనిచేత జీవించుచున్నవో, ప్రళయము నందవి దేనిని బొందుచున్నవో అది బ్రహ్మమని తెలిసికొనుమని యతడు తెలియజెప్పెను. ఈరెండువాక్యములు తండ్రివలన విని భృగువు తపమునాచరించెను. తపస్సుజేసి—

అ॥ భృగువు తపస్సుచే మొదటగ్రహించినది యేమన?

## ద్వితీయానువాకము.

మూ:- అన్నం బ్రహ్మేతి వ్యజానాత్। అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయన్తే। అన్నేన జాతాని జీవన్తి। అన్నం ప్రయన్త్యభిసంవిశన్తీతి। తద్విజ్ఞాయ। పునరేవ వరుణం పితరముపససార। అధీహి భగవో బ్రహ్మేతి। తగ్ం హోవాచ। తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ।తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత। స తపస్తప్త్వా।

టీ:- అన్నమే బ్రహ్మమని యతడు తెలిసికొనెను. ఏలనన, ఈభూతము లన్నమువల్లనే బుట్టుచున్నవి; పుట్టిన భూతములన్నముచేతనే జీవించుచున్నవి; లయకాలమున నవి యన్నమున బ్రవేశించుచున్నవి. ఇట్లు తెలిసికొని భృగువు నుజల తండ్రి దగ్గరకువెళ్లి తనకు బ్రహ్మముపదేశింపుడని గోరెను. తపస్సుచేతనే బ్రహ్మమును తెలిసికొనుము, తపస్సే బ్రహ్మమని తండ్రి కుమారునకు తెలియచెప్పెను. ఆతడు తిరిగితపస్సు జేసి

అ॥ రెండవతూరి గ్రహించినది యేమన!

## తృ తీ యా ను వా క ము

మూ:- ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్ । ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । ప్రాణేన జాతాని జీవన్తి । ప్రాణం ప్రయన్త్యభిసంవిశ న్తీతి । తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితరముపససార అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ। తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ। తపో బ్రహ్మేతి। స తపోఽతప్యత । స తపస్తప్త్వా ।

టీ:- ప్రాణము బ్రహ్మమని యతడు తెలిసికొనెను. ఏలనన ప్రాణమునుండియే ఈభూతము లుత్పన్నములగుచున్నవి. ఉత్ప న్నములయినవి ప్రాణముచేత జీవించుచున్నవి; ప్రాణమునందు లయమగుచున్నవి. ఇట్లు తెలిసికొని తిరిగి తండ్రిదగ్గరకుచని తనకు బ్రహ్మమునుపదేశింపుడని యతడు గోరెను. తపస్సుచేతనే బ్రహ్మమును దెలిసికొనుము. తపస్సే బ్రహ్మమని వరుణుడు కుమారునికి తిరిగి దెలియజెప్పెను. భృగువు తిరిగి తపస్సుజేసి

అ॥ మూడవపర్యాయము తెలిసికొనబడిన విషయమేమన !

## చ తు ర్థా ను వా క ము

మూ:- మనో బ్రహ్మేతి వ్యజానాత్ । మనసో హ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । మనసా జాతాని జీవన్తి । మనః ప్రయన్త్యభిసంవిశన్తీతి తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితరముపససార । అధీహి భగవో బ్రహ్మేతి తగ్ం హోవాచ తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా॥

టీ:- మనస్సు బ్రహ్మమని తెలిసికొనెను. ఏలనన, మనస్సువలననే భూతములుత్పన్నములగుచున్నవి. ఉత్పన్నములయినవి మనస్సుచేత జీవించుచున్నవి; మనస్సునందు లయమగుచున్నవి. ఇట్లు తెలిసికొని, తనకు బ్రహ్మముపదేశింపుడని తిరిగి తండ్రిదగ్గఱకు బోయెను. తపస్సుచేతనే బ్రహ్మమును దెలిసికొనుము; తపస్సే బ్రహ్మమని వరుణుడు పుత్రునకు దెలియజెప్పెను. అతడు తిరిగితపస్సుజేసి—

అ॥ నాల్గవపర్యాయము తెలిసికొన్నవిషయ మేమన !

## ప ం చ మా ను వా క ము

మూ:- విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్ । విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । విజ్ఞానేన జాతాని జీవంతి । విజ్ఞానం ప్రయన్త్యభిసంవిశన్తీతి । తద్విజ్ఞాయ । పునరేవ వరుణం పితరముపససార । అధీహి భగవో బ్రహ్మేతి । తగ్ం హోవాచ । తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ । తపో బ్రహ్మేతి । స తపోఽతప్యత । స తపస్తప్త్వా॥

టీ:- విజ్ఞానము బ్రహ్మమని తెలిసికొనెను. ఏలనన, విజ్ఞానమువలననే భూతములుత్పన్నములగుచున్నవి. ఉత్పన్నములయినవి విజ్ఞానముచే జీవించుచున్నవి. విజ్ఞానమునందే లయ

మగుచున్నవి. ఇట్లు తెలిసికొని బ్రహ్మమును తనకుపదేశింపుడని తిరిగితండ్రికడకు జేరెను. తపస్సుచేతనే బ్రహ్మమును తెలిసికొనుము. తపస్సే బ్రహ్మమని వరుణుడు తెలియజెప్పెను. భృగువు తిరిగి తపస్సుజేసి—

తా. వి:- వరుణపుత్రుడగుభృగువు వేదాధ్యయనము ననుస్నాతముగ బూర్తిజేసి విధ్యుక్తమార్గమున తండ్రిదరిజేరి తనకు బ్రహ్మముపదేశింపుడని సకౌతుకముగ బ్రార్థించెను. విద్యలలోనెల్ల నుత్కృష్టతమము, పవిత్రము, పరమరహస్యము నగుబ్రహ్మవిద్యను సంప్రదాయసిద్ధముగ యోగ్యుడగు నాచార్యునివలన తెలిసికొనవలయును. వరుణు డిందుకన్నివిధముల దగినవాడు. బ్రహ్మోపదేశమున కన్నివిధముల దగినపుత్రుడే శిష్యుడుగ నేర్పడినాడను సంతోషముతో వరుణుడు తనపుత్రున కిట్లుపదేశింపదొడంగెను. "అన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, వాక్కు" అని. ఇంతటితోనాగక "దేనివలన నీభూతములు పుట్టుచున్నవో, పుట్టినభూతములు దేనిచేత జీవించుచున్నవో, దేనిలో నవి లయమగుచున్నవో అది బ్రహ్మమని తెలిసికొనుమని పలికెను. పితృపాదులు జేసినయుపదేశమునుగూర్చి వరుణుడు విచారింపదొడంగెను. బ్రహ్మముపదేశింపుడని పుత్రుని ప్రార్థనకు ప్రతివచనముగ సాక్షాద్బ్రహ్మస్వరూపమును బోధింపక వరుణుడు మరియొకమార్గమున బోయెను.

వరుణోపదేశము

ఇట్టివరుణోపదేశతాత్పర్యము విచారించెదముగాక. ఈయుపదేశము రెండువాక్యములుగ నున్నది. "అన్నము,

ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కు” యనునది మొదటివాక్యము. “దేనివలన నీభూతము లుత్పన్నములగుచున్నవో, పుట్టినవి దేనివలన జీవించుచున్నవో, దేనియందు లయమగుచున్నవో అది బ్రహ్మమని తెలిసికొనుము” అనునది రెండవవాక్యము. మొదటివాక్యమున కర్థమేమి? రెండవవాక్యమున కర్థమేమి? ఈరెంటికిని సంబంధమేమి?

బ్రహ్మజ్ఞానమునకు కోశపంచకము ద్వారభూతము

ఇచట నఖండబ్రహ్మోపలబ్ధియే యుపదేశవిషయము. సత్యజ్ఞానానంతాదిలక్షితమగు పరబ్రహ్మము నిర్ధర్మకము, అవాఙ్మానసగోచరము. దానిస్వరూపనిరూపణము సాక్షాత్తుగా సాధ్యము కాదు. సర్వులకు తెలిసినమార్గమున నద్దాని నుపదేశింపవలయును. ‘నేను’ అనుశబ్దముచే నుపలక్షితమగు నాత్మరూపమున నది సర్వవిదితము. బ్రహ్మము నా స్వరూపమున దెలిసికొనుమార్గ మిచట యుపదేశింపబడుచున్నది. బుద్ధిగుహాయం దీయాత్మను తెలిసికొనుటకుముందు పంచకోశాదులయందలి యజ్ఞానకల్పితమగు నాత్మత్వభ్రాంతి తొలగవలయును. ఈప్రణాళిక బ్రహ్మవల్లియందు వినుపింపబడినది. దానిని మననపూర్వకముగ ననుభవమునకు తెచ్చుకొనవలయును. అచట పూర్వపూర్వకోశము ననాత్మభావముచే దాటి జిజ్ఞాసువుయొక్క బుద్ధి, యాన్తరము, సూక్ష్మతరము నగు నుత్తరోత్తరకోశమున క్రమముగ ప్రవేశపెట్టబడి తుట్టతుదకు హార్దాకాశమున నభయప్రతిష్ఠాభూతమగుప్రత్యగాత్మదరికి చేర్చబడినది. అనగా పంచకోశములు హార్దాకాశమునను న్న పర

బ్రహ్మమును జేరుటకు ద్వారములుగా జేయబడినవి. ఈపద్ధతి శిక్షనే వరుణుడుగూడ నిచట ననుకరించినాడు.

అన్నప్రాణశబ్దములచేత తత్తద్వికారభూతములగు నన్నమయప్రాణమయకోశము లవగతమగుచున్నవి. మనశ్శబ్దముచే నంతఃకరణవికారము లగుమనోమయవిజ్ఞానమయానందకోశములు సూచింపబడుచున్నవి. చక్షుశ్శ్రోత్రశబ్దములచేత జ్ఞానోపలబ్ధిసాధనభూతములగుజ్ఞానేన్ద్రియపంచకముపలక్షితమగుచున్నది.

ప్రథమ వాక్యార్థము

వాక్ఛబ్దముచే కర్మేన్ద్రియపంచకము చేర్పబడుచున్నది. అన్నప్రాణమనోమయములు భోగ్యములు. విజ్ఞానమయుడు భోక్త. ఇంద్రియపంచకద్వయము భోగసాధనములు. ఇట్లన్నాదిశబ్దషట్కముచే భోగ్యభోక్తృభోగసాధనము లుపవర్ణితములగుచున్నవి. బ్రహ్మోపలబ్ధి తపస్సుచేతనే సాధ్యము. బాహ్యాన్తఃకరణసమాధానమే తపస్సు. జన్మస్థితిలయహేతుత్వము బ్రహ్మలక్షణమని చెప్పబడినది. ఈబ్రహ్మలక్షణము నన్నమయాదులయందు సమన్వయముజేయగా నిచట బ్రహ్మజిజ్ఞాసకు తిరిగి ప్రశ్నకలుగకుండునటుల సమాధానము చిక్కనో యచటు బ్రహ్మమును దెలిసికొనవలయునని 'తపసా విజిజ్ఞాసస్వ' యనువరుణోపదేశతాత్పర్యము. బ్రహ్మము ఘటాదులవలె జ్ఞేయముగాదు. శాస్త్రముగూడ నద్దాని సాక్షాత్తుగ దెలియచెప్పలేదు. అనాత్మభూతము లగుపంచకోశముల నిరసనముచేతనే నది బ్రహ్మమును బోధింపుచున్నది. బ్రహ్మజ్ఞానమునకు విక్షేపముగలుగజేయు నన్నమయాదిపంచకోశముల నబ్రహ్మత్వ

రూపమున త్రోసిబుచ్చుటయే భృగువుయొక్క తపఃప్రయోజనము. భృగు వీవిషయమునే మననముచేసెను. ఇదియే యతడు చేసినతపస్సు. పంచకోశముల స్వరూపమును బ్రహ్మానందవల్లియందు వివరింపబడినప్రకారము మననముచేసి బ్రహ్మమును దెలిసికొనుమని బోధించుట కన్నమయాదులను వరుణుడుదాహరించెను.

బ్రహ్మలక్షణము దెలిసినగాని యన్నమయాదుల యాత్మత్వానాత్మత్వముల నిశ్చయించుటకుసాధ్యముగాదు. అందుకొఱకు రెండవవాక్యమున బ్రహ్మలక్షణము నిరూపింపబడినది. ఇచట నిర్వచింపబడిన బ్రహ్మలక్షణము తటస్థలక్షణము. ద్వితీయ వాక్యార్థము బ్రహ్మము సత్యజ్ఞానానంతములచేత బ్రహ్మవల్లియందు నిర్వచింపబడినది. ఇది స్వరూపలక్షణము. ఆరోపిత మగుజగజ్జన్మస్థితిలయహేతుత్వరూపతటస్థలక్షణముగూడ బ్రహ్మవల్లియందు నిరూపింపబడినది. స్వరూపలక్షణము విచారచతురేతరమతులకు దుర్విజ్ఞేయము. పంచకోశములాత్మ యనుభ్రాంతమతుల కదిశక్యముగాదు. తటస్థలక్షణము మందమతులకుగూడ సుగమము. పంచకోశములయం దాత్మత్వబుద్ధిని మరల్చుటకు తటస్థలక్షణ ముపాయమగుచున్నది. అందువలన నిచట తటస్థలక్షణము భృగువుయొక్క మననార్థము వరుణునిచే ప్రదర్శింపబడినది. ఇట్టి తటస్థలక్షణము నన్నమయాదులయందు సమన్వయముచేయ వానియం దాలక్షణము సంపూర్ణముగసమన్వయముకానందున నవి బ్రహ్మము

గా నేరవని యతడు త్రోసివేయగల్గెను. బుద్ధినిర్మలమయ్యెను. హార్దాకాశమున బ్రహ్మమును భృగువు తెలిసికొనగలిగెను. బ్రహ్మముయొక్క అవిద్యాకల్పిత మగుతటస్థలక్షణము బ్రహ్మోపలబ్ధికి సాధనమాత్ర మగుచున్నది. ముత్యపుచిప్ప యందజ్ఞానకల్పిత మగురజతభ్రాంతి పోయినపుడు రజతముగా భాసించినది నిజముగాశుక్తియను యథార్థజ్ఞానము గల్గుచున్నది. పరిదృశ్యమానమగు నీజగత్తు సత్యమనునభిమానముచే నభిభూతులగువారు తటస్థలక్షణముచే నదియసత్యమని గ్రహించి యద్దాని త్రోసిపుచ్చగలరు. స్థితికాలమునందు దృష్టము, తత్పూర్వమదృష్టము, తదనంతరము నష్టము నగునీ ప్రపంచ మసత్యము, రజతమువలె భ్రాంతిమాత్రము. జగత్సత్యత్వభ్రాంతి కధిష్ఠానభూతము, నిత్యము, అద్వితీయము, అసంగము నగుకారణమన్యము గలదని తటస్థలక్షణముచే చూపబడుచున్నది. ఈవిధమున బ్రహ్మేతర మగుజగత్తంతయు నసత్యమనుజ్ఞానము తటస్థలక్షణముచే గలుగుచున్నది. జగత్తసత్యమని దృఢముగా తెలిసి త్రోసివేయబడినపుడు స్వరూపలక్షణసమన్వయముచే బ్రహ్మమునపరోక్షముగ దెలిసికొనుటకు సాధ్యము. ఇందుకు తగినభూమిక వరుణునియొక్క రెండవ వాక్యముచే నాయత్తము జేయబడుచున్నది. దీనివలన యను పంచమీవిభక్తిచే బ్రహ్మము జగత్తునకుపాదానకారణమని సూచింపబడుచున్నది.

భృగువు వేదాధ్యయనసంపన్నుడు. కృతకములగు కర్మజాలముచే నకృతకమగు మోక్షము సిద్ధింపజాలదని* దెలిసికొనుట వలన వైరాగ్యముపొందెను. బ్రహ్మమునుపదేశింపుడని సకౌతుకముగ తండ్రిని ప్రార్థించెను. ఉత్కటముగు బ్రహ్మజిజ్ఞాసాచోదితుడగు నతనికి తండ్రి యుపదేశించిన మార్గము విచారభూమిక అయ్యెను. పితృపాదులు సాక్షాత్తుగ బ్రహ్మమునుచెప్పక పరోక్షముగ నేలనద్దాని నుపదేశించిరని యతడు మననముచేయ దొడంగెను. సాక్షాత్ బ్రహ్మజ్ఞాన ముపదేశ్యవిషయము గాదనియు మనననిదిధ్యాసములచే స్వయముగా నిర్ణేయమనియు తండ్రితాత్పర్యమని దెలిసికొని తండ్రిచెప్పిన తటస్థలక్షణము నన్నమయకోశమున సమన్వయము జేయదొడంగెను. అన్నరూపమగు రేతస్సుచే జన్మము గలుగుచున్నది. అన్నముచేతనే ప్రాణికోటి జీవధారణము సేయుచున్నది. మితిమీరిన భోజనమువలన మరణము సంప్రాప్తమై యన్నకారణమగు పృథివి యందు భూతములు లయమగుచున్నవి. ఇట్లు స్థూలదృష్టిచే తండ్రిబోధించిన బ్రహ్మలక్షణ మన్నమునందు సృష్టిస్థితిలయ సామ్యముచే సమన్వయముచేసి యన్నము బ్రహ్మమని నిశ్చయించెను. కాని యంతటితో నతనికి బ్రహ్మజిజ్ఞాస నివర్తింపలేదు. బ్రహ్మము నిర్వికారము నిత్యమని భృగువెఱుంగును. వికారాత్మకము నశ్యమునగు నన్నము సృష్టిస్థితిలయకారణ

భృగువుయొక్క మననప్రకారము

---

* పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన (ముండక 1-2-12)

మైనను బ్రహ్మముగా నేరదని నిశ్చయించి పునర్విచారణకు దొడంగెను. నశ్వరమగునన్నము బ్రహ్మముగా నేరదని త్రోసి బుచ్చెను. ఇటులనే తండ్రిచెప్పిన బ్రహ్మలక్షణ మూపాతముగ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయములయందు సమన్వయమయినను జడత్వాలయత్వక్షణికత్వాదిదోషములచే నవి బ్రహ్మములుగా నేరవని నిశ్చయించెను. ఇట్లు క్రమముగా నన్నమయాదిపంచకోశముల నబ్రహ్మత్వముచే త్రోసిబుచ్చెను. తుదకానందమునందు బ్రహ్మలక్షణము సంపూర్ణముగ సమన్వయమగుటంజేసి నద్దాని బ్రహ్మముగానిశ్చయించెను. అంతటితో జిజ్ఞాసపూర్తిగనివర్తించెను. క్రమముగ నన్నమయాదులబ్రహ్మత్వముచే త్రోసివేయబడి వానియందలి బ్రహ్మత్వబుద్ధి నశించెను. బుద్ధియందు విక్షేపరహితము, నిర్మలము నగు బ్రహ్మజ్ఞానభూమిక సిద్ధమయ్యెను. ఇదియంతయు భృగువు యొక్క మననాత్మక మగుతపస్సుయొక్క ఫలము.

గంభీరమగు వరుణోపదేశముయొక్క సమగ్రతాత్పర్యమును గ్రహించుటకు బృహదారణ్యక కేనోపనిషత్తులలోని సజాతీయములగు మరికొన్ని వాక్యముల నీయుపదేశ వాక్యములతో సంయోజనముచేసి యన్నిటికి నేకవాక్యతారూప మగునర్థనిర్ణయము జేయవలయును. అపుడే వరుణోపదేశరహస్యము బుద్ధికి సంపూర్ణముగ ద్యోతితమగును. "ప్రాణమునకు ప్రాణము, చక్షుస్సునకు చక్షుస్సు, శ్రోత్రమునకు శ్రోత్రము, అన్నమునకన్నము, మనస్సునకు మనస్సని బ్రహ్మవిదులు పురాణము నగ్ర్యము నగుబ్రహ్మమును వర్ణించిరి" యను నర్థమును బృహ

దారణ్యకశ్రుతి* చెప్పుచున్నది. శ్రోత్రమునకు శ్రోత్రము, మనస్సునకు మనస్సు, వాక్కులకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, చక్షుస్సునకు చక్షుస్సు అని తెలిసికొని శ్రోత్రాముల యం దాత్మభావమును పరిత్యజించి యుపగతసర్వైషణులు ధీమంతులునగువా రమరణధర్మమును బొందిరి" యనునర్థమును కేనోపనిషన్మాత్రము♦ బోధించుచున్నది. చక్షురా జ్ఞానేన్ద్రియపంచకము వాగాదికర్మేన్ద్రియపంచకము ప్రాణపంచకము అన్తఃకరణము ఇవియన్నియు నచేతనములు. అయినను నవి జ్ఞానసాధనములై చేతనసాధ్యమగుకర్మ నాచరించుచున్నవి. రథాద్యచేతనము లేదియో యొక చేతనవంతమగు నధిష్ఠాతయొక్క ప్రేరణములేక ప్రవృత్తములగుట యనుభవసిద్ధముగాదు. అటులనే యీయింద్రియములుగూడ చేతనవంతమగునేదియో యొక నధిష్ఠాతయొక్క ప్రేరణములేక స్వస్వవ్యాపారక్షమములు గానేరవని యూహింపవలసియున్నది. ఇంద్రియములన్నియు మరియొకచేతన మగువస్తువుచే నధిష్ఠింపబడియున్నవను విషయ

వరుణోపదేశముయొక్క సంపూర్ణవిచారణ

మూహచేతనేగాక వివిధశ్రుతిప్రమాణము చేతగూడసిద్ధమగుచున్నది. "ఆత్మజ్యోతిస్సు చేతనే మనుజుడున్నాడు".♦♦ "ఆత్మ

---

* ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షురుత శ్రోత్రస్య శ్రోత్రమన్నస్యాన్నం మనసో యే మనో విదుః తే నిచిక్యుర్బ్రహ్మపురాణమగ్ర్యమ్॥ బృ 4-4-18

♦ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో, యద్వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవంతి (కేన 1-2)

♦♦ ఆత్మనైవాఽయం జ్యోతిషాఽస్తే (బృ 4-3.6)

కాంతిచేతనే ప్రపంచమంతయు ప్రకాశించుచున్నది" * ఆత్మకాంతిచేతనే సూర్యుడు తేజోవంతుడై లోకములను తపింపచేయుచున్నాడు" ♦ "దేనిచేత ప్రాణము ప్రాణవంతమగుచున్నదో అది బ్రహ్మమనిదెలిసికొమ్ము"♦♦ అనువర్థమును బోధించు శ్రుతులనేకములు బ్రహ్మాధిష్ఠాతృత్వమును బోధించుచున్నవి. చైతన్యజ్యోతిస్సుచేత ప్రకాశింపబడుటచేతనే చక్షుస్సు రూపము నభివ్యక్తముచేయగలుగుచున్నది. నిత్యము సర్వాన్తరము నగునీయాత్మజ్యోతిస్సునది లేనిచో చక్షుస్సున కిట్టిసామర్థ్యము గలుగనేరదు. అందువలన నాత్మతేజస్సు చక్షుస్సునకు చక్షుస్సగుచున్నది. ఈవిధముగనే ప్రాణాదులు కూడ నీయాత్మజ్యోతిస్సుచే ప్రకాశితములు గానిచో నవి స్వస్వవ్యాపారక్షమములు గానేరవు. కనుకనే బ్రహ్మము అన్నమునకన్నము, ప్రాణమునకుప్రాణము నగుచున్నది. అందువలన చేతనవంతమగు నేకారణముచేత నన్నాదులు స్వస్వవ్యాపారనిర్వహణసమర్థము లగుచున్నవో యాకారణము బ్రహ్మమనియు, అన్నాదులు బ్రహ్మోపలబ్ధిస్థానములనియు పర్యవసన్నమగుచున్నది. అన్నాదిపదార్థములు కొన్నిమాత్ర మిచట బ్రహ్మోపలబ్ధిస్థానముగ ప్రస్తావింపబడినవి. యథార్థ మారయ, భోగ్యభోక్తృభోగసాధనభూతములగుసర్వభూతములు బ్రహ్మోపలబ్ధిస్థానములే యగుచున్నవి. అందువలననే బ్రహ్మో

* తస్య భాసా సర్వమిదం విభాతి (ముం 2-2-10)

♦ యేన సూర్యస్తపతి తేజసేద్ధః

♦♦ యేన ప్రాణః ప్రణీయతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి (కేన 1-8)

పలబ్ధిబోధక మగువరుణుని రెండవవ్యాక్యమునందు 'ఈభూతము లన్నియు' నని బుద్ధిగోచరమగు సమస్తవస్తుజాలము సంగ్రహింపబడినది. 'ఈసర్వము బ్రహ్మమే'* యని మరియొకశ్రుతి గలదు. భోగ్యభోక్తృభోగసాధనరూప మగుప్రపంచమంతయు బ్రహ్మోపలబ్ధిస్థాన మగుచున్నదని వరుణోపదేశముయొక్క నిష్కృష్టితార్థము. రహస్యాతిరహస్య మగునీతత్త్వమును వరుణుడు తనకుమారునకు ప్రథమవాక్యమున నుపదేశించెను. ఇట్టిసంప్రదానార్థమునందు తస్మై (అతనికొఱకు)అని చతుర్థీ విభక్తి ప్రయోగింపబడినది. అది యుపదేశవాక్యము. ద్వితీయవాక్యము సామాన్యమగు లక్షణవాక్యము. అందువలన 'తం' అని ద్వితీయావిభక్తి సామాన్యముగ వాడబడినది.

పంచమానువాకము సమాప్తము

—o—

## షష్ఠానువాకము

అ॥ తుట్టతుదకు భృగువానందరూప మగుబ్రహ్మము నపరోక్షముగ తెలిసికొనిన విధానము వివరింపబడుచున్నది.

మూ:- ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ । ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే । ఆనందేన జాతాని జీవంతి । ఆనందం ప్రయన్త్యభిసంవిశంతీతి । సైషా భార్గవీ వారుణీ విద్యా । పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా । య ఏవం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్భవతి । ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్ కీర్త్యా॥

---

* సర్వం ఖల్విదం బ్రహ్మ (ఛాం 3-14-1)

టీ:-భృగువానందము బ్రహ్మమని దెలిసికొనెను. ఏలనన ఆనందమువలననే యీభూతములు జన్మించుచున్నవి. జన్మించినభూతము లానందమువలననే జీవించుచున్నవి. ఆనంద మునందు తాదాత్మ్యమును బొందుచున్నవి.

ఈసుప్రసిద్ధమయిన విద్య వరుణవిద్యయనియు భార్గవీవిద్యయనియు బిలువబడుచున్నది. అది శ్రేష్ఠమైన హృదయాకాశమునందు ప్రతిష్ఠితమగుచున్నది.

ఎవ్వడీవిధముగ తపముచే బ్రహ్మానందమును తెలిసికొనుచున్నాడో ఆతడు బ్రహ్మానందమునందు సుప్రతిష్ఠుడగుచున్నాడు. అన్నము గలవాడగుచున్నాడు; దీప్తాగ్నిగలవాడగుచున్నాడు; సంతానముచేతను గవాదిపశుగణముచేతను బ్రహ్మతేజస్సుచేతను శ్రేష్ఠుడగుచున్నాడు; కీర్తిచేతను గొప్పవాడగుచున్నాడు.

తా. వి:- కోశనిష్కాసప్రకరణమగు బ్రహ్మానందవల్లి ద్వితీయాదిపంచమాంతానువాకములయందు కోశపంచకము యొక్క యాపేక్షికసూక్ష్మత్వాత్మత్వములు ప్రదర్శింపబడినవి. ఆనందమయకోశమున కానంద మాత్మయనియు బ్రహ్మము ప్రతిష్ఠాస్థానమనియు జెప్పబడినది. ఈవిధముగ కోశపంచకము ననాత్మాభావముచే త్రోసిబుచ్చుమార్గము పూర్తి చేయబడినది. షష్ఠసప్తమానువాకములయందు బ్రహ్మాస్తిత్వ ముపపాదింపబడినది. ఈబ్రహ్మము పరమాకాశమునందు దెలిసికొనతగినదని ప్రథమానువాకముననే బోధింపబడినది.

అందువలన పంచకోశములదాటి బుద్ధిని హార్దాకాశమున ప్రవేశ పెట్టి యచటబ్రహ్మమును దెలిసికొనవలయునను నర్థము నివ్వన్నమగుచున్నది. ఈవిధానమే భృగువునకు మననప్రకార మార్గమాయెను. భృగువల్లి యన్నమయాదివిజ్ఞానమయాంత కోశములయందు వరుణునిచే నుపపాదింపబడిన బ్రహ్మలక్షణమాపాతముగ సమన్వయము జేయబడినను వానిబ్రహ్మత్వ మాపేక్షికమయిసందేహమున కాస్పద మయ్యెను. నశ్వరత్వాది దోషదూషితము లగునీనాలుగుకోశ ములుబ్రహ్మముగానేరవని నిశ్చయించుకొని భృగువు బుద్ధిని వానినుంచిమరల్చి యానందమయకోశమునందు బ్రవేశపెట్టి యాకోశము బ్రహ్మ మగునాయని విచారించెను. సవిషయ ములు క్షణికములు నగుప్రియమోదాదులద్దాని స్వరూపమగు టంజేసి యది గూడ నిత్యనిర్విషయానందరూపమగు బ్రహ్మము గానేరదని దలంచి నద్దానినుండిగూడ బుద్ధిని మరల్చుకొనెను. ఇట్లు పంచకోశములయందలి నజ్ఞానకల్పితమగు నాత్మభావము మననముచే బూర్తిగ దొలగెను. బ్రహ్మమాత్మకంటె వేరు గాదనియు అది బుద్ధిగుహయందు దెలిసికొనదగినదనియు బ్రహ్మనన్దవల్లియందుపదేశింపబడినది. కనుక యానన్దమయమునుంచి మరలిన బుద్ధిని హార్దాకాశమున బ్రవేశపెట్టి తిరిగి యతడు విచారణచేసెను. పంచకోశనిష్కాసనముచే నిర్మలమయిన బుద్ధికి యచట యానందము భాసించెను. అట్టి యానందము నిర్విషయానందమగుటంజేసి యచట వరుణుడు జెప్పిన బ్రహ్మలక్షణము బూర్తిగ సమన్వయమగు

ఆనందమునందు సంపూర్ణ లక్షణసమన్వయము

టయేగాక, పంచకోశములయందువలె నేమియుశంక కలుగలేదు. అట్టి యానందము సర్వప్రతిష్ఠాస్థానము గావలయునని భృగువు గ్రహించెను. నిర్విషయము సర్వప్రతిష్ఠాస్థానము నగు నానన్దము బ్రహ్మమని యతడు స్థిరము జేసికొనెను. వరుణు డుపదేశించిన తటస్థలక్షణ మిట్లు బ్రహ్మజ్ఞానమునకు కారణమయ్యెను. తటస్థలక్షణముచే దెలిసికొనినబ్రహ్మమును స్వరూపలక్షణబోధకములగు సత్యజ్ఞానానన్తాదివాక్యముచే దృఢముజేసికొని యపరోక్షముగ నతడు సాక్షాత్కారము నొందెను. ఇచట భృగువుయొక్క బ్రహ్మజిజ్ఞాస పూర్తిగ నివర్తించి సందేహ విపర్యయనిరస్తమగు బ్రహ్మజ్ఞాన ముపలబ్ధమయ్యెను. వరుణుడు బ్రహ్మప్రాప్తిద్వారమును జూపి మార్గదర్శి మాత్రమయ్యెను. పునఃపునరభ్యస్తమగు మననరూపతపస్సుచే నపగతచిత్తకల్మషుడయి భృగువు బ్రహ్మమును దర్శింపగల్గెను. బ్రహ్మము మనన నిదిధ్యాసాత్మకమగు తపస్సుచేతనుమాత్రమే సాధకునిచే బొందతగినదిగాని యన్నపుముద్దవలె నోటిలో బెట్టతగినది గాదని వరుణోపదేశరహస్యము. ఈ యర్థమే యుపనిషచ్ఛబ్దములోని ఉప, ని, యను యుపసర్గలచే బోధింపబడుచున్నది. శాస్త్రము సాధకుని బుద్ధిని బ్రహ్మదరికిమాత్రము జేర్చగలదనియు సాక్షాత్కారము సాధకాయత్తమనియు తాత్పర్యము. బ్రహ్మవల్లియాదిమానువాకపంచకము ను, భృగువల్లియాదిమానువాకషట్కమును జోడించి మననము జేసినపుడుగాని సంపూర్ణ మగు నర్థసమన్వయము గానేరదు.

ఇట్లు తెలిసికొనబడిన బ్రహ్మవిద్య వరుణునిచే నుపదేశింపబడుటచే వారుణీవిద్యయనియు, భృగువుచే తెలిసికొనబడుటచే భార్గవీవిద్యయనియు బ్రసిద్ధిగాంచినది.

వారుణీవిద్య

అస్మత్ప్రత్యయగోచరమగువిషయియొక్కయు, యుష్మత్ప్రత్యయగోచరమగు విషయముయొక్కయు విభాగ మెచట పూర్తిగా నివర్తించునో యట్టి యద్వైతానందమునం దీబ్రహ్మవిద్య ప్రతిష్ఠితమగుచున్నది. అనగా "నీవు", "ఇది" యని వ్యవహరింపబడుచు పరిదృశ్యమానమగు జగత్తంతయు జ్ఞానవిషయము 'నేను' యని స్థూలముగ వ్యవహరింపబడు ఆత్మ యీవిషయములను గ్రహించుచు విషయి యనబడుచున్నాడు. 'నీవు', 'నేను' అనుభేదము సంపూర్ణముగ నశించినస్థాయియం దద్వితీయబ్రహ్మవిద్య సమకూడునని తాత్పర్యము.

భృగువువలె నితరులుగూడ తపస్సాధనముచే క్రమముగకోశపరంపరనుదాటి హార్దాకాశమున బ్రహ్మానందమును దెలిసికొని బ్రహ్మానన్యత్వమును బొందగలరు. ఇది బ్రహ్మవిద్య కాత్యంతిక ఫలము. ఇట్టిబ్రహ్మవిద్యావిధానమునం దీ జన్మముననే యుత్తీర్ణుడు కాజాలనివాడు నిఃస్పృహ జెందకుండుటకై సద్యఃఫలముగూడ జెప్పబడుచున్నది. అన్నాదుల నిట్లుమననము జేసినవాడు ప్రభూతమగు నన్నసమృద్ధియు, ప్రదీప్తమగు జఠరాగ్నియు, పుత్రపౌత్రగవాశ్వాదిసంపత్తియు, శమదమాదినిమిత్తమగు బ్రహ్మవర్చస్సుచే గల్గు మహత్తును, శుభాచారఖ్యాతియు బొందును. ఆత్మను బొందినబ్రహ్మవిదుడు సర్వకామములను బొందినవాడగుటచే,

బ్రహ్మవిద్యాఫలము

నీఫలమతనికి గూడగలిగినను నద్దానివలన నతనికి ప్రయోజనము లేదు. జీవన్ముక్తుడగుటచే నివియన్నియు నతనికి మిథ్యా మాత్రములగుచున్నవి. బ్రహ్మజ్ఞానాభ్యాసమున కీవాక్యములు ప్రరోచకములగుచున్నవి.

షష్ఠానువాకము సమాప్తము

---

## సప్తమానువాకము

అ॥ బ్రహ్మప్రాప్తికి ద్వారభూతముగ వారుణీవిద్యయందు వర్ణింపబడిన యన్నముఖమున బ్రహ్మము నుపాసించుప్రకారము సప్తమాష్టనవమానువాకములయందు వివరింపబడు చున్నది.

మూ:- అన్నం న నిన్ద్యాత్ । తద్వ్రతమ్ । ప్రాణో వా అన్నమ్ ॥ శరీరమన్నాదమ్ । ప్రాణే శరీరం ప్రతిష్ఠితమ్ । శరీరే ప్రాణః ప్రతిష్ఠితః । తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్ కీర్త్యా॥

టీ:- అన్నమును నిందింపగూడదు. అది బ్రహ్మవిదునకు వ్రతము. ప్రాణమే అన్నము. శరీరమన్నాదము. ప్రాణమునందు శరీరము ప్రతిష్ఠితమయి యున్నది. అందువలన ఈయన్నము ప్రాణమనెడి యుభయవిధమగు నన్నము అన్నమునందు ప్రతిష్ఠితమగుచున్నది. ఎవ్వడీశరీరము ప్రాణమనెడి యుభయవిధ

మగు నన్నము అన్నమునందు ప్రతిష్ఠితమయినదని యుపాసించుచున్నాడో యతడు ప్రతిష్ఠితుడగుచున్నాడు. అన్నవంతుడు, అన్నము భుజింపువాడు నగుచున్నాడు. ఆతడు సంతానముచేతను, పశువులచేతను బ్రహ్మవర్చస్సుచేతను, కీర్తిచేతను, గొప్పవాడగును.

సప్తమానువాకము సమాప్తము

—౦—

## అష్టమానువాకము

మూ:- అన్నం న పరిచక్షీత । తద్వ్రతమ్ । ఆపో వా అన్నమ్ । జ్యోతిరన్నాదమ్ । అప్సు జ్యోతిః ప్రతిష్ఠితమ్ । జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః । తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్ స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్ కీర్త్యా॥

టీ:-అన్నమును పరిహారింపగూడదు. ఆది వ్రతము ఉదకములు జాఠరాగ్నిచే జీర్ణములయి యన్నమగుచున్నది. వర్షోదకములయందు విద్యుదగ్ని ప్రతిష్ఠితమగుచున్నది. జ్యోతిస్సునందుదకములు ప్రతిష్ఠితములు. అందువలన ఈయుభయము నగు నన్న మన్నమునందు ప్రతిష్ఠితమగుచున్నది. ఎవ్వడీ ఆపో జ్యోతీరూప మగునన్నము అన్నమునందు ప్రతిష్ఠితమయినదానినిగా యుపాసించుచున్నాడో వాడు ప్రతిష్ఠితుడగుచున్నాడు. అన్నవంతుడు అన్నాదుడు సంతానముచేతను, పశువులచేతను, బ్రహ్మవర్చస్సుచేతను గొప్పవాడునగును. కీర్తిచేతను గొప్పవాడగును.

## నవమానువాకము

మూ:- అన్నం బహు కుర్వీత । తద్వ్రతమ్ । పృథివీ వా అన్నమ్ । ఆకాశోఽన్నాదః । పృథివ్యామాకాశః ప్రతిష్ఠితః । ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా । తదేతదన్నమన్నే ప్రతిష్ఠితమ్ । స య ఏతదన్నమన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠతి । అన్నవానన్నాదో భవతి । మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన । మహాన్ కీర్త్యా॥

టీ:- అతిథుల కిచ్చుటకుగా నన్నమును విస్తారముగ సమకూర్పవలెను. అదివ్రతము. భూమి, అన్నము, ఆకాశమన్నాదము. పృథివియం దాకాశము ప్రతిష్ఠితము. ఆకాశమునందు పృథివి ప్రతిష్ఠిత.సు. ఈయుభయవిధ మగునన్నము అన్నమునందు ప్రతిష్ఠితమయియుండని యెవ్వడీయుభయవిధమగు నన్నమన్నమునందు ప్రతిష్ఠితమయినదని యుపాసించునో వాడు ప్రతిష్ఠితుడగుచున్నాడు. అన్నవంతుడు అన్నాదు డగుచున్నాడు. ప్రజాపశుబ్రహ్మవర్చస్సులచేతను కీర్తిచేతను గొప్పవాడగుచున్నాడు.

తా. వి:- బ్రహ్మవిజ్ఞానమున కన్నము ద్వారమగుటచే నది గురుతుల్యము. దానిని నిందింపరాదు. ఉపాసకునికిది యొకవ్రతము. ఏది దేనియందు ప్రవేశించునో దానికది యన్నమగును. దేనియందది ప్రతిష్ఠితమో యదియన్నాదము. ఈవ్యవస్థననుసరించి శరీరమధ్యమున నుండుటచే ప్రాణమన్నము; ప్రాణమన్నముచే ధరింపబడుచున్నది గనుక శరీరమన్నాదము. అటువలెనే ప్రాణముచే శరీరము ధరింపబడుచున్నది. అందువలన శరీరమన్నము

అన్నోపాసనావ్రతము.

ప్రాణమన్నాదము. ఇట్లన్ని ప్రాణముల కన్యోన్యమన్నాన్నాదత్వ సంబంధము గలదు. ఈ ప్రకారమే జలము అన్నము, జ్యోతిస్సన్నాదము, పృథివి అన్నము; ఆకాశమన్నాదము. పర్యాయముచే జ్యోతిస్సన్నము, జలమన్నాదము; ఆకాశమన్నము, పృథివియన్నాదము నగుచున్నవి. అబ్జ్యోతిఃపృథివ్యాకాశములన్యోన్యము స్థితిహేతువులగుటంజేసి యీవిధముగ నన్నాన్నాదత్వసంబంధము జెప్పబడుచున్నది. ఇట్లుపాసించినవాని కన్నబాహుల్యము మొదలగుఫలము చెప్పబడినది.

నవమానువాకము సమాప్తము

---

## దశమానువాకము

అ॥ అన్నోపాసనాంగమగునన్నదానము యొక్క మహాత్మ్యము వర్ణింపబడుచున్నది.

మూ:- న కంచన వసతౌ ప్రత్యాచక్షీత । తద్వ్రతమ్ । తస్మాద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్ । అరాధ్యస్మా అన్నమిత్యాచక్షతే । ఏతద్వై ముఖతోఽన్నగ్ం రాద్ధమ్ । ముఖతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వై మధ్యతోఽన్నగ్ం రాద్ధమ్ । మధ్యతోఽస్మా అన్నగ్ం రాధ్యతే । ఏతద్వా అన్తతోఽన్నగ్ం రాద్ధమ్ । అన్తతోఽస్మా అన్నగ్ం రాధ్యతే॥

టీ:. గృహమునకు వచ్చిననెవ్వరిని నిషేధింపగూడదు. అది వ్రతము. శాస్త్రీయమగు వేదోపవిధానమున అన్నమును మిక్కుటముగా సంపాదింపవలయును. గృహాగతుడగునతిథి

కొఱకన్నముసిద్ధముగానున్నదని పలుకుచున్నారు. అన్నము సిద్ధముగానున్నదని యుత్తమోపచారములతో నడిగినవెంటనే యన్నమునిచ్చువాడు ప్రథమవయస్సున యిచ్చినయెడల ప్రథమవయస్సునందే యన్నము పొందును. మధ్యమవయస్సునందు మధ్యమోపచారములతో నిచ్చినయెడల మధ్యమవయస్సునం దన్నమునుబొందును. తక్కువ ఉపచారములతో వార్థక్యమునందిచ్చినయెడల వార్థక్యమున హీనోపచారముతో నన్నమును పొందును.

తా. వి:- గృహమునకు వచ్చినయతిథిని నివాసము, అన్నమునిచ్చి యాదరింపవలెను. తరుణ, ప్రౌఢ, వృద్ధాది భేదమును బట్టియు, యాదరముయొక్క నతిశయోదాసీనజఘన్యత్వాదిభేదమును బట్టియు సత్కారము షడ్విధమగుచున్నది. తీర్థక్షేత్రాదివిశేషము సంక్రాంత్యాదికాలవిశేషము వేదశాస్త్రాధ్యయనానుష్ఠానపరత్వాది పాత్రాధికారవిశేషము శ్రద్ధాప్రణిపాతాది సత్కారవృత్తిభేదవిశేషము దాతృప్రతిగృహీతలయొక్క ముఖ్యమధ్యమాధికారభేదము-వీనికనురూపముగ నన్నదానము ఫలమునిచ్చును.

అన్నదాన మాహాత్మ్యము

ఆ॥ వేదాంతశాస్త్రమునందు శాఖాచంద్రన్యాయమున బ్రహ్మ మధ్యారోపము, అపవాద మనురెండుమార్గములచే బోధింపబడుచున్నది. అద్వితీయ మగుపరబ్రహ్మము దుర్విజ్ఞేయము. అది స్వయముగా నిర్గుణము, నిర్వికల్పము, నిరుపాధికము, అవాఙ్మనోగోచరము. బుద్ధికిగోచరమగు మరియొక

ద్వారముననే దానిని బోధించుమార్గమవలంబింపవలెను. ఇదియే యుపాసనాతత్త్వము. శాస్త్రసమ్మత మగునేదియో యొకయాలంబనమునందు బ్రహ్మభావముచే బుద్ధిని నిలిపియుపాసించుట నధ్యారోపమార్గములలో నొకటి. సంసారమంతయు నవిద్యాకల్పితము. జీవునకు జీవత్వ ముపాధివిశేషమువలన సంభవించుటచే నాయుపాధి తొలగినపుడు జీవుని జీవత్వముదొలగి స్వతఃసిద్ధ మగుబ్రహ్మత్వము భాసించును. ఇట్టి బోధ యపవాదమార్గములలో జేరినది. లేనిలక్షణము నారోపించుట అధ్యారోపము. ఆరోపితలక్షణమును తొలగించుట యపవాదము. అన్నబ్రహ్మోపాసన మధ్యారోపములో జేరును.

అధ్యారోపాపవాదములు

ఈ క్రిందికొన్ని యధ్యారోపమార్గములిచట నుదాహరింపబడుచున్నవి.

మూ:- స ఏవం వేద । క్షేమ ఇతి వాచి । యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః । కర్మేతి హస్తయోః । గతిరితి పాదయోః । విముక్తిరితి పాయౌ ఇతి మానుషీః సమాజ్ఞాః । అథ దైవీః । తృప్తిరితి వృష్టౌ । బలమితి విద్యుతి।

యశ ఇతి పశుషు । జ్యోతిరితి నక్షత్రేషు । ప్రజాపతిరమృతమానన్ద ఇత్యుపస్థే । సర్వమిత్యాకాశే । తత్ప్రతిష్ఠేత్యుపాసీత । ప్రతిష్ఠావాన్భవతి । తన్మహ ఇత్యుపాసీత । మహాన్భవతి । తన్మన ఇత్యుపాసీత । మానవాన్భవతి ।

తన్నమ ఇత్యుపాసీత । నమ్యన్తేఽస్మై కామాః । తద్బ్రహ్మేత్యుపాసీత । బ్రహ్మవాన్భవతి । తద్బ్రహ్మణః పరిమర ఇత్యుపాసీత । పర్యేణం మ్రియన్తే ద్విషన్తః సపత్నాః । పరియేఽప్రియా భ్రాతృవ్యాః ।

టీ:- బ్రహ్మము వాక్కునందు క్షేమరూపమునను, ప్రాణాపానములయందు యోగక్షేమరూపమునను, హస్తముల యందు కర్మరూపముగను, పాదములయందు గతిరూపకము గను, పాయువునందు విసర్జనారూపముగను యున్నటుల నుపా సింపవలయును. ఇవి యధ్యాత్మికములగు నుపాసనలు. ఇక ఆధిదైవికోపాసనలు చెప్పబడుచున్నవి. బ్రహ్మము వృష్టి యందు తృప్తిరూపమునను, విద్యుత్తునందు బలరూపముగను, పశువులయందు కీర్తిరూపముగను, నక్షత్రములయందు జ్యోతీ రూపముగను, జననేన్ద్రియమునందు సంతానముచే, పితౄణ విమోచనరూప మగునానందస్వరూపముగను, ఆకాశము నందు సర్వస్వరూపముగను ప్రతిష్ఠితమయిన ట్లుపాసింపవల యును. బ్రహ్మస్వరూప మగునాకాశము ప్రతిష్ఠారూపమని యుపాసించినచో ప్రతిష్ఠగలవాడగును. మహత్త్వగుణము గల వానిగా నుపాసించిన మననసామర్థ్యము గలవాడగును. నమన గుణముగలదని యుపాసించిన భోగ్యములన్నియు నుపాసకు నకు లోబడును. విస్తారరూపమని యుపాసించిన విస్తృతి గలవాడగును; వేదస్వరూపమని యుపాసించిన వేదము స్వాధీ నమునందుగలవాడగును.

ఆకాశము బ్రహ్మమునకు పరిమరమని యుపాసించిన నుపాసకుని ద్వేషించుశత్రువులు నశించెదరు. అప్రియులగు శత్రువులు చనిపోవుదురు.

తా. వి:- ఈమార్గములన్నిటిలో నుపాసనాస్థానములు, ఉపాస్యస్వరూపము వివరింపబడినవి. ఆయాస్థానములయం

దాయారూపమున బ్రహ్మమునుపాసింపవలయునని తాత్ప ర్యము. మానుషశరీరము నందలి యనయవ ములనాలంబనముగా గ్రహించిన యుపాస నములన్నియు మానుషోపాసనలనబడుచున్నవి.

మానుష దైవి యుపాసనలు

అప్రాప్తమగు దానిప్రాప్తి యోగమనియు, ప్రాప్తమైనదాని పరిరక్షణము క్షేమమనియు చెప్పబడుచున్నది. ఇక దేవతా సమాజ్ఞలు వివరింపబడుచున్నవి. ఇచటగూడ బ్రహ్మమే యుపాస్యము. ఉపాసనాస్థానములు తద్రూపములుగూడ నుదా హరింపబడినవి. బ్రహ్మము నేరూపమున నుపాసించెదరో యారూపమును తదుపాసకులు బొందుదురు.

అ॥ మందాధికారి కుపయోగించు నధ్యాత్మోపాత్మకము లగుబ్రహ్మోపాసనములు ప్రదర్శింపబడినవి. ఇక నపవాద మార్గము వివరింపబడుచున్నది.

మూ:- సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే । స ఏకః ॥

టీ:- పురుషునియం దేయాత్మగలదో ఆయాత్మయు ఆదిత్యునియం దేయాత్మగలదో ఆయాత్మయు ఈరెండు నొకటియే.

తా.వి:- జలము, ఆకాశము మొదలగువానివలన శరీ రముత్పన్నమగుటచే నవిగూడ నాధ్యాత్మికములగుచున్నవి. శరీరప్రాణాదులు ప్రత్యగాత్మకుపాధిభూతము లగుటంజేసి వానికన్నాదత్వము భోగ్యభోక్తృ త్వము చెప్పబడినది. భోగ్యభోక్త్రాత్మక మగు నీసంసారము కార్యరూపము గనుకనది యాత్మవిషయము

జీవాత్మలు సంసారులుగారు

గా నేరదు. అయినను నవిద్యచే నది యాత్మవిషయకమని భావింపబడుచున్నది. ద్వైతమంతయు నవిద్యాకల్పితమని శ్రుతి చెప్పుచున్నది. ఆత్మ సంసారిగాడు. అతడు ప్రపంచమును సృజించి యద్దానిని ప్రవేశించెనని శ్రుతి నిరూపించుచున్నది. క్రమముగా పంచకోశముల ననాత్మభావముచే దాటి బుద్ధిగుహాయం కథయ ప్రతిష్ఠాభూత మగునాత్మను తెలిసికొనుటయే ప్రవేశించుటయని సంక్రమణశబ్దార్థపరికరణమున నిశ్చయింపబడినది. కనుక సృష్టికర్త భావాంతరముచే ప్రవేశించెనని యనవీలులేదు. "నీవే యా బ్రహ్మమగుచున్నావని" శ్రుతి* బోధించుటచే ప్రవేశానంతర మతనిస్వభావము మారెనదనవీలులేదు. ప్రవేశావస్థయందు సంప్రాప్తమయిన భావాన్తరాన్ని బోగొట్టుకొనుటకై యిట్టియుచ్చ్రిస్థితి వర్ణింపబడలేదు. ఆ ఆత్మ సత్యము. అది నీవే అగుచున్నావు. అని పై శ్రుతి చెప్పుచున్నది. జీవునకు సంసార మనుభవసిద్ధమనిగూడ చెప్పవీలులేదు. పై శ్రుతులు జీవాత్మల కనన్యత్వమును బోధించుటచే సంసారము ననుభవించువాడును యీవిషయమును గ్రహించువాడు నొకడే కావలయును. సంసారవిశిష్ట మగునాత్మయే మనకనుభవసిద్ధ మగుచున్నాడనుటకుగూడ వీలులేదు. అసత్యమును ననుభవించువాడును, అనుభవింపనివాడు నొకడేగావలయును. ఉష్ణము దహింపబడలేదు. వెలుతురు ప్రకాశింపబడలేదు. ఆత్మకు భయాదులుండుట కనుపడుచున్నందున యతనికి దుఃఖానుభవ మూహింపగలమనుటయు సరికాదు. ఈధర్మములు చూడ

---

* తత్సత్యం స ఆత్మా తత్త్వమసి (ఛాం. 6-8-8)

బడుచున్నవి. కనుక నవి చూచువానిధర్మములు గానేరవు. ఇందుకు భిన్నముగ బోధించుకపిలకాణాదదర్శనములు వేదవిరుద్ధములు, నిరాధారములు, భ్రాంతిగ్రస్తము లగుచున్నవి. ఆత్మ సంసారిగాడని శ్రుతులచేతను, ఉపనిషత్తులచేతనుగూడ సిద్ధమగుచుండగా నతని సంసారిత్వ మవిద్యావిలసితమని చెప్పక తప్పదు. ఆత్మ సంసారి కాడు. అద్దానికంటె వేరుగాని జీవుడు గూడ నిజముగా సంసారి గానేరడు. జీవాత్మల కనన్యత్వము బహుశ్రుతిప్రసిద్ధము. ఈపురుషోపాధియందు ప్రకాశించుచున్న చైతన్యము, సూర్యబింబమున ప్రకాశించుచున్న చైతన్యము నొకటియే. ఈయర్థమే పైశ్రుతివాక్యమున వివరింపబడుచున్నది.

అ॥ వివిధోపాధివిశిష్ట మగుచైతన్య మా యా యుపాధులు తొలగిపోయినపు డొకటియే యగుచున్నదని తెలిసికొనినవానికి గలుగు ఫలము ప్రదర్శింపబడుచున్నది.

మూ:- స య ఏవంవిత్ । అస్మాల్లోకాత్ప్రేత్య । ఏతమన్నమయమాత్మానముపసంక్రమ్య । ఏతం ప్రాణమయమాత్మానముపసంక్రమ్య । ఏతం మనోమయమాత్మానముపసంక్రమ్య । ఏతం విజ్ఞానమయమాత్మానముపసంక్రమ్య । ఏతమానన్దమయమాత్మానముపసంక్రమ్య । ఇమాన్లోకాన్కామాన్నీ కామరూప్యనుసంచరన్ । ఏతత్సామ గాయన్నాస్తే । హా౩వు హా౩వు హా౩వు ।

అహమన్న మహమన్న మహమన్నమ్ । అహమన్నాదో౽౩హమన్నాదో౽౩హమన్నాదః । అహగ్ం శ్లోకకృదహగ్ం శ్లోకకృదహగ్ం శ్లోకకృత్ । అహమస్మి ప్రథమజా । ఋతా౽స్య । పూర్వం దేవేభ్యో౽మృతస్య నా౩భాయి । యో మా దదాతి స ఇదేవ మా౩వాః । అహమన్నమన్నమదన్తమా౩ద్మి । అహం విశ్వం భువనమభ్యభవా౩మ్ । సువర్ణజ్యోతీః । య ఏవం వేద ఇత్యుపనిషత్ ॥

టీ:- ఎవ్వఁ డీవిధముగా తెలిసికొనునో వాఁడీలోకము నుండి దాటిపోయి యీయన్నమయాత్మను, ప్రాణమయాత్మను, మనోమయాత్మను, విజ్ఞానమయాత్మను, ఆనందమయాత్మను క్రమముగా బొంది యీభూతాదిలోకములను సంచరించుచు కామానుసార మగుసన్నముగలవాఁడై కామరూపియై చెప్పఁబోవుసామమును గానముచేయుచుండును.

ఆశ్చర్యము! ఆశ్చర్యము! ఆశ్చర్యము! నేనన్నస్వరూపుఁడ నగుచున్నాను! నేనన్నస్వరూపుఁడ నగుచున్నాను! నేనన్నస్వరూపుఁడ నగుచున్నాను! నేనన్నాదుఁడ నగుచున్నాను! నేనన్నాదుఁడ నగుచున్నాను! నేనన్నాదుఁడ నగుచున్నాను! నేను శ్లోకకృత్తు నగుచున్నాను? నేను శ్లోకకృత్తు నగుచున్నాను! నేను శ్లోకకృత్తు నగుచున్నాను! నేను మూర్తామూర్తరూపమగు జగత్తుకంటెను, దేవతలకంటెను పూర్వము మొట్టమొదట బుట్టినవాఁడను! అమృతమునకు నాభిమాత్రుఁడనగుచున్నాను. ఎవ్వఁడన్నరూపుఁ డగునన్నన్నార్థులకిచ్చునో యతఁడు నన్నీవిధముగా సంరక్షించును. నేను అన్నమును. అన్నము నితరులకివ్వకుండ తానొక్కఁడే తినువానిని నేను తినుచున్నాను. నేను సమస్తమయిన భువనమును తిరస్కరించుచున్నాను. నా ప్రకాశ మాదిత్యప్రకాశమువలె స్వయంప్రకాశమయినది. ఎవ్వఁడీవిధముగ నుపాసించుచున్నాఁడో వానికి పూర్వోక్తఫలము కలుగును. తైత్తిరీయోపనిషత్తు సమాప్తము.

తా వి:- ఉపాధివశముచే ననేకముగ భాసించుచున్నయాత్మచైతన్యమంతయు నొకటియే యని తెలిసికొనినవాఁడు

క్రమముగా ననాత్మభూతములగు నన్నమయాదుల నొకదాని తరువాత నొకదాని నపవాదముచే త్రోసిబుచ్చి స్వస్వరూపావస్థానమును బొందినవాడై తానే భోగ్యభోక్తృస్వరూపుడయి కామరూపమున త్రిభువనమనోహరము సర్వప్రాణిజ్ఞానోపదేశకము నగు గానమును పాడుచు స్వేచ్ఛగా నశేషలోకసంచారమును జేయును. బ్రహ్మము సత్యము జ్ఞానము అనంతమునని బ్రహ్మానందవల్లి యాదిమానువాకమున వివరింపబడినది. జ్ఞానియగు వాడా ప్రకాముడగుటంజేసి సమస్తకోరికల నొక్కమారుగ బ్రహ్మముతో గూడ ననుభవించునని తరువాతవాక్యమున నుదాహరింపబడినను దానిభావము సమగ్రముగవిస్తరింపపబడలేదు. ఇచటనది వివరింపబడుచున్నది. ఆకోరికలెవ్వి? వానివిషయములెవ్వి? బ్రహ్మముతో గూడ నెట్లనుభవించును. ఈమున్నగు విషయములన్ను విరళించుటకై పైప్రకరణమిచట పునరభ్యస్తమగుచున్నది. వరుణభృగ్వాఖ్యాయికయందు తపస్సు బ్రహ్మవిద్యా

బ్రహ్మవిదుని సర్వకామానుభవ వివరణము

సాధనముగ నుపదేశింపబడినది. కార్యస్వరూపులగు నాకాశాదిపురుషాంతములగు ప్రాణాదుల కన్యోన్య మన్నాన్నాదత్వ ముదాహరింపబడినది. నియతములగు ననేకసాధనములచే సాధింపతగిన యాకాశాదివివిధకార్యములే విషయములుగాగలిగిన కోరికలు గూడ ప్రదర్శింపబడినవి. ఆత్మయద్వితీయమయినచో, సకలభేదజాత మాత్మభూతమగుచున్నది. అపుడు కామములుండుటయు వానినభిలషించువాడు మరియొకడుండుటయు సంభవముగాదు. అట్లయినచో బ్రహ్మ

విదుడు సమస్తకామములనొక్కమారుగ బ్రహ్మరూపమున నెట్లుపొందగలడను సందేహము గల్గుచున్నది. ఇందులకు సమాధానము చెప్పవలసియున్నది. బ్రహ్మవేత్త సర్వాత్మభావమును బొందినవాడు. అతడు పురుషోపాధిచే నుపలక్షితమగు సర్వప్రాణికోటియందును, సూర్యోపాధిచే నుపలక్షితమగు సమస్తదేవతోపాధియందును భాసించుచున్న యాత్మతేజస్సాకటియే యనుమహదాశయమును సాక్షాత్కారముచేసికొన్నవాడు. అతడవిద్యాకల్పితము లగుచున్న పుయాదుల యనాత్మత్వము నుత్కర్షాపకర్షలచే తొలగించుకొని సత్యజ్ఞానానంతలక్షితము అదృశ్యాదిధర్మకము స్వాభావికము, అద్వైతము, ఫలభూతము నగుబ్రహ్మము తానయి, భూమ్యాదినర్వోపాధిస్వరూపను తానయి భోగ్యభోగమిథ్యాత్వజ్ఞానము వలన వానిచే నసంస్పృష్టుడై నిస్త్రైగుణ్యమార్గమున స్వేచ్ఛగా సంచరింపగల దిట్టి. ప్రారబ్ధమగు నతనిశరీరోపాధి యింకను జారిపోలేదు. అంతవర కతనిప్రత్యేకవ్యక్తిత్వము బాహ్యలోకమునను భాసించుచున్నది. అతను స్వేచ్ఛాప్రవృత్తి గల కామచారి యగుచున్నాడు. కామముచే నతనికి యన్నముగలుగుచున్నది. కామముచే సర్వరూపములు గలుగుచున్నవి. సర్వాత్మభావమునొంది సమస్తలోకము లనాత్మభావముచే ననుభవింపుచున్నాడు. ఇదియే బ్రహ్మవిదుడు బ్రహ్మతోగూడ ననుభవించు సర్వకామానుభవము.

అతడు లోకకళ్యాణముకొఱకు కొకానొకప్పుడు భూరాది లోకసంచార మొనర్పవచ్చును. అప్పుడు తనయనుభవమును

గానరూపమున లోకమునకు వెల్లడిచేయుచుండును. ఆగాన మెట్టిదనిన, "నే నద్వయుడను. నిరంజను డగునాత్మయే యయి యున్నాను. అన్నము అన్నాదుడనుగూడ నగుచున్నాను.

బ్రహ్మవిదుని గానస్వరూపము

అన్నాదిభోగ్యజాతమంతయు నామరూపాత్మక ప్రపంచము మిథ్యాస్వరూపము, తదధిష్ఠాన మగుపరమాత్మస్వరూపము నేనేయగుచున్నాను. చేతనాత్మక మగున గామరతిర్యగాది భోక్తృజాత మంతయు నాస్వరూపమే. కనుక నేనన్నాదుడనగుచున్నాను. ద్వివిధముగ విభక్తమగుచున్న అన్నాన్నాదులయొక్క భోగ్యభోక్తృత్వసంబంధమును కలుగజేయు చేతనుడను నేనేయగుచున్నాను. ఇది యెంతయు నాశ్చర్యము! అన్నాన్నాదరూప మగుజగత్తునకుముందు జన్మించినహిరణ్యగర్భుడను నేనే యగుచున్నాను. నేనే ప్రాణికోటియొక్క యమృతత్వమున కాధార భూతుడను. అన్నాత్మకుడ నగున న్నర్థులకిచ్చువారును నన్నట్లు చెప్పువారును నన్ను సంరక్షించెదరు. అన్నార్థులయి సకాల మునకు వచ్చినవారికి నన్ను ఇవ్వక తామేభుజించువారిని నేనే భుజించెదను. బ్రహ్మాదిభూతజాలమున కాశ్రయమగు నీ విశ్వమునంతయు పరమేశ్వరస్వరూపమున నేనుపసంహరించుచున్నాను. బ్రహ్మభావమునొందిన నాచైతన్యజ్యోతిస్సు సూర్యకాన్తివలె నెల్లపుడొకేవిధమున బ్రకాశించుచుండును." ఇట్లు బ్రహ్మజ్ఞాననిరతిశయమగు తనబ్రహ్మానందమును లోకము

నకాతడు వెల్లడిచేయును. ఈగానమునం దద్వైతసిద్ధాన్తపరమార్థ భూతమగునద్వితీయబ్రహ్మాత్మత్వము సృష్టియొక్కమిథ్యాత్వము. బ్రహ్మముయొక్క సృష్టిస్థితిలయకారణత్వము నిగమనము చేయబడుచున్నది.

ఈగానము బ్రహ్మానందముయొక్క స్తోత్రమాత్రము. జనసామాన్యమున కర్థమగురీతిని వ్యవహారస్వరూపమున గానముచేయబడినది. అన్నాత్మకుడగు జ్ఞాని

ఫలశ్రుతి

యన్నరూపమున భక్షింపబడుటకంటె సంసారమే మేలని భయపడనక్కరలేదు. ఇది పరమార్థవిషయముగాదు. బ్రహ్మాత్మత్వమును బొందిన విద్వాంసునకు ద్వైతనిమిత్తమగు భయగంధ మెంతమాత్రము లేదు. శాంతుడు, దాంతుడు ఉపరతుడు, సమాహితుడునై శృత్యుపహితమగు తపమొనర్చి బ్రహ్మము నెఱింగిన వానికి యుత్తరక్షణమున బ్రహ్మభావ లక్షణ మగుమోక్షము కరతలామలకమగును.

దశమానువాకము సమాప్తము

---

## ఉత్తరశాన్తిపాఠము

సహ నా వవతు । సహ నౌ భునక్తు । సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీతమస్తు మా విద్విషావహై.

ఓమ్ శాన్తిః । శాన్తిః । శాన్తిః ॥

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంచిత
శ్రీభారతీసంప్రదాయసార్వభౌమ జగద్గురు శ్రీకల్యాణానంద
భారతీమాన్తాచార్యమహాస్వామిపాదాత్యంతాన్తేవాసియు
నత్రిగోత్రసముద్భూతుడు నగు లింగనసోమయాజిచే
విరచితమగు నుపనిషచ్చన్ద్రిక ప్రథమమయూఖ
మగు తైత్తిరీయోపనిషత్తు
సమాప్తము.

బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా॥

# ఉపనిషచ్చన్ద్రిక

## ద్వితీయ మయూఖము



ఈశ, కేన, కఠోపనిషత్తులు

రాయప్రోలు లింగన సోమయాజి

# ఉపనిషచ్చంద్రిక

## ద్వితీయమయూఖము

## ఈశ, కేన, కఠోపనిషత్తులు




రచయిత:

రాయప్రోలు లింగనసోమయాజి,

శ్రీ విద్యారణ్యకృతపంచదశీవ్యాఖ్యాన శ్రీకల్యాణపీయూష

తైత్తిరీయోపనిషద్భాష్యవార్తిక వ్యాఖ్యాత్రవినాగాద

విరచయిత

# తొలిపలుకు

ఉపనిషచ్చన్ద్రిక ప్రథమమయూఖమునెడ పఠితృవర్గము చూపిన గౌరవాదరణములకు నే నెంతయు కృతజ్ఞుడను. కృతికదంబమునకెల్ల విద్వాంసుల పరితోషమే పరమావధి. ఈశ, కేన, కఠోపనిషత్తుల మూటిని ద్వితీయ మయూఖముఖమున పఠితృమహాశయుల కందజేయుచున్నాను. విషయగ్రహణమున కుపకారకములగు విధానములన్నియు నిచటగూడ ననుసరింపబడినవి. పండితజనసాధ్యమగు నిమ్మహత్తరకార్యమున నాకత్యంతము తోడ్పడిన గురు పండిత మిత్రబృందమునకు నాయధమర్ణతను మఱొక్కమాఱు స్మరించుచున్నాను. విశాఖపట్న కాపురస్థులు, యం. ఏ. పట్టభద్రులు, వేదాన్తవిజ్ఞాన విశారదులు నగు (శ్రీ) కగారి వెంకట్రావు పంతులుగారొనర్చిన యుపకార మత్యంతమనిర్వచనీయము, ప్రత్యేకముగ ప్రశంసనీయము. నేను రచియించిన పది వ్యాఖ్యానములను, ముఖ్యముగ మాణ్డూక్య ఛాందోగ్య బృహదారణ్యకముల ప్రతిపఙ్క్తిని చదివి వా రమూల్యములగు సలహాలను సూచనలను నా కొసంగిరి. వారు నాయెడజూపిన శ్రద్ధయు ప్రేమయు, నిష్కృష్టమగు వారి పాండిత్యమునకే సరిపోగలవు.

ఈ గ్రన్థము నచ్చొత్తించిన నా మిత్రరత్నము శ్రీయుత పత్రిపాటి వెంకటరత్నముగారికి నే నెంతయు కృతజ్ఞుడను. 1912 సంవత్సరమున వ్యాసహారికముగ నారంభమయిన మా యిద్దరి స్నేహము కాలముగడచినకొలది యుభయులకును

ముల నొక్కటిగ జేయు ప్రేమపాశముగ బరిణమించి దినదినాభివృద్ధిగాంచినది. వ్యాపారమునం దాయనకు గల నైపుణ్యమునకు సహజమగు ధైర్యసాహసములు మెఱుంగుపెట్టి యసమానమగు లక్ష్మీకటాక్షమున కాయనను బాత్రునిగ జేసినవి. ఆయన స్నానసంధ్యావందనాది నిత్యకర్మానుష్ఠానమును శివదర్శనమును నిత్యవ్రతముగ నాచరించు ఆస్తికాగ్రణి. సిరిసంపదలతో కిలకిలలాడుచుండు ఆయన గృహాంగణము జూచువారలకు కనులపండువుగ నుండును. ఆయన యావాసము 'మారమారమణ మారమాశ్రియమై' నిత్యోత్సవము పచ్చతోరణములతో నలరారుచుండుగాత యని పరమేశ్వరిని బ్రార్థించెద.

1-5-'53
గుంటూరు

వాడప్రోలు లింగన సోమయాజి

**
**

# విషయసూచిక

## ఈశావాస్యోపనిషత్తు

# కేనోపనిషత్తు

## కఠోపనిషత్తు

# మన్త్రముల
# వర్ణానుక్రమణిక

## ఈశావాస్యోపనిషత్తు



## కేనోపనిషత్తు

## కఠోపనిషన్మంత్రములు

# ఈశావాస్యోపనిషదర్థ సంగ్రహము

## ప్రథమ మన్త్రము

బ్రహ్మాండ మంతయు పరమాత్మ స్వరూపము. తద న్యత్వబుద్ధి కల్పితము. ఇట్టి జ్ఞానము విచారైకలభ్యము. జగత్తు సత్యమను భ్రాంతి దొలగినపుడు స్వాత్మయం దధ్యస్త మయిన కర్తృత్వభోక్తృత్వస్వరూపమగు ద్వైతబుద్ధి నశిం చును. సర్వద్వైతబుద్ధి పరిత్యాగమే సర్వసంన్యాసము. ఆ స్థితియం దాత్మ సురక్షిత మగును. ధనము స్వకీయ మయినను పరకీయమయినను కాంక్షింప దగదు. ధనమునం దెవరికిని స్వత్వమున్నదని నిర్వచింప శక్యముగాదు.

## ద్వితీయ మన్త్రము

పూర్ణవైరాగ్యము లేక ధనజీవితములం దిచ్ఛగల వాడు నిత్యనైమిత్తిక కర్మల నాచరింపవలయును. ఫలేచ్ఛావి రహితమగు కర్మనిరతి చిత్తశుద్ధిహేతు వగును. చిత్తనైర్మ ల్యము మోక్షమునకు పరంపరాకారణము. ఈ మన్త్రమున పునర్జన్మహేతువుగాని కర్మాచరణ ముపదేశింపబడుచున్నది. ఇచటినుంచి పోవుటకు కర్మకంటె వేఱొకమార్గము లేదనియు నట్టి కర్మాచరణఫలముచే నరుడు సంస్పృష్టుడు గానేరడనియు శ్రుతి చెప్పుచున్నది. అట్టికర్మ మెట్టిదిగానుండవలయును ? ఆపాతముగ నాలోచించిన, కర్మలన్నియు స్వర్గాదికామచోది

తములు, ఫలానుభవకామేచ్ఛయగు జన్మకు కారణములు నగు చున్నవి. సుఖాసుఖవము తిరిగి సుఖేచ్ఛకు కారణ మగు చున్నది. ఇచ్ఛాసంస్పృష్టమగు వాని చిత్తమెప్పుడును గలుషితమయియుండును. అట్టివానికి చిత్తైకాగ్ర్యముగాని సమస్త కామములు వీడిపోయిన వైరాగ్యముగాని మోక్షముగాని లభించనేరదు. కామనాప్రవృత్తమగు కర్మాచరణముచే నిచటకు రాకపోవుటగాని యద్దాని ఫలముచే నసంస్పృష్టుడగుటగాని సాధ్యముగాదు. అట్టి కర్మాచరణ మీమంత్రమున జెప్పబడుటలేదు. ప్రకరణము మోక్షప్రకరణము. సమర్థుడయినవానికి సర్వసంన్యాసము, అసమర్థునికి కర్మాచరణము మోక్షమార్గములుగ ప్రదర్శింపబడినవి. చిత్తశుద్ధిహేతువు, అసంస్పృష్టత్వ నిమిత్తమునగు కర్మాచరణమే ప్రకృతమగు చున్నది. అట్టి కర్మాచరణము, నిష్కామము బ్రహ్మార్పితము గావలయును. అపుడే యది చిత్తశుద్ధిహేతువయి మోక్షమునకు పరంపరాకారణమగును.

## తృతీయ మంత్రము

విషయకాపేక్ష మాసురలక్షణము. ఆత్మవిచారము లేమింజేసి యిట్టివార లజ్ఞానఫలభూతమగు జన్మ మృత్యుపరంపరకు లోనగుచున్నారు. మఱియు వీరలాత్మఘాతకు లనబడుదురు.

## చతుర్థ మంత్రము

ఆత్మ నిశ్చలము, జాగ్రదాద్యవస్థా త్రయము నది

యుంటిదే యుండును. అది నిరుపాధికము, ఇన్ద్రియముల కగోచరము, సర్వవ్యాపకము, సర్వప్రాణిభరణక్రియాత్మకము, అగ్న్యాదిత్యాది దేవతలకు వ్యవస్థాపకము. నిత్యచైతన్యస్వభావమగు నా పరమార్థవస్తువుచేతనే సమస్త కార్యకరణాదిక్రియాజాలము నిర్వహింపబడుచున్నది.

## పంచమ మన్త్రము

ఆత్మ యచంచలము. ఇంద్రియముల చాంచల్య మద్దాని యం దారోపింపబడుటచే నది చలనవంతిముగ గాన్పించుచున్నది. నామరూపాత్మకమగు జగత్తునకు బాహ్యాభ్యంతరములను నిండిన ప్రజ్ఞానఘనస్వరూపమగు నాత్మచే ప్రపంచ మంతయు నావాస్య మగును.

## 6, 7, 8 మన్త్రములు

తానే సర్వభూతముల కాశ్రయము, కార్యకరణ సంఘాతమున కాత్మభూతు డగుచున్నాడని తలంచువానికి శోక మోహనిమిత్తమగు జుగుప్స గలుగనేరదు. అజ్ఞానము నశించి యతడు జీవన్ముక్తుడగును.

పరమాత్మ సర్వవ్యాపకుడు, శుద్ధుడు, అలిప్తుడు, నిత్యుడు సర్వాత్మకుడు,నియతములగుకర్మఫలములనిచ్చువాడు

## 9, 10, 11 మన్త్రములు

ఇట్లాత్మతత్త్వోపదేశము చేయబడినది. ఏషణాత్రయ పరిత్యాగమున కశక్తుడగుటచే సన్న్యాసమున కసమర్థుడు సంసారమున కత్యంతము సుముఖుడును గానివానికి బ్రహ్మ

జ్ఞానమున కవసరమగు చిత్తైకాగ్రతను కలుగజేయు కర్మో పాసనాసముచ్చయ ముపదేశింపబడుచున్నది. కర్మనిష్ఠ జ్ఞాన నిష్ఠకు విరుద్ధము కనుక నీరెంటికిని సముచ్చయము గుదరదు. కర్మోపాసనము లవిరుద్ధములు గనుక వానికి సముచ్చయము గుదురును. దేవతాజ్ఞాననిమిత్తమగు నిరంతరమానసిక చింతన ముపాసన మనబడును. ప్రత్యేక కర్మాచరణము వలన పితృలోకము లభించును. అది మోక్షసాధనము గాదు. నిష్కామముగ జేయబడు కర్మచే నుపాసనమున కవసర మగు చిత్తశుద్ధి గల్గును. చిత్తశుద్ధిగలిగిన హిరణ్యగర్భోపాస నమువలన బ్రహ్మలోకప్రాప్తియు నచటనుండి మోక్షము లభించును. చిత్తశుద్ధిలేని యుపాసనము నిష్ప్రయోజనము. ఉపాసనము సాక్షాన్మోక్షసాధనము గాదు.

## 12, 13, 14 మన్త్రములు

కర్మదేవతలయొక్క పృథగుపాసనము నింద్యము. అదేవిధమున జగత్సృష్టికి కారణభూతములగు నవ్యాకృత హిర ణ్యగర్భుల పృథగుపాసనముగూడ నింద్యమే యగును. సచ్చి దానన్దరూపమగు బ్రహ్మోపాసనమే పరిగ్రాహ్యము. ప్రకృ త్యుపాసనముగూడ నింద్యమే యగుచున్నది. కార్యబ్రహ్మో పాసనమువలన అణిమాద్యైశ్వర్య సిద్ధియు, అవ్యాకృతోపాస నమువలన ప్రకృతిలయరూప ఫలము గల్గును. ఇట్లు ప్రవృత్తి లక్షణమగు కర్మనిష్ఠయు నివృత్తిలక్షణమగు జ్ఞాననిష్ఠయు ఫల సహితముగ వివరింపబడినవి.

# V

## 15, 16, 17 మన్త్రములు

నిష్కామ కర్మానుష్ఠానముచే సాధకుఁడు మృత్యువును దాటి యుపాసనముచే బ్రహ్మలోకమును బొందునని చెప్పబడినది. అట్టి బ్రహ్మలోకద్వారమును బ్రవేశించుటకుఁగాను సూర్యాగ్నులు ప్రార్థింపబడుచున్నారు. పురుషుని దక్షిణాక్షిమునందుండు తేజస్సు సూర్యాగ్నులయం దుండు తేజస్సు గూడ సత్యస్వరూపమగు బ్రహ్మతేజస్సగుటచే నంతకాలము నం దాత్మప్రాప్తిద్వారమును బ్రహ్మము దెరచి ప్రవేశము నిచ్చుగాకయని ప్రార్థనాభావము. సత్యధర్మత్వ మట్టి ప్రవేశమునకు యోగ్యతాపత్రము. సత్యమగు బ్రహ్మదర్శనమే ప్రవేశఫలము. ఉపాసనము క్రమముక్తిద్వారము.

ఈశావాస్యోపనిషదర్థ సంగ్రహము సమాప్తము.



# ఉపనిషచ్చంద్రిక

## ద్వితీయమయూఖము

## ఈశావాస్యోపనిషత్తు

### ఉపోద్ఘాతము

వేదముల ప్రమాణము

చతుర్విధపురుషార్థసాధనభూతములు చతుర్దశవిద్యలకు, చతుష్షష్టికళలకును మూలభూతములు మానుషనిశ్వసితములవలె నప్రయత్నముగ వ్యాకృతములును నగు నాల్గు వేదములను జగత్స్రష్టయగు పరమాత్మ హిరణ్యగర్భున కుపదేశించెను. హిరణ్యగర్భుడు వీనిని మరీచి అత్రి మొదలగు తన పదిమంది మానసిక పుత్రులకుం జెప్పె. వీరలనుండి శిష్యప్రశిష్యపారంపర్యమున వేదములన్నియు ప్రాచుర్యమొందెను. ద్వాపరమునందు వేదవిస్తరకర్తలలో నగ్రగణ్యుడగు పారాశర వేదవ్యాసుడు నిజశిష్యులగు పైల వైశంపాయన జైమిని సుమంతులకు ఋగ్యజుస్సామాథర్వణసంహితలను క్రమముగా నధ్యయనము జేయించెను. వైశంపాయన శిష్యులలో నొకడును వాజసనపుత్రుడును నగు యాజ్ఞవల్క్యుడు గురువుయొక్క యాగ్రహమునకు గురియై యాతనివలన తన కలవడిన యజుర్వేదమునంతయు తిరిగి ఆయనకే యొప్పచెప్పి యఖిలవేదనిధియగు సూర్యభగవాను నాశ్రయించెను. వేదాభిమానులగు

శుక్లకృష్ణ యజుస్సంహితల విభాగము

మహాత్ములు యాజ్ఞవల్క్యునిచే వదలివేయబడిన యజుర్గణమును తిత్తిరియను పక్షిరూపమున గ్రహించిరి. అందువలన నా వేదశాఖకు తైత్తిరీయశాఖయని ప్రసిద్ధి గల్గెను.

యాజ్ఞవల్క్యుని భక్తికి సంతసించి సూర్యభగవానుడు వాజి రూపమున యజుస్సంహిత నతనికిం జెప్పెను. యాజ్ఞవల్క్యుడు సూర్యానుగ్రహముచే గ్రహించిన యజుర్గణమును తన శిష్యులగు కణ్వామధ్యందినప్రభృతి పంచదశవర్గము నధ్యాపనముం గావించెను. అందుచే నీశాఖ వాజసనేయము, కాణ్వము మాధ్యందినమను వివిధనామములచే వాడబడుచున్నది. వ్యాసమహర్షి యన్ని శాఖలను విభాగముజేసి ప్రవర్తింపజేసెను. అందు వేదవ్యాస ప్రవర్తితమగు యజుశ్శాఖ కృష్ణయజుస్సనియు యాజ్ఞవల్క్యసంవర్ధిత మగు యజుశ్శాఖ శుక్లయజుస్సనియు ప్రసిద్ధిగాంచినవి.

ఈశావాస్యబృహదారణ్యములు శుక్లయజుశ్శాఖాన్తర్గతములు

యజనాత్మకమగు నీ సంహితయందలి మొదటి ముప్పదితొమ్మిది యధ్యాయములయందు కర్మకాండ సంబంధమగు మన్త్రములు గలవు. చివరిదియగు నలుబదియవ యధ్యాయమునందు వినబడు మన్త్రములకు కర్మకాండమునందు వినియోగము లేదు. అవి జ్ఞానకాండమునందు సమన్వయము జేయబడినవి. ఈశావాస్య మీ జ్ఞానకాండములో జేరినది. ఈ సంహితకు సంబంధించిన నూఱధ్యాయములతో నొప్పు శతపథబ్రాహ్మణమున అంతిమాధ్యాయములారును జ్ఞానప్రకాశములయి బృహదారణ్యకోపనిషత్తను పేర బరగుచున్నది.

ఆత్మతత్త్వము విశుద్ధము, ఏకము నిత్యము అశరీరము సర్వగతమని కేవలాత్మతత్త్వమును మాత్రి మీమంత్రము

లుపదేశించుచున్నవి. ఇట్టి యాత్మతత్త్వము సిద్ధవస్తువగుటం జేసి కర్మచే నుత్పాద్యముగాదు. నిత్యమగుటంజేసి వికార్యము గాదు. స్వస్వరూపమగుటంజేసి ఆప్యముగాదు. నిర్గుణమగుటంజేసి నూతనగుణాధానమువలనగాని దోషాపనయమువలనగాని సంస్కార్యముగాదు. నిష్క్రియమగుటంజేసి కర్తృత్వభోక్తృత్వములద్దాని నాశింపవు. ఈ నాలుగుందక్క కర్మఫల మన్యము లేదు. కర్మఫల మాత్మజ్ఞానము గానేరదు. కర్మలన్నియు నవిద్యాప్రాపకములు. ఆత్మజ్ఞాన మవిద్యావినాశకము. కర్మలు చిత్తశుద్ధి హేతువులు. ద్విజులందర వ్వానికధికారులు. చిత్తశుద్ధి యాత్మజ్ఞానమున కనివార్యమగు పూర్వాంగము. ఈశావాస్యమన్త్రము లాత్మయొక్క యాథాత్మ్యమును ప్రకాశింపజేసి స్వభావసిద్ధమగు నాత్మవిషయాజ్ఞానమును బోగొట్టి శోకమోహాది సంసారధర్మోచ్ఛేదనైకసాధనమగు నాత్మైకత్వవిజ్ఞానము నుపదేశింపుచున్నవి. అందువలన నీ మన్త్రపూగమున కుపనిషత్తను నామ మన్వర్థకమగుచున్నది. దుఃఖహేతువగు స్వస్వరూపాజ్ఞానమును బోగొట్టుకొనగోరువాడచట నధికారి. ఆత్మయొక్క యాథాత్మ్యనిరూపణము విషయము. స్వస్వరూపానన్దావిర్భావము ప్రయోజనము.

సంబంధచతుష్టయ కథనము

మొదటి మన్త్రము 'ఈశావాస్య' మను రెండుపదములతో నారంభమగుటచే నీ యుపనిషత్తునకు ఈశావాస్యమను పేరుగల్గెను.

# ఈశావాస్యోపనిషత్తు

## శాన్తిపాఠము

ఓం। పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

టీ॥ సుప్రసిద్ధమగు నా పరబ్రహ్మము పూర్ణము, అనగా నాకాశమునలె సర్వవ్యాపియు నిరంతరము నిరుపాధికము నయి యున్నది. నామరూపములచే వ్యవహారక్షమమగుచున్న నీ ప్రపంచముగూడ కారణస్వరూపమున పరబ్రహ్మమే నగుచున్నది. పరబ్రహ్మము కార్యరూపమునందుగూడ తనయథార్థస్వరూపమగు పూర్ణత్వము గోలుపోవనేరదు. జ్ఞానముచే కార్యస్వరూపమునుండి యజ్ఞానకృతమగు నబ్రహ్మత్వమును దొలగించినపు డనంతరము, అబాహ్యము, ప్రజ్ఞానఘనైకరసమును నగు కేవల పరబ్రహ్మము మాత్రము మిగులుచున్నది. ఆధిభౌతికాధ్యాత్మికాధిదైవికోపద్రవము లుపశమించు గాత!

తా॥ వి॥ పరబ్రహ్మము సర్వమును వ్యాపించియున్నది. కనుక నది యున్నచోట మఱియొక వస్తువుండుటకు సాధ్యముగాదు. అనగా నది యద్వితీయమని దేలుచున్నది. విభిన్న నామరూపాత్మకమగు నీ జగత్తు పరబ్రహ్మము నుండి యుత్పన్న మగుచు నద్దానికంటె వ్యతిరిక్తముగనున్నటుల గాన్పించుచున్నది. కాని యది నిజముగా భిన్నముగాదు.

సువర్ణాభరణములు వివిధములయినను సువర్ణమొకండైనవి విభిన్నములుగావు. వ్యవహారమునఁగాన్పించు కటకకుండలాది వివిధములగు నామములను నాకారములనుఁ త్రోసిబుచ్చినపుడు సువర్ణమే మిగులుచున్నది. విభిన్నములగు నామములతోను ఆకారములతోను భాసించుచున్నను వానియం దుపాదానరూపముననున్న సువర్ణలక్షణమున కేమియు కొంచెంతలేదు. అట్లనే జగత్తని వ్యవహరింపఁబడుచున్న నామరూపములను సువర్ణాభరణనామరూపములవలె మిథ్యామాత్రములని త్రోసిబుచ్చినపుడు జగదుపాదానమగు బ్రహ్మముమాత్రము మిగులుచున్నది.

జిజ్ఞాసువులకు బ్రహ్మజ్ఞాపకములగు సాధనములు పదము, బీజము, సంఖ్య, రేఖ యను నాలుగు విధముల జరుగుచున్నవి. వానిలో పదమనగా వేదము; తదర్థబోధకమగు స్మృతియు. బీజమనగా గురుముఖైకవేద్యమగు మన్త్రసముదాయము. సంఖ్య వైదికము, లౌకికమని ద్వివిధము. వైదికమగు సంఖ్య మన్త్రసంకేతముగ పలరారుచు తత్త్వమునకు సన్నిహితసాధన మగుచున్నది. లౌకికసంఖ్య సర్వప్రపంచవ్యవహారక్షమమయి సర్వజనానుభవసిద్ధమగుచున్నది. రేఖగూడ సంఖ్యవలెనే ద్వివిధము. వైదికమగు రేఖ యుపాసనాంగము. లౌకికము గణితశాస్త్రప్రసిద్ధము.

పదము, బీజము, సంఖ్య, రేఖ యను నీనాలుగుసాధనములలో నుత్తరోత్తరము తత్త్వవిజ్ఞానమునకు సన్నిహితతరము. రేఖయన్ననో సన్నిహితతమము. ఈ నాలుగుసాధనములు ప్రకృతమున నగ్రగణ్యముగ వినవచ్చుచున్న పూర్ణ

మదః యను శ్రుతిని నిదానముగా గలిగి ప్రవర్తించుచున్నవి. ఇందులకు నిదర్శనము. పూర్ణము పదమాత్రముచే బ్రహ్మ శబ్దసమానార్థకము; బీజరూపమున ప్రణవజ్ఞాపకము, ప్రణవమన్ననో అకారఉకారమకారాత్మకము, సంఖ్యయన్ననో నవత్వసంఖ్య యుపలక్షణముగా గలిగి యనంతత్వమును బోధించుచున్నది. రేఖయన్ననో సదాశివశబ్దవాచ్యమగు వృత్తము వ్యావహారికము పారమార్థికము. వ్యావహారికమున వక్రరూపమగు పరిధిచే నావరింపబడియున్నది. పారమార్థికమున రేఖాకోణసామ్యావస్థారూపము. (Polygon of n sides) రేఖాకోణసామ్యావస్థారూప మీశ్వరజ్ఞాపకము. తద్భిన్నము పూర్ణమయి బ్రహ్మస్వరూపజ్ఞాపకము. మరియొకసంఖ్యచే సంకలనవ్యవకలనములుగాని గుణకవిభాగములుగాని చేయబడినపుడు బిందువువిలువ మారదని గణితశాస్త్రసమ్మతము.

అ॥ సంస్కృతమగు శరీరము గలవాడును వేదాధ్యయనసంపన్నుడును, యథాశక్తి కర్మానుష్ఠానముచే నపహతకిల్బిషుడును, నిత్యానిత్యవస్తువివేకియు వైరాగ్యోపేతుడును శమదమాదిసంపన్నుడు నగుముముక్షువునకు స్వయమాచార్యస్వరూపిణి యగుశ్రుతి దిగువనుదహరింపబడు పదునెనిమిది మన్త్రములచే నాత్మతత్త్వమును బోధించుచు మున్ముందు ప్రపంచమంతయు పరమాత్మ నాశ్రయించియున్నదనియు అట్టి పరమాత్మను బొందుటకు వైరాగ్యముదక్క మఱియొక సాధనము లేదనియు నుపదేశించుచున్నది.

అటులనే భ్రాన్తిదుర్గంధము శాస్త్రవిచారసన్నికర్షముచే నశించినపు డాత్మయొక్క యాథాత్మ్యసౌగంధ్య మంతటను పరిమళించును. జగత్సత్యత్వభ్రాన్తి తొలగినపుడు స్వాత్మ యం దధ్యస్తమగు కర్తృత్వభోక్తృత్వాదిద్వైతభావమంతయు తొలగిపోవును. ఇట్టి సర్వద్వైత బుద్ధిపరిత్యాగమే సర్వకర్మసంన్యాసము. అయ్యది నిష్క్రియమగు స్వస్వరూపావస్థానమున కనుకూలమగుటచే నాత్మ సురక్షితమగుచున్నది.

సంన్యాసికి శరీరధారణ సంరక్షణోపయోగమగు భిక్షాశనాచ్ఛాదికమునందు విరక్తి కల్గినను ఒకానొకపుడు ధనాశ కలుగవచ్చును. దానినిగూడ వదలుటకు తప్పక ప్రయత్నించవలయును. తనయొక్క గాని పరునియొక్క గాని ధనము నెప్పుడును కాంక్షింపవలదు. ధనమునం దేరికిని స్వత్వము గలదని నిర్వచింప శక్యముకాదు. పరిదృశ్యమానమగున దంతయు నాత్మార్థమే గనుకసర్వమును బరిత్యజించి మిథ్యావిషయమగు ధనమును కాంక్షింపవలదు.

ధనగృధ్నమాన వలయును.

అ॥ పై మంత్రమున సూత్రప్రాయముగ తత్త్వోపదేశము చేయబడినది. విరాగి ధనగృధ్నను బరిత్యజింపవలయునని నియమింపబడినది. దారైషణపుత్రైషణ ధనైషణ పరిత్యాగరూపమగు సర్వసంన్యాసమునకు చిత్తశుద్ధియే యుపాయమగుటవలన అట్టి చిత్తశుద్ధి సిద్ధించు మార్గము రెండవమన్త్రమున నుపదేశింపబడుచున్నది.

## ద్వితీయ మంత్రము

మూ॥ కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః ।
ఏవం త్వయి నాన్యథేతో௨స్తి న కర్మ లిప్యతే నరే ॥

టీ॥ ఈ లోకమునందు శాస్త్రవిహితములైన అగ్నిహోత్రాదికర్మల నాచరించుచుమాత్రము నూరుసంవత్సరములు జీవింపగోరవలయును. ఇట్టి జీవితేచ్ఛ గల నీకు మోక్షప్రాప్తికి కర్మాచరణము కంటె మార్గాంతరము లేదు. విహితకర్మల నాచరించు నిన్ను పాపఫలమంటదు.

తా॥ వి॥ పూర్వమంత్రము సంపూర్ణవైరాగ్యముగల జ్ఞాని నుద్దేశించి చెప్పబడినది. అట్టివానికి జీవితమునందుగాని ధనమునందుగాని యెంతమాత్రము కోరికయుండదు. అతనికి నిష్కామకర్మము సర్వసంన్యాసము విధింపబడినది. ధనజీవితము చిత్తశుద్ధిహేతువు. లం దిచ్ఛగలవానికి సంన్యాసము సమకూడదు. అతడు నిత్యనైమిత్తికకర్మల యందుమాత్రమే నాయుష్కాలమును గడుపవలయును. ఫలేచ్ఛలేని కర్మాచరణమువలన ధనజీవితములయం దిచ్ఛ నశించి మోక్షసాధనమగు చిత్తశుద్ధి కలుగును. కర్మకాండమునందు సుశిక్షితుడైన వాని చిత్తము మూసలోకరగిన బంగారమువలె మాలిన్యవిరహితమగును. చిత్తనైర్మల్యము మోక్షమునకు పరంపరాకారణము. జ్ఞానము నివృత్తిమార్గము. దారపుత్రధనైషణాదిపరిత్యాగపూర్వకమగు సర్వసంన్యాసమున కశక్తుడగు వాడీ మార్గమున కర్హుడుగాడు. ఫలేచ్ఛావిరహితమగు కర్మాచరణమతనికి

కర్తవ్యము. కోరికలేని కర్మాచరణమువలన నేదోషమంటదు. అట్టి కర్మాచరణము మోక్షహేతువై స్వాయముగా నశించును. చిల్లగింజ నీటిలోని యొండును విఱుగగొట్టి దానితో తానుగూడ నడుగుకుబోవునుగదా! ఈ రెండు మన్త్రములు మోక్షమును గూర్చిన సూత్రములవంటివి అగుటచే మిగిలిన పదునారు మన్త్రములీసూత్రములకు భాష్యప్రాయము లగుచున్నవి.

## తృతీయ మన్త్రము

ఆ॥ మొదటి మన్త్రమున నుదహరింపబడిన విషయ ప్రాపేయఫలము మూడవమన్త్రమున విస్తరింపబడుచున్నది.

మూ॥ అసూర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః। తాగ్ంస్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః॥

టీ॥ కర్మఫలములైన యాసుప్రసిద్ధజన్మపరంపర లేవి కలవో యవి యసురులకు చెందినవి. ఆ జన్మములు విచార శూన్యములగుటచేనజ్ఞానావృతములగుచున్నవి. ఆత్మఘాతకు లగు జనులెవరు గలరో వారలు మరణానన్తర మా యాసుర జన్మములను బొందుచున్నారు.

తా॥ వి॥ కేవలనిజప్రాణపోషణో పలక్షితమగు విషయ ప్రాపేయము గల వారందరసురులని చెప్పబడుదురు. భోగలంపటులగు దేవతలుగూడ నీ శబ్దమునకు గురి

యగుచున్నారు. ఆత్మవిచారము లేమింజేసి వీరంద కర్మఫలము రజ్ఞానఫలమగు జన్మమృత్యుపరంపరకు లోనగు జన్మమృత్యువులు చున్నారు. వీరాత్మజ్ఞానశూన్యులై యనాత్మ భూతములగు దేహాదుల నాత్మగా భావించి సత్యమగు నాత్మ కవజ్ఞత చేయుటచే నాత్మఘాతకుల నబడుచున్నారు.

చతుర్థ మన్త్రము

అ॥ ఏ ఆత్మజ్ఞానము లేమింజేసి సంసారప్రాప్తియు ఏ ఆత్మజ్ఞానముచే తన్నివృత్తియు గల్గునని చెప్పబడినదో యట్టి యాత్మతత్త్వము వివరింపబడుచున్నది.

మూ॥ అనేజదేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువత్పూర్వ మర్షత్ । తద్ధావతోఽన్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి॥

టీ॥ ఆత్మ చలనము లేనిది; మఱియొకటి లేనిది; మనస్సుకంటె నెక్కుడు వేగము గలది. ఇన్ద్రియము లీయాత్మ తత్త్వమును పొందలేవు. ఆత్మతత్త్వము మనస్సుకంటె ముందుగా పరుగిడును. అది స్థిరముగానుండియు గూడ పరుగులెత్తు మిగిలినవానిని దాటిపోవును. ఆత్మతత్త్వ ముండుటచేతనే వాయువు సర్వప్రాణిచేష్టలను విభజించు చున్నది.

తా॥ వి॥ ఆత్మస్వీయమగు స్థితినుండి చలనమునొందదు. జాగ్రదాదిసర్వావస్థ లొకదానినొకటి వ్యావర్తము చేయు చుండగా నాత్మ యీ యవస్థలననువర్తించుచున్నది. అనగా

జాగ్రదాద్యవస్థలొకటి యుండగ మఱియొకటియుండదు. ఆత్మ ప్రతియవస్థ ననుసరించును. వృద్ధి అపక్షయము పరిణామము మొదలగు వికారములులేక యది

ఆత్మయేసర్వవ్యాపారకారణము.

యొకేస్వరూపము కలిగియున్నది. అది నిశ్చలము నిరుపాధికము. అచ్యుదిమనోవ్యాపారవ్యవహితములగు నిన్ద్రియములకు గోచరముకాదు. సర్వవ్యాపకమయి అంతటనుండుటచే నత్యంతము ద్రుతతమములగు మనోవాయువులు ప్రసరింపగల ప్రతిస్థలమునందు వానికంటె ముందుగా తానే చేరినట్లగుపడుచుండును. అగ్ని ఆదిత్యుడు పర్జన్యుడు మొదలగువారికి దహనము ప్రకాశము వర్షము మొదలగు వ్యాపారవ్యవస్థాపకుడును సర్వప్రాణిభరణక్రియాసక్తుడును హిరణ్యగర్భరూపుడును నగు వాయువు పడుగుపేక వలె నతని నాశ్రయించియున్న సమస్తకార్యకరణజాతము గూడ నిత్యచైతన్యస్వభావమగు నాత్మతత్త్వమున్నపుడే యుండును, అనగా సర్వాస్పదము నిత్యచైతన్యస్వరూపమునగు నాత్మతత్త్వమున్నపుడు మాత్రమే సమస్తకార్యకరణాది విక్రియాజాలమంతయు సంభవించునని భావము. ఇదియే ఈశశబ్దార్థము.

పంచమ మన్త్రము

అ॥ ఈ యర్థమే తరువాత మన్త్రమున విస్తరింపబడుచున్నది.

మూ॥ తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే।
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః॥

టీ॥ ఆ యాత్మతత్త్వము చలించును, చలింపదు; దూరమున నుండును, ఆదేవిధమున సమీపమున నుండును. అది సమస్తజగత్తునకు లోపల బయట కూడ గలదు.

తా॥ వి॥ ఆత్మతత్త్వము నిరుపాధికస్వరూప మగుట వలన నచంచలము. ఇంద్రియచలనము ద్దానియం దారోపింప బడుటచే నది చలనవంతముగ దోచుచున్నది.

సర్వమాత్మచే నాచ్ఛాదితము

అజ్ఞానులక ది కోటిజన్మములకైనను లభ్యము గాదు. విస్మృతమైన కంఠమునందలి హారము వలె నజ్ఞానికది దూరమున నున్నటుల కనుపించినను స్వస్వరూపమగుటచే జ్ఞానులకది యత్యంత సమీపమున నున్నదగుచున్నది. నామరూపాత్మకమగు జగత్తుయొక్క బాహ్యాభ్యంతరముల నిండి ప్రజ్ఞానఘనస్వరూపమగుచున్నది. సర్వము పరమాత్మచే నావాస్యమను మాటకిదియే యర్థము.

షష్ఠ మన్త్రము

అ॥ మొదటి మన్త్రములోని 'ఈశ' శబ్దము నాల్గవ మంత్రమునందును, 'ఆవాస్య'మను పదయిదవమన్త్రము నందును వివరింపబడినవి. 'సర్వసంన్యాసముచేత నిన్ను రక్షించుకొను మ'ను పదములు రాబోవుమంత్రమున విస్తరింపబడుచున్నవి.

మూ॥ యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి।
పర్వభూతేషు చాఽఽత్మానం తతో న విజుగుప్సతే॥

టీ॥ ఎవ్వడైతే సమస్తభూతముల నాత్మస్వరూపుడగు తనయందే చూచుచున్నాడో సకలభూతములయందు నాత్మ

స్వరూపుడగు తనను చూచుచున్నాడో అట్టివా డట్టిజ్ఞానము గలిగియుండుటచేత నితరులయెడ విముఖుడు గా నేరడు.

తా॥ వి॥ గురుశాస్త్రోపదేశములవలన నెవ్వా డవ్యక్తాదిస్థావరాన్తములగు సర్వభూతములను తనయందే యున్నట్లులను తనకంటె భిన్నమగు మరియొకటి యేదియు లేనట్లును భావించుకొనుచున్నాడో అట్లే కార్యకరణసంఘాతమునకు తానే యాత్మసంభూతుడనియు సర్వజ్ఞానములకు సాక్షిభూతుడై దేహమునకు చేతనత్వము కలిగించుచు స్థావరాన్తముల కాత్మభూతుడనియుఁ దన్నెవడు భావించుకొనునో అట్టివాని కేవిధమగు సంశయము కలుగ నేరదు. సర్వసంన్యాసముచే నతనికి తనకంటె భిన్నమగు వస్తువు మఱియొకటిలేదు. కనుక శోకమోహకారణమగు జుగుప్స యతనికి కలుగదు. ఇదియే యాత్మరక్ష.

ఆత్మరక్ష శబ్దార్థము.

అ॥ ఈ యర్థమునే తరువాతమన్త్రము భంగ్యన్తరమున విస్తరించుచున్నది.

## సప్తమ మన్త్రము

మూ॥ యస్మిన్ సర్వాణి భూతాన్యాత్మైవాభూద్విజానతః।
తత్ర కో మోహః కః శోక ఏకత్వమనుపశ్యతః॥

టీ॥ ఆత్మసాక్షాత్కారముపొందినవాని కెపుడు సమస్తభూతములు స్వస్వరూపములే యగుచున్నవో యపుడు తన

కును ఇతరభూతములకును నైక్యమును గుర్తెరింగిన వాడగుట చేత నతనికి శోకమోహములుండవు.

తా॥ వి॥ బ్రహ్మాదిస్థావరాంతములగు సర్వభూతములు తనకంటె భిన్నములు గావు, తనరూపములే అనఁగా దానే సర్వమును అనుసర్వాత్మభావజ్ఞానము గల వానికి నాత్మజ్ఞానముచే నవిద్య సమూలముగ నశించుటవలన నజ్ఞానావరణరూపమగు మోహము గాని విక్షేపరూపమగు శోకము గాని కలుగదు. సర్వసంసారము సమున్మూలితమగుటచే నట్టి జ్ఞాని జీవన్ముక్తుడగుచున్నాడు. అతనికి ద్వైతప్రపంచ మైంద్రజాలికమునవలె నసత్యమగుటచే జుగుప్స యుండనేరదు.

ఆత్మజ్ఞానికి శోకమోహములు లేవు

అ॥ పైమన్త్రమునం దాత్మజ్ఞానియొక్క స్థితి వర్ణింపబడినది. ఈమన్త్రమునం దాత్మస్వరూపము వర్ణింపబడు చున్నది.

## అష్టమ మన్త్రము

మూ॥ సపర్యగాచ్ఛుక్రమకాయమవ్రణమస్నావిరగ్ంశుద్ధమపాపవిద్ధమ్। కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్యాథాతథ్యతోఽర్థాన్వ్యదధాచ్ఛాశ్వతీభ్యః సమాభ్యః॥

టీ॥ ఆ పరమాత్మ సర్వవ్యాపి జ్యోతిస్స్వరూపి శరీరములేనివాడు, ఛిద్రము లేనివాడు, నాడులు లేనివాడు, నిర్మలుడు, ధర్మాధర్మాదిపాపములు లేనివాడు, సర్వసాక్షి, మనస్సునకు ప్రభువు, అన్నిటికంటెను పైనుండువాడు,

స్వయంభువుడు, కర్మఫలసాధనములగునట్లు కర్తవ్యపదార్థములను నిత్యులగు సంవత్సరములను పేరుగల ప్రజాపతులకొఱకు నిర్మించెను.

తా॥ వి॥ ఆత్మ ఆకాశమునలె సర్వవ్యాపకుడు విభులుడు, స్వయంప్రకాశచైతన్యస్వరూపుడు నగుటచే సంసారిరూపమున శరీరమునం దుపలభ్యమానమగు జీవరూప మాతని వాస్తవ రూపముగాదు. స్థూలసూక్ష్మ శరీరము లతనివి కావు. ఆతడు శుద్ధుడు అపాపహతుడు, సర్వప్రభువు, సర్వసాక్షి, నిత్యముక్తుడు, అలిప్తుడు, శాశ్వతుడు, సర్వాభిభవకరుడు, స్వప్రకాశచైతన్యస్వరూపుడు గనుక స్వయంభువుడు సర్వాత్మకుడు. ఇచట పూర్వపూర్వలక్షణ ముత్తరోత్తర లక్షణమునకు కారణమగుచున్నది. ఇట్టి పరమాత్మ సంవత్సరములను నామములు గల ప్రజాపతులకు నియతములగు కర్మఫలములను వానికి సాధనములను చేతనాచేతనరూపములునునగు నర్థములను తదనురూపముగ విభజించిపంచి పెట్టెను.

ఆత్మతత్త్వస్వరూపము

అ॥ ఉపక్రమింపబడిన యాత్మతత్త్వోపదేశము ముగిసినది. ఏషణాత్రయపరిత్యాగమున కశక్తుడు, అందువలన సంన్యాసమున కనర్హుడయినను సంసారమునం దత్యంతమాసక్తుడు గానివానికి చిత్తైకాగ్ర్యము గుదురుటకు కర్మోపాసనాసముచ్చయము నుపాయముగా జెప్పదలచి ఫలకథనము ను మిషచే ప్రత్యేకముపాసనమును రాబోవు మన్త్రమున శ్రుతి నిందించుచున్నది.

## నవమ మన్త్రము

మూ॥ అన్ధం తమః ప్రవిశన్తి యేఽవిద్యాముపాసతే । తతో
భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥

టీ॥ ఎవ్వరు విద్యకు విరుద్ధమగు కర్మనాచరించెదరో వారంధకారాత్మకమగు నజ్ఞానమును ప్రవేశించెదరు. ఎవ్వరు కేవల దేవతాస్వరూపజ్ఞానమునందు మాత్రమాసక్తచిత్తులగుదురో వారంధకారాత్మకమగు నజ్ఞానముకంటెను హీనతరమగు చీకటిని బ్రవేశించెదరు.

తా॥ వి॥ ఈశావాస్యమను ప్రథమ మన్త్రమునందు సర్వైషణాపరిత్యాగమే లక్షణముగాగల జ్ఞాననిష్ఠ సలుకరింపబడినది. ఇది ప్రథమ వేదార్థము. జీవితమునందు గాఢమగు కోరికగల వానికి

**కర్మనిష్ఠ జ్ఞాననిష్ఠలు విరుద్ధములు**

యీ నిష్ఠ సంభవముగాదు. అట్టివానికి "కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్" అని ద్వితీయ మన్త్రమునందు కర్మనిష్ఠ విధింపబడినది. ఇది ద్వితీయ వేదార్థము. ఇట్లు ప్రదర్శింపబడిన జ్ఞాననిష్ఠకర్మనిష్ఠవిభాగమున కితరోపనిషత్తులుపోద్బలకములగుచున్నవి. అజ్ఞానకామములు రెండును కర్మనిష్ఠకు ముఖ్యలక్షణములు. "సోఽకామయత జాయా మే స్యాత్" (బృ 1. 4. 17) (నాకు భార్య కావలెనని యతడు గోరెను) యను వాక్యము జాయాపుత్రాదిలక్షితమగు సంసారము కామనాజన్యమని దెల్పుచున్నది. జాయాపుత్రాది కామనానిపీడితులగు వారు గృహస్థాశ్రమమున కర్మనిష్ఠ

ప్రవిష్టులగుచున్నారు. జీవితమునం దిచ్ఛలేక వైరాగ్యమును బొందినవారు "కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయ మాత్మాఽయం లోకః" (బృ 4. 4. 22.) (ఎవరికి యీ లోక మాత్మగాదో అట్టి నేము సంతానముతో నేమి జేయ గలము?") అని జ్ఞానులు తమ కర్మనిష్ఠకు చిహ్నమగు సంసారమునందు వైముఖ్యమును వెలిబుచ్చుచున్నారు. వైరాగ్యము జ్ఞాననిష్ఠకు ముఖ్యమగు ప్రవేశద్వారము. ఈ రెండు మన్త్రములచే కర్మజ్ఞాన నిష్ఠలకు గల ప్రాతికూల్యము స్పష్టమగుచున్నది. ఈ యుపనిషత్తు మూఁడు మొదలు యెనిమిది వరకు గల మన్త్రములయం దవిద్యానిందాపూర్వకముగ నాత్మయొక్క యథార్థ స్వరూపము ప్రదర్శింబడినది. మఱియు సర్వసంన్యాస మొనర్చిన జ్ఞాననిష్ఠులు మాత్రమే యాత్మదర్శనమున కర్హులనియు కామనానివిష్టులగువా రిద్దానికి ననర్హులనియు నుపదేశింపబడినది. ఈ యర్థమే శ్వేతాశ్వతరమునందుగూడ నుపపాదింపబడినది. "అన్ధం తమః ప్రవిశన్తి" యను ప్రకృత మన్త్రము జీవితమునందు గాఢమగు నిచ్ఛగలిగి తన్నిమిత్తములగు గర్మల నాచరించు కర్మపరులను గూర్చి చెప్పుచున్నది. ఈ మన్త్రము సర్వులకును వర్తింపదు. కామన లేనివారు సాధ్యసాధనాది సర్వభేదబుద్ధిశూన్యులయి యెవ్వనియందు సర్వభూతము లాత్మత్వమును బొందుచున్నవో యట్టి పరమాత్మను గుర్తెఱింగి యంతట నేకత్వమునే గ్రహించుచున్నారు. వారలకు శోకమోహములు దూరములగుచున్నవి. అట్టి యేకత్వవిజ్ఞానము

నేదియు నొక కర్మతోఁగాని జ్ఞానాన్తరముతోఁగాని ముముక్షువు దక్క నన్యుఁడెవఁడును సముచ్చయము చేయఁగోరఁడు. కాని యీ

అవిరుద్ధములగు కర్మ దేవతా జ్ఞానములకు సముచ్చయము కుదురును

ప్రకరణమున సముచ్చయమును గూర్చి ప్రస్తావించు తలంపుతో కేవల కర్మనిష్ఠ నిందింపబడుచున్నది. కనుక ప్రకరణము నకు ప్రస్తుతమగు సముచ్చయముయొక్క స్వరూప మెట్టిదిగా నుండవలయును? న్యాయముచేతను శాస్త్రముచేతను సముచ్చయ మెవ్వానికి సంభవమో యట్టి సముచ్చయమే ప్రస్తుతమగుచున్నదని యంగీకరింపవలసి యున్నది. సముచ్చేయములగునవి పరస్పరము విరుద్ధములు గాకుండవలెను. ఆత్మసాక్షాత్కారైక సాధనమగు జ్ఞాననిష్ఠ, దేవతాజ్ఞాన సాధనమగు నుపాసనము, పితృలోకాదికామనా సంపాదకమగు కర్మనిష్ఠ— ఈ మూటిలో నన్యోన్య మవిరుద్ధములగు వానికే సముచ్చయము సంభవ మగును. అవిరుద్ధములగు వాని సముచ్చయమే ప్రస్తుతమగు చున్నది.

ఇచట వినబడుచున్న విద్యయనగా జ్ఞానమునకు దేవ లోకము ప్రత్యేక ఫలముగ జెప్పంబడినది గనుక నాజ్ఞాన

కర్మ దేవతాజ్ఞానము ప్రత్యేకోపాసనము నింద్యము

మాత్మజ్ఞానము గానేరదు. దేవతాజ్ఞానమే కావలెను. కర్మనిష్ఠకు పితృలోకము ప్రత్యేకఫలము చెప్పబడినది. కనుక ఆత్మ సాక్షాత్కారనిమిత్తమగు జీవన్ముక్తికి హేతుభూతమగు జ్ఞానమునకును తదితరములకును సముచ్చ

యము కుదుర నేరదు. శాస్త్రమునకును న్యాయమునకు నట్టి సముచ్చయము విరుద్ధము. అవిరుద్ధములగు దేవతాజ్ఞానకర్మ నిష్ఠల సముచ్చయము ప్రికృతమని యర్థము చేసికొనవల యును. కాని ప్రకృత మన్త్రమునందు దేవతాజ్ఞాన కర్మనిష్ఠలు రెంకును నిందింపబడుచున్నట్లు వినబడుచున్నవి గనుక నవి రెంకును ప్రత్యేకముగా గాని సముచ్చితములుగా గాని యుపాదేయములు గానేరవని యూహింపరాదు. దేవతా జ్ఞానమునకును కర్మనిష్ఠకును ప్రత్యేక ప్రత్యేక ఫలము లుదా హరింపబడినవి. కనుక నవి యననుష్ఠేయములు గానేరవు. శాస్త్రవిహితమయిన దెద్దియు నననుష్ఠేయము గానేరదు. కాని ప్రత్యేకప్రత్యేకముగ నొనర్పబడు కర్మదేవతాజ్ఞానము లిచట నిందింపబడుచున్నవి. వాని సముచ్చయనిందయందు శాస్త్రమునకు తాత్పర్యములేదు.

అవిద్యాశబ్దమునకు కర్మాచరణ మర్థము. అగ్నిహోత్రాదులు కర్మలక్షణములు. కేవల కర్మాచరణపరు లజ్ఞానరూపమగు నంధకారమును బ్రవేశించె దరు. వారు పరమాత్మదర్శనసమర్థులు గానేరరు. నేను, నాది, యను నహంమమాభిమాన

ప్రత్యేక కర్మాచర ణము నింద్యము

మనశ్శబ్దమున కర్థము. అహంమమాభిమానావిష్టులగు సుప్ర సిద్ధధనాద్యభిలాషులు రెండవమన్త్రమునను జ్యోతిష్టోమాది కర్మైకనిష్ఠాపరులు మూడవ మన్త్రమునను నుదాహరింపబడు చున్నారు. అట్టివారలు పరమాత్మజ్ఞానవిరుద్ధమగు నజ్ఞానమును బడయుదురని మన్త్రముయొక్క ప్రథమవాక్యార్థము.

కెర్తి దేవతాజ్ఞా
నసముచ్చయఫలము

చేయు దేవతాజ్ఞానసాధనముగు నుపాసన ముచే చిత్తైకాగ్ర్యము సిద్ధించుచున్నది. ఇట్టియుపాసనము హిరణ్యగర్భోపాసనమయి మరణమునకు పూర్వము పరిపక్వమయినచో జీవన్ముక్తి హేతు వగును. అట్లుకానిచో బ్రహ్మలోకప్రాప్తి హేతు వగును. ఆ లోకమున బ్రహ్మోపదేశముచే ముక్తి సంప్రాప్తమగును. ఇతర దేవతోపాసనముచే తత్తద్దేవతాలోకము తత్తద్దేవతాను గృహీతములగు వశిమాదిమహిమలు సిద్ధించును. చిత్తశుద్ధి ఆత్మజ్ఞానమున కెన్నడును సాక్షాదుపకారకము గాదు. ఈ విషయమును గూర్చి మాచే రచియింపబడిన యుపనిషచ్చ న్ద్రికా ప్రథమ మయూఖము తైత్తిరీయోపనిషత్తు పదునాల్గవ పుటను జూడవలెను.

అ॥ అట్లయినచో కర్మోపాసనలు రెండును నగ్రాహ్యము లగుటంజేసి పరిత్యాజ్యములగుచున్నవిగదా యను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

## పదిమన్త్రము

మూ॥ అన్యదేవాహుర్విద్యయా ఽన్యదాహురవిద్యయా। ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే॥

టీ॥ దేవతాజ్ఞానముచే నొక ఫలముగల్గును, కర్మ నిష్ఠచే మఱియొక ఫలము గలుగునని వేదములు చెప్పుచున్నవి. ఈ విషయమునే యుభయతన్త్రకుశలులగు వేదవేత్తలవలన పారంపర్యముగ వినుచున్నాము.

తా॥ వి॥ దేవతాజ్ఞానమునకు ఫలము దేవలోకప్రాప్తియు నియు, కర్మమునకు ఫలము పితృలోకప్రాప్తియనియు వేదములు బోధించుచున్నవి. అంతియేగాక మన్త్రద్రష్టలు, ఉభయతన్త్రకుశలులునగు వేదవిదులు గూడ నీ ఫలభేదమును పరంపరగా బోధించుచున్నారు. ఈరెండు మార్గములు సాక్షాత్తుగ బ్రహ్మజ్ఞానోపకారకములు మాత్రము కావని వాని నిందకభిప్రాయము.

కర్మనిష్ఠదేవతాజ్ఞానములప్రత్యేకఫలములు

అ॥ విభిన్నఫలకములగు కర్మజ్ఞానముల సముచ్చయము వలని ఫలమును పదునొకండవ మన్త్రము వివరించుచున్నది.

ఏకాదశ మన్త్రము

మూ॥ విద్యాం చావిద్యాం చ యస్తద్వేదోభయగ్ంసహ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే॥

టీ॥ ఎవ్వడు దేవతాజ్ఞానమును కర్మను గూడ సముచ్చయముచేసి తెలిసికొనునో నతడు కర్మానుష్ఠానముచేత మృత్యువును దాటి దేవతాజ్ఞానముచేత దేవత్వమును బొందును.

దేవతాజ్ఞానసహితముగ నీశ్వరార్పణబుద్ధితో నాచరింపబడు నగ్నిహోత్రాది కర్మలచే దుఃఖకారణమగు నన్తఃకరణమలము నశించి బ్రహ్మలోకము సిద్ధించును. అచటనుండి బ్రహ్మతోగూడ ముక్తుడగును. ఇది క్రమముక్తివిషయము

కర్మదేవతాజ్ఞానమునకుపాయము

ఇట్లు నిష్కామకర్మాచరణము దేవతాజ్ఞానమున కుపాయ మగుచున్నది. ఈ మన్త్రమునందు విద్య మృత్యువు అమృతత్వ మను మూడుపదములు వినబడుచున్నవి. విద్యాశబ్దముచే నాత్మజ్ఞానోపాసనలు రెండును మృత్యుశబ్దముచే సహజముగ ప్రాప్తములగు సామాన్యకర్మజ్ఞానమును చెప్పనొప్పును. అట్లే అమృతత్వశబ్దము బ్రహ్మాత్మత్వమును దేవతాత్మత్వమును గూడ చెప్పనొప్పును. కాని సముచ్చయ ప్రకరణము ననుస రించి విద్యాశబ్దము దేవతాత్మజ్ఞానపరముగను అమృతశబ్దము దేవతాత్మపరముగను వ్యాఖ్యానింపబడినవి.

అ॥ వ్యాకృతావ్యాకృతముల సముచ్చయము నుపపా దించుటకై వానియొక్క పృథగుపాసనము తరువాత మన్త్ర మున నిందింపబడుచున్నది.

ద్వాదశ మన్త్రము

మూ॥ అన్ధం తమః ప్రవిశన్తి యే ऽసంభూతిముపాసతే।తతో
భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ం రతాః॥

టీ॥ ఎవ్వరు కారణరూపమగు ప్రకృతిని మాత్రము పాసించెదరో వారదర్శనాత్మకమగు తమస్సును పొందు చున్నారు. ఎవ్వరు హిరణ్యగర్భరూపమగు కార్యబ్రహ్మ యందు మాత్రమే యాసక్తిగలవారగుదురో వారంతకంటెను నధికమగు నంధకారమును పొందుచున్నారు.

తా॥ వి॥ అసంభూతి ప్రకృతి కారణము అవ్యాకృ తము అవిద్య. ఈ పదములన్నియు సమానార్థకములు. ఇట్టు

లనే సంభూతి కార్యబ్రహ్మ హిరణ్యగర్భు లను పదములే కార్యకములు. ఆత్మజ్ఞాన శూన్యులై బ్రహ్మానమును నేమనాశ్రయ పరిత్యాగము చేయించేసి కేవలదేవతాశ్రయమున కున్నారలు, సంసారమునందు నిమగ్నాహులు నాప ప్రత్యవాయభావాపు లీ మంత్రమున నుద్దేశింపబడినారు. ఈ యుపాసనలు కూడ సాక్షాన్మోక్షోపయోగములు కావు కాని చిత్తైకాగ్రతకు సహాయములగుచున్నవి.

నిరుపాధిబ్రహ్మా నోపాసనముం మోక్ష హేతు వులు కావు

ఇందలి తొమ్మిదవమంత్రమునందు సామాన్యముగు కర్మయొక్కయు తద్దేవతలయొక్కయు పృథగ్భావనము నిందింపబడినది. ఇందన్ననో సకల జగత్సృష్టికి నిదానభూతములగు నవ్యాకృత హిరణ్యగర్భుల పృథగుపాసనము కూడ నిందింపబడుచున్నది. కావుననే యుపాసనయన్న సచ్చిదానందరూపమగు బ్రహ్మము యొక్క యుపాసనమే శ్రుతిస్మృతిసదాచారానుయాయులచే బరిగ్రహింపబడుచున్నది గాని కేవలమాయోపాసనమనగా బ్రకృత్యుపాసనము పరిగ్రహింపబడుటలేదు. అంతియగాక నయ్యది హేయముగా కూడ దలంపబడుచున్నది.

9. 12 మంత్రముల భేదము

అ॥ ఇట్టి యుపాసనాసముచ్చయమాహాత్మ్యము తదనుభవజ్ఞుల యనుభవపరిదర్శనపూర్వకముగ పరిదర్శింపబడుచున్నది.

త్రయోదశ మన్త్రము

మూ॥ అన్యదేవాహుః సంభవాదన్యదాహురసంభవాత్। ఇతి
శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచచక్షిరే॥

టీ॥ కార్యబ్రహ్మోపాసనమువలన గల్గు ఫలము వేఱనియు, ప్రకృత్యుపాసనము వలన గలుగు ఫలము వేఱనియు నీరెండింటియొక్క సముచ్చయమున నుత్కృష్టఫలము లభించు ననియు నుభయోపాసనాకుశలులగు పండితులుగూడ బోధించుచున్నారు.

తా॥ వి॥ కార్యబ్రహ్మోపాసనమువలన అణిమాద్యైశ్వర్యసిద్ధి గలుగును. అవ్యాకృతోపాసనమువలన ప్రకృతి లయరూపమగు ఫలము గల్గును.

అ॥ సంభూత్యసంభూత్యుపాసనాసముచ్చయముచేబొందు ఫలమును పదునాల్గవ మన్త్రము వివరించుచున్నది.

చతుర్దశమన్త్రము

మూ॥ సంభూతిం చ వినాశం చ యస్తద్వేదోభయగ్ంసహ।
వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యా ऽ మృతమశ్నుతే॥

టీ॥ అవ్యాకృతమనబడు ప్రకృతిని వ్యాకృతరూపమగు కార్యబ్రహ్మను రెంటినొక్కడే యుపాసింపదగినదిగా తెలిసికొనినవాడు కార్యబ్రహ్మోపాసనముచే ననైశ్వర్యము నధర్మకామాదిదోషజాలమును దాటి ఆ వ్యాకృతోపాసనముచే ప్రకృతి లయమును పొందుచున్నాడు.

తా॥ వి॥ ఈ పదునాల్గు మన్త్రములచేత ప్రవృత్తి లక్షణమగు కర్మనిష్ఠయు నివృత్తిలక్షణమగు జ్ఞాననిష్ఠయు ఫలసహితముగ వివరింపబడినవి. మానుషదైవ

కార్యకారణాత్మోపాసనాఫలము

విత్తసాధ్యమైన ఫలము ప్రకృతిలయాన్తము. శరీరపాటవము గోభూహిరణ్యాది సంపత్తి మానుషవిత్తము. దేవతాజ్ఞానము దైవవిత్తము.

అ॥ సాధకుడు విద్యానుకర్మానుష్ఠానముచే మృత్యువును దాటి యుపాసనముచే బ్రహ్మలోకము బొందునని పదునాల్గవమన్త్రమున చెప్పబడినది. అట్టి బ్రహ్మలోకద్వారమును ప్రవేశించుప్రకారము నాలుగు మంత్రములలో వివరింపబడుచున్నది.

పంచదశాది అష్టాదశాన్త మన్త్రములు

మూ॥ హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్।
తత్త్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥
పూషన్నేకర్షే యమ సూర్య ప్రాజాపత్య వ్యూహ రశ్మీన్
సమూహ । తేజో యత్తే రూపం కల్యాణతమం తత్తే
పశ్యామి యోఽసావసౌ పురుషః సోఽహమస్మి॥
వాయురనిలమమృతమథేదం భస్మాన్తగ్ం శరీరమ్।
ఓం క్రతో స్మర కృతగ్ం స్మర క్రతో స్మర కృతగ్ం
స్మర.
అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ
వయునాని విద్వాన్ । యుయోధ్యస్మజ్జుహురాణమేనో
భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ॥

టీ॥ జ్యోతిర్మయమగు పాత్రముచేత నాదిత్యమండలాన్తర్వర్తి యగు బ్రహ్మముయొక్క ద్వారము కప్పబడి యున్నది. ఓ సూర్యుడా! సత్యమైన ధర్మము నాచరించు నాకొరకు నీ సత్యస్వరూపమును చూచుటకై నీవట్టి పాత్రమును తొలగింపుము.

ఓ జగత్పోషకా! ఏకాకివై తిరుగునట్టివాడా! సకలమును నియమించువాడా! ప్రాణములను రసములను స్వీకరించువాడా! ప్రజాపతి పుత్రుడ వగు నో సూర్యభగవానుడా! నీకిరణములను తొలగింపుము; తపనహేతువగు నీ తేజస్సు నుపసంహరింపుము. అత్యంతము మంగళకరమగు నీ రూపమును నీ యనుగ్రహముచేత చూచుచున్నాను. ఆ యీ పురుషు డెవడుకలడో యతడే నేనగుచున్నాను.

నేను మరణించునపుడు నాప్రాణము పరిమితమగు నీ శరీరమును విడచి ముఖ్య వాయుస్వరూపుడగు సూత్రాత్మను పొందుగాక! అటు తర్వాత నీ స్థూలశరీర మగ్నియందు భస్మీభూత మగుగాక! ఓంకారవాచ్యుడవు అగ్నిరూపుడవు నగు నో సంకల్పాత్మకా! నన్ను స్మరింపుము! ఇంతకాలము నుండి నే జేయు నుపాసనాదికమును స్మరింపుము. నన్ను స్మరింపుము! నే చేయు నుపాసనాదికమును స్మరింపుము!

ఓ యగ్నిదేవా! మమ్ములను మంచి మార్గము ననగా గమనాగమనరహితమగు నుత్తమ మార్గమును పొందింపుము. ఓ దేవా! నీవు సమస్తమైన కర్మములను ప్రజ్ఞానములను తెలిసినవాడవు. మాయొక్క వంచనాత్మక మగు

పాపమును తొలగింపుము. నీకొఱకు మిక్కుటమగు నమస్కారోక్తిని చెప్పుచున్నాను.

ఉపాసనచే క్రమముక్తి లభించును.

తా॥ వి॥ పురుషుని దక్షిణాక్షమునందు ప్రకాశించుచున్న తేజస్సు సూర్యమండలమునందు ప్రకాశించు తేజస్సు నొకటియే. ఆ తేజస్సే సత్యస్వరూపమగు బ్రహ్మ మని యుపాసించు ముముక్షు వంత్యకాలమునం దాత్మప్రాప్తి ద్వారమును తెరచి యచట తనకు ప్రవేశమును గలుగజేయుమని ప్రార్థించుటయే దీని భావము. సత్యధర్మత్వ మట్టి ప్రవేశమునకు యోగ్యతా పత్రము. వర్ణాశ్రమాచారపరత్వము సత్యధర్మపదమున కర్థము. లేక సత్యమే ధర్మముగా కలిగి యుండుట సత్యధర్మత్వము. సత్యమగు బ్రహ్మదర్శనమే యీ ప్రవేశఫలము. అట్టి పరబ్రహ్మమే పురుషశబ్దముచే నిచట పరామర్శింప బడుచున్నది. సమస్తమైన జగత్తు ప్రాణబుద్ధ్యాత్మకముగ నతనిచే నిండియుండుటవలన నతడు పురుషు డనిపించుకొనుచున్నాడు. లేక శరీరమునందుండు వాడు గనుక పురుషు డగుచున్నాడు. స్వర్గాదులు కేవల కర్మాచరణఫలములు. వానికి బోవుమార్గము దక్షిణా పథము. ఉపాసనాఫలము బ్రహ్మలోకము. దీని మార్గ ముత్తరపథము. దీనినే దేవయాన మనిగూడ నందురు. స్వర్గ ఫల మనిత్యము. అచటికి పోవువారలు ఫలభోగానంతరము తాము వెళ్ళిన మార్గముననే వర్షసస్యాదిద్వారా నీలోకమును ప్రవేశించి శేషకర్మానురూపమగు జన్మము నెత్తు

దురు. బ్రహ్మలోకమునకు జేరువారు కల్పాన్తమున కార్య బ్రహ్మముతోఁగూడ ముక్తు లగుదురు. వారిచటికి తిరిగిరారు. అందువలననే బ్రహ్మలోకమును జేర్చు సరియయిన ఉత్తమ మార్గప్రాప్తి యిచట ప్రార్థింపబడినది.

ఈ మంత్రములో నుదాహరింపబడిన సముచ్చయము కర్మోపాసనాసముచ్చయము గాని కర్మాత్మజ్ఞానసముచ్చయముకాదు. విరుద్ధములగు సాధనములు, ప్రయోజనములు గల కర్మజ్ఞానములకు సముచ్చయ మసంభవము.

కర్మజ్ఞానసముచ్చయము సాధ్యము కాదు.

కర్మోపాసనముల కట్టి విరోధము లేకపోవగా కర్మాచరణ ముపాసనమునకు నియతమగు పూర్వాంగమై దాని కుపకారక మగుచున్నది. ఉపాసనము కర్మాంతర్భాగము గూడ నగు చున్నది. ఋత్విక్కులు హోమద్రవ్యములు మొదలగువాని సాహాయ్యముచే ననుష్ఠింపబడు శ్రౌతకర్మ కర్మశబ్దము చేతను, మానసికకర్మలక్షితము నిరంతర మనితరవిచ్ఛిన్నము నగు ధ్యాన ముపాసనా శబ్దముచేతను సామాన్యముగ జెప్ప బడుచున్నవి. ఉపాసనము గూడ కర్మాంతర్భాగమే యగుచున్నది. జ్ఞానముచేత సాంఖ్యులకు, కర్మచేత యోగులకు ముక్తి మార్గము ప్రదర్శింప బడుచున్నది. ఉపాసనమను మూడవ మార్గము లేదు. అందువలననే కర్మోపాసనల రెండింటిఫల మిచట కర్మఫలమని పరామర్శింపబడినది. స్వర్గాదు లిచ్ఛా పురస్సరముగ చేయబడు శ్రౌతకర్మఫలము. కర్మపరులకు

ఉపాసనము కర్మ కాండాన్తర్భాగము

పునర్జన్మము తప్పదు. నిరీహాత్మో నీశ్వరార్పణముగ జేయ బడు శ్రౌతకర్మ చిత్తశుద్ధిని కలుగజేసి యుపాసనమున కుప కారకమగుచున్నది. అందుచే నీ రెండింటికిని సముచ్చయము కుదురును. సూర్యతేజోనన్యమగు నగ్ని యిట్టి సముచ్చయ ఫలసంధానకర్త యగుటంజేసి యతడిచట నామంత్రణము సేయబడుచున్నాడు. మందమధ్యమబుద్ధులకు నిర్గుణోపాసనము క్రమముక్తి హేతువగును. విచారచతురులగు సూక్ష్మబుద్ధుల కది చిత్తైకాగ్రతా హేతువై జీవన్ముక్తిసాధకమగును.నిర్గుణ బ్రహ్మేతరోపాసనము తత్తదనురూప మగు నణిమాది ఫలహేతువగును. మోక్షమున కదిగాని చిత్తశుద్ధిగాని యెంతమాత్రము ప్రత్యక్షసాహాయ్యకారి గాదు. విద్యా శబ్దమున కిచట దేవతాజ్ఞానమనియు అమృతత్వ శబ్దమునకు దేవతాస్వరూప ప్రాప్తి యనియు నర్థము. ఆ పద మీ ప్రక రణమున ఆత్మసాక్షాత్కారపరము కాదు. అట్లయినచో మంచిమార్గమును చూపుమని ప్రార్థించుట యసంభవము. ఆత్మ సాక్షాత్కారము నొందిన జీవన్ముక్తుడు బోగల మఱి యొక లోకముగాని తన్మార్గముగాని లేదు. సామాన్య లోక మునకు గానవచ్చు నాతని భౌతికశరీరము తిరిగి పంచభూత ములలో జేరును.

ఇట్లు ముముక్షువగు నుత్తమాధికారికి సర్వసంన్యాస పూర్వకమగు జ్ఞాననిష్ఠ ప్రథమ మంత్రమునందును, కామో పేతుడగు వానికి యావజ్జీవము కర్మాచరణము

సింహావలోకనము ద్వితీయ మంత్రము నందును విధింపబడినవి.

నాలుగైదు మంత్రములయం దాత్మతత్త్వవిచారణము ఆరు
ఏడు ఎనిమిది మంత్రములయం దాత్మజ్ఞాన ఫలవివరణము
చేయబడినది. సర్వకర్మసంన్యాసమున కశక్తులై జ్ఞానసహిత
విహితకర్మాచరణప్రవణు లగువారికి కర్మోపాసనాసము
చ్చయపూర్వకమగు క్రమముక్తిమార్గము తొమ్మిదవ
మన్త్రమున బ్రదర్శింపబడినది. వీని ప్రత్యేకానుష్ఠానము
యొక్క నైరర్థక్యము పది పదునొకండు మన్త్రములయం
దుదాహరింపబడినది. ఉత్తరమార్గసాధన మగు సంభూ
త్యసంభూతిసముచ్చయోపాసనము పండ్రెండు పదమూడు పదు
నాలుగు మంత్రములలో వివరింపబడినది. పదునైదు పదునారు
పదునేడు మంత్రములలో నట్టి యుత్తరమార్గద్వారము
యొక్క యాచ్ఛాదనపరిహారము సూచింపబడినది. పదునెనిమి
దవ మంత్రమున సీప్రార్థనాద్వారుక్తిచే నద్దానియందలి
యుత్కంఠ ప్రకటిత మగుచున్నది. ఈ విధముగ నిందలి

15, 18 ఈశావాస్యోపనిషత్తు 29

నాలుగైదు మంత్రములయం దాత్మతత్త్వవిచారణము ఆరు
ఏడు ఎనిమిది మంత్రములయం దాత్మజ్ఞాన ఫలవివరణము
చేయబడినది. సర్వకర్మసంన్యాసమున కశక్తులై జ్ఞానసహిత
విహితకర్మాచరణప్రవణు లగువారికి కర్మోపాసనాసము

శ్రీమ త్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంచిత
శ్రీభారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు
శ్రీకల్యాణానంద భారతీమాన్నాచార్య మహా
స్వామి పాదాత్యంతా న్తే వాసియు నత్రి
గోత్ర సముద్భూతుఁడు నగు లింగన
సోమయాజిచే విరచితమగు నుపనిష
చ్చంద్రిక ద్వితీయమయూఖమున
నీశావాస్యోపనిషత్తు
సమాప్తము.

బ్రహ్మార్పణం బ్రహ్మహవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥



# కేనోపనిషత్తు

## అర్థసంగ్రహము

కర్మాచరణము కామనాప్రాప్తము; స్వర్గాదు లద్దాని ఫలము. పుత్రవిత్తాదులవలె స్వర్గాదులుగూడ ననిత్యములు. కర్మాచరణమంతయు ప్రవృత్తిమార్గమునకు జెందినది. కర్మాచరణమువలన నిత్యమగు మోక్షము లభించనేరదని తెలిసికొని బ్రహ్మజిజ్ఞాసువు శ్రవణమననిదిధ్యాసనములచే బ్రహ్మజ్ఞానమును బొందును. ఇది నివృత్తిమార్గ మనంబడును. బ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనినవానికి దిరిగి జన్మములేదు. ఇంతమాత్రముచేత కర్మాచరణ మనవసరమన వీలులేదు. కామన చిత్తకాలుష్యకారణము. చిత్తశుద్ధిలేనిది చిత్తైకాగ్ర్యము కుదరదు. చిత్తైకాగ్ర్యము లేనిది నిదిధ్యాసన మలవడదు. విరుద్ధ ప్రయోజనములుగల కర్మజ్ఞానముల రెండింటిని జోడింపశక్యముగాదు. నిదిధ్యాసన మభ్యాససాధ్యము. ఇట్టియభ్యాసమునకు తగిన శరీరపాటవము బ్రహ్మమునం దనిరాకరణబుద్ధియు, నుపనిషద్బోధితములగు ధర్మముల ప్రాప్తియు బ్రహ్మానుగ్రహమును శాన్తిపాఠమున నభ్యర్థించుచు నీయుపనిష త్తారంభమగుచున్నది.

పంచమ ఖండము

మనస్సు చక్షురాది జ్ఞానేన్ద్రియములద్వారా వాని వాని విషయములగు రూపాదులతో సంయోగమును బొంది నపుడు మనకు వానిజ్ఞానము గలుగుచున్నది. మనస్సు ఇన్ద్రియములుగూడ నచేతనములు. స్వయముగానవి విషయములను గ్రహించలేవు. ఆత్మతేజస్సాన్నిధ్యమువలన వానికట్టి సామర్థ్యము గల్గుచున్నది. ఆత్మ స్వయముగా క్రియారహితము. కేవలమద్దాని సన్నిధానమాత్రముచేత నట్టిశక్తి యిన్ద్రియములకు గల్గుచున్నది. సూర్యకాన్తిప్రసారమాత్రముచేతనే పదార్థములు మన కగుపడుచున్నవి. ఆత్మతేజస్సాన్నిధ్యముచేతనే చక్షుస్సుకు చక్షుస్త్వము, శ్రోత్రమునకు శ్రోత్రత్వము అటువలెనే యితరేన్ద్రియములకు తత్తదిన్ద్రియత్వము సంభవించును. అందువలన ఆత్మ చక్షుస్సుకు చక్షుస్సు శ్రోత్రమునకు శ్రోత్రమని చెప్పబడుచున్నది. అదేతీరున యితరేన్ద్రియముల కది తత్తదిందియమని బిలువబడుచున్నది. చక్షుస్సు చక్షుస్సు గాదనియు తన్ముఖమున యాత్మతేజస్సే యభివ్యక్తమగుచున్నదనియు దెలిసినపుడు చక్షుస్సునందు చక్షుర్జ్ఞానము బోయి యాత్మజ్ఞానము గలుగును. ఇటులనే సర్వేన్ద్రియములయందు నిన్ద్రియజ్ఞానము బోయి యాత్మజ్ఞానము సిద్ధించును. సర్వప్రపంచమును భాసింపజేయు నాత్మతేజస్సును బ్రకాశింపజేయు మరియొక కాంతి యెద్దియును లేదు. అది గ్రహించుటకు మనస్సునకును వర్ణించుటకు వాక్కునకును సాధ్యముగానిది. విదితమగు ప్రపంచము

కంటెను, అవిదితమగు ప్రకృతికంటెను గూడ విలక్షణము. అది బుద్ధిమొదలగు నిన్ద్రియములద్వారమున నభివ్యక్త మగుటంజేసి యిన్ద్రియధర్మములు దానియం దారోపింపబడు చున్నవి. దాని నిజస్వరూప మారోపిత ధర్మముచే గప్పబడు చున్నది. ఇట్టి యారోపిత ధర్మములను తొలగించి యాత్మ యొక్క నిజస్వరూపమును దెలిసికొనుటకు గురుశాస్త్రోప దేశ మవసరమగుచున్నది. కేవలహేతువాదముచే నది దెలియబడదు. బ్రహ్మము సర్వప్రమాణాతీత మగుటవలన సర్వవ్యవహారాతీతముగూడ నగుచున్నది. వ్యవహారసంపా దితమగు జ్ఞాతృజ్ఞేయకర్తృక్రియాదిభేదము సంపూర్ణముగ దొలగినపుడే యది సుగ్రాహ్యమగును. ఆత్మకాంతిచే ప్రకా శింపబడు మనస్సాత్మను ప్రకాశింపచేయలేదు. బ్రహ్మ ముపాసనావిషయము గాదు.

## ద్వితీయ ఖండము

బ్రహ్మము విదితావిదితములకంటె నన్యము, అనుపా స్యము స్వాత్మానన్యమని పైన దెలుపబడిన విషయము విచా రణపూర్వకముగ దృఢము జేయబడుచున్నది. బ్రహ్మము బుద్ధికి అందరానిదగుటచే 'బ్రహ్మమును నేను దెలిసికొంటిని' యని చెప్పువాని జ్ఞానము యథార్థజ్ఞానము గానేరదు. బుద్ధిచే దెలిసికొనబడు బ్రహ్మరూపము లన్నియు నామరూపోపాధికృత ములు అసత్యములును నగుచున్నవి. పరబ్రహ్మము కేవల చేతనాత్మకము; విజ్ఞానఘనము; సర్వవ్యవహారసాక్షిభూతము; చక్షురాద్యుపాధిముఖమున మాత్రము జ్ఞేయము. బుద్ధిచే

దెలిసికొన ప్రయత్నించువారి కది తెలియరాదు. బుద్ధిచే దెలిసికొన బ్రయత్నింపని వారి కయ్యది తెలియును. అనగా బ్రహ్మము సాక్షాత్కారయోగ్యముగాని బుద్ధిసాధ్యముగాదని తాత్పర్యము. ఈ విషయము శాస్త్రముచేతనే గాక ననుభవజ్ఞులగు బండితులచేతగూడ స్థిరము జేయబడుచున్నది. ఇట్టిబ్రహ్మసాక్షాత్కారము శ్రవణమననసిదిధ్యాస సాధ్యము. అయ్యది జాగ్రత్స్వప్నసుషుప్తులనుదాటి నివాత దీపమునవలె యచంచలమగు సమాధియం దనుభవింపదగియున్నది. నేను బ్రహ్మమునయితినని దెలిసికొనినవాడు బ్రహ్మజ్ఞాని. నేను బ్రహ్మమును దెలిసికొంటినని దెలిసికొనినవాడు మిథ్యాజ్ఞానియగును. బ్రహ్మజ్ఞానము సంపూర్ణముగ గుదరనంతవఱకు జ్ఞాతృజ్ఞానభేదముండక తప్పదు. అట్లుగానిచో జ్ఞానోదయమునకే యవకాశము గలుగదు. బుద్ధివృత్తిరూపములగు సర్వజ్ఞానము లాత్మప్రకాశముచే నుద్దీపితములగుచున్నవి. ఎఱ్ఱగా కాలిన యినుపగుండునం దగ్నికాంతివలె ప్రతివిషయబోధమునం దాత్మకాంతి యనుస్యూతముగ బ్రకాశించుచున్నది. బుద్ధివృత్తులనుంచి యాత్మజ్యోతిస్సును ప్రత్యేకించి దెలిసికొనవలయును. ఇట్టి యాత్మజ్యోతి స్సశేషబుద్ధివృత్తులకు సాక్షిభూతమయి వానినవభాసింపజేయును. ఆత్మ అమృతము. నేను మర్త్యుడనను భ్రాంతిజ్ఞానము దొలుగుటయే యమృతత్వము. బ్రహ్మజ్ఞానజన్యమగు బలము మనుష్యత్వాద్యభిమానవిదూరమయి యభయమగు ప్రతిష్ఠాహేతు వగును. మనుజుడు బ్రహ్మజ్ఞానమున కధికారి. అతడు బాహ్యవిషయాభిలాషల

దొలగించుకొని సర్వాత్మకమగు బ్రహ్మతత్త్వమును గుర్తెఱింగి సాక్షాత్కారము జేసికొనసమర్థుడు. బ్రహ్మజ్ఞాన మీశరీర మున్నపుడు మాత్రమే సాధ్యము గనుక త్వరపడ వలయును.

## తృతీయ ఖండము

విశుద్ధాన్తఃకరణులగువారు మాత్రమే సర్వాతిశయము సర్వాత్మభూతము నగు బ్రహ్మమును గ్రహించగలరను బ్రహ్మజ్ఞానసూత్ర మొక యాఖ్యాయికచే నుదాహరింపబడు చున్నది. బ్రహ్మ సంపాదితమగు నొకయాసురవిజయము నిజ సామర్థ్య నిమిత్తమని గర్వించుచున్న దేవతల దర్ప మణప దలంచి బ్రహ్మ మొక యద్భుతరూపము నావిర్భవింప జేసెను. వాయ్వగ్ని దేవత లద్దాని రూపమారయ నచటికేగిరి కాని విఫలమనోరథులయిరి. సౌందర్యమున హైమవతివలె శోభిల్లు నొక స్త్రీరత్న మచటికరుదెంచి యింద్రునికి కాన్పించి యీవిజయము బ్రహ్మదిగాని దేవతలదిగాదని చెప్పెను. బ్రహ్మస్వరూపము మెఱపుతీగవలె ప్రకాశించు చున్నది. అది నిరతిశయజ్యోతిఃస్వరూపము. సర్వవిశ్వ వ్యాపకము, సృష్ట్యాదిత్రిప్రకారియు నగుచున్నది. మఱియు నది యత్యంతము సన్నిహితము, స్మరణసంకల్పాదిచిహ్నముల వలన నుపాస్యము సర్వప్రాణిజాతమునకు సంసేవ్యము నగు చున్నది యని యీ సంనివేశమువలన నింద్రుడు గ్రహించెను.

ఇట్లు మోక్షోపకారకములగు జ్ఞానోపాసనములు రెండు నీయుపనిషత్తున వివరింపబడినవి. శరీరేన్ద్రియమనస్సుల

యొక్క సమాధానము, తపస్సు, అన్తరిన్ద్రియనిగ్రహము, స్వవర్ణాశ్రమోచితమగు నగ్నిహోత్రాది పూజనాదికము, కర్మ, తజ్జన్యమగు చిత్తశుద్ధి, ఉపాసనము, తజ్జన్యమగు చిత్తైకాగ్ర్యము, ఇవిఅన్నియు జ్ఞానసాధనములు. బ్రహ్మజ్ఞానమునకు నాలుగు వేదములు, నాలుగు పాదములు. బ్రహ్మవిద్య యుపనిషత్కామధేనువునకు వత్స; తపఆదు లద్దాని పాదములు; అమాయిత్వము అకౌటిల్యము ముఖ్యలక్షణములుగా గల సత్యమద్దానికి ఆవాసస్థానము

— కేనోపనిషదర్థ సంగ్రహము సమాప్తము —



# కేనోపనిషత్తు

## ఉపోద్ఘాతము

కేనోపనిషత్తు సామవేదీయతలవకారాన్తర్భాగమునకు సంబంధించి యుండుటవలన తలవకారోపనిషత్తనియు 'కేన' యనుపదముతో నారంభమగుటంజేసి కేనోపనిషత్తనియు బిలువబడుచున్నది. దీనికి శ్రీ శంకరభగవత్పాదులు ప్రతిపదభాష్యమును రచియించి దానితో దృప్తిజెందక గాబోలు వాక్యభాష్యమను మఱియొక వ్యాఖ్యానమును గూడ రచియించిరి. ఈ వ్యాసమునం దీరెండువ్యాఖ్యానములనుకరింపబడినవి. శ్రీశంకరానంద నారాయణకృతవ్యాఖ్యానవిశేషములుగూడ నిందు బొందుపరుపబడినవి.

**పూర్వగ్రంథ సంగతి**

పూర్వగ్రంథమునం దశేషకర్మలు వాని కాశ్రయములగు ప్రాణోపాసనములు కర్మాంగములగు సామవిషయములు వివరింపబడినవి. అటుతరువాత గాయత్రిసామవిషయము లుదాహరింపబడినవి.

**ప్రవృత్తిమార్గము**

స్వాభావసిద్ధము పుత్రధనదారైషణాత్మకము నగు కామనచే ప్రేరితుడగువాడు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానముచే దక్షిణమార్గమున స్వర్గాదిలోకముల కేగును. అచటిఫలభోగానన్తరము శేషకర్మఫలానుభవము కొఱకదేమార్గమున నీలోకమును దిరిగి ప్రవేశించి తత్తదుచితములగు జన్మముల నెత్తును. మృత్యుపరంపరవాతబడి స్వర్గనరకేహలోకములకు రాకపోకల ననవరతము సేయు

చుండుటయే కర్మమార్గఫలము. కర్మపరులచే నిరతిశయసుఖమని చెప్పంబడు స్వర్గఫలముగూడ సాపేక్షికసుఖస్వరూపమే గాని యాత్యంతికమోక్షము గానేరదు. ఇది శాస్త్రీయమగు ప్రవృత్తిమార్గము. అశాస్త్రీయమగు ప్రవృత్తిమార్గమువలన పశ్వాదిస్థావరాన్తమగు నధోగతి లభించును.

నివృత్తిమార్గము

శాస్త్రీయము ఫలేచ్ఛారహితము నగు కర్మాచరణమువలన సత్వశుద్ధి, దానివలన సర్వకామవినాశము గలుగును. సర్వకామవినాశము వైరాగ్యహేతువు. సంపూర్ణవైరాగ్య మబ్బినవాని కాత్మజ్ఞానమునుగూర్చి తీవ్రమగుకోర్కె జనించును. ముముక్షువద్దానిచే చోదితుడయి శ్రోత్రియుడును బ్రహ్మనిష్ఠుడును నగు సద్గురువువలన నుపనిషచ్ఛాస్త్రమును విశ్వాసపురస్సరముగ శ్రవణము జేయును. శ్రుతమయిన నాత్మతత్త్వము శ్రుతిసమ్మతమగు మననముచే సంశయవిపర్యయరహితమగు స్థైర్యమునొంది నిదిధ్యాసవిషయమగుచున్నది. మననముచే స్థైర్యమునొందింపబడిన యాత్మజ్ఞానముయొక్క నిరంతరచింతనమే నిదిధ్యాస యనంబడుచున్నది. సంపూర్ణవైరాగ్యము బ్రహ్మజ్ఞానమునకు ముఖ్యకారణము. ప్రత్యగాత్మవిజ్ఞానముచేత సర్వసంసారబీజము కామకర్మప్రవృత్తికారణము నగు నజ్ఞానము సంపూర్ణముగ నశించి శోకమోహములు దొలంగును. కర్మాచరణము జ్ఞానసాధనమయినను జ్ఞానికి పరిత్యాజ్యమగుచున్నది.

కర్మజ్ఞానసముచ్చయముగూడ నిట్టిఫలహేతు వగుటం జేసి కర్మము పరిత్యాజ్యము గాదనవీలులేదు. కర్మజ్ఞానములు రెండును విభిన్నములు, విభిన్న కారణములవలన నుపాదేయములునగుచున్నవి. "నాకు సంతానము గావలెను. అందుకొఱకు వివాహము చేసికొందును."1 "పుత్రునిచేతనే యీ లోకము జయింపదగినది"2యను కామము కర్మహేతు వగుచున్నది. ఇట్టికోర్కెలు వానిసాధనములుగూడనాత్మకంటె భిన్నములు. ప్రజాకర్మాదులవలన ప్రయోజనమును గానని విరాగులు "ఎవరికీలోకముతోపనిలేదో అటువంటి మాకీసంతానముచేనేమి ప్రయోజన"3మని దలంచుచున్నారు. వారలకు మనుష్యపితృదేవలోకత్రయసాధనములు నాత్మలోకకారణ

కర్మజ్ఞానసముచ్చయము సాధ్యముగాదు

కేనోపనిషత్తు 39

కర్మజ్ఞానసముచ్చయముగూడ నిట్టిఫలహేతు వగుటం జేసి కర్మము పరిత్యాజ్యము గాదనవీలులేదు. కర్మజ్ఞానములు రెండును విభిన్నములు, విభిన్న కారణములవలన నుపాదేయములునగు

కర్మజ్ఞానసముచ్చయము

ఘటింపదు. కర్తృక్రియాకారకభేదసంకులము కర్మ. సర్వభేద శూన్యమాత్మజ్ఞానము. సాధ్యసాధనవ్రాతవిపులము సాధ్యమగు దృష్టాదృష్టఫలముచే విశిష్టమునయినదికర్మ. అదిపురుషతంత్రా ధీనము. పరబ్రహ్మము స్వస్వరూపమగుటంజేసి సిద్ధము, పురుష తంత్రాతీతము.

కర్మాచరణ మనావశ్యకమనియుం గూడ చెప్పవీలు లేదు. కొందఱు కర్మ స్వల్పఫలమునిచ్చును, బహుళాయాస సాధ్యము, తత్త్వజ్ఞానముచేతనే నిఃశ్రేయః ప్రాప్తిగలుగుచున్నది గనుక గర్మను బూర్తిగా బరిత్యజింపవచ్చును. అడుసు కడుగుకొనుటకంటె త్రొక్కకుండుట మేలుగదా! యని శంకించుచున్నారు. నిజమే! కర్మాచరణము నిష్కామునికి పక్షకల్పమయినను సకాముని కవశ్యమగుచున్నది. ఈశ్వ రార్పణబుద్ధితో ననుష్ఠింపబడిన గర్మలు నిష్కామునికి శుద్ధ సత్త్వ సంపాదకములగు సంస్కారము లగుచున్నవి. యజనా దులచే జిత్తము బ్రహ్మయోగ్యముగా జేయబడుచున్నది. బుద్ధిమంతులకు యజ్ఞము దానము తపస్సు మొదలగునవి పావనములు. నిష్కాముడగు జిజ్ఞాసునకు కర్మము లాత్మజ్ఞాన ప్రతిబంధనిన ర్తకము లగుచున్నవి. చిత్తసంస్కారకారణము లగుటంజేసి యాతనికవి యాత్మజ్ఞానోపాయము లగుచున్నవి. ఆత్మతత్త్వప్రాప్తిమాత్రము జ్ఞానమువలననే గల్గును. అద్దా నికి మార్గాన్తరములేదు. ఆత్మ స్వభావసిద్ధము నిత్యము అవి కారము అవిషయము పరిమాణవిహీనము. కనుక దాని నంద

కర్మ చిత్తసంస్కార కారణము.

జేయు సాధనము లెవ్వియు గానరావు. ఆత్మ తనకంటె భిన్నముగాదు గనుక సంస్కారయోగ్యము గాదు. జన్మము నెత్తిన ప్రతిమనుజుడును నిత్యమగు మోక్షము నాశించు చున్నాడు. కర్మారంభ మట్టివాని కనుపపన్నమగును. బాహ్య విషయములనుండి బుద్ధిని సంపూర్ణముగా మరల్చి యనన్యాశర ణ్యము నిత్యము అభయము శివము అచలము నగు పరమార్థము నెఱుంగ గోరిన జిజ్ఞాసువుయొక్క ప్రశ్నకు బ్రతివచన పురస్సరముగ నాత్మవిజ్ఞానోప దేశ మీయుపనిషత్తునందు శాన్తిపాఠముఖమున నారంభింపబడుచున్నది.

## శాన్తిపాఠము

మూ॥ ఆప్యాయన్తు మమాఙ్గాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమిన్ద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మనిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోదనిరాకరణ మస్త్వనిరాకరణం మేఽస్తు తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు తే మయి సన్తు ॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

టీక॥ వాగాదిపంచకర్మేన్ద్రియములు, చక్షుశ్శ్రోత్రాది పంచజ్ఞానేన్ద్రియములు ప్రాణాపానాదిపంచప్రాణములు మనో బుద్ధ్యాత్మకమగు నన్తఃకరణము మొదలగు నాయొక్క సర్వే న్ద్రియములు పాటవమును తృప్తిని జెందుగాక. సర్వ ముపని షత్ప్రతిపాదకమగు బ్రహ్మమే. నేను బ్రహ్మమును నిరాకరిం పను. బ్రహ్మము నన్ను నిరాకరింపకుండుగాక! అనిరాకర

ణాము గలుగుగాక! నాకనిరాకరణము గలుగుగాక! ఉపనిష ద్బోధితములగు ధర్మములన్నియు నాత్మనిరతుడనగు నాయం దుండుగాక, అవి నాయందుండుగాక!

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

ప్రథమఖండము.

అ॥ చక్షురాదిజ్ఞానేన్ద్రియములు తత్తద్విషయములగు రూపాదులను గ్రహించుచున్నవి. కరచరణాది కర్మేన్ద్రియము లుత్క్షేపణావక్షేపణాకుంచనప్రసారణగమనాది కర్మల నాచరించుచున్నవి. మనోబుద్ధ్యాత్మకమగు నన్తఃకరణము విమర్శనాపూర్వకముగ విషయనిర్ణయము జేయుచున్నది. ప్రాణాపానాది వాయుపంచకము ప్రాణాదుల నిర్వహించు చున్నది. ఈ విషయములనన్నిటిని బరికించినపు డిట్టి వ్యవహారసామర్థ్య మీ యింద్రియములకు స్వకీయమా లేక పరకీయమా యను ప్రశ్న బుట్టుచున్నది. ఈప్రశ్నకు సమాధానము చెప్పుటకుముందు ప్రశ్నస్వరూపము నిరూపింపబడు చున్నది.

మూ॥ కేనేషితం పతతి ప్రేషితం మనః కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః। కేనేషితాం వాచమిమాం వదన్తి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి ॥

టీ॥ ఎవనిచే నభిప్రేతమగు ప్రేరణముచే చోదితమై మనస్సు విషయములనుగూర్చి బోవుచున్నది? ఎవనిచే ప్రేరితమై సకలేన్ద్రియములకంటె విలక్షణము ప్రథమమునగు ప్రాణము

ప్రవర్తింపుచున్నది? ఎవనిచే నిశ్చయింపబడి యీ వాక్కును లోకులు బల్కుచున్నారు? ఏ దేవుడు నేత్రేన్ద్రియమును శ్రోత్రేన్ద్రియమును వాని వాని విషయములయందు చోదన చేయుచున్నాడు?

తా॥ వి॥ శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములను పంచేన్ద్రియములకు శబ్దస్పర్శరూపరసగంధములనునవి వరుసగా విషయములగుచున్నవి. ప్రపంచములో

ప్రశ్నకారణము

జ్ఞేయములగు విషయములన్నియు నీ అయిదింటిలో నవాన్తరభేదము నందుచున్నవి. విషయములను దెలిసికొనగల యన్తఃకరణశక్తి మనస్సని పిలువబడుచున్నది. మనస్సు జ్ఞానేన్ద్రియములద్వారా బహిర్గతమై తత్తద్విషయములతో సంబంధించినపుడు తత్తదాకారములను బొందును. వివిధవిషయాకారమును బొందిన మానసికస్థితి వృత్తియనం బడును. మనస్సచేతనము గనుక దాని వికారముగూడ నచేతనమే యగును. మట్టిబొమ్మ మట్టిధర్మమునే బొందియుండును. కాని యచేతనమగు నన్తఃకరణమువలన మనకు బాహ్యవస్తుజ్ఞానము గలుగుచున్నట్లనుభవసిద్ధము. అచేతనమునకు చేతనసాధ్యమగు జ్ఞానక్రియ చేతగాదు. రథాదుల నధిష్ఠించి నడిపించు సారథివలె కర్మజ్ఞానేన్ద్రియములనధిష్ఠించి చోదనచేయు చేతనపదార్థ మొకటియుండి తీరవలయును. ఈ యర్థము ప్రశ్ననుబట్టియే నిష్పన్నమగుచున్నది. అన్తఃకరణము కర్మేన్ద్రియ జ్ఞానేంద్రియప్రాణపంచకములు యేదో యొక దేవతచే చోదితములయి వ్యాపారవంతములగుచున్నవనియు నట్టి

చోదనకర్త యింద్రియములకంటె భిన్నుడనియుగూడ ప్రశ్నయం దనుమానింపబడుచున్నది. ఇట్టి సర్వేంద్రియాధిష్ఠాత యెవరు? మనస్సున కట్టి సామర్థ్యము కానరాదు. స్వవిషయములయందది నియతముగ బ్రవర్తించుచున్నను దానికట్టి ప్రవృత్తియందు స్వాతంత్ర్యములేదు. దానికి ప్రవృత్తి స్వాతంత్ర్యమున్నయెడల తన కనిష్టమగు విషయములనుగూర్చి ప్రవర్తించదు. బలవత్తరముగ నివారింపబడియు నది దుఃఖతమములగు విషయముల బ్రవేశించు

ప్రశ్న తాత్పర్యము

చున్నది. కనుక నద్దానిగూడ నియమించు నధిష్ఠాత మఱియొకడుండితీరవలయును. ఆతడు మనస్సుకంటె భిన్నుడుగూడ గావలయును. దేహేంద్రియసంఘాత మిట్టి నియంత యగుచున్నదా యని పృచ్ఛకుని యుద్దేశ్యము గానేరదు. దేహేంద్రియసంఘాతము కర్మకార్యము అనిత్యము అని తెలిసికొని విరక్తుడయి నిత్యవస్తుస్వరూపము నెఱుంగగోరినవాడు దానినిగూర్చి దెలిసికొన బ్రయత్నింపడు. నిత్యవస్తువు నెఱుంగుటకే ప్రయత్నించును. అట్టి నిత్యవస్తువు నిష్క్రియము నిష్కలము నగుటంజేసి స్వీయమగు నిచ్ఛాక్రియాదు లద్దానికి లేవు. కావున ఆ వస్తువు స్వీయమగు నిచ్ఛాక్రియాదులచే మనస్సుమొదలగు నింద్రియముల నాజ్ఞాపింపజాలదు. అట్లయినచో నానిత్యవస్తువేవిధమున సర్వవ్యవహారకారణమగుచున్నది? కనుక మనస్సు, ప్రాణము, వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము మొదలగు నింద్రియములు కార్యకరణసంఘాతముచే చోదితములయి స్వస్వవ్యాపారము

లను నిర్వహించుచున్నవా? లేక తద్వ్యతిరిక్తము స్వతంత్రము నగు మఱియొక చేతనవస్తువుయొక్క యిచ్ఛవలనగాని యింకొకవిధమునగాని యవి ప్రవృత్తము లగుచున్నవా యని ప్రశ్న భావము. ఈవిషయమును విమర్శించుటకై 'ఎవనిచేత' యను ప్రశ్నము వేయబడినది.

అ॥ పై ప్రశ్నకు గురుముఖమున శ్రుతియే యిట్లు సమాధానమును జెప్పుచున్నది.

మూ॥ శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచగ్ం స ఉ ప్రాణస్య ప్రాణః। చక్షుషశ్చక్షురతిముచ్య ధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి ॥

టీ॥ ప్రకాశస్వరూపుడగు నేదేవు డేకారణమువలన శ్రోత్రేన్ద్రియమునకు శ్రోత్రేన్ద్రియము, మనస్సునకు మనస్సగు చున్నాడో, నిశ్చయముగా వాక్కునకు వాక్కుగా నున్నాడో, ప్రాణమునకు ప్రాణమగుచున్నాడో, నేత్రమునకు నేత్రమగు చున్నాడో యాదేవుని మర్త్యులు దెలిసికొని శ్రోత్రాదికరణ కలాపమును వదలి యీలోకమునుండి వెలువడి మరణరహితు లగుచున్నారు.

తా॥ వి॥ శబ్దమును గ్రహించుశక్తి శ్రోత్రమునకు రూపమును గ్రహించుశక్తి చక్షుస్సునకు గలదు. అటులనే నితరజ్ఞానేన్ద్రియములకుగూడ తమ తమ విషయములను గ్రహించు శక్తి గలదు. అనగా శ్రోత్రేన్ద్రియము శబ్దమును చక్షురిన్ద్రియము రూపము నవభాసింప

మన్త్రమునందలి వివిధపద సమన్వయము.

జేయుచున్నవి. అటులనే యితరేన్ద్రియములుగూడ తమతమ విషయముల నవభాసింపజేయుచున్నవి. మనఃశబ్దముచే నిచట సంకల్పాత్మకమగు మనస్సు నిశ్చయాత్మకమగు బుద్ధియు నవగతములగుచున్నవి. అదేప్రకారము చక్షుఃశ్రోత్రశబ్దములచే జ్ఞానేన్ద్రియపంచకము, వాక్ఛబ్దముచేత కర్మేన్ద్రియ పంచకము దెలియబడుచున్నది. ప్రాణమనఃశబ్దములచే నన్నమయాది కోశపంచకము సూచింపబడుచున్నది.

మనస్సు జ్ఞానేన్ద్రియములలో నన్యతమముద్వారా విషయసంయోగమును గోరినప్పుడు మనకు విషయజ్ఞానముగలుగును. అందుచే నిన్ద్రియపంచకము మనస్సుగూడ జ్ఞానకారణములగుచున్నవి. అవి యచేతనములు.

శ్రోత్రాదులకు శ్రోత్రత్వాదు బ్రహ్మతేజస్సుచే గలుగుచున్నది

చేతనవస్తుసాధ్యమగు జ్ఞానోత్పాదనకార్యనిర్వహణము నొనర్చుచున్నవి. నిత్యము అసంహతము సర్వాన్తరమునగు నాత్మసాన్నిధ్యముచేతనే వీనికట్టి సామర్థ్యము గల్గుచున్నది. ఆత్మజ్యోతిస్సనునది లేనిచో వీనికట్టి సామర్థ్యముగలుగదు. "ఆత్మప్రకాశముచేతనే నీపురుషుడు ప్రకాశింపబడుచున్నాడు."1 "అతనికాంతిచేతనేనీప్రపంచమంతయు భాసింపబడుచున్నది"2 అతని తేజస్సుచే నుద్దీపితుడయి సూర్యుడు లోకమును తపింపజేయుచున్నాడు.3 అను మొదలగు శ్రుతివాక్యము

1) ఆత్మనైవాఽయం జ్యోతిషాఽఽస్తే – బృ 4.3.6
2) తస్య భాసా సర్వమిదం విభాతి – ముం 2.2.10
3) యేన సూర్యస్తపతి తేజసేద్ధః – కేన 1.9

లా బ్రహ్మస్తంబమగు జగత్తంతయు నాత్మతేజస్సుచేతనే వ్యాపింపబడినట్లు బోధించుచున్నవి. శ్రోత్ర మీయాత్మజ్యోతిస్సుచే వ్యాప్తమగుటచేతనే శ్రవణవ్యాపారమును జేయుచున్నది. నిజముగ వ్యవహరించునది యాత్మజ్యోతిస్సు; శ్రోత్రము దానికి అభివ్యక్తిద్వారమాత్రము. అయినను నీరెండింటిని విచక్షణచేయలేక శ్రోత్రము వినుచున్నదని చెప్పుకొనుదుము. విద్యుచ్ఛక్తి యంత్రముఖమున ఛేదనముద్రణాది క్రియల జేయుచున్నను రెండింటికి నభేదముకల్పించి యంత్రమే ఛేదనాదికము చేయుచున్నట్లు చెప్పుదుము. విద్యుచ్ఛక్తి ప్రసారముచేతనే ఛేదనయంత్రమునకు ఛేదకత్వము సంప్రాప్తమగుచున్నది. విద్యుచ్ఛక్తి యంత్రమునకు యంత్రమగుచున్నది. అందువలన ఆత్మజ్యోతిస్సు శ్రోత్రమునకు శ్రోత్రమని జెప్పబడుచున్నది. ఆతీరుననే నీఆత్మజ్యోతిఃప్రసారమువలననే మనస్సు మొదలగు కరణములు స్వస్వవ్యాపారనిర్వహణసమర్థము లగుచున్నవి. కనుక నా యాత్మతేజస్సు మనస్సునకు మనస్సు, వాక్కునకు వాక్కు, ప్రాణమునకు ప్రాణము, చక్షుస్సునకు చక్షుస్సు నగుచున్నది.

భోగ్యభోక్తృ భోగసాధన జాతిమంతయు బ్రహ్మోపలబ్ధిస్థానములు

శ్రోత్రాదులకు శ్రోత్రత్వాదిసిద్ధిహేతువగు నీయాత్మతేజస్సు నిష్క్రియము, నిర్విశేషము. నిష్క్రియమగుటచేనది మనస్సుమొదలగు నింద్రియములచే సేవనిని చేయింపదు. కాని నద్దాని సాన్నిధ్యముచేత వివిధేన్ద్రియములు స్వస్వవ్యాపారక్షమము లగు

చున్నవి. నిక్షిప్తుడగు సూర్యకాంతిప్రసారముచేతనే సమస్తవస్తుజాతము ప్రకాశమగుచున్నది. నిర్విశేషమగు నీయాత్మతేజస్సు శ్రోత్రాదీన్ద్రియములద్వారా తత్తచ్ఛక్తి రూపమున నభివ్యక్తమగుచున్నది. ఈ పరమరహస్యమే వరుణునిచేత తనకుమారుడగు భృగువున కుపదేశింపబడినది. సృష్టిస్థితిలయహేతువగు పరబ్రహ్మము నన్నము, ప్రాణము, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, వాక్కులను స్థలములయందు విచారణజేసి తెలిసికొనుమని యతడుపదేశించెను. అన్నమయాదిపంచకోశము లాత్మయను నజ్ఞానకృతమగు భ్రమను నివారించుటకుగా నన్నమయాదులకు ప్రకృతిస్వరూపములగు నన్నము, ప్రాణము, మనస్సు మొదలగు కొన్నిపదార్థములు మాత్ర మీమంత్రమునను వరుణోపదేశమునను ప్రత్యేకముగా నుదాహరింపబడినది. జ్ఞానసాధనమగు చక్షురాది జ్ఞానేన్ద్రియ పంచకము కర్మసాధనమగు వాగాది కర్మేన్ద్రియ పంచకము మనుజునకు భోగసాధనములగుచున్నవి. ప్రాణ మనశ్శబ్దములచే నుపలక్షితమగుచున్న నన్నమయాది కోశ పంచకమువలన భోగ్యభోక్తృజాతము సూచింపబడుచున్నది. ఇట్లీ మంత్రమునను వరుణోపదేశమునందునుగూడ సమస్త భోగ్యభోక్తృభోగసాధనజాతము బ్రహ్మోపలబ్ధిస్థానముగ నిర్దేశింపబడినది. ఇవియన్నియు బ్రహ్మతేజస్సుచే నధిష్ఠింపబడి యున్నవి. స్వస్వవ్యాపారముల నవి నిర్వహించుట కాత్మ తేజస్సాన్నిధ్యమే కారణము. ఇదంశబ్దవాచ్యమగు ప్రపంచ

మంతయు బ్రహ్మమే[1] యను శ్రుత్యంతరము యొక్క- పరమతాత్పర్యము భంగ్యంతరముచే నీయుపదేశద్వయమున వివరింపబడినది. ఈయుపదేశద్వయమును జోడించి యర్థసమన్వయము జేసినగాని సమగ్రమగు శ్రుతితాత్పర్య మనుగ్రృహీతము గాజాలదు. మాచేరచింపబడిన తైత్తిరీయోపనిషత్తు వరుణోపదేశవ్యాఖ్యానముః ప్రథమ మయూఖము 152 నుంచి 165 పేజీల నిచట నవలోకింపదగు.

అమృతత్వసిద్ధి

ఆత్మజ్యోతిస్సే శ్రోత్రమునకు శ్రోత్రమను జ్ఞానము గలిగినప్పుడు శ్రోత్రమునందు కేవల శ్రోత్రత్వభావము బోయి దాని నధిష్ఠించియున్న పరబ్రహ్మమే యారూపమున నభివ్యక్తమగుచున్న దను జ్ఞానము లభించును. అదేవిధమున నితరేంద్రియములయందు గూడ కేవల మింద్రియజ్ఞానము దొలగి వాని నధిష్ఠించియున్న యాత్మ తేజస్సే తత్తదింద్రియముఖమున నభివ్యక్తమగుచున్న దను జ్ఞాన మలవడును. అప్పుడు శ్రోత్రాదికరణకలాపమంతయు బుద్ధినుండి నీడిపోవును. శ్రోత్రాదిలక్షణముచే నభివ్యక్తమగుచున్న చైతన్యమే యాత్మతేజస్సు, అంతకంటె ప్రపంచమునందు మరియొకటి యేమియులేదను జ్ఞాన ముపలబ్ధమగును. సమస్తభోగ్యభోక్తృభోగసాధనాత్మకమగు ప్రపంచమంతయు నాత్మానన్యమను జ్ఞానముచే పుత్రమిత్రకళత్రాదులయందు ఏషణాపూర్వకమగు నభిమానము నశించును. అమృతత్వము లభించును. కర్మచేతగాని సంతానముచేతగాని

1) సర్వం ఖల్విదం బ్రహ్మ – చాం 3.14.1

ధనముచేతగాని యమృతత్వము లభ్యముగాదని శ్రుతి ప్రమాణము[1] వినబడుచున్నది. జన్మహేతువగు కర్మకు కారణమైన నజ్ఞానము జ్ఞానాగ్నియందు దహింపబడినప్పుడు కర్మారంభమునకు ప్రసక్తి కలుగదు. అపుడమృతత్వమే మిగిలియుండును. అమృతత్వము సహజమగుస్థితి. కామాది దోషకల్పనచే మృత్యు వమృతత్వమునం దారోపింపబడినది. జ్ఞానపూర్వకమగు సర్వైషణాపరిత్యాగముచే నారోపితమగు మృత్యువు దొలగును. అమృతత్వము ప్రాప్తించును. ఆత్మ ప్రకాశమే యీమంత్రమున దేవతాశబ్దముచే జెప్పబడు చున్నది.

అ॥ శ్రోత్రాదులకు శ్రోత్రాదియు అమృతత్వ హేతువు నగు నాత్మతేజస్స్వరూపము మూడవ మంత్రమున వివరింపబడుచున్నది.

మూ॥ న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనో న విద్మో న విజానీమో యథై తదనుశిష్యాదన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్తద్వ్యాచచక్షిరే॥3

టీ॥ బ్రహ్మమును చక్షుస్సు పొందలేదు; వాక్కు పొందలేదు; మనస్సు పొందలేదు; దానిని బుద్ధిచే దెలిసికొనలేము; దానిస్వరూపము నితరుల కుపదేశించుమార్గమును దెలిసికొనలేము. బ్రహ్మస్వరూపము దెలియబడు ప్రపంచము కంటె భిన్నము. తెలియబడని అవ్యాకృతము కంటెను

1) కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాఽయంలోకః
—బృహ 4.4.22

భిన్నము. ఈవిధముగ బ్రహ్మస్వరూపము నుపదేశించిన పూర్వాచార్యుల వాక్యములను మనము వినుచున్నాము.

తా॥ వి॥ పూర్వమంత్రమునందున లెనే నిచటగూడ చక్షుఃశబ్దముచే జ్ఞానేన్ద్రియములు, మనఃశబ్దముచేమనోబుద్ధులు నుపలక్షితము లగుచున్నవి. ఆత్మ జ్యోతిస్సుచే నుద్దీపితమై చక్షుస్సు స్వవిషయమగు రూపమును గ్రహించును

ఆత్మతేజస్సు జ్ఞానేన్ద్రియముల కవిషయము.

గాని తనను బ్రకాశింపజేయు నాత్మతేజస్సును బ్రకాశింప చేయజాలదు. దీపముచే బ్రకాశింపబడు నితరవస్తువులు దీపమును బ్రకాశింపజేయలేవు. భాస్యము భాసకమును భాసింపజేయలేదు. వాక్కు నామరూపములు గుణము క్రియ మొదలగు విశేషములతో నొప్పు పదార్థములనుమాత్రము వర్ణింపగలదుగాని నామరూపరహితము నిర్గుణము నిష్క్రియము నిర్విశేషము నగు పరమాత్మను వర్ణింపజాలదు. అది వాగ్విషయముగాదు. మాధుర్యాదిరసములను వాక్కుచేవర్ణింపలేము. పేరులేనిపెద్దమ్మ నది చెప్పలేదు. అన్తఃకరణము చక్షురాదీన్ద్రియగ్రాహ్యములగు రూపాదివిషయములనింద్రియసహాయముచేగ్రహించుచున్నది; తనకుగ్రాహ్యములగు విషయములను గూర్చి సంకల్పవికల్పనిశ్చయముల నొనర్పగలదు. మనస్సునకిట్టి శక్తియాత్మతేజస్సుచే గల్గుచున్నది. అనగా నాత్మతేజస్సే విషయములను దెలిసికొను నిజమగు విజ్ఞాత. అచేతనమగు మనస్సు చేతనమగు విజ్ఞాత కానేరదు. కనుక నీ యాత్మతేజస్సును మనస్సు దెలిసికొనలేదు. అయ్యది మనోవాగ

తీతము. ఇట్లు బుద్ధికిని నింద్రియములకును నతీతమగు నాత్మ తేజస్సును గ్రహించుటకు ప్రత్యక్షాది ప్రమాణము లుపకరింపనేరవు. రూపాది విశేషములతోఁగూడిన వస్తువులను మాత్ర మింద్రియములు, బుద్ధియు గ్రహింపగలవు. నిర్గుణము నిర్విశేషము నగునాత్మ తేజస్సు వాని కందనేరదు.

ఇట్లనుటచే నాత్మ యత్యంతముపదేశార్హము గాకపోవుచున్నదిగదా యను సందేహము గల్గుచున్నందున యాసందేహము రాబోవు వాక్యమున నివారింపబడుచున్నది. నిజమే! పరమాత్మను ప్రత్యక్షాది ప్రమాణములచేత దెలిసికొన శక్యముగాదు. శాస్త్రముచే నద్దాని నెఱుంగశక్యము.

బ్రహ్మము విదితావిదితములకంటె భిన్నము.

పరబ్రహ్మము విదితమయిన దానికంటెను అవిదితమయిన దానికంటెనుగూడ భిన్నము. శ్రోత్రములకు శ్రోత్రము, చక్షుస్సునకు చక్షుస్సని యేదివర్ణింపబడినదో అదియే యిచట ప్రకృతము. అది శ్రోత్రాదులకంటె భిన్నము. అదియే సర్వమును దెలిసికొను జ్ఞాత. అదియే సర్వాత్మము. "తెలిసికొనదగినదాని నంతయు నది తెలిసికొనును. దానిని తెలిసికొనునది యేదియును లేదు"[1] అనియు, "సర్వమును దెలిసికొనుదానిని దేనిచే దెలిసికొనదగును"?[2] అని శ్రుతులు పరబ్రహ్మముయొక్క సర్వప్రమాణాతీతత్వమును సర్వేన్ద్రియావేద్యత్వమును జాటుచున్నవి. కనుక సర్వమును దెలిసి

1) స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా – శ్వేత 3.19.
2) విజ్ఞాతారమరే కేన విజానీయాత్ – బృ 4.5.15.

కొను జ్ఞాతను దెలిసికొను జ్ఞాత మఱియొకడు లేకుండుటచే నతడు తెలియబడినదానికంటె నన్యమగుచున్నాడు. వ్యాకృత మయిన దెంతచిన్నదయినను నెప్పుడో యొకప్పు డెవరిచేతనో యొకరిచేత దెలియబడగలదు. అందుచేతనుగూడ నతడు వ్యక్తమయిన దానికంటె నన్యుడగుచున్నాడు. అనగా నతనిని దెలిసికొనువాడు మఱియొకడు లేడుగనుకను, వ్యాకృతమగు నది యెప్పుడో యొకప్పుడు వేద్యముగాక తప్పదుగనుకను నతడు విదితమయినదానికంటె నన్యమగుచున్నాడు. వ్యక్త మయి విదితమగున దంతయు నల్పము, జ్ఞాతృజ్ఞేయభేదముం డినదగుటచే సద్వితీయము, అసత్యము, అశుద్ధముగూడ నగు చున్నది. కనుక బ్రహ్మము విదితమయినదానికంటె నన్య మని సిద్ధమగుచున్నది.

అట్లయినచో బ్రహ్మ మవిదితమని యనగూడదా? అట్లనుటయు యుక్తముగాదు. అవిదితమన విదితమయిన దానికంటె విపరీతము. విదితమన వ్యాకృతము. అవిదితమన నవ్యాకృతము. అవిద్యయే దానిలక్షణము. వ్యాకృతమగు జగత్తున కది బీజభూతము. బ్రహ్మ మట్టి యవిదితమగు దానికంటెను నన్యము. ఏది యవిదితమో నద్దాని వేదనముకొఱకు లోకము ప్రవర్తించును. బ్రహ్మము విజ్ఞానస్వరూపమే గనుక నద్దాని దెలిసికొన బ్రయత్నము సాధ్యముగాదు. విజ్ఞానముచే నన్యము తెలిసికొనబడును. కాని విజ్ఞానము విజ్ఞానమును దెలిసికొనుట సంభవముగాదు. దీపము స్వస్వ

ఆత్మవిజ్ఞాన స్వరూపము

రూపాభివ్యక్తికొఱకు స్వప్రకాశమునుగాని మఱియొక ప్రకాశమునుగాని గోరదు. దీపకాంతి యితరములను బ్రకాశింపజేయునుగాని తనను తాను ప్రకాశింపజేసికొనలేదు. అటులనే స్వయంప్రకాశస్వరూపము సిద్ధము నగునాత్మవస్తువును దెలిసికొనగల ప్రకాశాన్తర మెద్దియును లేదు. ఆత్మనుగూర్చి విపరీతజ్ఞానము, యదార్థజ్ఞానము గూడ సంభవించుచున్నది. నాకాత్మవస్తువు దెలియదని వాడుక గలదు. "నీవే ఆత్మవు[1]" "ఆత్మను దెలిసికొనవలెను[2]" అని శ్రుతులు సెప్పుచున్నవి. ఈ విధమున ఆత్మను దెలిసికొనుటకు విజ్ఞానాన్తరమపేక్షింపబడుచున్నది. కనుక ఆత్మను దెలిసికొనుటకు విజ్ఞానాన్తర మవసరము లేదనుట ప్రత్యక్షానుభవమునకును శ్రుతికిని విరుద్ధమగుచున్నదని యాక్షేపించ నవసరములేదు. విజ్ఞానాన్తరము నపేక్షించు నాత్మ వేరు, నిత్యవిజ్ఞానస్వరూపమగు నాత్మ వేరు. మొదటిది బుద్ధిమొదలగు కార్యకరణసంఘాతముతో గూడుకొని యనవరత మభిమానపూరితమయి యున్నది. అయ్యది యజ్ఞానాత్మకమై నిరంతరము బుద్ధిచే నవభాసితమగును. చక్షురాది కరణములు గలిగియున్నది. నిత్యము చిత్స్వరూపమునగు నాత్మయే దాని యన్తస్సారము. బుద్ధిచే గల్పింపబడు జ్ఞానములన్నియు నావిర్భావ తిరోభావధర్మములను గలిగి, విజ్ఞానాభాసమాత్రములు అనిత్యములు నగుచున్నవి. లౌకిక

---

1) తత్త్వమసి. —ఛాం 6.8.8.

2) ఆత్మానమేవావేత్.

లతనికి సుఖదుఃఖముల నాపాదించుచున్నారు. అందువలన నాయాత్మ నిత్యవిజ్ఞానస్వరూపమగు నాత్మకంటె భిన్నము, అట్టివానిని దెలిసికొనువాఁడొకఁడుండుట, అతనిని దెలిసికొనుట మొదలగు విపరీతజ్ఞానమున కవకాశమేర్పడుచున్నది. నిత్య విజ్ఞానస్వరూపమగు నాత్మవిషయమయి యిట్టి యవకాశము లేదు. అటువంటివానివిషయమై "నీవే యా యాత్మవగు చున్నావు"[1] "ఆత్మనే యెఱుంగవలయును"[2] అను మొదలగు నుపదేశమునకు నిజముగా బ్రసక్తి గలుగదు. కాని సర్వాత్మము నిత్యవిజ్ఞానస్వరూపము నగు పరమాత్మ తత్త్వమును గుర్తెఱుంగలేక యజ్ఞానమువలన దానియందారో పింపబడిన యనిత్యములగు బుద్ధ్యాది ధర్మమును సుఖదుఃఖ బంధమోక్షాది యవివేకమును తొలగించుటకై యిట్టి యాత్మోపదేశముం జేయవలసివచ్చినది. అగ్నినిమిత్తమగు నుష్ణత్వ ముదకమునం దారోపింపబడుచున్నది. ఇట్లు విదితా విదితములనగా కార్యకారణసంబంధముచే వికల్పితములగు వ్యక్తావ్యక్తములకంటె నాత్మ వ్యతిరిక్తమగుచున్నది. అది విజ్ఞానస్వరూపము, సర్వవిశేషశూన్యము.

ఆత్మ విదితమయినదానికంటె నన్యమగుటచే నహేయ మగుచున్నది. అవిదితమగుటచే ననుపాదేయ మగుచున్నది. బ్రహ్మముకంటె భిన్నమగు వేరొకవస్తువున్నచో నద్దాని ప్రయోజనమునుగోరి బ్రహ్మము హేయముగాని యుపా

1) "తత్త్వమసి" – ఛాం. 6.8.7.

2) "ఆత్మానమేవావేత్."

దేయముగాని యగుచున్నది. ఎనయునుతనకు తానుపాదేయ ముగాని హేయముగాని గానేరదు. ఆత్మ సర్వాత్మ స్వరూపము. ద్వితీయమెద్దియు లేకుండుటచే నాత్మకు హేయోపాదేయత్వము లుండనేరవు. ఇట్టి యాత్మ స్వరూపము శాస్త్రముచే తెలియబడుటయేగాక బ్రహ్మ ప్రతిపాదకమగు శాస్త్రమును స్వబుద్ధిజన్యమగు తర్క సహాయము లేక సనుస్యూతముగ వ్యాఖ్యానముజేసిన బూర్వాచార్యులుగూడ నిట్లనే యాత్మోపదేశముం జేసిరి. కేవలతర్కమనవస్థితము భ్రాన్తియుతముగూడ నగుచున్నది. కనుక బ్రహ్మమునసుస్యూతముగ వచ్చునాచార్యోపదేశ పరంపరవలననే గ్రహింపదగును గాని ప్రవచనమేధాబహు శ్రుతతపోయజ్ఞాదులచేతను తర్కముచేతను గ్రహింపతగినది గాదు. ఇట్టియాత్మయే బ్రహ్మము. ౩.

బ్రహ్మము హేతువాద విషయము కాదు

అ॥ విదితావిదితములకంటె విలక్షణమగు బ్రహ్మమే యాత్మయని పైమంత్రమున నుపదేశింపబడినది. ఆత్మ బ్రహ్మ మెట్లు కాగలదు? కర్మోపాసనములు జీవుని ప్రయోజనము కొఱ కుద్దేశింపబడినవి. వాని కతడధికారి. వాని యనుష్ఠానముచే నతడు స్వర్గాదిలోకమున బ్రహ్మాది దేవానుగ్రహమును బొందగోరుచున్నాడు. ఈదేవతలాత్మకంటె భిన్నములు గావలయును గావున బ్రహ్మమే ఆత్మయనుట లోకానుభవవిరుద్ధము. ఇంకను ఏది యుపాస్యమో ఏది విదితమో అదియే బ్రహ్మము గావలెనుగదా యనునిట్టి

శంకకు నాల్గవమంత్రమున సమాధానము చెప్పబడుచున్నది.

మూ॥ యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే॥4.

టీ॥ ఏది వాగిన్ద్రియముచేత బ్రకాశింపబడదో, దేనిచేత వాగిన్ద్రియము ప్రకాశింపబడుచున్నదో దానినే బ్రహ్మముగా దెలిసికొనుము. ఆకారాదులతో నుపాసింపబడునట్టి యే యీశ్వరాదికముగలదో అది బ్రహ్మము గాదు.

తా॥వి॥ కంఠము శిరస్సు జిహ్వామూలము దంతములు నాసిక ఓష్ఠములు తాలువులను నీస్థానములనుండి అభివ్యక్తమగుచు వర్ణసంకేతముచే నియమితమైన వర్ణపరంపరారూపమగువాక్కు చైతన్యమాత్రస్వరూపమగు బ్రహ్మమును బ్రకాశింపచేయలేదు. బ్రహ్మతేజస్సుచేతనే వాక్కు ప్రకాశింపజేయబడుచున్నది. నిరతిశయము భూమాఖ్యము నగు బ్రహ్మమే యాత్మ. నిర్విశేషము పరమార్థము నగు బ్రహ్మమే వాక్కునకు వాక్కు చక్షుస్సునకు చక్షుస్సు శ్రోత్రమునకు శ్రోత్రము మనస్సునకు మనస్సు. కర్త భోక్త విజ్ఞాత నియంత ప్రకాశిత విజ్ఞానము ఆనందము మొదలగు విశేషములచే నదివ్యవహరింపబడుచున్నది. వ్యవహారసముత్పన్నములగు నీవిశేషములను తొలగించినపుడు మిగిలియున్న నిర్విశేషమగునాత్మయే బ్రహ్మమగుచున్నది. జ్ఞాతృజ్ఞానజ్ఞేయభేదవిశిష్టము అనాత్మభూతము ఉపాస్యమునగు నీశ్వరాదికము బ్రహ్మము గాదు. అన్వయ

బ్రహ్మము నిర్విశేషము.

వ్యతిరేకములచే నిట్లుపదేశింపబడిన బ్రహ్మస్వరూపముచే సనాత్మభూతములగు వానియందు బ్రహ్మబుద్ధి తొలగును. 4

అ॥ చంపకము కేతకి మొదలగు పుష్పముల సుగంధము వాక్కునకు వర్ణింప శక్యము గాకపోయినను మనస్సుచే గ్రహింపశక్యము. అటులనే బ్రహ్మముగూడ వాగగమ్యమయినను మనోగమ్యము గావచ్చునుగదా యను సందేహము తరువాతమన్త్రముల నివారింపబడుచున్నది.

మూ॥ యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ 5

టీ॥ లోకము దేనిని మనస్సుచేత సంకల్పింపలేదో, దేనిచేత మనస్సు స్వవిషయముగా జేయబడి వ్యాపింపబడుచున్నదో అదియే బ్రహ్మమని తెలిసికొనదగును. ఉపాస్యమగు నీశ్వరాదికము బ్రహ్మముగాదు.

తా॥ వి॥ మనస్సు సమస్త కర్మజ్ఞానేన్ద్రియములకు సమానమై వానిద్వారా వ్యవహరించుచున్నది. దానిచే కర్మేన్ద్రియములు వ్యాపారవంతములగుచున్నవి. కామము, సంకల్పము, విచికిత్స, శ్రద్ధ, అశ్రద్ధ, ధృతి, అధృతి, ధీ, భీ మొదలగు వివిధవృత్తిరూపములను దాల్చి యీమనస్సు కనుపించుచున్నది. ఇట్టి మనస్సు బ్రహ్మమును సంకల్పింపలేదు, నిశ్చయింపలేదు. చైతన్యజ్యోతిస్సుచేత ప్రకాశింపబడుటచేతనే యీమనస్సునకు మన

చైతన్యజ్యోతిస్సుచే ప్రకాశింపబడు మనస్సు ఆజ్యోతిస్సును ప్రకాశింపజేయలేదు.

నాది సామర్థ్యము స్వవిషయగ్రహణశక్తియు గలుగుచున్నది. తన్ను బ్రకాశింపజేయు నాత్మకాంతిని తాను బ్రకాశింప జేయలేదు. మనస్సును బ్రకాశింపజేయు పరమచైతన్య జ్యోతిస్సే బ్రహ్మము. ఉపాస్యములగు నీశ్వరాదులు బ్రహ్మము గావు. 5

మూ॥ యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూఁషి పశ్యతి
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ 6

టీ॥ లోకము దేనిని చక్షుస్సుచేత చూచుటలేదో, దేనిచేత చక్షుస్సునకు చూడగలశక్తిగలుగుచున్నదో అదియే బ్రహ్మము. ఉపాస్యమగు నీశ్వరాదికము బ్రహ్మముగాదు. 6

మూ॥ యచ్ఛ్రోత్రేణ న శృణోతి యేన శ్రోత్రమిదఁ
శ్రుతమ్। తదేవబ్రహ్మ త్వం విద్ధినేదం యదిదముపాసతే॥7

టీ॥ లోకము దేనిని శ్రోత్రేన్ద్రియముచేత వినుటకు శక్యముగాదో దేనిచేత శ్రోత్రము శబ్దమును వినుచున్నదో అదియే బ్రహ్మము. ఉపాస్యమగు నీశ్వరాదికము బ్రహ్మము గాదు. 7

మూ॥ యత్ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీ
యతే। తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥ 8

టీ॥ లోకముదేనిని ఘ్రాణేన్ద్రియము నాసికాపుటాన్త ర్వర్తియగు నన్తఃకరణముచేతను ప్రాణవృత్తిచేతను గ్రహించుటకు శక్యముగాదో యే చైతన్యాత్మజ్యోతిస్సుచేత

నవభాసింపబడి ఘ్రాణేన్ద్రియము స్వవిషయమగు గంధమును గ్రహించుచున్నదో అదియే బ్రహ్మము. ఉపాస్యమగు నీశ్వ రాదికము బ్రహ్మము గాదు. 8

తా॥ వి॥ పరబ్రహ్మము చక్షుః శ్రోత్ర ఘ్రాణేన్ద్రియ ములచే గ్రహింపబడదు. బ్రహ్మజ్యోతిస్సుచే నవభాసితము లయి యా యా యింద్రియములు తమ తమ విషయములను గ్రహించుచున్నవి. సర్వావభాసకమగు నాత్మజ్యోతిస్సే పర మాత్మ. ఉపాస్యదేవత లెవరును పరమాత్మ గాజాలరు. ఇట్లనుటచేత పరమాత్మ ఉపాస్యముగాదని చెప్పబడుచున్నది.

ప్రథమఖండ సంక్షేపార్థము.

మనః ప్రాణచక్షుః శ్రోత్రేన్ద్రియములకు ప్రేరకుడెవడను ప్రశ్నకు ఆత్మానన్యమగు పరబ్రహ్మమే వాని ప్రేరకుడనియు, అతని జ్యోతిస్సుచే నవభాసితములై మనః ప్రాణాదులుస్వస్వధర్మముల నిర్వర్తించుచున్న వనియు, నా పరమార్థజ్యోతిస్సును మనశ్చక్షు రాదికరణములు గ్రహింపలేవనియు అన్వయ వ్యతిరేకముల సమాధానము చెప్పబడినది. బ్రహ్మము విదితావిదితములకంటె భిన్నమని తృతీయమన్త్రమున జూపబడినది. విషయ మత్యంతము సూక్ష్మమగుటంజేసి అనాత్మ విషయములయందు దృఢముగ లగ్నమయిన అజ్ఞుని బుద్ధిని బ్రహ్మమునుగూర్చి మరల్చుటకై మనశ్చక్షురాదీన్ద్రియములయొక్క ఆత్మత్వము ప్రత్యేకముగా నిరాకరింపబడినది. ఇట్లు మనః ప్రాణవాక్చక్షుః శ్రోత్రములను గూర్చిన ప్రశ్నములకు వరుసగా 5-8-4-6-7 మంత్రములలో సమాధానము చెప్పబడినది. ప్రాణవాయువు

నాసాపుటము నందభివ్యక్తమగుటంజేసి యెనిమిదవ మంత్రములో ప్రాణిశబ్దమునకు ఘ్రాణేన్ద్రియ మర్థము చెప్పబడినది.

ప్రథమ ఖండము సంపూర్ణము.

## ద్వితీయ ఖండము

అ॥ పూర్వఖండమునందు విదితావిదితములు బ్రహ్మము గాజాలవని నిరూపింపబడినది. బ్రహ్మముయొక్క ఉపాస్యత్వము నిషేధింపబడినది. మఱియు స్వాత్మయే బ్రహ్మమని యుపదేశింపబడినది. ఇట్లలవడిన జ్ఞానమును విచారణాపూర్వకముగ దృఢముచేయుటకు ద్వితీయఖండ మారంభింపబడుచున్నది.

మూ॥ యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్। యదస్య త్వం యదస్య చ దేవేష్వథ ను మీమాంస్యమేవ తే మన్యే విదితమ్॥.

టీ॥ నేను బ్రహ్మస్వరూపమును బాగుగా తెలిసికొంటినని యెవ్వరయినను తలంచినయెడల నట్లు తెలిసికొనబడిన బ్రహ్మస్వరూపము నిశ్చయముగా నల్పమేయగును. బ్రహ్మముయొక్క యేరూపము దేవతలయందు దెలిసికొనబడుచున్నదో యా రూపముకూడ నల్పమే యగుచున్నది. బ్రహ్మస్వరూపమును దెలిసికొంటినని దలంచువానికి బ్రహ్మస్వరూపము మీమాంస్యమే యగుచున్నదని నేను తలంచుచున్నానని, యాచార్యునిచే నుపదిష్టుడయిన శిష్యుం డేకాంతమున సమాహితచిత్తుడయి శాస్త్రోపదిష్టమగునర్థమును విచా

రణజేసి శాస్త్రసమ్మతమగు తర్కముచే నిర్ధారణచేసికొనిన స్వానుభవము నాచార్యునకుం దెలియజేసెను. అట్టియర్థ మీ మన్త్రమున నిరూపింపబడుచున్నది.

తా॥వి॥ బ్రహ్మము హేయముగాని యుపాదేయముగాని గాదని ప్రథమ ఖండార్థమునుబట్టి తెలియుచున్నది. ఇందువలన నేను బ్రహ్మ స్వరూపమును బాగుగ దెలిసికొంటినను జ్ఞానము శిష్యునకు గలుగవచ్చును. ఇట్టి ప్రమాదమును దొలగించి శిష్యుని బుద్ధిని విచారణోన్ముఖము జేయుటకై యాచార్యముఖమున నీ మన్త్రము ప్రవర్తించుచున్నది. నేను గట్టిగా దెలిసికొంటినను నిశ్చయజ్ఞానము గోరతగినదే కదా ? నిజమే ! నిశ్చయజ్ఞాన మెల్లపుడును స్పృహణీయమేగాని బ్రహ్మమును నేను దెలిసికొంటినను జ్ఞానము మాత్రము యథార్థజ్ఞానము గాదు గనుక స్పృహణీయము గాదు. దేనిని దెలిసికొన శక్యమో దానిని దృఢముగా దెలిసికొనుట సాధ్యము. తెలిసికొనువాని యాత్మయే బ్రహ్మమని సర్వవేదాన్తములయొక్క సునిశ్చితార్థము. ఈ యర్థమే 'శ్రోత్రస్య శ్రోత్రం' (1,2) అనుమన్త్రమున నుపపాదింపబడి 'యద్వాచానభ్యుదితం' (1,4) అను మంత్రమున నవధారితమగుచున్నది. "అన్యదేవ తద్విదితాదథో అవిదితాదధి" (1–3) యని చెప్పబడిన బ్రహ్మవిత్సంప్రదాయనిశ్చయము "అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్"(2–3) అను మంత్రమున నుపసంహరింప

బ్రహ్మమును దెలిసికొంటినను వాని జ్ఞానము మిథ్యాజ్ఞానము.

బడినది. ఇట్లు విదితావిదితములనుంచి మరలింపబడి స్వారాజ్యమునం దభిషి క్తయగు శిష్యునిబుద్ధి యుపాస్యమగు నది బ్రహ్మము గానేరదను యుపదేశపూర్వకముగ నీమన్త్రి మున విచారణోన్ముఖము జేయబడుచున్నది. బ్రహ్మమును దృఢముగా దెలిసికొంటినను శిష్యునిభావమును నిరాకరింప వలయును. అగ్ని తననుతాను దహింపలేనట్లే జ్ఞాత తనను తాను దెలిసికొనలేడు. తెలిసికొనదగినది బ్రహ్మము. తద న్యము మఱియొకటిలేదు కనుక నేను బ్రహ్మమును బాగుగ దెలిసికొంటినను జ్ఞానము మిథ్యాజ్ఞానమగును. గురూపదిష్ట మయినవిషయము దుర్విజ్ఞేయమయినను, క్షీణమయినను మేధావియగు నతడొకప్పుడు బుద్ధిదోషమువలన యథాశ్రుత ముగమాత్రి మద్దానిగ్రహించును. మఱియొక డా యుపదేశ మునే విపరీతముగ గ్రిహించును. ఇంకొకని కది గ్రాహ్యమే గాకపోవును. సామాన్యవిషయములనుగూర్చియే యిట్లు బుద్ధి దోషకృతమగు గ్రహణభేదముండ నతీన్ద్రియవిషయమగు నాత్మత త్త్వవిషయమునుగూర్చి యర్థగ్రిహణభేదముండునను టకు సందియములేదు. అందువలననే "నీవిట్లు తలంచినచో" ననిసాశంకముగ నాచార్యుడు తనయుపదేశము నుపక్రమించు చున్నాడు. అట్టి యుపదేశప్రికార మెట్టిదనిన, బ్రహ్మమును నేను దెలిసికొంటినను వాని జ్ఞానము దృఢమయినను, అత్యంత మల్పమగుచున్నది. బ్రహ్మమునకు మహాంతములు, అర్భకములు నగు రూపములనేకము లుండుటచే నిట్లు

గురువుచే చెప్పబడెనా ? నిజమే! బ్రహ్మమునకు స్వయముగా గాకపోయినను నామరూపోపాధి కృతములగు రూపము లనేకములు గలవు. స్వయముగా నాపరమార్థవస్తువు శబ్దములేనిది, స్పర్శములేనిది, రూపములేనిది, మార్పులేనిది, రసములేనిది, నిత్యము నయినది.[1] ఆ వస్తువునకు సమస్త రూపము లిట్లు నిషేధింపబడుచున్నవి. ఏధర్మముచే నేది నిరూపింపబడుచున్నదో అదియే దాని స్వరూపము. బ్రహ్మము నేవిషయముచేత శాస్త్రము నిరూపించుచున్నదో అదియే దాని స్వరూపమనందగు గదా! యని శంక రాగా నిట్లు సమాధానము చెప్పబడుచున్నది. చైతన్యధర్మముచే బ్రహ్మస్వరూపనిరూపణము సేయబడినది. ఆ ధర్మము వికార స్వరూపములగు పృథివ్యాదులయొక్కగాని యన్తఃకరణము యొక్కగాని స్వరూపము గా నేరదు. "బ్రహ్మము విజ్ఞానము ఆనందము"[2] "బ్రహ్మము విజ్ఞానపుగడ్డయే"[3] "సత్యము జ్ఞానము అనన్తము బ్రహ్మము"[4] "ప్రజ్ఞానమే బ్రహ్మము"[5] అని బ్రహ్మస్వరూపము శ్రుతులయం దుపదేశింపబడుచున్నది. చైతన్యము బ్రహ్మమురయొక్క పరమార్థస్వరూపము.

---

1) "అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథాఽరసం నిత్యమగంధవచ్చ యత్"—కఠ 1.3.15

2) "విజ్ఞానమానన్దంబ్రహ్మ" — బృ-3.7.28

3) "విజ్ఞానఘన ఏవ"

4) "సత్యం జ్ఞానమనన్తంబ్రహ్మ"—తై-2.1

5) "ప్రజ్ఞానంబ్రహ్మ" ఐత-2.5.3

అయ్యది అన్తఃకరణము దేహేన్ద్రియములు మొదలగు నుపాధులు వ్యాపారవంతములగుటకు గారణభూతమై యట్టి యుపాధులద్వారమున నభివ్యక్తమగుచున్నది. ఉపాధిద్వారమున నభివ్యక్తమగుచున్న యీ చైతన్యమే బ్రహ్మమని చెప్పంబడుచున్నది. ఈ చైతన్యము స్వయముగా నసంగమయినను దేహాద్యుపాధిసంబంధముచే సంబద్ధమయినట్లు కాన్పించుచున్నది. జలముతో బాటు దానియందలి సూర్యప్రతిబింబముగూడ చలించునట్లగుపడుచున్నంతమాత్రముచే విప్రకృష్టములయి కడుదూరముననున్న సూర్యజలముల కేవిధమగు సంబంధమారోపింప సాధ్యముగాదు. అదే తీరున దేహాదులకు వృద్ధిసంకోచచ్ఛేదనాశములు సంప్రాప్తమగుచుండగా నాధర్మము లాత్మతో సంబంధింపబడుచున్నవి. స్వయముగా బ్రహ్మము బుద్ధిచేత దెలిసికొన బ్రయత్నించువారికి దెలియరాదు. బుద్ధిచే దెలిసికొన బ్రయత్నింపనివారి కయ్యది తెలియనగును. ఇదియే పరమార్థము. విషయసంబంధము లేని చైతన్యస్ఫురణ మేదిగలదో యదియేబ్రహ్మానుభవము. మానుషశరీరోపాధిరూపమున నెఱుంగబడిన బ్రహ్మ మెట్లల్పమో యట్లే దేవతాశరీరోపాధిరూపమున దెలిసికొనబడు బ్రహ్మరూపముగూడ నుపాధిపరిమితమగుటం జేసి యల్పమే యగుచున్నది. బ్రహ్మము నిరుపాధికము, శాన్తము, అనంతము, ఏకము, అద్వైతము, నిత్యము, భూమము. అట్టిబ్రహ్మము విషయాదులవలె జ్ఞేయముగాదు.

ఉపాధ్యవచ్ఛిన్నమగు బ్రహ్మమల్పము

కనుక బ్రహ్మమును బుద్ధిచే దెలిసికొంటినని దలంచువాని కయ్యది విచార్యమే యగుచున్నది.

అ॥ శాస్త్రోపదిష్టమార్గమున బ్రహ్మవిచారము జేసిన వాని బ్రహ్మానుభవము తన్ముఖముననే వర్ణింపబడుచున్నది.

మూ॥ నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ।
యోన స్తద్వేద తద్వేద నో న వేదేతి వేద చ॥ 2

టీ॥ 1) నేను బ్రహ్మమును జక్కఁగా దెలిసికొంటినని తలంచను. 2) దెలిసికొనలేదనిగాని, తెలిసికొంటిననిగాని తలంచను. 3) నేను బ్రహ్మమును దెలిసికొనలేదనిగాని తెలిసికొంటిననిగాని తలంచనను విషయమును మాలో దెలిసికొనిన వాడు బ్రహ్మమును దెలిసికొనినవాడగును.

తా॥ వి॥ బ్రహ్మము ఘటాదులవలె జ్ఞేయముగాదు. జ్ఞేయవిషయాకారాత్మకమగు మానసికవృత్తి యచేతనము.

బ్రహ్మము ఫలవ్యాప్యముగాదు

బుద్ధియందు బ్రతిఫలించిన యాత్మప్రతిబింబముచే మానసికవృత్తి యుద్దీపితమయినపుడు ఘటాది విషయజ్ఞానము గల్గును. ఆత్మప్రకాశప్రసారములేనిచో నట్టి జ్ఞానము కలుగదు. ఆత్మప్రకాశప్రసారఫలము ఘటాదివిషయజ్ఞానము. విషయజ్ఞానమంతయు నాత్మప్రకాశప్రసారఫలముచే వ్యాపింపబడుటచే నాజ్ఞానము ఫలవ్యాప్యమగుచున్నది. రూపాది జ్ఞానేన్ద్రియవిషయములన్నియు బాహ్యములు, నిర్దిష్టములు. ప్రతి జ్ఞానేన్ద్రియము స్వవిషయమును గ్రహించును గాని తదితర

ములను గ్రహింపజాలదు. బ్రహ్మము రూపశబ్దాదివిషయే తరము. జ్ఞానేన్ద్రియములకది విషయముగాదు. కనుక నది ఘటాదులవలె మనోవృత్తివిషయము గానేరదు. మనోవృత్తి విషయముగా కుండుటంజేసి యది ప్రతిఫలితప్రకాశముచేత నుజ్జ్వలితము గానేరదు. అనగా బ్రహ్మమునకు ఘటాదులవలె ఫలవ్యాప్యత్వము సంభవముగాదు. దానిని ప్రకాశింపజేయు మఱియొక తేజస్సేదియు లేదు. విజ్ఞాతను దెలిసికొను సాధనము మఱియొకటి[1] లేదు. బ్రహ్మము స్వయంప్రకాశ స్వరూపము.

బ్రహ్మము జ్ఞేయము గాదను మాటకర్థము.

ఫలవ్యాప్తిచే జ్ఞేయములగు విషయములన్నియు జాగ్రత్స్వప్నములయందు దెలియబడుచునే యున్నవి. జాగ్రదవస్థయందు మనస్సు ఇంద్రియములు గూడ జాగరూకములై జ్ఞానసాధనములగుచున్నవి. స్వప్నమునం దింద్రియము లుపరమించుచున్నవి. జాగ్రదవస్థయందలి వాసనలే స్వప్నమునం దుద్బుద్ధములయి సర్వసృష్టిని జేయుచున్నవి. స్వప్నానుభవములన్నియు తాత్కాలికముగ సత్యములు గానే కాన్పించుచున్నవి. సుషుప్తియన గాఢనిద్రయందు సర్వేన్ద్రియములు మనస్సుగూడ నుపరమావస్థయం దుండుట వలన సర్వవిషయకాజ్ఞానము మాత్రమనుభూతమగుచున్నది. నిద్రలేచి నాకేమియు దెలియలేదని ప్రతిమనుజుడును జెప్పు

---

1. "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" —బృ. 4-5-15

చున్నాడు. సమస్తచిత్తకాలుష్యము నశించి యన్తర్ముఖులగు జ్ఞానులకు సమాధియందు స్వయంప్రకాశము శాంతము ఆనందము చేతనము నగు బ్రహ్మము బుద్ధికి స్ఫురించును. 'నేను బ్రహ్మమునయితి' [1] నను జ్ఞానము గలుగును. ఇదియే బ్రహ్మసాక్షాత్కారము. ఇకాలమున జ్ఞాతృజ్ఞేయ భేదము సమున్మూలమగును. బ్రహ్మ మొకటియే మిగిలియుండును. ఇట్టి యద్వితీయబ్రహ్మసాక్షాత్కారానందమును గూడ బుద్ధియే యనుభవించును. బ్రహ్మముగూడ మనస్సననుస రించియే దర్శనీయమగుచున్నది.[2] బ్రహ్మము జ్ఞేయముగాదను వాక్యమునకు ఘటాదులవలె నది ఫలవ్యాప్యము గాదని తాత్పర్యము. ఆ పరమార్థవస్తువును గ్రహింపబూని చేతగాక శబ్దములు మనస్సుతోగూడ వెనుకకు మరలివచ్చినవను [3] త్తైత్తిరీయవాక్యముల కిదియే తాత్పర్యము.

బ్రహ్మ స్వరూపమును గూర్చి సునిశ్చితమగు జ్ఞానము లేనపుడు ఘట పటాదులవలె నదిగూడ జ్ఞేయమగుచున్నదని దలంచుటసహజము. చక్షురాద్యుపాధిద్వారా నాపరమార్థ మభివ్యక్తమయి తెలియబడు చున్నది. ఉపాధి సంబంధములేక బ్రహ్మము దుర్విజ్ఞేయము. ఉపాధివిశిష్టమగు జ్ఞానము జ్ఞాతృజ్ఞేయ భేద విశిష్టము మనోవృత్త్యాత్మకము. బ్రహ్మమును మనస్సుగాని

శ్రీధను వాక్యార్థము

1. "అహంబ్రహ్మాస్మి"—బృ 1-4-10
2. "మనసైవానుద్రష్టవ్యమ్"—కఠ 2-4-11
3. "యతో వాచోనివర్తన్తే అప్రాప్య మనసా సహ" తై 2.4

చక్షురాదీన్ద్రియములుగాని పొందలేవని యుపదేశింపబడిన బ్రహ్మలక్షణమున కీజ్ఞానము విరుద్ధము. ప్రథమఖండమున మూడు మొదలెనిమిదవ మంత్రమువరకు బ్రహ్మస్వరూపము లెస్సగా వివరింపబడినది. అందువలన బ్రహ్మము ఘటాదుల వలె జ్ఞేయము గాదనియు బ్రహ్మవిచారము జేయువాడే బ్రహ్మమనియు సుపరినిశ్చితార్థము తేలుచున్నది. స్వస్వరూపమే బ్రహ్మము గనుక నది మఱియొకవిధముగా నుండ వీలు లేదు. తన యునికి స్వప్రకాశ స్వరూపమగుటచే స్వయం జ్ఞాన స్వరూపముగూడ నగుచున్నది. ఇట్టి జ్ఞానము కలుగక పూర్వము బ్రహ్మము సంపూర్ణముగ దెలిసికొనబడినదని చెప్పవీలులేదు. ఇదియే మన్త్రమునందలి మొదటివాక్యమున కర్థము. ఇందుచే బ్రహ్మము విదితమయిన దానికంటె నన్యమని తెలియుచున్నది.

ద్వితీయ వాక్యార్థము.

బ్రహ్మనుగూర్చి నాకు బాగుగ దెలియలేదనుటచే నద్దానిగూర్చి యేమియు దెలియదా యను ప్రశ్న గల్గుచున్నది. బ్రహ్మను గూర్చి యేమియు దెలియదనుటకు వీలులేదు. సాక్షాద్బ్రహ్మస్వరూపము తెలియకపోయినను, 'అహం' అను రూపమున బ్రతివాడును బ్రహ్మకంటె నన్యముగాని యాత్మను దెలిసికొనియె యున్నాడు. కాని అహం అను రూపమున దెలిసిన రూపము సాక్షాద్బ్రహ్మ స్వరూపము గాదు. 'అహం' అను జ్ఞానము గలిగినంతమాత్రముచేత బ్రహ్మమును దెలిసి

కొంటినని చెప్పుటకు వీలులేదు కనుక బ్రహ్మమును దెలిసి కొంటినని తెలిసికొనలేదని తలంపవీలులేదు.

ఆత్మస్వరూపమును విచారణచేసినతరువాత ననుభూతమగు జ్ఞానమును తరువాత వాక్యము వివరించుచున్నది.

**తృతీయ వాక్యార్థము**

బ్రహ్మమును దెలిసికొంటినని గాని తెలిసికొనలేదని గాని తలంపనివాడు బ్రహ్మమును దెలిసికొనినవాడగును. తెలిసికొనబడినది యనగా నామరూపములచేత విదితమగుచున్న ప్రపంచ మవగతమగుచున్నది. తెలిసికొనినది బ్రహ్మముగాదనుటచే విదితమగుచున్న నీ ప్రపంచ మబ్రహ్మత్వముచేత దొలగింపబడుచున్నది. తెలిసికొనబడనిది యనగా ననభివ్యక్తమగుటచే నవిదితరూపమున నున్నదియని భావము. ఇదియు నబ్రహ్మత్వముచేత దొలగింపబడుచున్నది. ఇట్లు మూడవ వాక్యముచే విదితావిదితముల రెండింటికి నతీతమయినది బ్రహ్మమను పరినిష్ఠితార్థము తేలుచున్నది. ఇచ్చట 1-3 మంత్రార్థమును జ్ఞాపకముజేసికొనవలెను. ఈవాక్యమునకు మఱియొక్క అర్థముగూడ చెప్పబడుచున్నది.

**మరియొక అర్థము**

పరబ్రహ్మము నిత్యవిజ్ఞానస్వరూపమయి యెల్లపుడు ప్రకాశించుచుండుటచే దెలియబడుచునే యున్నది. దాని స్వరూపమును వర్ణింపగల విశేషవిజ్ఞానమెంతమాత్రము లేకుండుటచే నద్దానికి బ్రత్యేకస్వరూపమేమియు లేదు. కనుక పరమార్థముచే నది తెలియబడుటలేదు. తెలిసికొంటినమటచేత సర్వసంశయవిపర్యయ

విధురమగు బ్రహ్మజ్ఞానము గలిగినదని తాత్పర్యము. అట్టి జ్ఞానస్వరూపమును 'తెలియబడలేదు' అను పదము చెప్పుచున్నది. ఆ జ్ఞానము ఘటాదులవలె ఫలవ్యాప్యమగు జ్ఞానముగాక తురీయావస్థయందు బొందబడు సర్వభేదశూన్యమయిన సాక్షాత్కారరూపమని యీ పదముయొక్క పరమార్థము. దుర్బోధము శాస్త్రైకగమ్యము అసందిగ్ధము సర్వభేదశూన్యము నగు బ్రహ్మము నేనే యని సాక్షాత్కారము చేసికొనినవానియొక్క బ్రహ్మానుభవము బ్రహ్మవేత్త లక్షణమని యీశ్రుతివాక్యము సింహగర్జనము సేయుచున్నది. నేను బ్రహ్మమును దెలిసికొంటినని దెలిసికొన్నవాడు బ్రహ్మవేత్తగాడు. నేను బ్రహ్మమునే అయితినని తెలిసికొన్నవాడు మాత్రమే బ్రహ్మవేత్త. శాస్త్రముల శ్రవణముచేసినంత మాత్రమున బ్రహ్మవేత్తగానేరడు. శ్రవణముచేసినదానిని విచారణచేసి సాక్షాత్కారము నొందినవాడే బ్రహ్మవేత్త యని మంత్రముయొక్క నిష్కృష్టార్థము. ఇట్లు సాక్షాత్కారము చేసికొన్నవాడు స్వయముగా బ్రహ్మమే యగుచున్నాడని శ్రుతి[1] చెప్పుచున్నది. 2

అ॥ సాధకుని యనుభవసిద్ధమగు బ్రహ్మతత్త్వరహస్యమును శ్రుతిమాత స్వయముగ నిగమనము సేయుచున్నది.

మూ॥ యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః । అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతామ్ ॥ 3

---

1) "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" —ముం 3.2.9

టీ॥ బ్రహ్మస్వరూపము మనస్సుచేత జ్ఞేయముగాదను నిశ్చయజ్ఞాన మెవనికి గలుగునో వానికి బ్రహ్మము జ్ఞాతమగు చున్నది. అది మనస్సుచే జ్ఞేయమను నిశ్చయజ్ఞాన మెవనికో వానికది యజ్ఞాతమగుచున్నది. బ్రహ్మము మనస్సుచే దెలిసికొనువారి కజ్ఞాతము, తెలిసికొననివారికి జ్ఞాతము నగుచున్నది.

తా॥ వి॥ కర్తృకర్మాది విశిష్టసాధనముచేతను మనో వాగాదీన్ద్రియములచేతను బ్రహ్మము జ్ఞేయముగాదు. వానిచే విదితములగువానికంటె బ్రహ్మము వేరు.

నిగమనము ఇట్లు తెలిసికొనినవాడు బ్రహ్మమును లెస్సగా దెలిసికొనినవాడగును. ఇట్టి నిశ్చయజ్ఞానముచే బుద్ధినలన దానిని దెలిసికొను ప్రయత్నము నివర్తించును. బ్రహ్మము మనోవాగాదుల కవిదితమని తెలిసికొనుటయే బ్రహ్మతత్త్వ విచారణాపర్యవసానము. బ్రహ్మేతరజ్ఞానమంతయు మిథ్యా జ్ఞానము. అవైదికములగు కపిలకణభుగాది దర్శనములన్నియు విదితబ్రహ్మవిషయములు అనవస్థితమగు తర్కముచే సంపా ద్యములు నగుచున్నవి. వానిచే బ్రహ్మజిజ్ఞాసానివృత్తి యగుటలేదు. అందువలన నవి మిథ్యాజ్ఞానమాత్రము లగు చున్నవి. శ్రుతిసమ్మతమగు తర్కముచే నుపస్థాపితమగు బ్రహ్మజ్ఞానముచే దద్విషయకజిజ్ఞాస తృప్తిచెంది సంపూర్ణ ముగ నివర్తించుచున్నది. కనుక నుపనిషద్బోధితమగు బ్రహ్మతత్త్వము సుపరినిష్ఠిత మగుచున్నది. ఇట్టి బ్రహ్మము విదితావిదితములకంటె భిన్నము స్వస్వరూపము నిత్యవిజ్ఞా

నాత్మకము వికిృయారహితము అమృతము అజరము అభయము నగుటంజేసి బుద్ధివిషయము గాదని దెలిసికొనినవా రాత్మను దెలిసికొనినవారగుదురు. అవిదితమగు బ్రహ్మము నందు వేద్యత్వాది ధర్మారోపణము సేయుట ముత్యపుచిప్ప యందు రజతధర్మము నారోపించుట యగును.

బ్రహ్మజ్ఞానమునకు జిజ్ఞాసానివృత్తియే పర్యవసానము. సాక్షాత్కారమే దానిలక్షణము. ఈ సర్వోత్కృష్టస్థానము సమాధిలభ్యము. సాక్షాత్కారమున కని వార్యముగ పూర్వాంగములగు శ్రవణ మనననిధిధ్యాసములు బుద్ధివిషయములే యగుచున్నవి. అక్కాలమున గురువు శిష్యుడు బోధకుడు బోద్ధవ్యుడను భేదమే లేనియెడల జ్ఞానోదయమున కవకాశములేక పోవుచున్నది. సాధనావస్థయందీ భేదమనసరము అనివార్యము. సమగ్రమగు బ్రహ్మజ్ఞానము కలిగినపుడుపాధికృతమగు నశేషభేదజ్ఞానము నశించి నిత్యమగు నాత్మయొక్కటి మాత్ర మవశిష్టమగును. 3

సాధనావస్థయందు జ్ఞాతృజ్ఞానభేద మనివార్యము

అ॥ నిర్విషయము అవిజ్ఞేయమునగు నాత్మను గ్రహించుటెట్లను శంకకు సమాధానము నాల్గవమంత్రమున జెప్పబడుచున్నది.

మూ॥ ప్రతిబోధవిదితం మతమమృతత్వం హి విన్దతే।
ఆత్మనా విన్దతే వీర్యం విద్యయా విన్దతేఽమృతమ్ ॥ 4

టీ॥ బ్రహ్మస్వరూపము బుద్ధివృత్త్యాత్మకమగు ఘట పటాది ప్రతిజ్ఞానమునందును సాక్షిరూపమున దెలియఁబడు చున్నది. సాక్షిరూపమున బ్రహ్మమును దెలిసికొనినవా డమృతత్త్వమును బొందుచున్నాఁడు. ఆత్మవలన బలము కలుగుచున్నది. జ్ఞానమువలన మోక్షము కలుగుచున్నది.

తా॥ వి॥ ఘటపటాదివిషయములు తత్తదాకారాకా రితములగు బుద్ధివృత్తులుగూడ జడములు. వీనికన్నిటికిని సాక్షిభూతముగ నవభాసించుచున్న యాత్మయొక్క సన్నిధియందతనికాంతిచే నవి ప్రదీప్తములయి భాసించు చున్నవి. అందువలన వివిధవిషయజ్ఞానములు మన కేర్పడు చున్నవి.

ఆత్మకాంతి బుద్ధి వృత్తులకంటె విలక్షణము

ప్రతిబోధయందనగా ప్రతివిషయబోధయం దనుస్యూతముగనుండి వాని నవభాసింపజేయు నాత్మచైత న్యము వానికంటె విలక్షణము. ఎఱ్ఱగాకాలిన యినుప గుండునం దంతట నగ్నియుండినను అది యినుపగుండుకంటె విలక్షణము. బుద్ధివృత్త్యాత్మకమగు ప్రతిజ్ఞానము నవభాసింప జేయుచైతన్య మద్దానికంటె విలక్షణము. జ్ఞానిమాత్రమే యాత్మచైతన్యమును బుద్ధివృత్తులనుంచి ప్రత్యేకించగలఁడు. ప్రతివిషయబోధమునందు స్ఫురించుచున్న యాత్మకాన్తియే బ్రహ్మము. దానిని దెలిసికొనినవాఁడు సమ్యగ్దర్శి యగు చున్నాఁడు. ఈజ్ఞానము విషయజ్ఞానము గాదు. ఘటపటాది జ్ఞానము బుద్ధివృత్తిఫలవ్యాప్యజ్ఞానము. ఆత్మజ్ఞానము కేవల బుద్ధివృత్తివ్యాప్యజ్ఞానము. చీకటిలోనున్న ఘటమునుజూచు

టకు దీపము చక్షుస్సు గావలెను. దీపమును జూచుటకు చక్షుస్సుమాత్ర మవసరము.

ఈ యాత్మజ్యోతిస్సు నిత్యము స్వయంప్రకాశము. దానిసన్నిధింజేరిన బ్రతివస్తువు నది భాసింపచేయును. భాస్య

సాక్షి శబ్దార్థము

మగు పదార్థము లేకున్నను నది స్వయముగ భాసించుచునే యుండును. నిత్యప్రకాశత్వము దాని స్వభావము. దర్పణముండిన దానిని సూర్యకాన్తి భాసింపజేయును. అది లేకపోయినను సూర్యకాంతిమట్టుకు ప్రకాశించుచునేయుండును. నిర్వికల్పకసమాధియందు బాహ్య ప్రపంచ మెంతమాత్రము భాసింపక బుద్ధి సర్వవృత్తిశూన్య మయి నివాతదీపమువలె నిశ్చలముగనుండును. అక్కాల మున నిత్యము జ్ఞానస్వరూపము స్వయంప్రకాశము నగు చైతన్యజ్యోతిస్సుమాత్రము భాసించుచున్నది. బాహ్యవస్తు బుద్ధివృత్తుల నవభాసింపజేయు కాలమునమాత్ర మీయాత్మ జ్యోతిస్సు సర్వసాక్షియని వ్యవహరింప బడుచున్నది. సర్వ వ్యవహారమతని సన్నిధిలో నతనికాంతిచాటున జరుగుచుం డుటచే నతడు సాక్షియని పిలువబడుచున్నాడు. అట్టి వ్యవ హారములతో నతని కేసంబంధము లేదు. ఇద్దరిమధ్య జరుగు వ్యవహారమున కెదుటనుండి యద్దానియం దేసంబంధము లేక చూచువాడు సాక్షియనబడును. నిర్వికల్పకసమాధి సర్వ వ్యవహారశూన్యమగుటచే నచట సాక్షిత్వప్రసంగము గలుగ నవకాశములేదు. తాను మాత్రము మిగిలియుండి ప్రకా శించుచుండును, అక్కాలమున బుద్ధివృత్తిగూడ నశించును,

అప్పుడపరోక్షసాక్షాత్కార మబ్బును. ఇదియే సమ్యగ్దర్శనము.

అమృతత్వము సమ్యగ్దర్శనఫలము. బుద్ధ్యాది సంఘాతమాత్రుడని గాని ఆదియుపాస్యుమని గాని తలంచువానికి మృత్యుపరంపరయే శరణ్యము. ఆత్మవిదుడు శోకసముద్రమునుదాటునని శ్రుతి[1] చాటుచున్నది. ఆత్మవిజ్ఞానముచేత నేను మర్త్యుడనను నజ్ఞానకల్పితమగు భ్రమ నివృత్తియగుటయే యమృతత్వమని యిచట గౌణముగా జెప్పబడినది. ఆత్మ నిత్యమగుటచే స్వయముగా నమర్త్యము. దానికి గ్రొత్తగా నమృతత్వము రానేరదు.

అమృతత్వశోకదైర్ఘ్యము

ఆత్మజ్ఞానముచే బలము కలుగును. గజాదుల శారీరక బలముకంటె విద్యాజన్యమగు బుద్ధిబల మెక్కుడు శ్రేయస్కరము. ఇట్టి బలమునకు మనుష్యత్వాద్యభిమానము దూరము. మాయాకృతమగు నజ్ఞానముచే లభించు జీవభావము మొదలగువానిచే బరాభవము లేదు. జ్ఞానజన్యమగు నీ బలము వినాశరహితము. అవిద్యాజన్యమగు బలము నశ్వరము, భయనిమిత్తము. భయ మెక్కువయినకొలది భౌతికబల సంచయ మెక్కువగును. బాంబులు మొదలగు రక్షణపరికర సంపాదన మధికమగును. ఆత్మజ్ఞాని యుభయమగు ప్రతిష్ఠను

బ్రహ్మవిద్యాబలమే బలము

1) "తరతి శోకమాత్మవిత్" —ఛాం 3.12.6

బొందును. బలిష్ఠతమమగు నాధ్యాత్మికజ్ఞానముచే నవిద్యా వినాశము లభించును. అవిద్య నశించినపుడు నేను జీవుడనను భ్రమ వీడిపోయి స్వస్వరూపము బ్రహ్మత్వము సాక్షాత్కారమగును. అవరోధము తొలగిన యుత్తరక్షణమే దీప దర్శనమగును. 4

అ। సంసారదుఃఖబాహుళ్యమునకును జన్మజరా మరణరోగాద్యనుభవమునకును కారణమగు నజ్ఞానమును దొలగించు మార్గమును సానుక్రోశయుగ శ్రుతిమాత ఫల శ్రుతిరూపమున ననుగ్రహింపుచున్నది.

మూ॥ ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావే దీన్మహతీ వినష్టిః। భూతేషు భూతేషు విచిత్య ధీరాః ప్రేత్యా స్మాల్లోకాదమృతా భవన్తి ॥ 5

టీ॥ ఈ జన్మమునందే యాత్మస్వరూపమును దెలిసి కొనినయెడల దానిఫలముగ సత్యస్వరూపము సిద్ధించును. అట్లు తెలిసికొనలేకపోయినయెడల గొప్పవినాశము కలుగును. జ్ఞానులగువారు ప్రతిభూతమునందు నద్వితీయమగు నాత్మ తత్త్వమును గ్రహించి యీలోకమునుండి పోయినతరువాత జననమరణము లేనివారగుచున్నారు.

తా॥ వి॥ బ్రహ్మజ్ఞానమున కధికారి మనుజుడు. అతడు సమర్థుడై పూర్వోక్తలక్షణలక్షితమగు పరమాత్మస్వరూప మును పూర్వోక్తప్రకారమున దెలిసి కొనినచో వానిజన్మము సఫలమగును. అట్లుకానిచో వృథాయగును. జన్మ

ఈజన్మమునందే ఆత్మను దెలిసికొనవలయును

జరామరణపరంపరాసంకులమగు సంసారముపాలగును. కనుక గుణదోషములను గుర్తెఱింగిన వివేకులు బాహ్యవిషయాభిలాషను మరలించుకొని స్థిరచరాత్మకములగు సర్వభూతముల యందు నొకటిగానున్న బ్రహ్మాత్మతత్త్వమును గుర్తెఱింగి సాక్షాత్కారముచేసికొనినచో 'నేను' 'నాది' యను నభిమానరూపమగు జ్ఞానమే కారణముగాగల యీ లోకము నుండి యుపరమించి యద్వైతాత్మకమగు సర్వాత్మైకత్వభావమును బొందుదురు. అనగా బ్రహ్మభావమునే బొందుదురు. ఘోరసంసారవినాశకమగు బ్రహ్మజ్ఞాన మీశరీరముండగనే సాధ్యముగనుక ప్రతిమనుజుడు నీశరీరము పడిపోకపూర్వమే త్వరపడవలయును. 5

ద్వితీయఖండము సమాప్తము

## తృతీయఖండము

అ॥ సమస్తభోగ్యభోక్తృభోగసాధనజాతమంతయు బ్రహ్మోపలబ్ధిస్థానమనియు నయ్యది విదితావిదితములకంటె భిన్నము మనోవాగతీతమునగు నిర్విశేషజ్ఞానస్వరూపమగుటంజేసి జ్ఞేయముగాదనియు, సర్వప్రవృత్తిహేతువుగూడ నదియేయని పూర్వగ్రన్థమున నిరూపింపబడినది. ఇట్టిపరమార్థ మొకయాఖ్యాయికారూపమున స్పష్టముజేయబడుచున్నది.

మూ॥ బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్య హ బ్రహ్మణో విజయే దేవా దేవతం అమహీయన్త॥ త ఐక్షన్తాస్మాకమేవాయం విజయోఽస్మాకమేవాయం మహిమేతి (1) తద్ధై

షాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ తన్నవ్యజానత కిమిదం యక్షమితి ॥ (2) తేఽగ్నిమబ్రువన్ జాతవేద ఏతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి ॥ (3) తదభ్యద్రవత్తమభ్యవదత్ కోఽసీత్యగ్నిర్వా అహమస్మీత్యబ్రవీజ్జాతవేదా వా అహమస్మీతి ॥ (4) తస్మిం స్త్వయి కిం వీర్యమిత్యపీదగ్ం సర్వం దహేయం యదిదం పృథివ్యామితి ॥ (5) తస్మై తృణం నిదధావేతద్దహేతి తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి॥ (6) అథ వాయుమబ్రువన్ వాయవేతద్విజానీహి కిమేతద్యక్షమితి తథేతి ॥ (7) తదభ్యద్రవత్తమభ్యవదత్ కోఽసీతి వాయుర్వా అహమస్మీత్యబ్రవీన్మాతరిశ్వా వా అహమస్మీతి ॥ (8) తస్మిం స్త్వయి కిం వీర్యమిత్యపీదగ్ం సర్వమాదదీయ యదిదం పృథివ్యామితి॥ (9) తస్మై తృణం నిదధావేత దాదత్స్వేతి తదుపప్రేయాయ సర్వజవేన తన్న శశాకాదాతుం స తత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం యదేతద్యక్షమితి॥ (10) అథేన్ద్రమబ్రువన్ మఘవన్నేతద్విజానీహి కిమేతద్యక్షమితి ॥ తథేతి తదభ్యద్రవత్తస్మాత్తిరోదధే॥ (11) స తస్మిన్నేవాకాశే స్త్రియమాజగామ బహుశోభమానాముమాం హైమవతీం తాగ్ం హోవాచ కిమేతద్యక్షమితి॥ 12

తా॥ విశుద్ధాన్తఃకరణులగు వారికి మాత్రమే సర్వాతిశయము సర్వాత్మభూతము నగుబ్రహ్మము జ్ఞేయమగునను బ్రహ్మజ్ఞానముయొక్క ముఖ్యసూత్ర మీయాఖ్యాయికా రూపమున వివరింపబడుచున్నది. జగత్స్థితిపరిపాలనానిరతుడగు బ్రహ్మ దేవతులచే పార్థితుడయి యసురుల నొక

యుద్ధమున జయించెను. యజ్ఞవిఘ్నకారులగు నసురుల దర్ప మణంగుటచే దేవతలు తమతమహవిర్భాగముల సక్రమముగ సేకరింపుచుండిరి. దేవతలు తమశక్తిచే నసురుల జయింపం బడినట్లు విజయమును దమయందారోపించుకొని గర్వపూరితు లయిరి. మిథ్యాహంకారనిమిత్తమగు వీరల గర్వము నణచి వారికి గుణపాఠము నేర్పుటకై మాయోపాత్తము అత్యంత మద్భుతమునగు నొకానొక రూపవిశేషమున బ్రహ్మము వారి యెదుట ప్రాదుర్భూతమయ్యెను. ఇట్టి యపూర్వస్వరూప మును కనుంగొనుటకై దేవతలచే బ్రేరితులయి యగ్ని వాయువు లావ్యక్తిసన్నిధియందు తమతమసామర్థ్యముల శ్లాఘించుకొనిరి గాని యావ్యక్తిచే నచట నుంచబడిన గడ్డి పోచ నగ్నిదహింపలేకపోయెను. వాయువు చలింపజేయలేక పోయెను. వీరుభయులు విఫలప్రయత్నులగుటంజేసి దేవ రాజే స్వయముగా నావ్యక్తిని జేరప్రయత్నించెను. కాని మఘవానుడచటికి జేరునప్పటికే యావ్యక్తి యన్తర్హితమై యాస్థలమున సౌందర్యమున హైమవతివలె శోభిల్లునొక స్త్రీరత్నమతని కగుపడెను. ఇంతకుపూర్వ మగుపడిన యా యపూర్వవ్యక్తి యెవరని యిందుడ్రామెనడిగెను. 12

తృతీయఖండము సమాప్తము

## చతుర్థఖండము

మూ॥ సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణో వా ఏత ద్విజయే మహీయధ్వమితి తతో హైవ విదాంచకార బ్రహ్మేతి(1)

తస్మాద్వా ఏతే దేవా అతితరామివాన్యాన్ దేవాన్ యదగ్ని ర్వాయురిన్ద్రస్తే హ్యేనన్నేదిష్ఠం పస్పృశు స్తే హ్యేనత్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి (2) తస్మాద్వా ఇన్ద్రోఽతితరామి వాన్యాన్ దేవాన్ స హ్యేనన్నేదిష్ఠం పస్పర్శ స హ్యేన త్ప్రథమో విదాంచకార బ్రహ్మేతి॥ (3)

టీ॥ "ఇంతకుపూర్వమగుపడిన యపూర్వవ్యక్తి దేశ కాలవస్తుపరిచ్ఛిన్నముగాని బ్రహ్మము. అతడే దేవాసుర యుద్ధమున గెలిచినవాడు. అతని విజయముచేతనే మీరం దరు గొప్పవారలై లోకమునందు స్తుతిపూజాదికమునకు బాత్రులగుచున్నారు. కనుక మీరు వృథాహంకారమును అభిమానమును బొందకుందురుగాక" యని యాస్త్రీ దేవ రాజున కానతినిచ్చెను. స్త్రీరూపమున ప్రాదుర్భూతమయిన ఐశ్వర్యశక్తిచే నిట్లుపదేశింపబడుట కిన్ద్రుడే మొదటివా డగుటచే నతడు దేవతలలో నగ్రగణ్యుడయ్యెను. వాయ్వగ్ని దేవత లాయపూర్వవ్యక్తిసన్నిధిం జేరుటకు మొదటివారగుటం జేసి వీరితర దేవతలకంటె మిన్నకెక్కిరి. 1–3

అ॥ ఇంతటితో నీయాఖ్యాయిక ముగిసినది. బ్రహ్మ స్వరూపమును గూర్చినయాఖ్యాయికయం దిన్ద్రుడు గ్రహిం చిన యుపదేశమిక వివరింపబడుచున్నది.

మూ॥ తస్యైష ఆదేశో యదేతద్విద్యుతో వ్యద్యుతదా3ఇతీ న్న్యమీమిషదా3ఇత్యధిదైవతమ్ ॥ 4

టీ॥ సుప్రసిద్ధమయిన యీపరబ్రహ్మము మెఱుపుతీగ కాంతివలె బ్రకాశించును. కనురెప్పపాటువలె నత్యంతము

శీఘ్రముగ ప్రకాశతిరోధానములుగలది. ఇది బ్రహ్మము యొక్క దైవికస్వరూపము.

తా॥ వి॥ బ్రహ్మముయొక్క స్వరూపము దుర్విజ్ఞేయము. ప్రస్తుతసన్నివేశమునుబట్టి యనుభూతమయిన స్వరూపము నిన్దు్రడు వర్ణించుచున్నాడు. దట్టమగుచీకటిచే నావరింపబడిన మేఘపటలమును బ్రద్దలుచేసుకొని హఠాత్తుగా ప్రాదుర్భూతమగు మెఱుపుతీగెకాంతివలెనే దేవతలయెదుట నీబ్రహ్మస్వరూపము హఠాత్తుగా మెఱసెను. అందువలన బ్రహ్మస్వరూపము మెఱుపుతీగెవలె బ్రకాశించునది యని యిందు్రడు తలచెను. మరుదగ్నులవలన విషయమును దెలిసికొని సురరాజచటికి జేరకపూర్వమే కనురెప్పపాటంత శీఘ్రముగా బ్రాదుర్భూతమయిన యా యపూర్వవ్యక్తి యన్తర్ధానమొందెను. మరియొకమార్గమున వర్ణించుటకశక్యమగు బ్రహ్మస్వరూపమిచట దేవతానిమిత్తములగు నుపమానములచే వర్ణింపబడినది. ఈ యుపమానద్వయముచేత బ్రహ్మస్వరూపము యొక్క యుగపద్విశ్వవ్యాపకత్వము నిరతిశయజ్యోతిరాత్మకత్వము సృష్ట్యాదిక్షిప్రకారిత్వము తెలియజేయబడుచున్నవి. 4

బ్రహ్మముసర్వవ్యాపి జ్యోతిరూపకము.

అ॥ ప్రత్యగాత్మస్వరూపమున బ్రహ్మ అభివ్యక్తమగు నటుల శారీరకమగు నుపమానముచే నద్దాని స్వరూపము తరువాత మంత్రమున వివరింపబడుచున్నది.

మూ॥ అథాధ్యాత్మం యదేతద్గచ్ఛతీవ చ మనోఽనేన చైత దుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః ॥ 5

టీ॥ మనస్సు బ్రహ్మస్వరూపమును బొందుచున్నట్లుగా నున్నది. అందువలన నీ బ్రహ్మ సమీపమునందున్నట్లు స్మరింపుచున్నాము. మాటిమాటికి బ్రహ్మవిషయకమగు సంకల్పము గలుగుచున్నది.

తా॥ వి॥ మనస్సు బ్రహ్మమునకుపాధియగుటంజేసి యది యత్యంతసమీపమున నున్నటుల గాన్పించుచున్నది. అందువలన మనస్సు బ్రహ్మమును పొందుచున్నట్లున్నది. నిజముగానది మనస్సున కవిషయము. అద్దాని నది బొందలేదు. అత్యంతసామీప్యముచే నేను బ్రహ్మము నయితినని బ్రతిక్షణము సాధకుడు స్మరింపుచున్నాడు. అందువలన బ్రహ్మసాక్షాత్కారాభిలాష యతనికి పలుమరు గల్గుచున్నది. ఇట్లు స్మరణసంకల్పాది చిహ్నములచేత బ్రహ్మముపాస్యమగుచున్నదియని భావము. 5

బ్రహ్మము మనస్సున కందరాదు.

అ॥ ఇట్టి యుపాసనావిధానఫలములు తరువాతమంత్రమున బోధింపబడుచున్నవి.

మూ॥ తద్ధ తద్వనం నామ తద్వనమిత్యుపాసితవ్యం స య ఏత దేవం వేదాఽభి హైనం సర్వాణి భూతాని సంవాంఛంతి॥6

టీ॥ సుప్రసిద్ధమయిన యాపరబ్రహ్మమునకు తద్వనమను పేరు గలదు, కనుక బ్రహ్మమును తద్వనమని యుపా

సింపనగును. ఇట్లుపాసనము జేయువానిని సమస్తభూతము లభివాంఛింపుచున్నవి.

తా॥ వి॥ తద్వనమను శబ్దమునకు సమస్తప్రాణిజాతము లకు సంసేవ్యమని యర్థము. ఆత్మజ్యోతిస్సుచే నుజ్జ్వలితము లయినపుడే సమస్తప్రాణిజాతములు స్వస్వ వ్యాపారక్షమము లగుచున్నవి. అట్టియుజ్జ్వలనములేనపుడు వాయ్వగ్నులు తృణకణ మునుగూడ చలించుటకును దహించుటకు నశక్తులయిరి. అందువలననే "శ్రోత్రస్య శ్రోత్రం"(1–2) అను మన్త్రమున బ్రహ్మముయొక్క సర్వాత్మత్వ మునపిష దాదియం దుపదేశింపబడినది. కనుక యీ పరబ్రహ్మతత్త్వ మందరికి సంసేవ్యమగుచున్నది. బ్రహ్మమును తద్వనమను గుణముగలదిగా నుపాసింపవలయును.

బ్రహ్మమును తద్వనమనియుపాసించుట.

ఇతరవిషయకబుద్ధివృత్తులచే విచ్ఛేదమునొందని యుపాస్యైకవిషయకబుద్ధివృత్తి పరంపర, యుపాసన మనంబడును. స్వయంప్రకాశము సర్వవ్యాపారహేతుభూతము సంకల్పస్మరణగమనాదికమునకు కారణము నగుబ్రహ్మమును తద్వనమను నామముతో నుపాసించువాడు స్థావరజంగమములగు సమస్తభూతములచేత దర్శనస్పర్శనాదులచే నభివాంఛింపబడుచున్నాడు.

ఎవ్వని ప్రేరణముచే ప్రాణమనోవాక్చక్షుఃశ్రోత్రాదులు స్వస్వకర్మాచరణసమర్థములగునో యట్టి బ్రహ్మస్వరూ

టీ॥ బ్రహ్మజ్ఞానోపదేశమంతయు నీ యుపనిషత్తున జేయబడినది. ఈ యుపనిషత్తున నుపదేశింపబడినదంతయు సత్యజ్ఞానానంతలక్షితమగు బ్రహ్మవిషయమే యయియున్నది.

తా॥ వి॥ సమస్తహృదయగ్రంధులను శిథిలముజేసి యవిద్య నంతమొందించి సాధకుని నత్యంతము బ్రహ్మసామీప్యమును బొందించునది గనుక ఉపనిషత్తను పేరువచ్చినది. అట్టి జ్ఞానము గ్రంథవిషయము గనుక గ్రంథమునకుగూడ నాపేరు కలిగినది. 7

అ॥ బ్రహ్మజ్ఞానోపలబ్ధికవశ్యములగు ముఖ్యసాధనములను గూడ జెప్పినగాని బ్రహ్మజ్ఞానోపదేశము సంపూర్ణము గాదనిదలంచి యట్టిముఖ్యసాధనముల నెనిమిదవమన్త్ర ముపదేశించుచున్నది.

మూ॥ తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా వేదాః సర్వాంగాని సత్యమాతనమ్ ॥ 8

టీ॥ బ్రహ్మజ్ఞానమునకు తపస్సు దమము అగ్నిహోత్రాదికర్మలు ప్రతిష్ఠాభూతములు. వేదములు దానియంగములు. సత్యమద్దానికి నివాసస్థానము.

తా॥ వి॥ శరీరేన్ద్రియాన్తఃకరణములయొక్క పరస్పర సమాధానము తపస్సు. అన్తరిన్ద్రియనిగ్రహము దమము. స్వవర్ణాశ్రమోచితమగు నగ్నిహోత్రాతిథిపూజనాదికము కర్మ. కర్మచే చిత్తశుద్ధి ఉపాసనముచే చిత్తైకాగ్ర్యము లభించును. చిత్తైకాగ్ర్యము ముక్తిసాధనము. కర్మోపాసన

ములు రెండును నాలుగు వేదములయందు వివరింపబడినవి. వేదశబ్దముచే శిక్ష, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము, వ్యాకరణము, కల్పములను నారు వేదాంగ ములు గూడ నవగతము లగుచున్నవి. మను జుడు నిలుచుటకు పాదము లాధారమయి నటుల బ్రహ్మజ్ఞానమునకు నాలుగు వేదములు బ్రతిష్ఠాస్థానము లగుచున్నవి. లేక నుపనిషత్కామధేనువునకు బ్రహ్మవిద్య వత్సయనియు తపఆదు లద్దాని పాదములనియు జెప్పంబోలు.

బ్రహ్మప్రాప్త సాధనములు.

అమాయిత్వము, వాఙ్మనఃకాయముల యకౌటిల్యము, సత్య శబ్దార్థములు. కావున మాయారహితులగు సాధుజనులయందే బ్రహ్మవిద్య నిలచి ఫలించును. అందువలన సత్యము బ్రహ్మ విద్య కావాసస్థానమని వర్ణింపబడినది. 8

అ॥ ఫలశ్రుతికథనముచే నీయుపనిష త్తుపసంహారింప బడుచున్నది.

మూ॥ యో వా ఏతామేవం వేదాపహత్య పాప్మానమన
న్తే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి ॥ 9

చతుర్థఖండము సమాప్తము.

టీ॥ పూర్వోక్తప్రకారమున నీ బ్రహ్మవిద్యను దెలిసి కొనినవా డవిద్యను బోగొట్టుకొని యనంతము, అత్యంతము శ్రేష్ఠము ఆనందస్వరూపము నగుబ్రహ్మమునందు స్థిరమగు స్థితిని బొందును.

తా॥ వి॥ బ్రహ్మజ్ఞానికి ధర్మాధర్మములు పుణ్యపాప ములు నశించును. ధర్మాచరణముచే నుత్తమలోకము, అధర్మా

చరణముచే నధోలోకము సంప్రాప్తము లగుచున్నవి. ఈ రెండును బంధకారణములే. అటులనే పుణ్యపాపములుగూడ నవశ్యమనుభవనీయములగు ఫలహేతువులగుటచే బంధనిమిత్తములే యగుచున్నవి. విధినిషేధవిదూరమగు నిస్త్రైగుణ్యమార్గమున మెలంగు బ్రహ్మజ్ఞానికివి యుపాదేయములు గానేరవు. అట్టి బ్రహ్మజ్ఞాని సర్వవేదాన్తాఖణ్డార్థప్రతిపాదితము అఖణ్డరసఘనము నగు బ్రహ్మమును స్వస్వరూపముచే బొంది బ్రహ్మమే యగుచున్నాడు. సర్వసంసారసంబంధ మతనినుండి తొలగిపోవును. 9

బ్రహ్మజ్ఞానికి ధర్మాధర్మములు పుణ్యపాపములు లేవు.

నాల్గవఖండము సమాప్తము

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యేత్యాది బిరుదాంచిత శ్రీభారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమహాన్తాచార్య మహా స్వామి పాదాత్యంతా న్తే వాసియు నత్రి గోత్ర సముద్భూతుడు నగు లింగన సోమయాజిచే విరచితమగు నుపనిష చ్చంద్రిక ద్వితీయమయూఖమునం దలి కేనోపనిషత్తు సమాప్తము

బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

# కఠోపనిషత్తు

## అర్థసంగ్రహము

గురుశిష్యులుభయు లర్థజ్ఞానయోగ్యములగు విద్యాఫలములబొంది తేజోవంతులగునట్లును అన్యోన్యము ద్వేషింపకుండునట్లును ప్రార్థనాపూర్వకమగు శాంతిపాఠముతో నీయుపనిషత్తు ప్రారంభింపబడుచున్నది.

## ప్రథమాధ్యాయము

ప్రథమవల్లి:— కాఠకోపనిషత్తు కృష్ణయజుర్వేదీయాంతర్గతము. ఆత్మతత్త్వమిచట వాజస్రవసపుత్రుడగు నచికేతసునికి యముడుపదేశించిన యాఖ్యాయికారూపమున వివరింపబడినది. ఈ యాఖ్యాయిక అనుశాసికపర్వమునగూడ గానవచ్చుచున్నది. వాజస్రవసుడను నొకకర్మజ్యేష్ఠుడు సర్వస్వదానప్రయుక్తమగు విశ్వజిద్యాగమునొకదానిని దలపెట్టి నిరింద్రియములు నిర్బలములు నగు గోవులను ఋత్విక్కులకు దక్షిణలనిచ్చెను. ఇందుచే దండ్రికి గలుగనున్న నరకదుఃఖమునకు బ్రతీకారముగ నచికేతసుడు తనను యమునికి దానము జేయించుకొని యమసదనము జేరెను. బ్రహ్మదర్శనమునకుం బోయినయముడు స్వగృహమునకు వచ్చునంతవరకతడు నిరాహారుడయి త్రిరాత్రమచటనే వసియించెను. అగ్నిస్వరూపు

డగు బ్రాహ్మణుడు నిరాహారుడయి తనయింట వసియించి నందున తనకు వాటిల్లనున్న ముప్పును దొలగించుకొనుటకై యముడు నచికేతసునికి మూడువరముల నొసంగెను. అతడు స్వగృహమున కేగినపుడు తండ్రిశాంతమనస్కుడయి తనను గుర్తించుట మొదటివరము. ఆకలిదప్పులు లేనిస్వర్గసుఖ ప్రాప్తికి సాధనమగునగ్నిచయన ముపదేశించుట రెండవ వరము. మొదటివరము నచికేతసుని పితృభక్తిద్యోతకము. రెండవది కర్మసంబంధము, అనిత్యఫలప్రదము. నిఃశ్రేయః ఫలప్రద మగుబ్రహ్మవిద్యోపదేశము మూడవవరము. ఇట్లు రెండుమూడువరములరూపమున కర్మజ్ఞానములు రెండు నుపదేశింపబడినవి. సర్వోత్కృష్టమగు నాత్మవిద్యోపదేశమునకు నచికేతసునియర్హతను బరీక్షించుటకు యముడు నచికేతసుని యనేకములగు నిహపరలోకైశ్వర్యములచే బ్రలోభింపజేసెను గాని యాతడందుల కియ్యకొనలేదు. అందులకు యముడు సంతసించెను.

ద్వితీయవల్లి:— శ్రేయోమార్గము పరమపురుషార్థమగు నిఃశ్రేయస్సునకు సాధనము. ప్రేయోమార్గము ప్రియమగు నభ్యుదయమునకు సాధనము. మొదటిది నిత్యఫలకము. రెండవదియనిత్యఫలకము. వివేకవంతుడగుజ్ఞాని మొదటిదానిని గోరును. మందబుద్ధి రెండవదానిని గోరును. బ్రహ్మము కేవల హేతువాదమున కందరానిది. సర్వసంసారభోగజాతమును బరిత్యజించిన విరాగికిగాని బ్రహ్మజ్ఞానమలవడనేరదు. ఆత్మ నిగూఢమ్ము, ప్రాకృతవిషయవిజ్ఞానముచే గప్పబడినదియుగుటచే

మనస్సును విషయములనుంచి తొలగించి నద్దాని గ్రహింపవలయును. యముడు దుర్విజ్ఞేయమగు పరబ్రహ్మము నోంకార రూపమున సంగ్రహముగనుపదేశించెను. ఈ యొక్క అక్షరముచే బరాపరబ్రహ్మలరెండింటిని దెలిసికొనసాధ్యమగును. ఓంకారము రెంటికిని బ్రశస్తమగు ప్రతీకయయి నిదిధ్యాసోపాసనలకు విషయమగుచున్నది. ఆత్మ చావదు, చంపబడదు; లోపింపని నిత్యచైతన్యస్వరూపము; పుట్టుకలేనిది పురాణము నిర్వికారము. శస్త్రాదులు శరీరమును గొట్టునుగాని యాత్మను గొట్టనేరవు. శరీరముకంటె వేరయి సుఖదుఃఖాదిశరీరధర్మములచే నసంస్పృష్టము, పరిమాణరహితము, సూక్ష్మముకంటె సూక్ష్మతరము; మహత్తుకంటె మహత్తరము; బుద్ధిగుహయందు నిగూఢముగ నున్నది. బాహ్యవిషయములనుంచి తొలగింపబడి ప్రసన్నమగు మనస్సు నద్దానిమహిమను దెలిసికొనగలదు. సర్వవ్యాపియగుటచే దానిని వెతుకబోయినవానికంటె ముందుగబోయినది యట్లగుబడును. అది యచంచలము; స్థిరధర్మకము; పుటుకలేకుండుటచే నిర్వికారము, సర్వవ్యాపియగుటచే మహత్తమము. ఇట్టియాత్మ తానేయని గ్రహించినవానికి శోకమోహములు దూరములగును. వేదాధ్యయనముచేతను బహుగ్రన్థాభ్యాసముచేతను నది తెలియబడదు. శ్రవణమనననిదిధ్యాసములచేత మాత్రము నద్దాని దెలియనగును. పరమేశ్వరానుగ్రహము వీనికి దోడ్పడవలెను. ఇంద్రియలౌల్యముచే చిత్తశాన్తియు చిత్తైకాగ్ర్యము లేనిప్రాకృతబుద్ధి కది యందదు.

తృతీయవల్లి:— ఆత్మను బుద్ధిగుహాయందు దెలియ నగును. ఈ యాత్మయే యొకానొకప్పుడు గర్మఫలమున నుభవించును. నిర్లిప్తమగు నాత్మయు కర్మఫలభోక్తయగు నాత్మయు విలక్షణములుగ నున్నటుల గాన్పించుచున్నారు. కాని వారిద్దరు నొకరే. కర్మఫలభోక్తయగు నాత్మ జీవుడనిపించుకొనును. ఆత్మకిట్టి జీవత్వ మవిద్యచే నుపాధివశమున సంప్రాప్తమగుచున్నది. కర్మఫలమనుభవించు జీవునియొక్క యాత్మత్వము దుష్యంతపాత్రధారణమును జేసినగోపాలుని స్వస్వరూపమువలె బోలేదు. అజ్ఞానముచే నదికప్పబడి తెలియుటలేదు. ఆత్మలు రెండు గావు. అవస్థలు మాత్రము రెండు గలవు. నిర్వికారము సహజము నగుస్వరూపమొకటి. దానియందజ్ఞానముచే నారోపింపబడు జీవత్వావస్థ రెండవది. జీవత్వమును జెప్పినపుడాత్మత్వం కూడ స్ఫురించుచునే యున్నది. ఎండను నీడవలె ఆత్మను జీవత్వమనుసరించుచున్నది. సంసారసాగరమును దాటుటకు పరబ్రహ్మము, కర్మఫలమగు నభ్యుదయమును బొందుటకు యపరబ్రహ్మము సాధనములగుచున్నారు. జీవుడే ఈరెంటికిని యధికారి. ఉభయవిధఫలముల ననుభవించుటకు శరీర మతనికి సాధనము. అది యతనికి నుపాధి యగుచున్నది. అన్తఃకరణముయొక్క రూపాన్తరమగుమనస్సు చక్షురాదిజ్ఞానేన్ద్రియములద్వారా విషయముల గ్రహించి వానిని బుద్ధికి బ్రసాదించును. అపుడు బుద్ధి వానిని బట్టి మానుషప్రవృత్తిని నిశ్చయించును. జీవుడీప్రవృత్తిఫలము ననుభవించును. జీవునికి కర్మఫలానుభవము శరీరోపాధిచే

సంప్రాప్తమగుచున్నది. ఆత్మ స్వయముగా నిర్ధర్మకము. బుద్ధి ఆత్మకత్యంతసమీపమునం దుండుటచే జపాకుసుమ ధర్మము స్ఫటికమునం దారోపింపబడినట్లు బుద్ధిధర్మము లాత్మ యందును, ఆత్మధర్మములు బుద్ధియందు నారోపింపబడు చున్నవి. ఇట్లాత్మకు జీవత్వ మారోపితస్వరూపమగుచున్నది. ఈవిధమున దేహేన్ద్రియసంఘాతఫలమగు భోక్తృత్వ కర్తృత్వరూప మగుసంసారము జీవునికి సంప్రాప్తమగు చున్నది. జీవుడనురథికుడు, బుద్ధియనుసారథిచే విషయములను మార్గమున నడిపింపబడు యింద్రియములను నశ్వములతో సమర్చబడినశరీరరథము ననుష్ఠించియున్నాడు. బుద్ధి మంచి మార్గమున నడచిన నివృత్తిమార్గము, అన్యమార్గమున నడ చిన ప్రవృత్తిమార్గము సంప్రాప్తమగును. నివృత్తిమార్గముచే బ్రహ్మప్రాప్తియు, ప్రవృత్తిమార్గముచే సంసారము లభించును. ఇన్ద్రియములు, ఆకాశాదిభూతపంచకము, మనస్సు, బుద్ధి, హిరణ్యగర్భుడు వీనిలో పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము సూక్ష్మతరము మహత్తరము నగుచున్నది. పురుషుడు వీనియన్నిటికంటెను సూక్ష్మతమము, మహత్త మము. సూక్ష్మత్వమహత్వములకితడే పరమావధి. ఇతడు సర్వజగత్కారణము. ఈపరమపురుషుడు బుద్ధిగుహాయందు నిగూఢముగనుండుటచే సులభముగ దెలియుటలేదు. ఏకా గ్ర్యము సూక్ష్మము నగుబుద్ధికి యతడందగలడు. సకలేన్ద్రియ వ్యాపారముల మనస్సునం దుపసంహరించినవాడు నిర్వికల్ప సమాధియం దాత్మప్రకాశమును జూడగలడు. ఆత్మనుబొందు

మార్గము దుస్సాధమగుటచే యజ్ఞాననిద్రనుండి లేచి జాగరూకతతోనద్దాని గ్రహింపనలయును. శరీరము లనిత్యములు జీవితము స్వల్పము గనుక నాలస్యము జేయరాదు. ఆత్మశబ్దము, రూపము, స్పర్శము, నాశము, రసము, గంధము లేనిది; నిత్యము, అనాది, అనంతము. ఇట్లెరింగినవాడు మృత్యువునుంచి తప్పించుకొనును.

## ద్వితీయాధ్యాయము

(ప్రథమవల్లి:— ఆత్మయొక్క దుర్విజ్ఞేయత్వము, తత్స్వరూపము, తత్ప్రాప్తిమార్గము ప్రదర్శింపబడినవి. ఆత్మ బుద్ధిగుహానిహితమగుటవలననేగాక నిందిద్రియప్రతిబంధమునవలన గూడ నది దుర్విజ్ఞేయమగుచున్నది. చక్షురాదిపంచేన్ద్రియములు బాహ్యావిషయములనుగూర్చి యెల్లపుడును పరుగులిడును. అందువలన కామ్యలోలుపత్వము, సంసారప్రాప్తియు గలుగుచున్నవి. ఆత్మచైతన్యముచే నుద్దీపితములయినపుడు మనస్సు పంచేంద్రియములు వ్యాపారవంతములగుచున్నవి. ఆత్మచైతన్యమే సర్వవ్యవహారకారణము. అజ్ఞానిజనమీవిషయమును గుర్తింపలేక మనస్సువ్యవహరించుచున్నదని దలంచుచున్నారు. మనస్సును దానినుజ్జ్వలింపజేయుచున్న ఆత్మప్రకాశమును బ్రత్యేకింపలేక మనస్సుయొక్క ధర్మముల నాత్మయందారోపించి ఆత్మ జ్ఞానకర్త, ఫలభోక్త యనిపొరబడుచున్నారు. ఆత్మకు కర్తృత్వభోక్తృత్వములు లేవు. ఆత్మ సర్వవ్యాపి; వివిధయోనులయందతడు జీవరూపమున మెలంగుచున్నాడు. జీవాత్మలనన్యములు. జీవునికి తత్తదుపాధిగత

మగు కర్తృత్వభోక్తృత్వములు సంప్రాప్తమగుచున్నవి. ఆత్మ యొక్కడే మోక్షైకసాధనము. హిరణ్యగర్భుడు ఇంద్రాగ్నులు మొదలగు దేవతలు, సర్వప్రపంచము గూడనతనిస్వరూపములు. హిరణ్యగర్భుడు ప్రథమశరీరి. జగత్సృష్టి కతడే ప్రారంభము. అతడు జగత్తుయొక్క సమష్టిస్వరూపుడు. జీవులంద రతనిప్రత్యేకస్వరూపములు. ఇంద్రియనిగ్రహముచే మనస్సు నంతర్దృష్టిగలదానినిగ జేసి బాహ్యస్వరూపముల నసత్యములుగ ద్రోసిబుచ్చి పరమాత్మస్వరూపమును హార్దాకాశమున దెలిసికొనవలయును. అతనిని దెలిసికొనుటకు నిర్దేశింపబడినహార్దాకాశ మంగుష్ఠపరిమాణమగుటచే నతడు గూడ నంగుష్ఠపరిమాణుడని వర్ణింపబడుచున్నాడు. అతనికి బరిమాణములేదు. మహత్తముడు. ఇంద్రియలోలుపత్వమును జయించి శుద్ధచిత్తులు మననశీలులునగు మును లతనిదర్శనము జేయగలరు.

ద్వితీయవల్లి:— వాక్చక్షుశ్శ్రోత్రఘ్రాణములను నేడు, నాభియొకటి, మూత్రపురీషద్వారములురెండు, బ్రహ్మరంధ్రమొకటిమొత్తముపదునొకండుద్వారములతో నలరారుచున్న నీశరీరనగరమును స్వతంత్రరాజగు నాత్మ యధిష్ఠించియుండును. విజ్ఞానపూర్వకముగ నతనిని దెలిసికొనినవాడు కామకర్మబంధములు వీడి యభయప్రతిష్ఠితుడగును. ఆత్మ సర్వాత్మకుడు, సర్వసంసేవ్యుడు నగును. ప్రాణపంచకమతనిచే నడిపింపబడుచున్నది. అతను లేనిశరీరము రాజులేచిపోయిన నగరము వలె బాడుబడును. బ్రహ్మజ్ఞానముచే సర్వసంసారోపరతి, అదిలేకుండుటచే సంసారనిరతియు గల్గుచున్నది. ఆత్మయే

జీవస్వరూపమున స్వప్నమునందవిద్యచే సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. సూర్యకాంతి యశుభ్రపదార్థసంపర్కముచే నసంస్పృష్టముగాన ట్లాత్మగూడ సుఖదుఃఖములచే నసంస్పృష్టుడగుచున్నాడు. త్రాటియందు కాన్పించుసర్పము త్రాటికంటెను. ఆత్మ యద్వితీయము. సర్వలోకములను వశము నందుంచుకొనినవాడు. అతడు సర్వాధారుడు. దర్పణమునందలి ప్రతిబింబమువలె నతడు స్వయముగా నిరాధారుడు. అతడొకడే నిత్యము, చేతనములకెల్ల జేతనము. దాని స్వరూపమిట్టిదని నిర్దేశింపవీలులేదు. నివృత్తైషణులగు యతిసత్తములకతడు గోచరముకాగలడు. సర్వప్రపంచావభాసకములగు సూర్యాగ్ని తేజస్సు లతనిచే బ్రకాశింపబడుచున్నవి. అవి యతనిని బ్రకాశింపజేయలేవు.

తృతీయవల్లి:— వృక్షమునకు వేళ్ళవలె సర్వసంసారమునకు బ్రహ్మము మూలమగుచున్నదని యీవల్లియందు వివరింపబడుచున్నది. సంసారవృక్షమునకు బ్రహ్మము మూలమగుటవలన దానిమొదలు పైనయుండినట్లు వర్ణింపబడినది. స్వర్గనరకాదిలోకము లడ్డముగావ్యాపించిన సంసారవృక్షశాఖలు. బ్రహ్మము సమస్తజగత్తును నడిపించుచున్నది. చంద్రసూర్యాదు లద్దానిభయముచే స్వస్వవ్యాపారముల నవవహితులయి మెలంగుచున్నారు. అతనిచే నియతముగానిచో నీజగత్తంతయు చెల్లాచెదరయి, జీవితనుసంభవమగును. జలము పాషాణము గావచ్చును. ఇక్షుఖండము కటుకషాయితము కాగలదు. పృథివి కాఠిన్యమును గోల్పోయి యార్ద్రతను బొందవచ్చును. బ్రహ్మ మశేషజగద్ధరణభారనిర్వహణ

సమర్థము, సర్వజ్ఞము, సర్వశక్తిమంతము. ఇట్టిబ్రహ్మమును దెలిసికొనినవాడు శరీరపతనమునకుబూర్వమే ముక్తుడగును. నిర్మలబుద్ధులకయ్యది దర్పణమునందు బ్రతిబింబమువలె స్పష్టముగగాన్పించు. మానవజన్మమునమాత్రమే దానింజూడదగు. నిశ్చలమయినబుద్ధిచే నద్దానిస్వరూపమును మననము సేయవలయును. పరమాత్మను మననముజేయుప్రకారము యోగమని బిలువబడుచున్నది. చక్షురాదిజ్ఞానేంద్రియపంచకము స్వస్వవిషయములనుంచి తొలగి సంకల్పవికల్పవిదూరమగు నన్తఃకరణముతో నన్తఃప్రవిష్టమయి యాత్మయందు నిలచి యుండు యుత్కృష్టస్థితి యోగమనబడును. అదియుపరమగతి. ఈస్థితిజాగ్రత్స్వప్నసుషుప్తులకంటె విలక్షణమగు సమాధియగుచున్నది. బాహ్యాభ్యంతరములగు నిన్ద్రియములను స్థిరముగ ధారణముసేయుటయే యోగము. అపుడు బుద్ధీన్ద్రియసంయోగముండదు. ఈ యోగము పతంజలియోగసూత్రములయందు వివరింపబడిన చిత్తనిరోధరూపమగు యోగముకంటె విలక్షణము. చిత్తమును బాహ్యప్రపంచమునుగూర్చి పరుగులిడకుండ నిరోధించుట యోగమని పాతంజలిమతము. నిరోధము సడలినపుడు చిత్తము దిరిగి విషయసంయోగము నొందును. అద్వైతదర్శనమునందలియోగమునం దిట్టి ప్రమాదములేదు. బాహ్యప్రపంచమంతయు మిథ్యామాత్రమని దృఢజ్ఞానముండుటవలన చిత్తమద్దాని నాశించదు. ప్రపంచముయొక్క మిథ్యాజ్ఞానదార్ఢ్యముచే చిత్తము సర్వవృత్తిశూన్యమయి అప్రయత్నముగ నివాతదీపమువలె నచంచలముగ నుండును. ఆత్మ సర్వేన్ద్రియాతీతము మనోవాగగోచరము

యోగులంతర్దృష్టిచే నాత్మను సాక్షాత్కారము జేసికొని తమయనుభవమును లోకమునకు దెలియజేయుచున్నారు. బ్రహ్మ మున్నదనుభావముచేతనే నుపలభ్యముకాగలదు. లేదనితలంచువా డద్దాని దెలిసికొనుప్రయత్నమే చేయడు. సర్వకామోన్మూలనముచే మర్త్యుడమర్త్యుడగును. వివిధ కామములు, అభిమానములు హృదయము నాశ్రయించుకొని పీటముడివేసికొనియుండును. వీనిని హృదయగ్రంథులందురు. ఇవి బ్రహ్మసాక్షాత్కారమున కవసరములగు చిత్తనైర్మల్యైకాగ్ర్యములకు ప్రతిబంధకములు. బ్రహ్మసాక్షాత్కారము హృదయగ్రంథివిచ్ఛేదమయినపుడే సంభవించును. బ్రహ్మ మును దెలిసికొనినవారు హృదయమునుంచి యూర్ధ్వమునకు బోవు సుషుమ్నానాడీద్వారమున శిరఃకపాలమును భేదించు కొని బ్రహ్మలోకమును జేరును. పరమపురుషు డంగుష్ఠమాత్రుడు, సర్వాన్తర్యామి. హృదయకమలమునందు సన్నిహితుడుగ నున్నాడు. గడ్డిలోనుంచి కాడనువలె దేహమునుంచి యతనిని వైరాగ్యాదరహితమగుజ్ఞానముచే వేరుపరుపవలెను. అట్టివాని కమృతత్వము సిద్ధించును. ఇదియే వల్లియొక్క పిండితార్థము. యమునియుపదేశమువలన నచికేతసుడు పాపరహితుడయి మృత్యుదాడిని దప్పించుకొని యమృతత్వమును బొందెను. ఇచటవివరించినప్రకార మాత్మను దెలిసికొనిన యితరులు గూడ నమృతత్వమును బొందగలరు.

కఠోపనిషదర్థసంగ్రహము

సంపూర్ణము.

# కఠోపనిషత్తు

## ద్వితీయమయూఖము

కృష్ణయజుర్వేదీయ చరకశాఖాన్తర్గతమగు కఠశాఖా బ్రాహ్మణమునకు జెందియుండుటంజేసి యీయుపనిషత్తు కాఠకోపనిషత్తనియు కఠోపనిషత్తనియుం గూడబ్రసిద్ధికెక్కినది. సామాథర్వవేదములలోగూడ నీ యుపనిషత్తు వినబడుచున్నట్లు వాడుకగలదు. యమునిచే బ్రహ్మతత్త్వోపదేశము నొంది కృతార్థతం గాంచిన నచికేతసుని చరిత్రము విద్వాస్తుత్యర్థ మిచట నాఖ్యాయికా రూపమున బేర్కొనబడినది. ఈయాఖ్యాయిక తైత్తిరీయబ్రాహ్మణమునను మహాభారతము అనుశాసన పర్వము నూటయిరవయధ్యాయమునను గూడ నుదాహరింపబడినది. విషయవిమర్శనమునకు భావకల్పనాగాంభీర్యములకును ప్రసిద్ధికెక్కియుండుటచే నీయుపనిషత్తు ప్రాక్పాశ్చాత్యవిద్వాంసుల ప్రోగడ్త గాంచినవి. ఇందలి యనేక మన్త్రములు లారూపముననే భగవద్గీతయందు నుకరింపబడినవి. వానిలో కొన్ని బ్రహ్మసూత్రములలో షుమారిరువది యయిదుసూత్రములకు విషయవాక్యములుగ గ్రహింపబడినవి.

కాఠకోపనిషదాచిత్యము.

### శాన్తిపాఠము

మూ॥ సహ నావవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై తేజస్వినావధీతమస్తు మా విద్విషావహై ॥

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః

టీ॥ గురుశిష్యులగు మాయిద్దరిని బ్రహ్మము రక్షించు గాక! మేమిద్దరము వీర్యవంతులమై విద్యాఫలము ననుభవింతుముగాక! మేమభ్యసించు విద్య అర్థజ్ఞానయోగ్యమగుగాక! మేముభయులము తేజోవంతుల మగుదుముగాక! మేముభయుల మొకరినొకరము ద్వేషింపకుందుముగాక!

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

తా॥ వి॥ విద్యాభ్యాసకాలమునందు గురుశిష్యుల కన్యోన్య మనాదరణమువలనగాని న్యాయమునతిక్రమించిన చేతలవలనగాని కలుగగల ద్వేషము శాంతించుటకును నభ్యసింపబడబోవు శ్రేష్ఠతమమగు బ్రహ్మవిద్య యవిఘ్నముగ సాగుటకును నిర్గుణబ్రహ్మవిద్యాశాన్తిపాఠము శిష్యునిచే బఠింపబడుచున్నది. గురువు కృతకృత్యుఁడు గనుక నతనికీశాన్తిపాఠ మనవశ్యముగాదు. ఆచార్యుఁడారోగ్యవంతుడు ప్రసన్నుడు నయినపుడే శిష్యునికి విద్యాపరిపాకము, తత్రాపి ఆధ్యాత్మికవిద్యాపరిసమాప్తియు సంభవింపగలదు. కనుకనే గురువుయొక్క క్షేమమును గూడగోరి శిష్యునిచే నీ శాన్తిపాఠము పఠింపబడుచున్నది. ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములగు సంభావితానేకవిఘ్నముల ప్రశమనమును గోరి త్రివారమీశాన్తి చెప్పబడుచున్నది.

## ప్రథమాధ్యాయము

ప్రథమవల్లి:— ఉపనిషత్తనుపదమునకు గర్భజన్మజరామరణదుఃఖనిమిత్తమగు నవిద్యను నాశనము నొందించి

ప్రత్యక్స్వరూపాత్మలయెడ భేదబుద్ధినిదొలగించి బ్రహ్మసామీప్యమును జేర్చుజ్ఞానవిశేషమర్థము. ఈ జ్ఞానమువలన బ్రహ్మ విషయకమగు సశేషవిశేషస్వరూపబోధ కల్గుచుండుటంజేసి యుపనిషత్తునకు బ్రహ్మవిద్యయను నామ మన్వర్థమగుచున్నది.

ఉపనిషచ్ఛబ్దము బ్రహ్మవిద్యాపరము

స్వర్గలోకప్రాప్తినిమిత్తమగు నగ్నివిద్యగూడ సంసారశైథిల్యకారణమగుటచే నుపనిషచ్ఛబ్ద వాచ్యమయి యీ యుపనిషత్తునందు వివరింపబడినది. ఇట్టి జ్ఞానమునుపదేశించుగ్రంథముగూడ గౌణముగ నుపనిషత్తనునామమున బరగుచున్నది.

ఉపనిషత్ప్రారంభము

ఓం॥ ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ తస్య హ నచికేతా నామ పుత్ర ఆస 1. తగ్ంహ కుమారగ్ంసన్తం దక్షిణాసు నీయమానాసు శ్రద్ధావివేశ సోఽమన్యత 2. పీతోదకా జగ్ధతృణా దుగ్ధదోహా నిరిన్ద్రియాః అనన్దా నామ తే లోకాస్తాన్ స గచ్ఛతి తా దదత్ 3. స హోవాచ పితరం తత కస్మై మాం దాస్యసీతి ద్వితీయం తృతీయం తగ్ం హోవాచ మృత్యవే త్వా దదామీతి 4. బహూనామేమి ప్రథమో బహూనామేమి మధ్యమః కిగ్ం స్విద్యమస్య కర్తవ్యం యన్మయాద్య కరిష్యతి 5. అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్య తథాఽపరే సస్యమివ మర్త్యః పచ్యతే సస్యమివాజాయతే పునః ॥ 6

టీ॥ భూరియన్నదానముచే వాజశ్రవసుడను యన్వర్థనామమున బరంగు గౌతముడను నొక కర్మజ్యేష్ఠుడు సర్వస్వ

దానప్రియుక్తమగు విశ్వజిద్యాగము నొకదానిని బ్రారంభించెను. అతనికి నచికేతసుడను సుగుణశాలియగు కొమరు డొకడుండెను.

నచికేతసుని యమునికి దానమిచ్చుట.

యాగాన్తమున నీరుద్రావుటకును మేత మేయుటకును బాలిచ్చుటకును చూలుండుటకునుగూడ శక్తిలేని గోవులను ఋత్విక్కులకు దక్షిణలుగా నీయనుద్యుక్తుడయిన తండ్రికి గలుగనున్న నరకదుఃఖమునకు బ్రతీకారముగ దనను వారిలో నెవరికయిన దానమిమ్మని నచికేతసుడు తండ్రిని రెండుమూడుపర్యాయములు నిర్బంధముజేసెను. తండ్రి కుపితుడయి నిన్ను మృత్యుదేవతకు దానమిచ్చెదనని వాకొచ్చెను. కాని యట్టిక్రూరప్రతిజ్ఞకు బశ్చాత్తప్తుడయ్యెను. తండ్రిమాట కసత్యత్వ మాపాదింపగూడదని నిశ్చయించుకొని జననమరణములకు లోనై యత్యల్పమగు సస్యములను బోలు జీవలోకమునందాడిన మాటను దప్పరాదనియు పితృపితామహాగతమగు సత్యపరిపాలనము జేయవలయుననియు మొదలగు నయోక్తులచే దండ్రినొప్పించి నచికేతసుడు తనను యమునికి దానముచేయించుకొనెను.

మూ॥ వైశ్వానరః ప్రవిశత్యతిథిర్బ్రాహ్మణో గృహాన్ తస్యైతాగ్ం శాన్తిం కుర్వన్తి హర వైవస్వతోదకమ్ 7. ఆశాప్రతీక్షే సఙ్గతగ్ం సూనృతాం చేష్టాపూర్తే పుత్రపశూగ్ంశ్చ సర్వాన్ ఏతద్వృఙ్క్తే పురుషస్యాల్పమేధసో యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే 8. తిస్రో రాత్రీర్యదవాత్సీర్గృహే మేऽనశ్నన్ బ్రహ్మన్నతిథిర్నమస్యః నమస్తేऽస్తు బ్రహ్మన్ స్వస్తి మేऽస్తు తస్మాత్ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ 9.

టీ॥ యముడు బ్రాహ్మసందర్శమునకుం బోయినసమయ మున నచికేతసు డతనిగృహము జేరి యాతడు వచ్చుదనుక నిరశనవ్రతమున నచట త్రిరాత్రము నివసించెను. బ్రాహ్మతే జస్సుతో నొప్పుచు తనరాక కెదురుచూచుచున్న నచికేతసుని వృత్తాంతమును యముడు దెలిసికొని పాద్యాసనాదిదానముచే నతనిగౌరవించెను. మఱియు నతనికిట్లు చెప్పెను.

యమనచికేతస సమాగమము

"అతిథిగా నింటికి వచ్చిన బ్రాహ్మణుడు సాక్షాత్తు అగ్నిహోత్రుడగుచున్నాడు. అట్టి యతిథి నిరాహారుడయి యెవ్వనిగృహమున నివసించునో యట్టి నిర్భాగ్యుడగు యజమాని యిహపరలోకసుఖమునకును సర్వసంత్సంగఫలమునకును ఇష్టాపూర్తఫలమునకును పశుపుత్రాదులకును విదూరుడగును. ఓ బ్రాహ్మణోత్తమా! నీవు నిరాహారివై నాయింట త్రిరాత్రము నివసించితివి. నీవు నాకునమస్కారార్హుడవు. ఇదిగో నీకు నేను నమస్కరించుచున్నాను. నీవు శాన్తింపుము. నాకు స్వస్తియగుగాక! నీవు త్రిరాత్ర మనశనుడవై నాయింట నివసించితివిగావున నా మూడురాత్రులకు మూడువరములను గోరుము, ఇచ్చెదను గాక" యని సబహుమానముగ యముడు నచికేతసునకు విన్నవించెను. 7-9

మూ॥ శాన్తసంకల్పః సుమనా యథా స్యాద్వీతమన్యుర్గౌతమో మాభి మృత్యో త్వత్ప్రసృష్టం మాభివదేత్ప్రతీత ఏతత్త్రయాణాం ప్రథమం వరం వృణే 10. యథాపురస్తాద్భవితా ప్రతీత ఔద్దాలకిరారుణిర్మత్ప్రసృష్టః సుఖగ్ం రాత్రీః శయితా

వీతమన్యుస్త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ప్రముక్తమ్ 11. స్వర్గే లోకే న భయం కించనాస్తి న తత్ర త్వం న జరయా బిభేతి ఉభే తీర్త్వాऽశనాయాపిపాసే శోకాతిగో మోదతే స్వర్గలోకే 12. స త్వమగ్నిగ్ం స్వర్గమధ్యేషి మృత్యో ప్రబ్రూహి త్వం శ్రద్దధానాయ మహ్యమ్ స్వర్గలోకా అమృతత్వం భజన్త ఏతద్ద్వితీయేన వృణే వరేణ 13. ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ స్వర్గ్యమగ్నిం నచికేతః ప్రజానన్ అనన్తలోకాప్తిమథో ప్రతిష్ఠాం విద్ధి త్వమేతం నిహితం గుహాయామ్ 14. లోకాదిమగ్నిం తమువాచ తస్మై యా ఇష్టకా యావతీర్వా యథా వా స చాపి తత్ప్రత్యవదద్యథోక్తమథాస్య మృత్యుః పునరేవాహ తుష్టః 15. తమబ్రవీత్ప్రీయమాణో మహాత్మా వరం తవేహాద్య దదామి భూయః తవైవ నామ్నా భవితాయమగ్నిః సృఙ్కాం చేమామనేకరూపాం గృహాణ 16. త్రిణాచికేతస్త్రిభిరేత్య సన్ధిం త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా నిచాయ్యేమాగ్ం శాన్తిమత్యన్తమేతి 17. త్రిణాచికేతస్త్రయమేతద్విదిత్వా య ఏవం విద్వాగ్ంశ్చినుతే నాచికేతమ్ స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య శోకాతిగో మోదతే స్వర్గలోకే 18. ఏష తేऽగ్నిర్నచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ ఏతమగ్నిం తవైవ ప్రవక్ష్యన్తి జనాసస్తృతీయం వరం నచికేతో వృణీష్వ ॥ 19.

టీ॥ నచికేతసుడిందుకుసమ్మతించి 'నీ యాజ్ఞను గైకొని నేను స్వగృహాముజేరినపుడు నాతండ్రికి నాయందు గల యాగ్రహాము పోయి యతడు శాంతమనస్కుడయి

నన్ను గుర్తించుగాక' యని మొదటివరమును గోరెను. స్వర్గలోకమునందు రోగముగాని మృత్యుభయముగాని యాకలిదప్పులుగాని లేవు. అట్టి స్వర్గప్రాప్తిసాధనమగు నగ్నిచయనము నీకు బాగుగా దెలియును. దానిని

నచికేతసుని మొదటి రెండువరములు.

శ్రద్ధావంతుడనగు నాకు నుపదేశింపవలయునని రెండవవరమును గోరెను. యముడీరెండువరములను నచికేతసునికి వెంటనే ప్రసాదించెను. అగ్నిచయనవిజ్ఞానము నంతను యముడుపదేశించినతీరున నచికేతసుడు సంపూర్ణముగ గ్రహించి తాను దెలిసికొనినదానిని సునిశ్చితము జేసికొనుటకై యమునికి దిరిగి నొప్పగించెను. శిష్యునియొక్క బుద్ధిసూక్ష్మతకు సంతసించి యముడగ్నిచయన మికమీదట నాచికేతచయనమని యతనిపేరుతో బ్రసిద్ధిగాంచునట్లు మఱియొక వర మిచ్చెను. మఱియు చిత్రమయినట్టియు శబ్దమునిచ్చునట్టియు రత్నఖచితమయిన నొకమాలనతనికి యముడు బ్రసాదించెను. నాచికేతాగ్నిచయనమాచరించినవాడును దాని విజ్ఞాన మెఱింగి యామన్త్రముల నధ్యయనముజేసినవాడును త్రినాచికేతనిపించుకొనును. త్రినాచికేతుడు జన్మమృత్యువులను దాటి జ్ఞానకర్మానుష్ఠానముచే వైరాజపదవిని బొందును. ఆత్మరూపమున నీ త్రినాచికేతాగ్నిక్రతువుననుష్ఠించువారు శరీరపాతమునకుబూర్వమే యధర్మజ్ఞానరాగద్వేషాదిలక్షితమగు మృత్యుపాశముదాటి స్వర్గలోకమునందు విరాడాత్మస్వరూపమున నానందించెదరు. 10-19

అ॥ ఈ రెండువరము లనాత్మవిషయములు క్రియా కారకఫలాద్యారోపణాత్మకములు నగుటవలన స్వాభావికము సర్వసంసారబీజము నగునవిద్యను దొలగింపలేవు. అందువలన క్రియాకారకాదిభేదశూన్యము, ఆత్యన్తికనిఃశ్రేయఃఫలప్రదము అవిద్యానివారకము నగుబ్రహ్మాత్మైక్యవిజ్ఞానోపదేశమును నచికేతసుడు తృతీయవరముగ గోరెను.

మూ॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే౽స్తీత్యేకే నాయమస్తీతి చైకే ఏతద్విద్యామనుశిష్టస్త్వయాహం వరాణా మేష వరస్తృతీయః ॥ 20

టీ॥ మనుజుడు మరణశీలుడు. అతడు చనిపోగా నిట్టి విచారణ కలుగుచున్నది. దేహేన్ద్రియములకు భిన్నమగు నాత్మయనునది యొకటిగలదని కొందఱు, అట్టిది లేదని మఱి కొందరు చెప్పుచున్నారు. నీచే శాసింపబడినవాడనయి నే నీవిషయమును దెలిసికొనెదను. ఇదియే నేను గోరు మూడవ వరము. 20

తా॥ వి॥ నచికేతసుడు చిఱుతప్రాయంపువాడైనను పితృభక్తియు నాధ్యాత్మికచింతనాసక్తియు గలవాడు. కృతక

వరత్రయ తాత్పర్యము.

మగు కర్మచే నకృతకమగు నిఃశ్రేయఃప్రాప్తి కలుగనేరదను దృఢజ్ఞానము గలవాడు. పితృభక్తిగలిగినవాడగుటచే నతనిమేలు గోరి యతనికి ప్రశాన్తచిత్తము గల్గునట్లు ముందుకోరెను. కర్మనిష్ఠాగరిష్ఠుడగు తండ్రిచేసిన విశ్వజిద్యాగము మొదలగు

క్రితువులయొక్క నియతఫలకత్వము మోక్షమునుగూర్చి యద్దాని నైరర్థక్యమును జూపుటకు సర్వయాగోపలక్షకమగు నగ్నిచయనవిధానమును గూర్చిన రెండవవరమును గోరెను. ఆత్మజ్ఞానముచేతనే మోక్షోపలబ్ధి సంప్రాప్తించునను దృఢజ్ఞానమతనికి గలదు. ఆత్మస్వరూపమునుగూర్చి వివిధాభిప్రాయములు గలవు. ఆత్మయనునది లేదనువారు కొందఱు. శరీరేన్ద్రియమనోబుద్ధులకంటె నది భిన్నము గాదనువారు కొందఱు. అది కేవలనిర్గుణాత్మకమనువారు మఱికొందరు. ఆత్మతత్త్వము ప్రత్యక్షముచేతగాని యనుమానముచేతగాని నిర్ణయింప శక్యముగానిది. ఇట్టిజ్ఞానోపదేశము జేయుటకు యముడు దగినవాడు. ఆత్మజ్ఞానమున కత్యంతమవసరమగు చిత్తశుద్ధి నిష్కామకర్మాచరణఫలము గనుక కర్మఫలవిజ్ఞానమును రెండవవరముగాను జ్ఞానవిషయమును మూడవవరముగాను నచికేతసుడడిగెను. ఇట్లు విభిన్నఫలకములగు కర్మజ్ఞానవిషయములు రెండును క్రమముగా ద్వితీయతృతీయవరవిషయము లగుచున్నవి. 20

అ॥ పరమరహస్యము సూక్ష్మతమము దుర్విజ్ఞేయము నగు నాత్మతత్త్వమునుపదేశించుటకు బ్రతివాడు నర్హుడుగాడు.

ఆత్మజ్ఞానోపదేశమునకు నచికేతసుని యర్హతే.

సంపూర్ణమగు సర్వైషణాపరిత్యజనము వైరాగ్యపూర్వకమగు సర్వకర్మసన్న్యాసము గలవాడుగాని బ్రహ్మజ్ఞానమున కర్హుడుగాడు. నచికేతసుని యర్హతను నిశ్చయింపకయే, మున్ముందతని కాత్మోపదేశమును జేయుట

కిష్టములేక యతని యోగ్యతను బరీక్షించుటకై యముడనేక విధముల నిహలోకసంబంధములగు వరముల నిచ్చెదనని యతనిని బ్రలోభింపజేయ బ్రయత్నించెను.

మూ॥ దేవైరత్రాపి విచికిత్సితం పురా న హి సువిజ్ఞేయ మణురేషధర్మః అన్యం వరం నచికేతో వృణీష్వ మా మోపరో త్సీరతి మా సృజైనమ్ ॥ 21

టీ॥ "ఈ విషయమునుగూర్చి దేవతలకుగూడ సంశయము గలదు. ఆత్మధర్మము బహుసూక్ష్మవిషయము. ప్రాకృతజనమునకు సువిజ్ఞేయము గాదు. అసందిగ్ధఫలము నిచ్చు మరియొక వరమును నీవు గోరుము. ఈవరమునుగూర్చి నిరోధింపక నన్ను వదలిపెట్టుము". 21

అ॥ అని యముడు చెప్పినదానికి నచికేతసుడు ప్రత్యుత్తరము జెప్పుచున్నాడు.

మూ॥ దేవైరత్రాపి విచికిత్సితం కిల త్వం చ మృత్యో యన్నసువిజ్ఞేయమాత్థ వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్ ॥ 22

టీ॥ ఆత్మధర్మమును గూర్చి దేవతలకుగూడ సంశయము గలదనియు నది సువిజ్ఞేయముగాదనియు మీరే చెప్పుచున్నారు. పండితులకుగూడ జెప్పుట కలవిగాని యీ సూక్ష్మవిషయము నుపదేశించుటకు దగినవాడు నీకంటె నన్యుడెంత వెదకినను జిక్కడు. నిఃశ్రేయసప్రాప్తిహేతువగునది యీ వరము. ఇతరవరములన్నియు ననిత్యఫలము నిచ్చునవి. కనుక మఱియేవరము దీనితో సమానముగానేరదు. 22.

అ॥ ఇట్లు ప్రతివచనము జెప్పిన నచికేతసుని బ్రిలోభింపజేయుటకై యముడిట్లు పలికెను.

మూ॥ శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తిహిరణ్యమశ్వాన్ భూమేర్మహదాయతనం వృణీష్వ స్వయం చ జీవ శరదో యావదిచ్ఛసి 23. ఏతత్తుల్యం యది మన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాం చ మహాభూమౌ నచికేతస్త్వమేధి కామానాం త్వా కామభాజం కరోమి 24. యే యే కామా దుర్లభా మర్త్యలోకే సర్వాన్ కామాంశ్ఛందతః ప్రార్థయస్వ ఇమా రామాః సరథాః సతూర్యా న హీదృశా లంభనీయా మనుష్యైః ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ నచికేతో మరణం మానుప్రాక్షీః ॥ 25.

టీ॥ శతవత్సరజీవులగు పుత్రులను పౌత్రులను, గవాది పశుబాహుల్యమును, గజములను అశ్వములను ధనమును, విస్తీర్ణమగు భూమండలసామ్రాజ్యమును వీని ననుభవించుటకు నీకు స్వయముగా శతాయుష్యమును గోరుము. (23). కావలసినయెడల వీనితో సమానమగు మఱియొకవరమును దేనినయినను గోరుము, హిరణ్యరత్నాదిపరిభూతధనము, చిరాయుస్సును గోరుము. మహాభూమండలమునకు నీవే రాజువు కమ్ము! మానుషములు దివ్యములునగు నే యే కోరికలు గలవో వాని నన్నిటిని నీవనుభవించునట్లు నేను జేసెదను. నేను సత్యసంకల్పుడను. (24) దుర్లభములు కోరదగినవి యగు కోర్కెలనన్నిటిని నీయిచ్ఛానుసారముగ గోరుము. రథతూర్యనినాదములతోగూడిన యప్సరస్త్రీలు మనుష్యు

లకు దుర్లభలు. నేననుగ్రహించు నిట్టియప్సరః స్త్రీల యుప చారమునొందుము. మరణసంబంధమగు ప్రశ్నను మాత్రి మఱుగకుము. 25

అ॥ ఇట్లు ప్రలోభింపబడియు నచికేతసుడు మహా హ్రదమువలె త్రొణకనివాడయి యిట్లు వాక్రుచ్చెను.

మూ॥ శ్వోభావా మర్త్యస్య యదన్తకైతత్సర్వేన్ద్రి యాణాం జరయన్తి తేజః అపి సర్వం జీవితమల్పమేవ తవైవ వాహాస్తవ నృత్యగీతే 26. న విత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యామహే విత్తమద్రాక్ష్మ చేత్త్వా జీవిష్యామో యావదీశిష్యసి త్వం వరస్తు మే వరణీయః స ఏవ 27. అజీర్యతామమృతా నాముపేత్య జీర్యన్మర్త్యః క్వధఃస్థః ప్రజానన్ అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదానతిదీర్ఘే జీవితే కో రమేత 28. యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో యత్సాంపరాయే మహతి బ్రూహి నస్తత్ యోఽయం వరో గూఢమనుప్రవిష్టో నాన్యం తస్మాన్నచికేతా వృణీతే ॥ 29.

టీ॥ మీరు చెప్పిన భోగములన్నియు రేపుండునవి గావు. అప్సరఃస్త్రీభోగాదులన్నియు ధర్మవీర్యప్రజ్ఞా తేజో యశస్సులను నశింపజేయును. నీ వెంతదీర్ఘాయుష్యము నొసంగి నను అది యల్పమే యగుచున్నది. ఇవి యన్నియు నీకే యుండుగాక 26. ఎంతధనమునిచ్చినను మనుష్యుడు తృప్తి నొందనేరడు. విత్తమునందు నాకు గోర్కెగల్గినను. నీదర్శన ముచే నది నాకులభింపగలదు. నీదర్శనము లభించినతరువాత మమజా డల్పాయుర్ధనములు గలవాడు గానేరడు. ఆత్మవిజ్ఞా

నముదక్క నేను గోరదగినవర మేమియు లేదు. 27. మృత్యు రహితుడవగు నీ సాన్నిధ్యమును జేరి యుత్కృష్టతమమగు ప్రయోజనమును బొందజాలక పృథివ్యాద్యధోలోకముల పాలయి పుత్రవిత్తాద్యస్థిరముల నెవడు గోరును? వర్ణ రతి ప్రమోదములగు నీభోగము లనిత్యములని దెలిసికొనిన య్యే వివేకి దీర్ఘమగు నీజీవితమునందు రమించును కనుక పుత్రవిత్తా ద్యాశలచే నేను బ్రలోభింప జేయబడుట కర్హుడనుగాను. 28. కనుక అనిత్యములగు నీకామములచే నన్ను బ్రలోభింప జేయుటమాని గొప్పప్రయోజనముగల పరలోకవిషయక మగు నాత్మను నిర్ణయించు విజ్ఞానమేది గలదో దానిని నాకు దెలియజెప్పుము. ఆత్మవిషయము గూఢము దుర్విజ్ఞేయము. అవివేకులచే గోరబ డనిత్యవిషయముల నీనచికేతసుడు మన స్సులోనయినను దలంపడు." నచికేతసు డిట్లు గంభీరములు నయవినయోపేతములు నగు ప్రతివచనములచే దనదృఢనిశ్చ యమును యమునికి వెల్లడించెను. 29

ప్రథమాధ్యాయము ప్రథమవల్లి
సమాప్తము.

ప్రథమాధ్యాయము - ద్వితీయవల్లి

అ॥ నచికేతసుడాత్మజ్ఞానమునకర్హుడని యముడు నిశ్చ యించి యద్దాని నిట్లుపదేశింపదొడంగెను.

మూ॥ అన్య చ్ఛ్రేయో౽న్యదుతైవ ప్రేయస్తే ఉభే నానార్థే పురుషగ్ం సినీతః తయోః శ్రేయ ఆదదానస్య సాధు భవతి హీయతే౽ర్థాద్య ఉ ప్రేయోవృణీతే॥

టీ॥ శ్రేయస్సు వేరు ప్రేయస్సు వేరు. వీని ప్రయోజనములు వేరు. ఇవి రెండును పురుషుని బంధించుచున్నవి. శ్రేయోమార్గము నవలంబించువానికి శుభము గల్గును. ప్రేయోమార్గము నాశ్రయించువాడు పరమ పురుషార్థము నుంచి విదూరుడగును. 1

తా. వి. శ్రేయస్సన నిఃశ్రేయస్సు లేక పరమపురుషార్థము. పరమపురుషార్థముకంటె శ్రేయస్తరమగునది మఱియొకటి లేదుగనుక నది యంత్యంతమగుశ్రేయస్సగుచున్నది. ప్రియమగునది ప్రేయస్సు. ఈ రెండును విభిన్నములు; నిఃశ్రేయస్సు జ్ఞానఫలము, ప్రేయస్సు లేక అభ్యుదయము కర్మానుష్ఠాన ఫలము. విరుద్ధములగు ప్రయోజనములతోను సాధనములతోను గూడుకొనిన నిఃశ్రేయోభ్యుదయము లొక్కమారుగ నేరికి నాలంబనీయములు గానేరవు. అభ్యుదయాభిలాషియగు నజ్ఞానికి నిఃశ్రేయఃస్వరూపమగు బరమపురుషార్థము లభింపనేరదు. వివేకియగువాడవిద్యారూపమగు ప్రేయస్సును వదలి శ్రేయోమార్గమునే యవలంబించును. మందబుద్ధులీసూక్ష్మము నారయలేక శరీరాద్యుపచయరక్షణార్థమై పశుపుత్రాదిరూపమగు ప్రేయస్సు నభిలషించుచున్నారు. 1

శ్రేయః ప్రేయో మార్గములు

అ॥ నిఃశ్రేయఃప్రేయోమార్గములు రెండును పురుషాధీనములగుచుండగా శ్రేయోమార్గముననే లోకప్రవృత్తి విస్తారముగా గలుగుటకు గారణము చూపబడుచున్నది.

మూ॥ శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతస్తౌ సంపరీత్య వివినక్తి ధీరః శ్రేయో హి ధీరోభిప్రేయసో వృణీతే ప్రేయో మన్దో యోగక్షేమాత్ వృణీతే॥ 2

టీ॥ నిఃశ్రేయసః ప్రేయోమార్గములు రెండును పురుషాధీనములే యగుచున్నను బుద్ధిమంతుడు వానిని లెస్సగా గ్రహించి ప్రత్యేకింపగలడు. అతడు ప్రేయస్సుకంటె శ్రేయస్సు శ్రేష్ఠతరమగుటచే వాంఛనీయమని గ్రహించి హంస నీటినుంచి పాలను విడదీసి గ్రహించినట్లు ప్రేయస్సునుంచి శ్రేయస్సును విడదీసి గ్రహించును. మందబుద్ధియగు వాడు సదసద్వివేకసామర్థ్యము లేనివాడగుటంజేసి శరీరాద్యుపచయరక్షణనిమిత్తములగు యోగక్షేమములకు గారణమగు ప్రేయస్సు నాశ్రయించుచున్నాడు. లేనిదానిని సంపాదించుకొనుట యోగము. సంపాదించినదానిని సంరక్షించుకొనుట క్షేమము. 2

అ॥ ఇట్టి సదసద్వివేకమునకు నచికేతసుడేయుదాహరణముగా నీయఁబడుచున్నాడు.

మూ॥ స త్వం ప్రియాన్ ప్రియరూపాంగ్శ్చ కామానభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః నైతాం సృఙ్కాం విత్తమయీమవాప్తో యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః॥ 3

టీ॥ ఓ నచికేతస! నీవన్నన్నో ప్రియములగు పుత్రాదులు ప్రియరూపలగు నప్సరఆదుల నొసంగి ప్రలోభింపజేసినను బుద్ధిమంతుడవగుటచే వాని యనిత్యత్వాసారత్వాది దోషములను విచారించి వానిని బరిత్యజించితివి. నేనిచ్చిన

ప్రభూతవిత్తహేతువగు సృంకమును గూడ కుత్సితమని త్రోసి పుచ్చితివి. మూఢజను లనేకులద్దాని గోరుదురు ? 3

మూ॥ దూరమేతే విపరీతే విషూచీ అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా విద్యాభీప్సినం నచికేతసం మన్యే స త్వా కామా బహవో౽లోలుపన్త॥ 4

టీ॥ శ్రేయఃప్రేయస్సులను నీ రెండుమార్గములకును గడుదూరము. ఒకటి వివేకముచే లభించును. మరియొకటి యవివేకముచే సంభవించును. విరుద్ధము లగుటచే నవి యొక దాని నొకటి త్రోసిపుచ్చును. తమఃప్రకాశమునలె నీరెండు నొకచోట నుండశక్యముగాదు. ఒకటి మోక్షకారణము ; రెండవది సంసారహేతువు. ప్రేయోమార్గ మవిద్యాకల్పిత మనియు శ్రేయోమార్గము విద్యావిషయమనియు బండితులు దెలిసికొనుచున్నారు. నీవు విద్యనభీప్సించుచున్నావు. అవిద్వాంసులను బ్రలోభింపజేయు నప్సరఃప్రభృతులగు ననేక కామము లాత్మోపభోగాభివాంఛాసంపాదకమగు శ్రేయో మార్గమునుంచి నిన్ను మరలింపఁజేయలేకపోయినవి. కనుక నీవు జ్ఞానమునే యభిలషించుచున్నావని నేను దలంచు చున్నాను. 4

అ॥ అవిద్యానిమగ్నులగు మందబుద్ధుల ప్రవృత్తి వర్ణింపబడుచున్నది.

మూ॥ అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయంధీరాః పండితంమన్యమానాః దన్ద్రమ్యమాణాః పరియన్తి మూఢా అన్ధే నైవ నీయమానా యథాన్ధాః ॥ 5

టీ॥ సంసారపతితులగువా రవిద్యయను దట్టమగు నంధకారమున జిక్కుకొని పుత్రపశ్వాదితృష్ణా పాశశతముచే బద్ధులగుచున్నారు. మేము పండితులము శాస్త్రకుశలులమను నహోహాన బడుచున్నారు. కుటిలము నానారూపమునగు సంసారగతిని జెంది జరామరణరోగాదిదుఃఖముల ననుభవించుచున్నారు. వీరి వృత్త మొక గ్రుడ్డివాడు మఱియొక గ్రుడ్డివానికి దోవ జూపినట్లున్నది. 5

అ॥ ఇట్టివారలకు మోక్షమలభ్యమని చెప్పబడుచున్నది.

మూ॥ స సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యన్తం విత్తమోహేన మూఢమ్ అయం లోకో నాస్తి పరఇతి మానీ పునఃపునర్వశమాపద్యతే మే ॥ 6

టీ॥ పుత్రపశ్వాదిప్రయోజనములయందాసక్తుడయి యజ్ఞానముచే నావరింపబడి ప్రమాదమును జెందిన యవివేకి పరలోకప్రాప్తి కారణమగు శాస్త్రీయసాధనమును బొందలేడు. కాంతాకనకాన్నపానాది సంపన్నముగ గాన్పించుచున్న యిదియే లోకము, పరలోకమనునది లేదని తలంచువాడు పలుమఱు పుట్టుచు గిట్టుచు మృత్యుదేవతనగు నాయధీనము నొందును. సామాన్యజనులందరు నట్టివారే యగుచున్నారు. 6

అ॥ శ్రేయస్సును గోరువారత్యంత మరుదుగానుందురని చెప్పుచున్నాడు.

మూ॥ శ్రవణాయాపి బహుభిర్యో న లభ్యః శృణ్వన్తోఽపి బహవో యం న విద్యుః ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధాఽఽశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః ॥ 7

టీ॥ ఆత్మతత్త్వశ్రవణమును జేయుట బహుజనమునకు లభ్యముగాదు. శ్రవణమును జేసినవారనేకు లసంస్కృతాత్మ లగుటచే నాత్మతత్త్వమును గ్రహింపలేరు. ఇట్టి యాత్మతత్త్వము నుపదేశముచేయగలవాడు చిక్కుటయు నాశ్చర్యము. దానిని గ్రహించువాడు లభించుటయు నాశ్చర్యమే. కుశలుడగు గురువుచే నుపదిష్టుడయి యాత్మను గ్రహింపగలవాడు చాల యరుదగుచున్నాడు. 7

అ॥ ఇట్టి యాశ్చర్యమున కేమికారణము? సమాధానము చెప్పబడుచున్నది.

మూ॥ న నరేణావరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో బహుధా చిన్త్యమానః అనన్యప్రోక్తే గతిరత్ర నాస్తి అణీయాన్ హ్యతర్క్యమణుప్రమాణాత్ ॥ 8

టీ॥ ప్రాకృతబుద్ధులగువారీయాత్మతత్త్వము నుపదేశింపజాలరు, ఆత్మస్వరూపమునుగూర్చి యనేకవిధముల నాలోచించువారలకతడు సువిజ్ఞేయుడు గాజాలడు. అద్వైతదర్శియగు నాచార్యునిచే నుపదేశింబడు నీయాత్మతత్త్వ విషయమున నానాత్వధర్మము సంభవము గాదు. అణుపరిమాణాదులవలన ఆత్మ బుద్ధియూహాకందరాదు.

తా॥ వి॥ ద్వైతు లాత్మవిషయమయి విభిన్నమతముల నుపపాదించుచున్నారు. ఆత్మయనువాడున్నాడని కొందఱు, లేడని కొందఱు, కర్తయని యొకరు, అకర్తయని యింకొకరు శుద్ధుడనియొకరు, అశుద్ధుడని తదితరులు, ఇట్లు విభిన్న మతములుండుటచే ద్వైతమతావలంబుల కాలంబనీయమగు మార్గము సునిశ్చితము కాదు. జీవబ్రహ్మైక్యము నుపపాదించు నద్వైతమున దెలిసికొనదగిన విషయమొక్కటియే. అద్వితీయాత్మసాక్షాత్కారమును గాంచిన బ్రహ్మాత్మాద్వైతకుశలుడు మాత్రమీ పరమరహస్యము నితరులకుపదేశింపనర్హుడు, ఆత్మ వికల్పరహితమగు నఖండరసఘనస్వరూపము. కనుక నతడు అస్తి నాస్తి కర్త అకర్త మొదలగు వికల్పముల కాస్పదుడు గాడు. అతడు జ్ఞేయవస్తువు కాడుగనుక నతనిని గూర్చి జ్ఞాతృజ్ఞానజ్ఞేయ భేదము లేదు. ఇదియే ఆత్మజ్ఞానము యొక్క పరాకాష్ఠ. బ్రహ్మభూతుడగు నాచార్యునిచేత నీయాత్మతత్త్వముపదేశింపబడినపుడది సుగ్రాహ్యమగుచున్నది. ఈతీరున నాత్మను దెలిసికొనినవా డగతికుడుగాడు. ఉపదేశికుడే బ్రహ్మము, శ్రోతయే బ్రహ్మమని తెలియజెప్పు జ్ఞానమెప్పుడు నసందిగ్ధము అవిపర్యయముగూడ నగుచున్నది. అపుడు మరియొకపదార్థమేదియు బుద్ధికి పొడగట్టనేరదు. ఈ విధమగు జ్ఞానము సర్వసంసారనివారకమగుటచే జన్మరాహిత్యము నిశ్చితమగుచున్నది. శ్రుతిసమ్మతముగాని కేవలతర్కమునకీ పరమరహస్య మందరాదు. తర్కము తార్కికుని

ద్వైతమని శ్చితము

బుద్ధిసూక్ష్మతనుబట్టి మారుచుండును. వాదమున కెన్నడు నిల కడలేదు. వాదిదౌర్బల్యముండును గాని వాదదౌర్బల్యముండ నేరదు. ఒకడాత్మ యణుపరిమాణమనియు, నింకొకడణుతర పరిమాణమనియు మరియొకడణుతమపరిమాణమనియు ననేక విధముల వాదించుచున్నారు. ఇదియంతయు బుద్ధ్యుత్ప్రేక్షా మాత్రము అనవస్థకాస్పదము నగుచున్నది.

అ॥ కనుక నాత్మజ్ఞానము తర్కముచే లభ్యముగాదని చూపబడుచున్నది.

మూ॥ నైషా తర్కేణ మతిరాపనేయా ప్రోక్తాన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ యాం త్వమాపః సత్యధృతిర్బతాసి త్వాదృఙ్నో భూయాన్నచికేతః ప్రష్టా ॥ 9

ఆత్మజ్ఞాన మాగమైకప్రతిపాద్యము. తనయూహచే బొందదగినది కాదు. పొందతగినదిగూడ గాదు. తార్కికు డాగమము దెలిసినవాడు గాడు. బుద్ధిసూక్ష్మతచే నేదియో కల్పించును. ఆగమజ్ఞేయమగు నాత్మజ్ఞాన మాగమాభిజ్ఞుడగు నాచార్యునిచే నుపదేశింపబడినపుడే పరినిష్ఠితమగుజ్ఞానమగు చున్నది. నావరప్రసాదముచే నట్టిజ్ఞానమును నీవు బొందు చున్నావు గనుక నీవు సత్యమతి వగుచున్నావు. నీవంటి పృచ్ఛకుడు మఱియొకడు నాకు లభింపడు. 9

అ॥ అందువలన నచికేతసుడు తనకంటెను శ్రేష్ఠతరు డని నాల్గుమంత్రములచే స్తోత్రమును జేయుచున్నాడు.

మూ॥ జానామ్యహం శేవధిరనిత్యం న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్ తతో మయా నాచికేతశ్చితోఽగ్ని రనిత్యైర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్ ॥ 10

టీ॥ కర్మఫలరాశి యనిత్యము; అనిత్యములగు ద్రవ్యములవలన పొందదగినది. నిత్యమగు నాపరమార్థము అనిత్యములగు ద్రవ్యములచే లభ్యముగాదు. ఈవిషయము దెలిసినవాడనయినను పశ్వాద్యనిత్యసాధనములగు ద్రవ్యములచే స్వర్గసుఖకారణమగు నాచికేతాగ్ని యనుదినము నాచే ననుష్ఠింపబడుచున్నది. అందువలన నీయధికారస్థానమును బొందియాపేక్షికనిత్యమగు స్వర్గమును పొందితిని గాని నిరపేక్షము నిత్యమునగు నాత్మస్థానమును బొందలేక పోతిని. 10

మూ॥ కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం క్రతోరానన్త్యమభయస్య పారమ్ స్తోమమహదురుగాయం ప్రతిష్ఠాం దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః ॥ 11

టీ॥ కామములన్నియు నాత్మయందే పరిసమాప్తి జెందుటను, అది సమస్తజగత్తున కాశ్రియమగుటను, ఉపాసనాఫలమగు హిరణ్యగర్భపదమనన్త్యమగుటను, అభయమే సర్వోత్కృష్టమగు నిష్ఠయగుటను స్తోత్రపాత్రమగుటను అణిమాద్యైశ్వర్యములు మున్నగు ననేకగుణములు గల్గియుండుటను విస్తీర్ణగతిగలిగియుండుటను గమనించి యట్టి యాత్మప్రతిష్ఠనుగోరి ధైర్యముతో నీవు సర్వసంసారభోగజాతమును సంపూర్ణముగ బరిత్యజించితివి. నీవెంతయు నుత్తమ గుణోపేతుడవు. 11

అ॥ నచికేతసు డే యాత్మను దెలిసికొనగోరెనో యట్టి శ్రేయోరూపమగు నాత్మదర్శనముయొక్క ఫలము వర్ణింపబడుచున్నది.

మూ॥ తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్ అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్ష శోకౌ జహాతి ॥ 12

టీ॥ ఆత్మదర్శనము కష్టసాధ్యము; ఆత్మ నిగూఢము; ప్రాకృతవిషయవికారవిజ్ఞానములచేఁ బుద్ధిగుహయందు గప్పఁబడియున్నది; అనేకానర్థసంకులమగు విషమస్థానమునందున్నది; అది పురాతనము. మనస్సును విషయములనుండి మరల్చి దానియందు సమాధానముచేయుటచే నయ్యది లభించును. ధీరుడగువా డిట్టియాత్మను దెలిసికొని హర్షశోకములను వదలును.

తా॥ వి॥ జ్ఞానిచే నపరోక్షముగ దెలియదగిన యాత్మ అతిసూక్ష్మమగుటచే దుర్దర్శము; బుద్ధిగుహయందున్నను నిగూఢము; అనేకానర్థసంకటమగు నీ శరీరమే యతని యుపలబ్ధిస్థానమగుటచే దుర్గమస్థానమునందున్నటులను ప్రవేశయోగ్యము కానటులను కాన్పించుచున్నాడు. ప్రాకృతమగు విషయవిజ్ఞానజాలముచే నుపహితమగుటంజేసి యతడు దుర్విజ్ఞేయుడగుచున్నాడు. ధీరుడగువాడు మనస్సును విషయములనుంచి మరల్చి యాత్మయందు ప్రవేశపెట్టి హర్షశోకములకు దూరుడగుచున్నాడు. 12

అ॥ సర్వవిషయవ్యావృత్తిచే మనస్సు నాత్మయందు బరివేశపెట్టగలవానికి మోక్షద్వారము తెఱచియేయుండునని చెప్పుచున్నాడు.

మూ॥ ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః ప్రవృహ్య ధర్మ్యమణు మేతమాప్య స మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా వివృతగ్ం సద్మ నచికేతసం మన్యే ॥ 13

టీ॥ నేనుపదేశింపబోవు నాత్మతత్త్వమును శ్రవణముజేసి యద్దాని నాత్మభావముచే బరిగ్రహించి (నద్దాని) శరీరాదులనుండి దానిని (ధర్మాధర్మములనుంచి) వేరుచేసి (శరీరాదులకంటె) సూక్ష్మమగు నాత్మను బొందిన మర్త్యుడు జ్ఞానియై మోదమును జెందును. ఆత్మోపలబ్ధియెల్లపుడును మోదనీయమేగదా! అట్టి జ్ఞానమునుబొందిన నచికేతసునికి బ్రహ్మభవనద్వారము తెరువబడియున్నదని నేనుతలంచుచున్నాను. 13

ఆ॥ జిజ్ఞాసువుయొక్క బుద్ధిని యాత్మయందు సుముఖముగజేసి సంలగ్నముజేయుటకై యాత్మయొక్క దుర్విజ్ఞేయత్వము, దౌర్లభ్యము, యోగ్యులగు గురుశిష్యులయొక్క వైరళ్యము బ్రదర్శింపబడినది. ఇక విషయసౌముఖ్యసంపన్నుడగు శ్రోతనుగూర్చి యాత్మతత్త్వోపదేశము చేయవలసియున్నది. సర్వవిధముల నుపదేశార్హుడు సముఖుడునగు నచికేతసుని ప్రార్థనారూపమున నాయుపదేశము ప్రవేశపెట్టబడుచున్నది.

మూ॥ అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్ కృతాకృతాత్ అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్ పశ్యసి తద్వద॥ 13

టీ॥ నేను నీయుపదేశమునకర్హుడనని తలంచి నాయెడల నీవు ప్రసన్నుడవయినచో, శాస్త్రీయమగు ధర్మానుష్ఠానము దానిఫలము దానిసాధనముల కంటెభిన్నము, శాస్త్రవిహిత ధర్మము ననుష్ఠింపకపోవుటచే కలుగుపాపముకంటె భిన్నము, కార్యకారణములకంటె భిన్నము, కాలత్రయాబాధితము, వ్యవహారగోచరముకానిది యేది కలదో దానిని నీవెఱుంగుదువుగావున నద్దాని నాకుజెప్పవలయునని నచికేతసుడు యముని బ్రార్థించెను.

తా॥ వి॥ మానుషప్రవృత్తివిషయమంతయు శ్రేయః ప్రేయస్సులను రెండుతెరంగు లగుచున్నదనియు ప్రేయస్సంతయు ననిత్యము, శ్రేయస్సు నిత్యముగనుక ధీరుడు దానినే గోరుననియు, నచికేతసు డట్టిధీరుడనియు వివరింపబడినది. ఈమంత్రమున నతడు నిరూపించిన విశేషణములన్నియును ప్రేయోలక్షణములు. కృతకము అనిత్యమునగు ప్రేయస్సుకంటె నన్యమగు శ్రేయస్సును దెలిసికొనుటయే తనదృఢనిశ్చయమని యమునికి మరొకపర్యాయ మెఱుంగ జెప్పి నిత్యమగు శ్రేయస్సునే తనకుపదేశింపుమని నచికేతసుడు యముని తిరిగిప్రార్థించెను. 14

అ॥ ఇట్లుప్రార్థితుడయి యముడు ధీమంతులచే నాశింపబడిన సర్వోత్కృష్టమగు శ్రేయఃస్వరూపమును సంగ్రహముగ నుపదేశించుచున్నాడు.

మూ॥ సర్వే వేదా యత్పదమామనంతి తపాగ్ంసి సర్వాణి చ యద్వదన్తి యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదగ్ం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్ ॥ 15

టీ॥ వేదాన్తములన్నియు నే పరమార్థము పొందతగిన దని యైకకంఠ్యముగ నుద్ఘోషించుచున్నవో, దేనిని పొందుట కశేషములగు తపస్సు లాచరింపబడుచున్నవో, దేనినిగోరి నైష్ఠికబ్రహ్మచర్యాదిబ్రహ్మావాప్తిమార్గములు ముముక్షువు లచే నాశ్రయింపబడుచున్నవో, దేనిని దెలిసికొనుటకు నీవు ఉత్కటేచ్ఛాపూరితుడవగుచున్నావో యట్టి పరమార్థ వస్తువు 'ఓం' అను శబ్దముచే జెప్పఁబడునదియు, 'ఓం' అను నదియే ప్రతీకముగాఁ గలదియు నగుచున్నదని నీకు సంగ్రహ ముగఁ జెప్పుచున్నాను. 15

అ॥ ఓంకారము పరాపరబ్రహ్మములరెంటికిని ప్రతీక మగుటచే యవి రెండు నద్దానియుపాసనముచే లభ్యములగు చున్నవని చెప్పబడుచున్నది.

మూ॥ ఏతద్ధ్యేవాక్షరంబ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా యో యదిచ్ఛతి తస్య తత్ ॥ 16

టీ॥ ఓంకారమను నీయక్షరము అపరబ్రహ్మమునకును పరబ్రహ్మమునకును ప్రతీకయగుచున్నది. ప్రణవము నీ ప్రకారము తెలిసికొని యుపాసించు నుపాసకుడు తన యిచ్ఛానుసార మద్దాని నేరూపమున నుపాసించునో వాని కయ్యది యగ్లెసిద్ధించును.

తా॥ వి॥ ఇచట పరశబ్దముచేత నిష్క్రియము నిష్కలము నిరవద్యము సన్మాత్రబోధితము నగు నిర్గుణబ్రహ్మము అపరశబ్దముచే హిరణ్యగర్భాత్మకమగు సగుణబ్రహ్మము చెప్పఁబడుచున్నవి. వేదాంతశాస్త్రమునందు పరబ్రహ్మశబ్దము నిర్గుణబ్రహ్మపరముగ వాడబడుచున్నది. నిర్గుణబ్రహ్మ మపరోక్షముగ జ్ఞేయము. సగుణబ్రహ్మ ముపాసనాప్రాప్యము. నిర్గుణబ్రహ్మజ్ఞానమునకును సగుణమగు హిరణ్యగర్భప్రాప్తికిని గూడ నోంకారమే సాధనమగుచున్నది. ఓంకారము శబ్దస్వరూపము. కనుక నది శుద్ధసత్త్వప్రధానమగు మాయచే పరిచ్ఛిన్నమగుచున్నది. ఏశబ్దము నుచ్చరింపునపు డేది బుద్ధికిగోచరమగునో అది యాశబ్దముచే జెప్పబడుచున్నది. సమాహితచిత్తముతో నోంకారము నుచ్చరించినపుడు సర్వసాక్షియగు నిర్గుణబ్రహ్మము బుద్ధికి స్ఫురించుచున్నది. అందువలన నిర్గుణబ్రహ్మమోంకారముచే బోధింపబడుచున్నదని చెప్పబడినది. సమాహితచిత్తమున కలవడని మందాధికారి యోంకారముఖమున హిరణ్యగర్భు నుపాసించి నాతనిఁ బొందుచున్నాడు. అనఁగా ప్రణవోపాసనముచే నిర్గుణబ్రహ్మసాక్షాత్కారము జేసికొనఁ గోరినవాడు బ్రహ్మాత్మభావమును బొందును; సగుణబ్రహ్మను దెలిసికొనఁ గోరినవాడు హిరణ్యగర్భలోకమున కరుగునని భావము. 16

ఓంకారము పరాపర బ్రహ్మప్రతీకము

అ॥ ఉభయబ్రహ్మములకు నోంకారము ప్రశస్తమగు నాలంబనమని స్తుతింపబడుచున్నది.

మూ॥ ఏతదాలమ్బనగ్ం శ్రేష్ఠమేతదాలమ్బనం పరమ్
ఏతదాలమ్బనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే ॥ 17

టీ॥ బ్రహ్మప్రాప్త్యాలంబనములలో నోంకారము ప్రశస్తతమము. పరాపరబ్రహ్మలరెంటికి నదియే యాలంబనమగుచున్నది. ఇట్టియాలంబనమును దెలిసికొనినవాడు బ్రహ్మభూతుడయి బ్రహ్మమువలెనే యుపాస్యుడగుచున్నాడు.

మూ॥ న జాయతే మ్రియతే వా విపశ్చిన్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్ అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥ 18

టీ॥ ఆత్మ పుట్టదు చావదు; అది లోపింపని చైతన్యస్వరూపము. మరియొకకారణమువలన నది కలుగదు. దానివలన మఱియొకటేదియు కలుగదు. ఆత్మ పుట్టుకలేనిది నిత్యమయినది శాశ్వతమయినది పురాణమయినది. శరీరము నశించుచుండగా నది నశింపనేరదు.

తా॥ వి॥ ఆత్మ ధర్మాధర్మతత్ఫలములకంటె విలక్షణమగుటంజేసి దానికి నుత్పత్తివినాశములు లేవు. ధర్మాధర్మములు క్రియారూపములు గనుక నవి యుత్పన్నములగుచున్నవి. వానిఫలములుగూడ నుత్పన్నములేయగుచున్నవి. ఫలదానానంతరము ధర్మాధర్మములు, అనుభవానంతరము ఫలములు నశించుచున్నవి. ఆత్మకు జననమరణములులేకుండుటచే సహజములగు వికారములుగూడ నద్దానికి లేవు. ఆత్మ జన్మము

ఆత్మస్వరూప నిరూపణము

లేనిదగుటచే కార్యము గానేరదు. దానివలన నేదియు పుట్టదు గనుక నది కారణము గానేరదు. మాయచే జగత్కారణత్వ మాత్మయందారోపింపబడినదిగాని యది వాస్తవము గాదు. నిత్యమగుటచే నది భూతభవిష్యద్వర్తమాన కాలభేదముచే నబాధితమగుచున్నది. సర్వవికారవిధురమగుటచే దాని కపక్షయములేదు గనుక శాశ్వతమగుచున్నది. శాశ్వతముగనుక పురాణమగుచున్నది. ఆత్మ అజము నిత్యము శాశ్వతము పురాణమగుటచే శస్త్రాదులు దానిని హింసింపలేవు. జననమరణాదిధర్మములన్నియు శరీరమునకు జెందుటచే నదియే శస్త్రములచే హింసింపదగినదిగాని యాత్మగాదు. ఈ మంత్రమే గీత 2-20 శ్లోకముగ స్మరింపబడుచున్నది. 18

అ॥ శరీరమే యాత్మయని భావించువారలు తత్త్వము నెఱుఁగనివారని చెప్పుచున్నాడు.

మూ॥ హన్తా చేన్మన్యతే హన్తుం హతశ్చేన్మన్యతే హతమ్ ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ 19

టీ॥ శరీరముకంటె భిన్నము అసంగస్వభావమునగు నాత్మను శరీరమాత్రదృష్టిచే దానిని నేను చంపెదను అనిగాని నేను చంపబడుచున్నాననిగాని యెవడు తలచునో యతడాత్మతత్త్వము నెఱుంగనివాడే యగుచున్నాడు. ఆత్మ చంపునదికాదు; చంపబడునది కాదు. ధర్మాధర్మాదిలక్షణమగు సంసారమునందు ప్రవిష్టుడగు ననాత్మజ్ఞుడిట్లు తలంచునేగాని బ్రహ్మజ్ఞుడట్లు తలంపడు. బ్రహ్మజ్ఞుడు ధర్మాధర్మతత్ఫలాతీతుడు. 19

అ॥ ఇట్టి యాత్మ నెటులుండునట్లు? యను ప్రశ్నకు సమాధానమును జెప్పుచున్నాడు.

మూ॥ అణోరణీయాన్మహతో మహీయానాత్మాస్య జన్తోర్నిహితో గుహాయామ్ తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుః ప్రసాదాన్మహిమానమాత్మనః ॥ 20

టీ॥ ఆత్మ అత్యంతసూక్ష్మమగు పరమాణువుకంటెను సూక్ష్మతరము. మహత్పరిమాణముగల పృథివ్యాదులకంటెను మహత్తరము. బ్రహ్మాది స్తంబపర్యంతమగు జీవకోటియొక్క బుద్ధిగుహయందది నిగూఢముగ నున్నది. దృష్టాదృష్టములగు బాహ్యవిషయములనుండి యన్తఃకరణమును మరల్చుటచే ప్రసన్నములగు నింద్రియములు గలవాడపగత సర్వశోకుడయి యాత్మయొక్క మహిమను జూడగలడు.

తా॥ వి॥ బుద్ధికగోచరుడగుటచే నాత్మయొక్క పరిమాణమింతయని చెప్పనలవికాదు. జనసామాన్యమునకు దెలిసినంతవరకు మహత్పరిమాణమునకవధి పృథివి. సూక్ష్మపరిమాణమునకు కొట్టగింజ మొదలగునవి పరమావధి. ఆత్మయొక్క పరిమాణ మీరెండుహద్దులను దాటినదగుటచే నది సూక్ష్మముకంటె సూక్ష్మతరము మహత్తుకంటె మహత్తరమని చెప్పబడినది. అనగా దాని ఇయత్త యింతదని చెప్పశక్యముగాదని భావము. బ్రహ్మశబ్దమునకు వృద్ధియని యర్థము. వృద్ధియను శబ్దమున కర్థ మెంతదూరము పోగలదో యంతదూర మాత్మ వ్యాపించియున్నదని పర్యవసానము. అందుచే నాత్మ సర్వ

ఆత్మకు పరిమాణము లేదు.

వ్యాపి యగుచున్నది. ఆత్మ సూక్ష్మముకంటె సూక్ష్మతరము మహత్తుకంటె మహత్తరము నగుటచే దోమమొదలగు నల్పో పాధులయందు నరగజాదిమధ్యమోపాధులయందును మహత్తమోపాధులగు సౌరమండలాదులయందును గూడ వ్యాపించి యున్నది. మధ్యమాధమమహత్పరిమాణపరిమితమగు జంతు సంతానము నంతయు నీయాత్మ వ్యాపించి తన్ముఖమున నభివ్యక్తమగుచున్నది. అందుచేత నద్దాని కణుత్వాది పరిమాణవ్యవహారము కల్పింపబడుచున్నను నిజముగా దానికి నెట్టి పరిమాణము లేదు. సర్వవ్యాపియయి సర్వాధిష్ఠాన మగుటంజేసి యద్దానికి సర్వాత్మత్వము సంభవమగుచున్నది.

నిర్గుణము అవాచ్యమునగు నీ పరమాత్మ సర్వప్రాణి జాతమున కాత్మభూతమై హృదయస్థానమునందు నివిష్ట మగుటంజేసి యధికారియగువా డద్దానిని సులభముగ సందర్శింపగలడు. బాహ్యవిష యములయందు సంపూర్ణమగు సేవగింపుచే వానియందు వైరాగ్యము, సర్వకామనారాహిత్యముచే చిత్త నైర్మల్యము, గలిగి శ్రవణమనననిదిధ్యాసనానిపుణుడగువా డాత్మను హృదయకమలమునందే దర్శింపగలడు. అపుడతనికి నేనే బ్రహ్మమునయితినను నాత్మసాక్షాత్కారము గలు గును. ఇదియే యాత్మసందర్శనము. ఆత్మసందర్శనము జేసిన వాడు వీతశోకుడగును. 20

ఆత్మదర్శన మెట్లు కలుగును ?

అ॥ ఇట్టియాత్మ ప్రాకృతపురుషుల కెఱుంగ శక్యము గాదని చూపుచున్నాడు.

మూ॥ ఆసీనో దూరం వ్రజతి శయానో యాతి సర్వతః
కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమర్హతి ॥ 21

టీ॥ ఆత్మ అచలుడయ్యును దూరగామి యగు చున్నాడు. అతడు సంతోషవిషాదాదివిరుద్ధధర్మములు గల వాడు. అట్టిదేవుని నాకంటె నితరులెవరును దెలిసికొనలేరు.

తా॥ వి॥ ఆత్మస్వయముగా నిర్ధర్మము. వివిధశరీరోపాధిముఖమున నతడభివ్యక్తి నిజెందుచు యుపాధిధర్మములు గలవాడుగ కాన్పించుచున్నాడు గాని వాస్తవముగా నత డాధర్మములచే నసంస్పృష్టు డగుచున్నాడు. సూర్యప్రతిబింబ ముపాధిభూతమగు జలము యొక్క సంచలనముచే సంక్షుభితమయినటుల కాన్పించినను సూర్యబింబ ముపాధిధర్మముచే నసంస్పృష్టమయి వానియన్నిటికిని గడుదూరముననుండి వానికి సాక్షిమాత్రముగ భాసించుచున్నది. అదేవిధముగ నాత్మగూడ యగసాలిదిమ్మెవలె నచంచలము అసంస్పృష్టము. జాగ్రత్స్వప్నములయం దనుభూయమానమగు సర్వేంద్రియవ్యాపారకలాపమున కయ్యది సాక్షిమాత్ర మగుచున్నది. స్వప్రకాశస్వరూపుడగు నతని కాంతి మనస్సున బ్రతిఫలించుటచే నీ మనస్సు విషయగ్రహణ సమర్థ మగుచున్నది. ఆత్మప్రతిబింబసముపేతమగు మనస్సు దూరమున నున్నవస్తువులను గ్రహించుట కింద్రియముల ద్వారా బహిర్గతమయినపుడు మనస్సుతో నాత్మగూడ దూర దేశము పోయినట్లగుపడుచున్నది. సుషుప్తియందు సర్వేంద్రి

ఆత్మ ఉపాధిధర్మములచే సంస్పృష్టుడు గాడు.

యములతో నదిగూడ నిద్రించుచున్నట్లుండును. నిర్ధర్మమగు నాత్మ మనస్సుచే నభివ్యక్తమగుచున్నందున ఆత్మకును మనస్సునకు వివేకముచేయనేరక యజ్ఞులు మనస్సుయొక్క సంతోషవిషాదము లాత్మవిగా భావించుచున్నారు. అందుచే నుపాధిగతమగు దూరదేశగమన నిద్రాసంతోషవిషాదాది ధర్మము లతనియం దారోపింపబడుచున్నవి.

ఆత్మనిర్ధర్మకము

చింతామణి స్వయముగా నిర్ధర్మమయినను మనము తలంచిన రూపమున నది కాన్పించును. కనుక ఆత్మ స్వరూపము దుర్విజ్ఞేయము. యమునిబోలు సూక్ష్మబుద్ధికి మాత్రము సువిజ్ఞేయ మగుచున్నది. 21

అ॥ ఆత్మను దెలిసికొనినవానికి శోకము దూరమగు నని చెప్పుచున్నాడు.

మూ॥ అశరీరగ్ం శరీరేష్వనవస్థేష్వవస్థితమ్ మహాన్తం
విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి ॥ 22

టీ॥ ఆత్మ స్వయముగా శరీరము లేనిది. అనిత్యములగు శరీరములయం దభివ్యక్త మగుచున్నను నిర్వికారము. సర్వవ్యాపి గనుక మహత్తమము. తానే యిట్టి యాత్మ యని గ్రహించువానికి శోకోపపత్తిగలుగదు. 22

అ॥ దుర్విజ్ఞేయమగు నాత్మ సువిజ్ఞేయమగు నుపాయమును జూపుచున్నాడు.

మూ॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా
న బహునా శ్రుతేన యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష
ఆత్మా వివృణుతే తనూగ్ంస్వామ్ ॥ 23

టీ॥ ఆత్మ బహువేదాధ్యయనముచే లభించునది గాదు. అనేకగ్రన్థార్థధారణాసామర్థ్యముచే బొందఁదగినది గాదు. ఆత్మప్రతిపాదకములగు వేదాన్తములు గాకనితరశాస్త్ర శ్రవణముచే గాని గురూపదేశరహితమగు శాస్త్రశ్రవణ ముచే గాని నదిప్రాప్యము గాదు. నిష్కాముడగు నే సాధ కుడు స్వాత్మభూతమగు నాత్మను బొందవలయునని శ్రవణాది కాలమునుండియుగూడ గోరునో అట్టివాని కది లభ్య మగుచున్నది. పరమాత్మ తన పారమార్థికస్వరూపము నాత్మకాముడగువానికి బ్రకాశింపజేయును. ఆచార్యపరమే శ్వరానుగ్రహపూర్వకమయిన శ్రవణమనననిదిధ్యాసనముల చేతను మాత్రమే యాత్మోపలబ్ధి గలుగునని తాత్పర్యము. 23

అ॥ ఈ యర్థమునే వివరించుచున్నాడు.

మూ॥ నావిరతో దుశ్చరితాన్నాశాన్తో నాసమాహితః
నాశాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైనమాప్నుయాత్ ॥ 24

టీ॥ శ్రుతిస్మృత్యవిహితమయినట్టియు ప్రతిషిద్ధమై నట్టియు పాపకర్మమునుండి తొలగనివాడును, ఇంద్రియలౌల్య ముచే జిత్తశాన్తిలేనివాడును, చిత్తైకాగ్ర్యము లేమింజేసి సమాహితచిత్తుడు గానిమనుజుడు నాత్మోపలబ్ధి కర్హుడు గాడు. బ్రహ్మజ్ఞానముచేత నే నద్దాని బొందదగును. 24

అ॥ ఇట్టియాత్మను బ్రాకృతపురుషుడు దెలిసికొనలేడని చెప్పుచున్నాడు.

మూ॥ ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ
పరమే పరార్థే ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో
యే చ త్రిణాచికేతాః ॥ 1

టీ॥ స్వయంకృతమగు కర్మఫలము ననుభవించునట్టి యాత్మ, శరీరమునందలి శ్రేష్ఠమయిన బ్రహ్మస్థానమగు బుద్ధి గుహను బ్రవేశించునట్టి యాత్మ, ఈ యాత్మలు రెండును ఛాయాతపములవలె విలక్షణములగుచున్నవి. ఈ విధముగ బ్రహ్మవిదులగు జ్ఞానులు పంచాగ్న్యుపాసకులగు కర్మకాండ పరులుగూడ తెలియజేయుచున్నారు.

తా॥ వి॥ జీవుడు పూర్వజన్మవాసనాచోదితుడయి సుకృతదుష్కృతముల నాచరించుచున్నాడు. తదనురూపము అనివార్యమునగు ఫలానుభవముకొఱకు తిరిగి జన్మము నెత్తుచున్నాడు. మనయెదుటనుండి 'ఇదం' ఇది యని వ్యవహరింపబడు పదార్థములన్నియు నాత్మకంటె భిన్నములయినను నవియే యాత్మయని భ్రమపడి జీవుడు వానియందు తాదాత్మ్యభావము నొందుచున్నాడు. అనాత్మవస్తువులయం దాత్మభావమును బొందుటయే జీవత్వలక్షణము. జీవత్వమంతయు నజ్ఞానవిలసితము. బాహ్యాప్రపంచము ఆంతరములగు నన్నమయాదిపంచకోశములుగూడ నాత్మలు గావని నిశ్చయజ్ఞానముతో వానిని దోసిబుచ్చి బుద్ధిగుహయందు స్వయం ప్రకాశమై వెలుంగుచున్నదియే యాత్మతేజస్సని గ్రహింపగలవా డాత్మదర్శి యగుచున్నాడు. ఆత్మదర్శన

ఆత్మత్వజీవత్వములు సహావస్థానములు.

ముచే నజ్ఞానకల్పితమగు జీవత్వము పోయి స్వస్వరూపము భాసించును. ఒకేవ్యక్తి యజ్ఞానకల్పితమగు జీవభావముచే గర్మఫలమును, జ్ఞానముచే స్వస్వరూపావస్థితిని ననుభవించు చున్నాడు. సహజమగు స్వస్వరూపము దానియందజ్ఞానముచే నారోపితమగు జీవత్వముగూడ నొక్కమారుగ సంభవించు చున్నవి. స్వస్వరూపము జీవత్వభావముచే గప్పబడియుండు టచే నాస్వరూపానుభవము మాత్రము గలుగుటలేదు. జీవుని స్వస్వరూపమతనిని విడిచిపెట్టలేదు. దుష్యంతపాత్రను ధరించిన నటుని స్వస్వరూప మతనిని వీడిపోదు. నటకావతంసు డొకపుడు పాత్రతాదాత్మ్యమును బొంది స్వస్వరూపమును మఱువవచ్చును. వేషమును దొలగించి యథార్థస్థితిని బొందినపుడు తనపాత్రతాదాత్మ్యమును స్మరించుచు సిగ్గు పడును. ఇట్లనివార్యముగ నొకచోట గలిసియున్న జీవత్వ స్వస్వరూపములను దెలియజేయుటకుగాను ఆత్మలు రెండు న్నట్లు చెప్పట నిర్దేశింపబడినది. కాని నిజముగా నాత్మలు రెండు లేవు. అవస్థలు మాత్రము రెండు గలవు. నిర్వికారము సహ జము నగు స్వస్వరూప మొకటి. దానియందజ్ఞానముచే నారోపితమగు జీవత్వావస్థ మఱియొకటి. 'ఆరోపితమగు జీవుడు, ఆరోపణమున కాధారమగు నాత్మయు వేషధారియొక్క

ఛాయాతపోపమానము.

స్వస్వరూపారోపితరూపమువలె నవపాయములు. ఒకదాని జెప్పినపుడు రెండవది స్ఫురించుచు న్నది.' పరికృతమంత్రమునందలి కర్మఫలాను భవిత యనుపేదముచే జీవుడు జీవత్వారోపణకధిష్ఠానభూత

మగు స్వస్వరూపముగూడ నవగతమగుచున్నవి. అధిష్ఠానము అసంసారియు నగునాత్మయు, ఆరోపితుడు సంసారియు నగు జీవుడును ఎండనీడలవలె విలక్షణులగుచున్నారు. సూర్యాతపము స్వభావముచేత ప్రకాశస్వరూపము. మఱియొకవస్తువు దానిప్రసారముక్రింద జేరినపు డావస్తుస్వరూపానురూపమగు ఛాయ యేర్పడుచున్నది. సూర్యాతపమునకును ఛాయకు నేమియు సంబంధము లేదు. మధ్యనున్న నుపాధిచే ఛాయ కల్పితమగుచున్నది. ఛాయ కేవల మవస్తుస్వరూపము. సూర్యకాంతి మధ్యనున్న వస్తువుచేతగాని దానిచే గల్పితమగు ఛాయచేతగాని యసంస్పృష్టమై దూరముననుండి యీ రెంటికిని సాక్షిమాత్రముగ నుండును. ఛాయలేక సూర్యాతపముండునుగాని సూర్యాతపములేని ఛాయ సంభవముగాదు. ఆతీరుననే బుద్ధియందు ప్రతిఫలించిన యాత్మప్రతిబింబము బుద్ధిధర్మములనుబొంది వానితో నైక్యము నొందుచున్నది. ఆభాసమాత్రమగు నీయుపాధిధర్మైక్యమే జీవత్వావస్థ యనంబడుచున్నది. ఇదియే కర్మఫలానుభవదశ. ఆత్మప్రకాశమనునది లేనిది జీవత్వము సంభవముగాదు. జీవుని యొక్క బుద్ధ్యుపాధినిమిత్తములగు ధర్మములు విదళితములయినపుడు జీవత్వము పోయి స్వస్వరూపము మిగులుచున్నది. హార్దాకాశమున బాహ్యధర్మములచే నసంస్పృష్టమయి స్వస్వరూపమున నాత్మ ప్రకాశించుచున్నది. అదియే బాహ్యోపాధిధర్మసంస్పృష్ట మయినపుడు జీవరూపమున భాసించుచున్నది. జీవుడుఛాయవలెయనిత్యము. ఆత్మసూర్యా

తపమువలెఁబ్రకాశవంతము. ఇదియే మంత్రిమున చేర్కొనఁ బడిన యాత్మద్వయమునకుఁగల వైలక్షణ్యము. ఇదియే ఛాయాతపోపమానహృదయము. అద్వితీయనుగు పరమాత్మను అవస్థాన్తరోపపన్నమగు జీవత్వమును సంమేళనముజేసి రెండాత్మలున్నట్లుదాహరింపబడినది. బుద్ధితోదాత్మ్యభావము నొందుటచే జీవుడును, బుద్ధియం దుపలభ్యమానమగుటచే నాత్మయు బుద్ధిప్రవిష్టులని వర్ణింపబడినారు. 1

అ॥ కర్మనిష్ఠులకును బ్రహ్మవిదులకు నాశ్రయములగు పరాపరబ్రహ్మములు రెండును వేదితవ్యములే యగుచున్న వని చెప్పుచున్నారు.

మూ॥ యః సేతురీజానానామక్షరం బ్రహ్మ యత్పరమ్
అభయం తితీర్షతాం పారం నాచికేతగ్ం శకేమహి ॥ 2

టీ॥ కర్మనిరతులగు యజమానులకు దుఃఖసంతరణార్థము సేతువువలెనున్న నచికేతాగ్నిని దెలిసికొనుటకును ఆచరించుటకును నేము శక్తిమంతులమగుచున్నాము. ఆరీతిగనే నిర్భయముగ సంసారసాగరమును దాటుటకు కోరిన బ్రహ్మవేత్తల కాశ్రియము అక్షరమునగు పరబ్రహ్మమును దెలిసికొనుటకుగూడ నేము సమర్థులము.

తా॥ వి॥ మొదటిమంత్రమున పరాపరబ్రహ్మముల దెలిసికొనగల యధికారులతోఁగూడ నట్టిజ్ఞానఫలము నిగూఢముగ నుదాహరింపబడియె. ఆయర్థనే యిచట స్పష్టము చేయబడుచున్నది. కర్మనిరతులగువారు సగుణబ్రహ్మము నాశ్రి

పరాపరబ్రహ్మములు సేవ్యములు

యించి యభ్యుదయప్రాప్తిచే దుఃఖమును దాటుదురు. సంసారసాగరమును దాటదలచినవా రభయప్రతిష్ఠాహేతు వగు నిర్గుణబ్రహ్మము నాశ్రయించి కృతకృత్యులు కాగలరు. సత్కర్మఫలము సుఖప్రదమయినను నొకదానిచే నయ్యది పుట్టునది గనుక నది యనిత్యము. దానిచే సంసారనాశనము గానేరదు. సంసారనాశనమునకు బ్రహ్మజ్ఞానమొక్కటియే మార్గము. ఇట్లు పరాపరబ్రహ్మ లధికారానుసారముగ సంసేవ్యము లగుచున్నవి. 2

అ॥ ఆత్మకు జీవత్వము సంభవించుచున్న విధానము హృదయంగమమగు రూపకాలంకారముచే వర్ణింపబడు చున్నది.

మూ॥ ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥ 3
ఇన్ద్రియాణి హయానాహుర్విషయాం స్తేషు గోచరాన్ ఆత్మే
న్ద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః ॥ 4

టీ॥ శరీరము రథము; ఆత్మ రథము నధిష్ఠించువాడు; బుద్ధి సారథి; మనస్సు పగ్గము; చక్షురాదీన్ద్రియములు గుఱ్ఱములు; వానికి విషయములగు రూపాదులు గమనమార్గములు; శరీరేన్ద్రియమనస్సులతో గూడుకొనియున్న యాత్మ భోక్తయనియు వివేకులగు పెద్దలు సెప్పుదురు.

తా॥ వి॥ అవిద్యకమగు సంసారమును విద్యాఫలమగు స్వస్వరూపమును గూడ జీవుడే యనుభవించుచున్నాడు.

శరీరమతనికి యుపాధిభూతమయి యుభయవిధఫలానుభవము నకు సాధనమగుచున్నది. కనుక శరీరము రథమనియు దాని నుపాధిగాకలిగి నధిష్ఠించియున్న జీవుడు రథికుడనియు వినరింప బడినది. అన్తఃకరణముయొక్క రూపాన్తర మగు మనస్సు చక్షురాదీన్ద్రియములద్వారా తత్తద్విషయములగు రూపాదులను గ్రహించి తనవలె నన్తఃకరణముయొక్క రూపాన్తరమగు బుద్ధికి సమ ర్పించును. అపుడుబుద్ధి యాప్సితార్థనిర్ధారణము సేయును. తదనుకూలముగ మనుజుడు ప్రవర్తించుచున్నాడు. జీవుడీ ప్రవృత్తిఫలము ననుభవించుచున్నాడు. బుద్ధీన్ద్రియమనః సంఘాతరూపమగు శరీరమను నుపాధివశముచే నాత్మకు జీవ రూపమున కర్మఫలానుభవము సిద్ధమగుచున్నది. ఉపాధిసం బంధములేని యాత్మకేవిధమగు భోక్తృత్వమాపాదింప శక్య ముగాదు. ఆత్మ కేవలచేతనస్వరూపము నిర్ధర్మకము. బుద్ధి జడము ధర్మసముపేతము. ఆత్మచైతన్యమును బుద్ధియందా రోపించి బుద్ధియే యాత్మయనియు బుద్ధిధర్మముల నాత్మయం దారోపించి యాత్మ భోక్తృత్వకర్తృత్వాదిధర్మవిశిష్టమనియు భావింపబడుచున్నది. ఆత్మయొక్కయు నుపాధియొక్కయు ధర్మముల యన్యోన్యారోపణముచే నాత్మకు జీవత్వము సంప్రాప్తమగుచున్నది. దేహేన్ద్రియసంఘాతఫలమే జీవునిచే ననుభవింపబడు భోక్తృత్వకర్తృత్వరూపమగు సంసారము. శరీరరథమును రూపాదిభోగ్యవిషయమార్గమున నడిపించుటచే నిన్ద్రియము లశ్వములుగను గమ్యమగువిషయమార్గమును

(విద్యావిద్యాఫలములకుజీవుడే భోక్త.)

నిశ్చయించుటచే బుద్ధిసారథిగను బుద్ధీన్ద్రియసంధానకర్తయగు మనస్సు పగ్గముగను సరసముగ వర్ణింపబడినవి. 4

అ॥ ఇంద్రియములను వశపరచుకొన్నవా డుత్కృష్ట మగుపదమును బొందుననియు నిన్ద్రియములకు వశుడయిన వాని కదిసాధ్యముగాదనియు నన్వయవ్యతిరేకముల జెప్పుచు న్నాడు.

మూ॥ యస్త్వవిజ్ఞానవాన్ భవత్యయుక్తేన మనసా సదా తస్యేన్ద్రియాణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః 5. యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా తస్యేన్ద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః 6. యస్త్వవిజ్ఞానవాన్ భవ త్యమనస్కః సదాఽశుచిః న స తత్పదమాప్నోతి సంసారం చాధిగచ్ఛతి 7. యస్తు విజ్ఞానవాన్ భవతి సమనస్కః సదా శుచిః స తు తత్పదమాప్నోతి యస్మాద్భూయో న జాయతే॥ 8

టీ॥ ప్రవృత్తినివృత్తిమార్గములరెంటియందును బుద్ధి యనుసారథి నిపుణుడు గాకపోయినచో సమాహితచిత్త మెన్నడును లభ్యముగాదు. అటువంటి యింద్రియములు దుష్టాశ్వములవలె నవశములగును.

బుద్ధిసారథి నిపుణుడయినచో సమాహితచిత్తము లభ్యమగును. అట్టివాని యిందిద్రియములు సదశ్వములవలె వశముననుండును.

సమాహితచిత్తుడు గానివాడెల్లప్పుడు నశుచియయి యుత్కృష్టపదమును బొందలేడు. మీదుమిక్కిలి జన్మమరణ లక్షణమగు సంసారమును బొందును.

సమాహితచిత్తుడగువాడు శుచియయి సంసారమార్గమునుదాటి బ్రహ్మపదమును బొందును. అచటినుండి ప్రచ్యుతినిజెంది సంసారమున జన్మించడు.

తా॥ వి॥ బుద్ధి సుశిక్షితము కానియెడల నింద్రియములను కామోపభోగవిషయమగు ప్రవృత్తిమార్గమున నడిపించును. ఈ ప్రవృత్తిమార్గము ధర్మోపేతమయిన స్వర్గాదిసాధనమగును. అధర్మోపేతమయిన నరకాదిదుఃఖకారణమగును.

బుద్ధియే ప్రవృత్తి నివృత్తులరెంటికిని కారణము.

బుద్ధి సుశిక్షమయినయెడల నింద్రియములను భోగ్యజాతమునుండి కామనలనుండియు మరల్చి నివృత్తిమార్గమున వానిని నడిపించును. బ్రహ్మపదము నివృత్తిమార్గఫలము. ఆపదమును జేరినవానికి యశేషసంసారనాశనము, పునరావృత్తిరాహిత్యము సంప్రాప్తమగును. 5–8

అ॥ ఇట్టి యుత్కృష్టమగు పదవి యేదియో నిరూపించుచున్నాడు.

మూ॥ విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః సోఽ
ధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్ ॥ 9

టీ॥ సుశిక్షితమగు బుద్ధియు నిగృహీతమగు మనస్సును గలవాడు సంసారసాగరముదరిజేరి యుత్కృష్టమగు వాసుదేవపదము నొందును. అనగా సర్వవ్యాపనశీలమగు బ్రహ్మ

అ॥ సుశిక్షితమగు బుద్ధిచే నిన్ద్రియములు నివృత్తి మార్గమున తీసికొనబడునని చెప్పబడినది. ఈ నివృత్తి మార్గమిపుడు వివరింపబడుచున్నది.

మూ॥ ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః
మనసస్తు పరా బుద్ధిర్బుద్ధేరాత్మా మహాన్ పరః ॥ 10
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్ పురుషః పరః పురుషాన్న
పరం కించిత్సా కాష్ఠా సా పరా గతిః ॥ 11

టీ॥ ఇన్ద్రియములు, ఆకాశాదిపంచభూతములు, మనస్సు, బుద్ధి, హిరణ్యగర్భుడు– ఇవి పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము సూక్ష్మతరము మహత్తరమును. అట్లే పూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము ప్రత్యగాత్మభూతము నగుచున్నది. అవ్యక్తస్వరూపమగు ప్రకృతి హిరణ్యగర్భుని కంటెను సూక్ష్మతరము మహత్తరము. పురుషుడు ప్రకృతి కంటెను సూక్ష్మతరము మహత్తరము. పురుషుడు ప్రత్యగాత్మభూతుడు. పురుషునికంటె సూక్ష్మతరము మహత్తరము నగుమఱియొక వస్తువేదియు లేదు. సూక్ష్మత్వమహత్త్వప్రత్యగాత్మత్వముల కతడే పరమావధి.

తా॥ వి॥ శరీరము పంచభూతాత్మకమగు నన్నము వలన బుట్టినదగుటచే నదియు పంచభూతాత్మకమే యగుచున్నది. తద్గతములగు చక్షురాదీన్ద్రియములుగూడ పాంచభౌతికములే యగుచున్నవి. విషయములిన్ద్రియములచే గ్రహింపబడుచుండుటచే నవి యింద్రియములకంటె సూక్ష్మతరములు.

ఇంద్రియములకంటె నవి వ్యాపకము లగుటచే మహత్తరములని చెప్ప బడుచున్నవి. ఇన్ద్రియములు విషయములను వదలి యుండనేరవు గనుక నవి ఇంద్రియములకు ప్రత్యగాత్మస్థానములగుచున్నవి. మనస్సు విషయములను గ్రహించుటచే నది సూక్ష్మతరమనియు, సర్వవిషయవ్యాపియగుటచే మహత్తరమనియు వివిధవిషయాకారాకారితమయి వాని నభివ్యక్తము చేయుటచే వానికి ప్రత్యగాత్మయనియు వర్ణింపబడినది. మనస్సు కేవలవిషయగ్రహణముచే చరితార్థత నొందుచున్నది. మానసికములగు సంకల్పవికల్పములను బుద్ధినిశ్చయించి సర్వప్రవృత్తిహేతువగుచున్నది. అందువలన బుద్ధి మనస్సుకంటె సూక్ష్మతరము మహత్తరము ప్రత్యగాత్మభూతముగూడ నగుచున్నది. సర్వప్రాణిబుద్ధులకు హిరణ్యగర్భు డాత్మభూతుడగుటంజేసి యతడు బుద్ధికంటె సూక్ష్మతరుడు మహత్తరుడుగూడ నగుచున్నాడు. సురనరతిర్యగాదిబుద్ధుల కన్నిటికి నతడు సమిష్టిస్వరూపుడు జ్ఞానక్రియాశక్త్యాత్మకుడు నగుటవలన వానికి ప్రత్యగాత్మయనిగూడ వ్యవహారము గలదు. ఇతడే సృష్టికంతకును ప్రథమశరీరి. హిరణ్యగర్భాదిజగత్తంతయు ప్రకృతివలన గల్గుచున్నది. ఆది సర్వజగత్కారణబీజభూతము. అవ్యక్తాకాశాదినామరూపమునై పడుగుపేకవలె పరమాత్మ నదియాశ్రయించియున్నది. వటవృక్షోత్పాదనశక్తి వటబీజమునందువలె పరమాత్మయందీప్రకృతియ న్తర్నిహితమగుచున్నది.

పరమాత్మ సూక్ష్మత్వ మహత్త్వ ప్రత్యగాత్మత్వములకు బరిమావధి.

అవ్యక్తమగు ప్రకృతికంటెను సూక్ష్మతరము మహత్తరము నయినవాడు పురుషుడు. ఇతడు సర్వజగత్కారణమగు ప్రకృతికి గారణభూతుడు. సమస్తప్రాణిజాతమునకు బ్రాణభూతుడు సర్వవ్యాపియు నగుచున్నాడు. ఇతడన్నిటికంటెను సూక్ష్మతముడు మహత్తముడు. సూక్ష్మత్వమహత్వప్రత్యగాత్మత్వముల కితడే పరమావధి. సంసారులకందఱకు నితడే గమ్యైకస్థానమగుచున్నాడు. అతనిని బొందినవారికి బునరావృత్తి యెంతమాత్రమును లేదు. ఇంద్రియములు మొదలు ప్రకృతివఱకును గల పూర్వపూర్వముల కుదాహరింపబడిన యుత్తరోత్తరముల సూక్ష్మత్వమహత్వప్రత్యగాత్మత్వము లాపేక్షికములు. ఇంద్రియములకు విషయములు ప్రత్యగాత్మ యనిభావించుటచే నింద్రియములాత్మకావని త్రోసిపుచ్చవచ్చును. అటులనే ప్రకృత్యంతములగువానినన్నిటిని ననాత్మబుద్ధిచే ద్రోసిపుచ్చి తుట్టతుదకు సర్వకారణము సర్వవ్యాపకము సర్వాత్మకము నగుపరమపురుషునియందు బుద్ధిని లగ్నముచేయుట కుపాయముగ నీప్రణాళిక యుపదేశింపబడినది. ఈప్రణాళికయే తైత్తిరీయబ్రహ్మవల్లి శిక్షావల్లులయందు సమగ్రముగ వివరింపబడినది. 11

అ॥ బుద్ధిగుహాయందున్న యీ యాత్మతత్త్వము నెఱుంగుట సుసాధముగాకుండుటకు గారణమును జెప్పుచున్నాడు.

మూ॥ ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యాసూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥ 12

టీ॥ పరమపురుషుడు సమస్తప్రాణుల బుద్ధిగుహాయందు నిగూఢముగ నుండుటచే దెలియబడుటలేదు. ఏకాగ్రము సూక్ష్మము నగుబుద్ధిసహాయముచే సూక్ష్మదర్శనకుశలులగు పండితులచే నతడాలోకింపబడగలడు.

తా॥ వి॥ పరమపురుషుడు సంసారులకందజాలకును పునరావృత్తిరహితమగు గమ్యస్థానమని వర్ణింపబడినది. ఇచట గమనశబ్దమునకు స్థలాంతరగమన మర్థముగాదు. అతఃపు బుద్ధిగుహాయందే యున్నటుల వర్ణింపబడుటచే గమనశబ్దమునకు జ్ఞాన మర్థము జెప్పవలెను. అతని తత్త్వమును దెలిసికొనినవారు బుద్ధిగుహాయందే యతనిని సాక్షాత్కారము చేసికొనగలరని తాత్పర్యము. జనసామాన్యము మాయావిమోహితమగుటచే నత్యంతసమీపమునందుండినను నతనిని గుర్తింపలేకున్నది. మాయ అతిగంభీరము దురవగాహము విచిత్రము. దానివశమునొందిన జనులు నీ వా బ్రహ్మమే యయియున్నావని పలుమరు శాస్త్రముచే బోధింపబడుచున్నను యీ విషయమును గ్రహింపలేకున్నారు. ఎవరు చెప్పకపోయినను ననాత్మభూతమగు దేహేన్ద్రియాదిసంఘాత మాత్మయని తలంచుచున్నారు. మాయాకల్పితమగు భ్రమయే దీనికి గారణము. మాయచే నావరింపబడిన సామాన్యబుద్ధికి సుగ్రాహ్యముగాకుండుటచే బరమాత్మబుద్ధిగుహాయందు నిగూఢముగ నున్నటుల వర్ణింపబడినాడు. సంస్కృతబుద్ధులు చిత్తైకాగ్రోపేతులు సూక్ష్మవస్తునిరూపణనిపుణులు నగుబండితు లతని నవలోకింపసమర్థులు.

పండితులకు బరమాత్మ సుగ్రహము

నిదిధ్యాసనజన్యమగు సంస్కారము సంస్కృతబుద్ధిలక్షణము. బహిర్మైత్త్రైక్యమును లక్ష్యమునందుంచుట చిత్తైకాగ్ర్యము. స్థూలములగు నిన్ద్రియములు మొదలు హిరణ్యగర్భాన్తముగల పారస్పరికములు ఆపేక్షికములు నగుసూక్ష్మత్వమహత్వప్రత్యగాత్మత్వముల ద్రోసిపుచ్చి సర్వకారణకారణము, సర్వవ్యాపి, సర్వాత్మయునగు పరమాత్మ ప్రత్యగాత్మకంబె ననన్యమని నిరూపింపగల బుద్ధి సూక్ష్మబుద్ధి. దురవగాహమగు నిట్టి సూక్ష్మమును గ్రహింపగలవాడు పండితుడనిపించుకొనును.12

అ॥ సూక్ష్మదర్శులగుపండితు లాత్మను దర్శించు నుపాయమును జూపుచున్నారు.

మూ॥ యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞస్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని
జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్తద్యచ్ఛేచ్ఛాన్త ఆత్మని ॥ 13

టీ॥ పండితుడయినవాడు వాగాదిసకలేన్ద్రియవ్యాపారమును మనస్సునం దుపసంహరింపవలయును. ఆమనస్సును ప్రకాశస్వరూపమగు బుద్ధ్యాత్మయందు నియమింపవలెను. అట్టిబుద్ధిని ప్రథమజుడగు హిరణ్యగర్భునియందు నియమించవలెను. ఆహిరణ్యగర్భబుద్ధిని సర్వవికారశూన్యమగు ముఖ్యాత్మయందు నిలుపవలెను.

తా॥ వి॥ ఇచట వాక్ఛబ్దముచే సర్వేన్ద్రియము లవగతములగుచున్నవి. అవియన్నియు ననగా బహిర్కృతివరకు నుదాహరింపబడిన వస్తువు లనాత్మభూతములయి యాత్మసందర్శనమున కుపాయభూతములగుచున్నవని పేర్కొనబడినది. అవి యెట్లుపాయములగుచున్నవో యిచట వివరింపబడుచు

న్నది. వాగాదీన్ద్రియముల ననాత్మభావముచే నసత్యములని త్రోసివుచ్చి వానిని మనస్సునం దుపసంహరింపవలయును.

ఆత్మదర్శనము సర్వేన్ద్రియోపసంహారముచేలభించును

ఇట్లులనే మనస్సును బుద్ధియందును,బుద్ధిని హిరణ్యగర్భునియందును హిరణ్యగర్భుని యందలి బుద్ధిని నిర్విశేషస్వరూపుడును అవిక్రియుడును సర్వాన్తరుడును సర్వబుద్ధి ప్రత్యయసాక్షియు నగుముఖ్యాత్మయం దుపసంహరింపవలయును. సమస్తప్రపంచమును బరమాత్మయందు బ్రవిలాపనము జేసి నిర్వికల్పసమాధియందు స్వస్వరూపమగు పరమాత్మయందు బుద్ధిని నిలుపవలెను. ఈవిధమున వివేచనాపూర్వకమగు విచారణచేతను నిదిధ్యాసనముచేతను జ్ఞానియగువాడాత్మదర్శనముఁ జేయగలడని తాత్పర్యము. ఇంద్రియముల నన్నిటిని తనయందుపసంహరించుకొని యన్తర్దృష్టిచే స్వస్వరూపావస్థానము నొందుటయే నివృత్తిమార్గము. అదియే జ్ఞానహేతువగును. పంచకోశముల ననాత్మభావముచే నిరసించుమార్గము తైత్తిరీయభృగువల్లియందు విస్తరింపబడినది. ఆప్రకరణము నిచటజూడవలెను. 10-11 మన్త్రములలో నుదాహరింపబడిన నుపసంహారక్రమమంతయు నీమంత్రములో బాటింపబడకపోయినను నారెండు మంత్రముల కీమంత్రము వ్యాఖ్యానస్థానీయమగుట వానినే యిచట జెప్పబడిన యుపసంహారక్రమముగ భావింపనగును. 13

అ॥ ఇట్టి యుపాయము నవలంబించి యాత్మదర్శనము చేయుడని యజ్ఞానమునందు నిద్రించుచున్నవారిని శ్రుతిమాత మేల్కొలుపుచున్నది.

మూ॥ ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత క్షురస్య ధారా నిశితా దురత్యయా దుర్గంపథ స్తత్కవయో వదన్తి. 14

టీ॥ అజ్ఞానమునందు నిద్రించుచున్న యోజీవులారా! మీరు లెండు; అజ్ఞాననిద్రనుండి మేల్కొని జాగరూకులు కండు; శ్రేష్ఠుడగు గురువునుబొంది తెలిసికొనుడు; పదునుగల కత్తివాడి దాటుట కెట్లుశక్యముకాదో అటులనే యాత్మ మార్గము దుస్సాధమని విద్వాంసులు బలుకుచున్నారు.

తా॥ వి॥ సర్వప్రపంచము మిథ్యాజ్ఞానవిజృంభితము, కర్తృక్రియాఫలసంకులము, నామరూపకర్మాశ్రయము. ఆత్మ స్వరూపమును దెలిసికొని దానియందు సర్వమును లయింపజేసినవాడు స్వస్థుడు పరిశాన్తమనస్కుడు కృతకృత్యుడు నగుచున్నాడు. ఎండమావుల నీటిభ్రమయు రజ్జువునందలి సర్పభ్రమయు యథార్థస్వరూపజ్ఞానముచే తొలగిపోవుచున్నవి. అటువలెనే ఆత్మదర్శనార్థమై యనాదియగు నవిద్యయందు గాఢనిద్రజెందినవారి నీమంత్రము నిద్రలేపి యాత్మజ్ఞానాభిముఖులుగా జేయుచున్నది. అజ్ఞాననిద్ర సర్వానర్థబీజము. ప్రకృష్టుడగు నాచార్యు నాశ్రయించి యాతని యనుగ్రహముచే నేనే యాత్మనని తెలిసికొనవలెను. ఆత్మజ్ఞానమతిసూక్ష్మబుద్ధి విషయము. అనాత్మభూతమగు సర్వప్రపంచము నసంస్పృష్టుడై కత్తివాడిని దాటినట్లు దాటవలెను. శరీరము లనిత్యములు గనుక నాత్మజ్ఞానసంపాదనముకొఱ

ఆత్మజ్ఞానమునుగూర్చి త్వరపడవలయును.

కాలస్యము చేయరాదని మోక్షముగోరువారలకు హెచ్చరిక చేయబడుచున్నది. 14

అ॥ దర్శనార్థమిట్లు హెచ్చరిక చేయబడిన యాత్మ సూక్ష్మతమమని సామాన్యముగ జెప్పబడినది. ఆ సూక్ష్మతమత్వమిచట వివరింపబడుచున్నది.

మూ॥ అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసం నిత్యమగన్ధవచ్చ యత్ అనాద్యనన్తం మహతః పరం ధ్రువం
నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే ॥ 15

టీ॥ ఆత్మ శబ్దరహితము, స్పర్శరహితము, రూపరహితము, నాశరహితము, రసరహితము, గంధరహితము, నిత్యము, అనాది, అనంతము, బుద్ధికంటె భిన్నము. అట్టి యాత్మతత్త్వము శాశ్వతమయినదానినిగా నెఱింగినవాడవిద్యాకామకర్మఫలమగు మృత్యువునుండి ముక్తుడగును.

తా॥ వి॥ పృథివియందు గంధరసరూపస్పర్శశబ్దములను నైదుగుణములుండుటచే నదిస్థూలతమమయి చక్షురాదిపంచేన్ద్రియములకు విషయమగుచున్నది. జలమునందు రసాదిచతుర్గుణములుండుటచే నది శ్రోత్రాదినాలుగింద్రియములకు విషయమగుచున్నది. అందుచే పృథివికంటె జలము సూక్ష్మతరమగుచున్నది. అటులనే తేజోవాయ్వాకాశములు పైగుణములలో క్రమముగా మూడు రెండు ఒకటి గుణములకు మాత్రమాకరమయి మూడు రెండు ఒక యింద్రియములకు మాత్రము విషయములగుచున్నవి. ఒక దానికంటె నొకటి

తక్కువగుణములు గలదగుటచే నొకదానికంటె మరియొకటి సూక్ష్మతరమగుచున్నది. గుణములున్నచోట సూక్ష్మభావముయొక్క తరతమభావ మేర్పడుచున్నది. సర్వగుణవిహీనమగు పదార్థమునుగూర్చి యిట్లు సూక్ష్మభావముయొక్క తారతమ్యము చెప్పశక్యముకాదు. కనుక నాపదార్థము నిరపేక్షము సూక్ష్మతమునగుచున్నది. అందుచేనది నింద్రియగ్రాహ్యము గానేరదు. శబ్దాదిగుణములుగల పదార్థములు వికారమును బొందునవగుటచే నవి యనిత్యములు. ఆత్మ గుణవిహీనమగుటచే నిర్వికారము నిత్యము. పృథివ్యాదులు కార్యములగుటచే వానికాది గలదు. కారణమునందవి లయమొందును. ఆత్మ సర్వకారణమగుటచే నది యాదిలేనిదగుచున్నది. దానికి కారణము లేకుండుటచే నది కార్యము గానేరదు. కార్యము కాకుండుటచే దానికి లయములేదు. దానికిగూడ కారణమున్నచో ననవస్థాప్రసంగము సంభవించును. అది యనంతము నిత్యవిజ్ఞానస్వరూపమునగుటచే బుద్ధికంటె విలక్షణము. సర్వభూతము లాత్మస్వరూపములగుటచే నతడు సర్వసాక్షియగుచున్నాడు. నిత్యమగుటచే ధ్రువమగుచున్నాడు. ఈ విధముగ బ్రహ్మస్వరూపమును దెలిసికొనినవా డవిద్యాకామకర్మలక్షణమగు మృత్యుముఖమునుండి తప్పించుకొనును. 15

ఆత్మస్వరూపము.

అ॥ నాచికేతోపాఖ్యానఫలశ్రుతికథనముతో మూడవ వల్లి యుపసంహరింపబడుచున్నది.

మూ॥ నాచికేతముపాఖ్యానం మృత్యుప్రోక్తం సనాతనమ్ ఉక్త్వా శ్రుత్వా చ మేధావీ బ్రహ్మలోకే మహీయతే॥ 16
య ఇమం పరమం గుహ్యం శ్రావయేత్ బ్రహ్మసంసది ప్రయతః శ్రాద్ధకాలే వా తదానన్త్యాయ కల్పతే తదానన్త్యాయ కల్పత ఇతి ॥ 17

టీ॥ యమునిచే నుపదేశింపబడినట్టియు నచికేతసునిచే గ్రహింపబడినట్టియు వైదికమగుటచే చిరంతనమయినట్టియు నీయుపాఖ్యానమును బ్రాహ్మణులకుపదేశించియు నాచార్యుని వలన శ్రవణముజేసియు బురుషుఁడు బ్రహ్మలోక మునందాత్మ భూతుఁడయి యుపాస్యుఁడగుచున్నాఁడు. శ్రేష్ఠమయినట్టియు గోప్యమయినట్టియు నీయుపాఖ్యానము నెవఁడు "శుచియై బ్రాహ్మణసభయందును, శ్రాద్ధకాలమునందు బ్రాహ్మణులకును వినుపించునో" యట్టివాని సత్క్రృత్యమనన్తఫల ప్రదమగును. నిశ్చయము. 16–17

ప్రథమాధ్యాయము – మూఁడవవల్లి సమాప్తము.

## ద్వితీయాధ్యాయము - ప్రథమవల్లి

అ॥ ఆత్మ బుద్ధిగుహాయందున్నను అవిద్యావరణముచే నయ్యది బుద్ధికగోచరమగుచున్నదని 1–3–12 మంత్రమున నుదాహరింపబడినది. ఇందుల కవిద్యావరణమేగాక యాగంతుకమగు నింద్రియప్రతిబంధముగూడ కారణమగుచున్నదని బోధించుట కీవల్లి యారంభింపబడుచున్నది. ప్రతిబంధజ్ఞానము వలన ప్రతీకారజ్ఞానము కలుగును.

మూ॥ పరాచః కామాననుయన్తి బాలాస్తే మృత్యోర్యన్తి వితతస్య పాశమ్ । అథ ధీరా అమృతత్వం విదిత్వా ధ్రువమధ్రువేష్విహ న ప్రార్థయన్తే ॥ 2

టీ॥ అల్పప్రజ్ఞకలవారు దృష్టాదృష్టమగు భోగాసక్తిచే నరికట్టబడిన యాత్మదర్శనము గలవారయి బాహ్యములగు కామ్యవిషయముల ననుసరించెదరు. మృత్యుపాశమునబడి యనవరతమగు జన్మమరణజరారోగాద్యనేకానర్థవ్రాతమును బొందెదరు. ధీరులగువారు ప్రత్యగాత్మస్వరూపావస్థానస్వరూపమగు నమృతత్వము నిశ్చితముగా దెలిసికొని యనర్థప్రాయమగు సంసారమును గోరరు. పుత్రవిత్తలోకైషణములనుండి దూరమగుటయే దీనిఫలము. 2

అ॥ ఆత్మచైతన్యము సర్వవ్యవహారసాధనమని ముందు మూడుమంత్రములలో జూపబడుచున్నది.

మూ॥యేన రూపం రసం గన్ధం శబ్దాన్ స్పర్శాగ్ంశ్చ మైథునాన్। ఏతేనైవ విజానాతి కిమత్ర పరిశిష్యతే,॥ ఏతద్వైతత్॥ 3
స్వప్నాన్తం జాగరితాన్తం చోభౌ యేనానుపశ్యతి। మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి. 4. య ఇమం మధ్వదం వేద ఆత్మానం జీవమన్తికాత్। ఈశానం భూతభవ్యస్య న తతో విజుగుప్సతే,॥ ఏతద్వైతత్॥ 5

టీ॥ దేహాదివ్యతిరిక్తము విజ్ఞానస్వభావము నగు నీ యాత్మయను సాధనముచేతనే ప్రాణిజాతమంతయు రూపమును గంధమును రసమును శబ్దమును స్పర్శమును దాంపత్యసౌఖ్యములను సంపూర్ణముగ దెలిసికొనుచున్నది. ఆత్మసాధ

నముచే దెలియబడని విషయ మేమియు లేదు. ఇదియే నచికేత
సుడు దెలిసికొనగోరిన యాత్మ. 3

స్వప్నమధ్యమును జాగరితమధ్యమును ఏ యీ
యాత్మ యనుసాధనముచేత లోకము దెలిసికొనుచున్నదో
యట్టియాత్మ మహత్తుగను సర్వవ్యాపిగను జ్ఞానియగువాడు
భావించి దుఃఖింపడు. 4

కర్మఫలము ననుభవించుజీవుడు కాలత్రయనియామకు
డును అత్యన్తసమీపవర్తియు నగునాత్మకంటె నన్యముగాదని
యెవడు దెలిసికొనునో యట్టివా డీశ్వరునికంటె దాననన్యు
డనుజ్ఞానము గల్గియుండుటవలన తనను తాను శిక్షించుకొన
గోరడు. ఇదియే నచికేతసుడు దెలిసికొనగోరిన యాత్మ. 5

తా॥ వి॥ జ్ఞానియగువాడు దెలిసికొనగోరతగిన యాత్మ
వస్తువు లేదనుసందేహమిచట తీర్చబడుచున్నది. సర్వేన్ద్రియ
ములు వ్యాపారవంతములుగనున్న జాగ్ర
దవస్థయందును మనస్సుదక్క నితరేంద్రి
యములన్నియు నుపరమావస్థను జెందిన

ఆత్మ సర్వవ్యవహార సాధనము

స్వప్నావస్థయందును మనుజుడు శబ్దాదిబాహ్యవిషయములను
దెలిసికొనుచున్నాడు. సర్వేన్ద్రియములు మనస్సు గూడనుపర
మావస్థను బొందిన సుషుప్త్యవస్థయందతడు సంపూర్ణ సుఖ
మును సర్వవిషయ కాజ్ఞానము ననుభవించుచున్నాడు. సుఖ
ముగా నిద్రించితిని, నాకేమియు దెలియలేదని నిద్రలేచి
చెప్పుచున్నాడు. ఇట్టియనుభవము మనఇంద్రియములకంటె

భిన్నమగు చేతనవస్తుసహాయమున గలుగుచున్నది. అచేతనమగు నిన్ద్రియాది దేహసంఘాతమున కీవిజ్ఞాతృత్వసామర్థ్యము లేదు. దేహాదులకే యిట్టిసామర్థ్యమున్నచో రూపము మఱియొకరూపమును శబ్దము మఱియొకశబ్దమును గ్రహింపవలసియుండును. అటుల జరుగుటలేదు. కనుక సర్వమానసికవృత్తిప్రకాశకమగు నాత్మతేజస్సు దేహాదివ్యతిరిక్తమగునది మఱియొకటి యుండితీరవలయును. కాని యజ్ఞానముచేత జనసామాన్యము మానసికవృత్తులను వానినధిష్ఠించియున్న ఆత్మతేజస్సును బ్రత్యేకింపలేక మనస్సుచేతనే జ్ఞానము కలుగుచున్నదని భ్రమజెందుచున్నారు. మనోవృత్తులను బ్రకాశింపజేయుటచే నాత్మతేజస్సు జ్ఞానసాధనమగుచున్నది. ఈయాత్మతేజస్సే యన్తఃకరణోపాధిచే జ్ఞానకర్త యగుచున్నది. ఆత్మక్రియావిహీనము గనుక నిజముగా దానికి కర్తృత్వమును జెప్పవీలులేదు. అన్తఃకరణోపాధివశముచే నద్దానికి గర్తృత్వమాపాదింపబడుచున్నది. జ్ఞానసాధనములగు మానసికవృత్తులుగూడ నాత్మతేజస్సుచేతనే నుద్దీపితములగుటచే నుపాధికృతమగు జ్ఞానసాధనత్వముగూడ నాత్మకాపాదింపబడుచున్నది. ఇట్లుపాధివశమున నాత్మకు జ్ఞానకర్తృత్వకరణత్వములు సిద్ధించుచున్నవి. ఆత్మతేజస్సు సర్వావభాసకము. దానిచే దెలియబడనిదేదియును లేదు. ఆత్మ సర్వజ్ఞము; సర్వావభాసకము; ధర్మాధర్మేతరము; సర్వోత్కృష్టము; ఇట్టియాత్మనే నచికేతసుడు యమునివలన దెలిసికొనగోరెను. అట్టియాత్మయే జీవుడని తెలిసికొనినధీరుడు సర్వదుఃఖ విదూరు

డగును. అభయమగు స్థైర్యమును బొందును. ఇతరులచే సంరక్షణము నతడు గోరనవసరము లేదు. రెండవవాడున్నప్పుడే భయమునకు సంరక్షణమునకు నవసరము గలుగును. ఇట్టిప్రత్యగాత్మ సర్వవ్యాపకము మహత్తమమునని చెప్పుటచే బ్రత్యక్పరమాత్మల కభేదము చెప్పబడుచున్నది. 3-5

అ॥ ప్రత్యగాత్మయే సర్వాత్మయని దిగువరెండు మన్త్రములలో సిద్ధముచేయబడుచున్నది.

మూ॥ యః పూర్వం తపసో జాతమద్భ్యః పూర్వమజాయత। గుహాం ప్రవిశ్య తిష్ఠన్తం యో భూతేభిర్వ్యపశ్యతే.॥ ఏతద్వైతత్॥ 6

యా ప్రాణేన సంభవత్యదితిర్దేవతామయీ। గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీం యా భూతేభిర్వ్యజాయత.॥ ఏతద్వైతత్॥ 7

టీ॥ ఏ ముముక్షువు జలములు మొదలగు పంచీకృత పంచభూతములకంటె పూర్వమే జ్ఞానాత్మకమగు బ్రహ్మము వలన జన్మించెనో, ఎవడుద్భవించినతరువాత నీలోకమునందు భూతములతోగూడ హృదయాకాశమును బ్రవేశించెనో ఆ హిరణ్యగర్భుడే నచికేతసుడు తెలిసికొనగోరిన బ్రహ్మము. 6

సర్వకర్మఫలానుభవిత యగుటచే నదితియని పిలువబడుచు హిరణ్యగర్భరూపమున భూతములలోఁగూడ పరబ్రహ్మమునుండి యుద్భవించి బుద్ధిగుహాయందు బ్రవేశించినట్టి యేశక్తి గలదో ఆశక్తియే నచికేతసుడు తెలిసికొనగోరిన బ్రహ్మము. 7

తా॥ వి॥ మాయాసృష్టమగు జగత్తునందు హిరణ్యగర్భుడు ప్రథమశరీరి. ఇతడు సర్వప్రాణికోటియొక్క సమష్టిస్వరూపుడు. ఇతడే వివిధయోనులయం దుద్భవించి జీవుడను పేర వ్యవహరింపబడుచున్నాడు. జీవుడతని వ్యష్టిరూపము. ఈ మంత్రములయందు సర్వసృష్టికారణమగు పరబ్రహ్మమునకును, సమస్తప్రాణికోటిసమష్టిరూపుడగు హిరణ్యగర్భునకును, కర్మఫలభోక్తయు వ్యష్టిరూపుడునగు జీవునికిని, గుహానివిష్టమగు ప్రత్యగాత్మకును నైక్యము చెప్పబడుచున్నది. ఒకేయాత్మకు నుపాధిభేదముచే నింద్రుడు చంద్రుడు నరుడు పశువు పక్షి మొదలగు భిన్నవ్యవహారములేర్పడి తత్తదుపాధిసహజమగు కర్మఫలానుభవము సంప్రాప్తమగుచున్నది. ఉపాధివశముచే జీవులనేకులుగా గాన్పించుచున్నారు. అతడు నిజముగానొకడే, ప్రత్యగాత్మకంటె వేఱుగాదు. 6-7

పరబ్రహ్మము యొక్క సర్వాత్మత్వము.

అ॥ హిరణ్యగర్భునియొక్క సర్వాత్మత్వము సోదాహరణముగ వివరింపబడుచున్నది.

మూ॥ అరణ్యోర్నిహితో జాతవేదా గర్భ ఇవ సుభృతో గర్భిణీభిః। దివే దివ ఈడ్యో జాగృవద్భిర్హవిష్మద్భిర్మనుష్యేభిరగ్నిః॥ ఏతద్వై తత్ 8. యతశ్చోదేతి సూర్యోऽస్తం యత్ర చ గచ్ఛతి। తం దేవాః సర్వేऽర్పితాస్తదు నాత్యేతి కశ్చన॥ ఏతద్వై తత్ 9. యదేవేహ తదముత్ర యదముత్ర తదన్విహ। మృత్యోః సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి॥ 10

టీ॥ శుచిమితాహారముచే గర్భిణీస్త్రీలచే రక్షింపబడు గర్భమువలె నుత్తరాధరారుణులయందు కాపాడబడుచున్న యజ్ఞాధికృతమగు నగ్ని సర్వహవిర్భోక్తయగుటచే ఋత్విక్కులు యజమానులుగూడ నప్రమత్తులయి నద్దాని గాపాడుచున్నారు. స్తోత్రము చేయుచున్నారు. అగ్న్యుపాసకులు ధ్యానభావనములచే నిజహృదయసీమలయం దగ్నిని నెలకొలిపి యుపాసించుచున్నారు. హిరణ్యగర్భు డిట్టియగ్నిస్వరూపుడే యగుచున్నాడు. ఈ యగ్ని యాబ్రహ్మమే॥ 8

ప్రాణాత్మకుడగు నే హిరణ్యగర్భునియందు సూర్యునికి ఉదయాస్తమయములు గలుగుచున్నవో రథచక్రమునందాకులవలె నగ్న్యాదిదేవతలందరు వాగాదులుగూడ నెవ్వానియందు సంధానముచేయబడుచున్నారో యట్టి హిరణ్యగర్భుడు సర్వాత్మకమగు బ్రహ్మనే యగుచున్నాడు. పరబ్రహ్మమును మించి యెవడును తదన్యము గాలేడు. ఇట్టి పరబ్రహ్మమునే నచికేతసుడు తెలిసికొనగోరెను. 9

ఈలోకమున నేదిగలదో యదియే పరమున గలదు. పరమున నేదిగలదో నదియే యీలోకమునగూడ గలదు. ఎవ్వడిచట నానాత్వమును జూచుచున్నాడో యతడు మరణపరంపరను బొందును. 10

తా॥ వి॥ సమిష్టిస్వరూపుడగు హిరణ్యగర్భుని సర్వాత్మత్వము అగ్న్యుదాహరణముచే వివరింపబడుచున్నది. మోక్షైకసాధనమగుపరబ్రహ్మము సర్వాత్మభావమని చెప్ప

దలచి ప్రథమశరీరి యగుహిరణ్యగర్భు డిచట ముందుగా బ్రస్తావింపబడినాడు. అదేతీరున, నగ్నిచయనాదియాగ ములయం దుపాస్యమగు నగ్ని దేవతయు తదుపలక్షితమగు నితర దేవతలుగూడ బ్రహ్మ స్వరూపులే యగుచున్నారు. వీరందఱు బ్రహ్మానన్యులయినను ఉపాధిభేదముచే విభిన్నులుగ కాన్పించు చున్నారు. అజ్ఞానముచే నేను వేఱు బ్రహ్మము వేఱని ప్రపంచమున నానాత్వమును జూచువాడు జననమరణపరంప రకు లోనగును. విజ్ఞానరసైకము పరిపూర్ణము నగు బ్రహ్మము నేనే యని తెలిసికొనువా డమర్త్యుడయి బ్రహ్మత్వమునొందును. 8-9-10

నానాత్వభావము మృత్యుకారణము

అ॥ అజ్ఞానజన్యమగు నీనానాత్వబుద్ధి నశించు నుపా యము చెప్పఁబడుచున్నది.

మూ॥ మనసైవేదమాప్తవ్యం 'నేహ నానాస్తి కిఞ్చన। మృత్యోః స మృత్యుం గచ్ఛతి య ఇహ నానేవ పశ్యతి॥ 11

టీ॥ ఏకరసాత్మకమగు నీపరబ్రహ్మ మాచార్యశాస్త్ర సంస్కృత మగు మనస్సుచేత బొందదగియున్నది. అద్వితీయ మగు బ్రహ్మమొకటియే గలదు, తదన్యమేమియు లేదను జ్ఞానము గలుగుచుండగా నవిద్యయు తత్కృతమగునానాత్వ బుద్ధియు నశించును. అజ్ఞానతిమిరముచే గప్పబడినదృష్టిగలవా నికి బ్రహ్మమునందు నానాత్వము గనుపడును. బ్రహ్మమున కును దనకును భేదమున్నదను భావమెంతస్వల్పముగానున్నను

అది మృత్యుపరంపరకు గాననమగును. ఫలవ్యాప్యత్వములేని మనస్సుచే బ్రహ్మము దెలియబడుచున్నాడు. ఈ విషయము మాచేరచింపబడిన పంచదశి తృప్తిదీపము 90 శ్లోకము ఈ సంపుటము 66 వ పుటన సంపూర్ణముగ వివరింపబడినది. చదువరులీవిషయము నచట చూడదగును. 11

అ॥ పరమాత్మ హార్దాకాశమున దర్శనయోగ్యమగు చున్నాడనువిషయము వివరింపబడుచున్నది.

మూ॥ అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి।
ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ॥ 12

టీ॥ అద్వితీయ మగునీపరమపురుషు డంగుష్ఠమాత్ర పరిమాణము గలిగి శరీరమధ్యనున్న హార్దాకాశమునందుండును. అట్టియాత్మ కాలత్రయనియమనకర్త యని యెఱింగిన వాడతనివలన దనను రక్షించుకొనగోరడు. ఇదియే తెలిసికొనదగిన యాబ్రహ్మము.

తా॥ వి॥ హృదయాకాశమంగుష్ఠపరిమాణము. బ్రహ్మము వస్తుతః సర్వవ్యాపి యయినను అంతటనున్న శబ్దము రేడియోముఖమున నభివ్యక్తమయిన ట్లియ్యది హార్దాకాశమున సాక్షాత్కార్యమగును. హార్దాకాశము సాక్షాత్కారస్థానమని చూపించుటయందు మాత్రమే శ్రుతితాత్పర్యము. అంగుష్ఠపరిమాణమగు హార్దాకాశమందంతటను నతడు నిండియున్నాడనుటచే నద్దాని సర్వవ్యాపనస్వభావ మర్థాత్సిద్ధమగుచున్నది. బ్రహ్మమునకు స్వయముగ బరిమాణములేదు.

దానియుపలబ్ధిస్థానమగు హార్దాకాశముయొక్క అంగుష్ఠపరిమాణ మద్దానియందారోపింపబడుచున్నది. ఆతీరుననే సూక్ష్మమధ్యమమహత్పరిమాణములుగల మశకమనుష్యాశ్వరవిబింబములంతట నదివ్యాపించియుండుటచే బ్రహ్మముగూడ నానాయాపరిమాణములు గలిగియున్నట్లు 1-2-20 మన్త్రమున వర్ణింపబడినది. కాలముగూడ సృష్టిలోనన్తర్భాగమగుటవలన బ్రహ్మము దానికిగూడ నతీతమయి దానికి నియంతయగుచున్నది. 12

అ॥ బ్రహ్మముయొక్క యస్తిత్వము సందేహాస్పదమగుటవలన నద్దాని దనకుపదేశింపుడని నచికేతసుడు యముని గోరెను. అందువలన బ్రహ్మముయొక్క యస్తిత్వమింతవఱకు సిద్ధముచేయబడినది. నచికేతసుని ప్రశ్నముయొక్క రెండవ భాగమున కిచటసమాధానము చెప్పబడుచున్నది.

మూ॥ అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః।
ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉ శ్వః॥ ఏతద్వైతత్॥ 13

టీ॥ అంగుష్ఠమాత్రుడగు నీపురుషుడు ధూమముచే గప్పబడని జ్యోతిస్సును బోలియున్నాడు. యోగిహృదయములయందిట్లు నిరూపింపబడిన సర్వకాలనియంతయగు నాపురుషు డగసాలెదిమ్మెవలె నిర్వికారుడు నిత్యుడునగుచున్నాడు. అతడు కాలత్రయము నందున్నవాడు. అతనితో సముడులేడు.

తా॥ వి॥ బ్రహ్మము నిత్యమనుటచే క్షణికత్వవాదము నిరసింపబడుచున్నది. అద్దాని తేజస్సనాచ్ఛాదితమయి స్వయం ప్రకాశమగుచున్నదని భావము. 13

అ॥ నానాత్వమును జూచువానికి గలుగునష్ట ముదాహరింపబడుచున్నది.

మూ॥ యథోదకం దుర్గే వృష్టం పర్వతేషు విధావతి।
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యంస్తానేవానువిధావతి ॥ 14

టీ॥ ఎత్తగు పర్వతములమీద గురిసినవర్షము పల్లపు ప్రదేశములకు నానాముఖముల బ్రవహించి యెట్లువిభిన్నప్రవాహములుగా జెదరినశించునో, అటులనే వివిధధర్మములను దనకంటె భిన్నముగా భావించునతడు తనయుచ్చైర్గతినుండి పరిచ్యుతిజెంది వివిధమార్గముల నధఃపతితుడై నశించుచున్నాడు. 14

అ॥ జ్ఞానియొక్క విశుద్ధమగు మనస్సుచే నాత్మయొక్క పారిశుద్ధ్యమును దెలిసికొనదగునని చెప్పుచున్నాడు.

మూ॥ యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి।
ఏవం మునేర్విజానత ఆత్మా భవతి గౌతమ॥ 15

టీ॥ శుద్ధోదక మొకసాధనముచే గొంతభాగము వేరు చేయుబడినను మఱలనాశుద్ధోదకమునందు బోయబడినప్పుడందులో కలిసిపోవును. అదేవిధముగ మననశీలుడగు జ్ఞానియొక్క యాత్మనిర్మలమగును.

తా॥ వి॥ పర్వతశిఖరమునందు కురిసినవర్ష జల మత్యంతము స్వచ్ఛము. దుర్గమమగుటచే తదతిరిక్తపదార్థములకు దూరమయి యేకరసస్వరూపమగుచున్నది. స్వస్థానమునుండి భ్రంశమును జెందినపుడది నానాముఖమయి యుపాధిధర్మము నొంది కటుకషాయతిక్తాదిరుచుల గాంచును. అటులనే పరమాత్మ యత్యంతదుర్గమమగునుచ్చస్థితియందు స్వచ్ఛము నేకరసము నగుచున్నది. అశేషకాలుష్యవిరహము ఏకాగ్ర్యమునగు యోగిచిత్తమునకు మాత్రమది సువిజ్ఞేయము. ఇదియే దుర్గశబ్దార్థము. అద్వితీయమగు నిట్టియుచ్చైర్గతినుండి భ్రష్టుడగువాడు ద్వైతవిశిష్టము నానాముఖమునగు నధఃపతనమునొంది నానాశరీరములనుమాత్రము చూచునుగానియతని చూపు పైకి బ్రసరింపలేదని తాత్పర్యము. పర్వతముమీది నుండి జలము క్రిందికెంతసులభముగా బారలునో యంత యప్రయత్నముగ సుశిక్షితముగాని మానుషచిత్త మధఃపతనహేతువులగు వివిధవిషయములమీదికి బ్రసరించును. ఇది పర్వతవర్షజలోపమానస్వారస్యము. మననశీలుడగు జ్ఞాని కుతర్కదూషితము నాస్తికభావవికృతము నగుదృష్టినుండి మరలి శాస్త్రోపదిష్టమగు సన్మార్గమున నడచి ప్రత్యక్పరమాత్మల యనన్యత్వమును గ్రహింపగలడు. అపుడు శుద్ధోదకము శుద్ధోదకములో గలిసి స్వస్వరూపమును బోగొట్టుకొనినట్లు జీవుడుగూడ స్వస్వరూపమును బొందును. ఇదియే శుద్ధోదకోపమానము యొక్క యర్థము. 15

ద్వితీయాధ్యాయము - ప్రథమవల్లి
సమాప్తము.

## ద్వితీయాధ్యాయము - ద్వితీయవల్లి

అ॥ బ్రహ్మతత్త్వము దుర్విజ్ఞేయమగుటచే నద్దానిని బ్రకారాంతరమున వివరించుటకు ద్వితీయవల్లి యారంభింపబడుచున్నది.

మూ॥ పురమేకాదశద్వారమజస్యావక్రచేతసః। అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యతే,॥ ఏతద్వైతత్ ॥ 1

టీ॥ పదునొకండుద్వారములతో గూడిన నగరమునకు బోల్పదగిన యీశరీరము జన్మాదివిక్రియారహితము అకుటిలము విజ్ఞానైకస్వరూపము నగునేయాత్మకొఱకు నిర్దేశింపబడినదో యట్టియాత్మను విజ్ఞానపూర్వకముగ ధ్యానించువాడు శోకమునొందడు. అతడు సమస్తైషణములనుండి విముక్తుడయి యవిద్యానిమిత్తమగు కామకర్మబంధమునుండి తొలగి పునర్జన్మమునొందడు. ఇదియే నచికేతసుడు దెలిసికొనగోరిన యాత్మ.

తా॥ వి॥ వాక్చక్షుశ్శ్రోత్రఘ్రాణములను నేడు, నాభి యొకటి, మూత్రపురీషద్వారములు రెండు, బ్రహ్మరంధ్ర మొకటి మొత్తము పదునొకండుద్వారములతో నీశరీరమలరారుచున్నది. ఏకాదశద్వారవిశోభితమగు నీశరీరనగరమును రాజగునాత్మ స్వతంత్రమయి యధిష్ఠించియున్నది. అయ్యది యచటనుండుటకును నుండకుండుటకును స్వతంత్రము. శరీరస్వామి యగునాత్మ సూర్యప్రకాశమువలె నకుటిలము విజ్ఞానస్వరూపము. ఇట్టిపరమేశ్వరుని విజ్ఞానపూర్వకముగ

దెలిసికొని ధ్యానించువాడు సమస్తైషణలు తొలగి దుఃఖ విదూరుడగును. పరమేశ్వరస్వరూపజ్ఞానముచే నభయప్రతిష్ఠితుడయి, భయకారణములేనివాడగుటచే నవిద్యాకృతమగు కామకర్మబంధములు వీడి తిరిగి జన్మము నెత్తడు. 1

అ॥ ఆత్మ సర్వశరీరవర్తియని చెప్పుచున్నాడు.

మూ॥ హగ్ంసః శుచిషద్వసురన్తరిక్షసద్ధోతా వేదిషదతిథిర్దురోణసత్। నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥ 2

టీ॥ ఈ యాత్మ సర్వశరీరవర్తియగుచున్నది. నిష్కళంకమయిన యాకాశమునందు, సూర్యునియందు, అగ్నిహోత్రవేదియందు, పృథివియందు, అగ్నియందు, యజ్ఞమునందలి హోమపాత్రమందు, అతిథియందు, మనుష్యులందు, దేవతలయందు, సత్యమునందునున్నది. శంఖశుక్తిమకరాదిరూపమున జలములయందుద్భవించును. భూమియందు వ్రీహియవాది రూపమున జనించును. యజ్ఞాంగరూపమునొందుచున్నది. పర్వతములనుండి నద్యాదిరూపమున జనించును. అతడు సర్వాత్మకుడు, మార్పులేని స్వభావముగలవాడు, అందఱికంటెను మహత్తముడు. ఇట్లతడు సర్వాత్మస్వరూపుడు సర్వవ్యాపియు నగుచున్నాడు. 2

అ॥ ఆత్మయే ప్రాణాపానాదివృత్తులకు గారణమని చెప్పుచున్నారు.

మూ॥ ఊర్ధ్వం ప్రాణమున్నయత్యపానం ప్రత్యగస్యతి। మధ్యే వామనమాసీనం విశ్వేదేవా ఉపాసతే॥ 3

టీ॥ ఆత్మ ప్రాణవృత్తిని యూర్ధ్వభాగమును బొందించుచున్నది. అపానవృత్తిని యధోభాగమును బొందించుచున్నది. హృదయకమలమధ్యవర్తియై యుండతిచేనుపాస్యమగుచున్నది. దానినే దేవతలంద రుపాసించుచున్నారు. చక్షురాదీన్ద్రియములు రూపాదివిషయవిజ్ఞానాత్మకమగు బలిసమర్పణచే నతనిని సేవించుచున్నవి.

తా॥ వి॥ ముఖ్యప్రాణవాయువే శరీరమునందు ప్రాణాపానవ్యానసమానోదానములను నైదువృత్తుల వ్యవహరించుచున్నది. ప్రాణవాయురూపమున నుచ్ఛ్వాసముల జరుపుచున్నది. అపానరూపమున నధోగామియై పతనములేని శరీరస్థితికి హేతువగుచున్నది. వ్యానము నరములకు పుష్టినిచ్చుచున్నది. సమాన మాహారమును జీర్ణముచేయును. ఉదానముచే మాటలాడుచున్నాము. వివిధవాయువు లాత్మబలముచేతనే తమతమ విధులను నిర్వర్తించుచున్నవి. స్వయముగానవి జడములు. అవి వ్యాపారవంతములగుటచే వానిని నడిపించునది యాత్మ యొకటి యున్నదని యూహించుచున్నాము. రథికుని ప్రేరణములేక రథచలనము గలుగదు. చక్షురాదీన్ద్రియములు రూపాదిబాహ్యవిషయజ్ఞానము నాత్మకు సమర్పించుటయే యతనిని సేవించుటయని యుత్ప్రేక్షింబడుచున్నది. 3

అ॥ ఆత్మసన్నిధిచేతనే శరీరము వ్యాపారవంతమగుచున్నదని చూపుచున్నాడు.

మూ॥ అస్య విస్రంసమానస్య శరీరస్థస్య దేహినః। దేహాద్విముచ్యమానస్య కిమత్ర పరిశిష్యతే,॥ ఏతద్వైతత్॥　　4

టీ॥ దేహియగునాత్మ దేహమునుండి జారిపోవుచుం డగా ఆపత్సమయమునందు రాజు నగరమునుండి వదలిపోయిన పుడు ప్రజలందఱు వెడలిపోయినట్లు శరీరమునందలి కార్యకరణ కలాపరూపమగు ప్రాణాదికమంతయు నిస్సత్త్వమయి కూలి పోవును. రాజులేచిపోయిన నగరమువలె చైతన్యములేని శరీ రము భోగానర్హమగుటచే నాత్మ శరీరముకంటె వేరని సిద్ధ మగుచున్నది. పైమంత్రమున ఆత్మ జీవనహేతువగు ప్రాణ ముకంటె వేరనిచూపబడినది. ఈమంత్రమునందు కార్యమగు శరీరముకంటె నతడు వేరని చెప్పబడుచున్నది. శరీరద్వార మున నభివ్యక్తుడగుటచే నతడు శరీరి యనబడుచున్నాడు. 4

అ॥ ప్రాణాదులచేతనే శరీరము జీవించుచున్నది. ప్రాణాదులు లేనపుడు శరీరము మరణించుచున్నది. వీనికంటె భిన్నమగు నాత్మయనునది మఱియొకటిలేదను పూర్వపక్షము నకు సమాధానము చెప్పబడుచున్నది.

మూ॥ న ప్రాణేన నాపానేన మర్త్యో జీవతి కశ్చన।
ఇతరేణ తు జీవన్తి యస్మిన్నేతావుపాశ్రితౌ ॥ 5

టీ॥ కేవలప్రాణాదివాయుపంచకముచేతగాని చక్షురా దీన్ద్రియములచేతగాని యే ప్రాణియు జీవించుటలేదు. సంఘా తములయిన ప్రాణాదివాయువులుగాని చక్షురాదీన్ద్రియములు గాని యాత్మప్రేరితములుగాక జీవింపనేరవు. వీనికంటె భిన్ను డగు నాత్మయనువాడొకడుండుటచేతనే వానికి సంఘాత మేర్పడి స్వస్వవ్యాపారక్షమములగుచున్నవి. 5

అ॥ బ్రహ్మజ్ఞానముచే సర్వసంసారోపరమము, తదజ్ఞానముచే మరణము సంప్రాప్తియను నీవిధానము రాబోవు మంత్రములో వర్ణింపబడుచున్నది.

మూ॥ హన్త త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్। యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ॥ 6

టీ॥ సనాతనము పరమరహస్యము నగుబ్రహ్మమును నీకు జెప్పుచున్నాను. బ్రహ్మజ్ఞానముచే సర్వసంసారోపరతియు అదిలేకపోవుటచే సంసారసంగతియు నన మరణమును గలుగుచున్నది. ఆవిధానమును నీకు దెలియజెప్పుచున్నాను వినుము. 6

అ॥ జననమరణము లజ్ఞానముచే సంభవించుచున్నవని చూపుచున్నాడు.

మూ॥ యోనిమన్యే ప్రపద్యన్తే శరీరత్వాయ దేహినః। స్థాణుమన్యేఽనుసంయన్తి యథాకర్మ యథాశ్రుతమ్ ॥ 7

టీ॥ మూఢులగుగొందఱు శుక్లశోణితసమన్వితులయి మాతృగర్భమును బ్రవేశించి శరీరధారులగుచున్నారు. మఱికొందఱు వారాచరించిన కర్మములకు విజ్ఞానమునకు ననురూపమగు వృక్షాదిస్థావరభావమును బొందుచున్నారు. 7

అ॥ స్వప్నోదాహరణముచే బ్రతిజ్ఞాతమగు బ్రహ్మమును బోధించుచున్నాడు.

మూ॥ య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః। తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే। తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన॥ ఏతద్వై తత్॥ 8

టీ॥ స్వప్నమునందు ప్రాణాదు లుపరమావస్థలో నుండగా నీయాత్మ కామినీభోగాదికామములను నిర్మించు కొనుచు మేల్కొనియుండును. దీనికవిద్యయే కారణము. స్వయముగా నాత్మ శుద్ధము, అమృతము. సమస్తలోకము లతనినాశ్రయించియున్నవి. అతడు సర్వలోకకారణుడు. అతని నేదియు నతిక్రమించిపోజాలదు. ఇదియే నచికేతసుడు తెలిసి కొనగోరిన బ్రహ్మము.

తా॥ వి॥ స్వప్నకాలమునందు సర్వేన్ద్రియములు నిర్వ్యాపారములయి నిద్రించుచుండగా చైతన్యముమాత్రముజాగ రూకతతోనుండి యవిద్యాకల్పితములగు ననేకకామములను కామ్యప్రపంచమును నిర్మించుకొని యనుభవించుచున్నది. అనుభవకాలమున స్వాప్నికానుభవముగూడ యదార్థము గానే కనుపించుచున్నది. ప్రాణాదులాత్మకావని నిర్ధారణ సేయుటకై యవి నిర్వ్యాపారములుగనుండు స్వప్నమిచట నుదాహరింపబడుచున్నది. స్వప్నప్రపంచమునంతకు నాత్మ చైతన్యమే కారణము. అతని నదియాశ్రయించియున్నది. అతనిని దాటి యది పోనేరదు. స్వయముగా నయ్యది శుద్ధము. 8

అ॥ శ్రుతిసమ్మతముగాని శుష్కతర్కముచే బుద్ధి చలించిన జిజ్ఞాసువులు కుటిలమనస్కులయి దరచుగానుపదే

శింపబడినను ప్రమాణసిద్ధమగు నాత్మతత్త్వమును గ్రహింప లేకుండుటచే వారి ననుగ్రహించుటకయి శ్రుతిమాత్ర యనే కోదాహరణపూర్వకముగ నద్దానిబోధించుచున్నది.

మూ॥ అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ। ఏకస్తథా సర్వభూతాన్తరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥ 9

టీ॥ ఆకృతిరహితము తేజఃస్వరూపము నగునగ్ని యొకటియేయయినను నీలోకమున బ్రవేశించి నదిదహించు కాష్ఠాదిరూపమున ఋజువక్రస్థూలసూక్ష్మగోళాది బహురూప ముల భాసించుచున్నది. ఆరీతిగానే పరమాత్మయొకటే యయినను వివిధదేహముల బ్రవేశించి యనేకరూపముల భాసించుచున్నదిగాని స్వయముగా నిర్వికారమే యగు చున్నది. 9

మూ॥ వాయుర్యథైకో భువనం ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపో బభూవ। ఏకస్తథా సర్వభూతాంతరాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ॥ 10

టీ॥ రూపరహితము స్పర్శలక్షణము గలవాయువొ క్కటి యయినను ప్రాణవాయురూపమున సకలదేహముల యందు బ్రవేశించి యాయారూపములను బొందుచున్నది. ఆతీరుననే యద్వితీయమగు పరమాత్మ సకలశరీరములను బ్రవేశించి యనేకరూపముల భాసించుచున్నది కావున స్వయ ముగ నిర్వికారము. 10

మూ॥ సూర్యో యథా సర్వలోకస్య చక్షుర్న లిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః। ఏక_స్తథా సర్వభూతా_న్తరాత్మా న లిప్యతే లోకదుఃఖేన బాహ్యః ॥ 11

టీ॥ సూర్యుడు ఆలోకముననుగ్రహించుటచే సకల ప్రాణులకు నేత్రభూతుడయియు నశుచిపదార్థదర్శనాదిజన్యములగు బాహ్యదోషములచే స్వయముగా నసంస్పృష్టుడగుచున్నాడు. అదేవిధముగా సకలభూతముల యంద_న్తర్యామి రూపమున బ్రకాశించుచున్న యద్వితీయమగు పరమాత్మ లోకసంబంధమగు దుఃఖముచే నసంస్పృష్టమగుచున్నది.

తా॥ వి॥ సమ_స్తవ_స్తువులను జూచుటలో సూర్యుడు తనకాంతిచేత మూత్రపురీషాద్యశుచివ_స్తువులను బ్రకాశింప జేయుచు మనకు నేత్రప్రాయుడగుచున్నాడు. అయినను నత డాయశుచిచే లిప్తుడగుట లేదు. అదేవిధమున వివిధదేహముల యందు బ్రకాశించుచున్న యద్వితీయమగు నాత్మ వానిసుఖ దుఃఖములచే సంస్పృష్టము కాదు. అయ్యది లోకదుఃఖమునకు బాహ్యము. దుఃఖమవిద్యాకృతమగు కామకర్మకలాపముచే సంభూతమయి యాత్మయందారోపిత మగుచున్నది. పరమార్థమున నదియాత్మను స్పృశింపదు. త్రాటియందు గాన్పించు సర్పము త్రాటిని స్పృశింపదు. అది త్రాటినిజూచువారి భ్రమైకసముద్భూతము. నిర్గుణమగు నాత్మయందజ్ఞానముచే జన్మమరణాదిదుఃఖానుభవ మారోపితమగుచున్నది. సకల భూతా_న్తర్యామియై నిజతేజోవభాసనముచే నీ యాత్మ సర్వ

వ్యవహారప్రవర్తక మగుటంజేసి సర్వాన్తర్యామియగు చున్నది. 9-11

అ॥ ఆత్మకంటె నధికుడుగాని సమానుడుగాని మఱి యొకడెవరును లేడని చెప్పుచున్నాడు.

మూ॥ ఏకో వశీ సర్వభూతాన్తరాత్మా ఏకం రూపం బహుధా యఃకరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్ ॥ 12

టీ॥ ఆత్మ అద్వితీయము. సమస్తజగత్తును దనవశ మునం దుంచుకొన్నది. సర్వభూతముల కంతరాత్మయు నగు చున్నది. శుద్ధవిజ్ఞానరూపియై యుపాధిభేదవశమున ననేక ప్రకారముల నున్నటులగన్పట్టుచున్నది. హార్దాకాశాన్తర్గత మగు బుద్ధిగుహయం దిట్టియాత్మను దర్శించువారికి శాశ్వత సుఖముకలుగును. తదితరుల కదికలుగదు.

తా॥ వి॥ పరమేశ్వరుడు సర్వవ్యాపియగుటచే సర్వ గతుడు స్వతంత్రుడు. అతనితో సమానులుగాని యధికులు గాని ఎవరులేరు. సర్వాధారుడగుటచే జగత్తంతయు నతని వశమునందుండును. అచింత్యశక్తిసముపేతుడగుటచే నామ రూపాత్మకములగు వివిధాకారముల బొందినట్లగపడును. బుద్ధిగుహయందున్నను అది అతనికాధారముగాదు. దర్పణము సందు గాన్పించుప్రతిబింబమునకది యాధారము గానేరదు. బాహ్యవృత్తులుతొలగిపోయి యంతర్దృష్టులగువా రాచా ర్యాగమోపదేశముల ననుసరించి బుద్ధిగుహయందతనిని

దర్శించి పరబ్రహ్మమే యగుచున్నారు. అందువలన నిత్యానందస్వరూపులగుచున్నారు. ఇట్టిభాగ్యమితరులకు లభ్యము గాదు. 12

మూ॥ నిత్యోఽనిత్యానాం చేతనశ్చేతనానా మేకో బహూనాం యో విదధాతి కామాన్। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరా స్తేషాం శాన్తిః శాశ్వతీ నేతరేషాం ॥ 13

టీ॥ నశ్వరస్వభావమగు సర్వప్రపంచమున కాత్మ యొకడే నిత్యమగువస్తువు. చేతనములుగ గాన్పించుచున్న బ్రహ్మాదిపిపీలికాంతప్రాణిజాతమున కతడే చేతనము. అగ్నితరములగు నుదకాదుల కగ్నిచేతనే నుష్ణత్వముకలుగుచున్నట్లాత్మతేజస్సుచేతనే యవి చేతనవంతములగుచున్నవి. అతడొక్కడు సర్వజ్ఞుడు సర్వేశ్వరుడు. అనేకమగు ప్రాణికోటి కంతకును బూర్వకర్మానురూపముగ గామఫలము ననుగ్రహించుచున్నాడు. స్వశరీరమునందే యతనిని దర్శనముజేయ గలవానికి శాశ్వతమగు శాన్తి లభించును. అది యితరులకు లభింపదు. 13

అ॥ దుర్విజ్ఞేయమగు నాత్మతత్త్వమును బొందుట కుండదగిన యాస్థాస్వరూపమును వర్ణించుచున్నాడు.

మూ॥ తదేతదితి మన్యన్తేఽనిర్దేశ్యం పరమం సుఖమ్। కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతివా ॥ 14

టీ॥ ప్రకృష్టము సుఖస్వరూపము నగు నాత్మవిజ్ఞాన మిట్టిదని నిర్దేశింప నశక్యము. అయ్యది ప్రాకృతపురుషుల

కగోచరము. అయినను నివృత్తైషణులగు బ్రహ్మనిష్ఠులద్దానిని బ్రత్యక్షమయినదానినిగానే భావించుచున్నారు. నివృత్తైషణులగు యతిసత్తములకు గోచరమగు నాత్మతత్త్వము నాబుద్ధికి గోచరమగునటుల నేనెట్లుచేసికొనగలనను యుత్కంఠతతో ముముక్షు వాత్మచింతనము జేయవలెను. 14

అ॥ ఆత్మతేజస్సే సర్వప్రకాశకమని చూపుచున్నాడు.

మూ॥ న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం నేమా విద్యుతో భాంతి కుతోఽయమగ్నిః। తమేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి ॥ 15

టీ॥ సర్వప్రకాశకుడగు సూర్యుడు స్వాత్మభూతమగు నాపరమాత్మను బ్రకాశింపజేయలేడు. అదేవిధముగ చంద్రుడు నక్షత్రములు మెరుపుతీగెలతనిని భాసింపజేయలేవు. ఇక నగ్నివిషయమై యేమిచెప్పవలెను! ఇచట బ్రకాశించునదంతయు నిత్యప్రకాశుడగు నతని ననుసరించియే ప్రకాశించుచున్నది. ప్రజ్వలించుచున్న యగ్నిననుసరించియే యింధనములు జ్వలించుచున్నవి. అతని ప్రకాశముచేతనే నీసూర్యాదికము బ్రకాశించుచున్నది. స్వయముగా నతడు స్వప్రకాశస్వరూపుడుగానిచో నొకఘట మితర ఘటమును బ్రకాశింపజేయలేనట్లే యతడితరులను బ్రకాశింపజేయలేడు. పరమాత్మను బ్రకాశింపచేయు మరియొకవస్తువేది యని ప్రశ్నించిన దాని బ్రకాశింపచేయునదేదియని మఱియొక ప్రశ్నకలిగి యనవస్థ సంభవించును. అతనిచే బ్రకాశింపజేయ

బడు సూర్యాదులతని బ్రకాశింపజేయలేవు. సూర్యునిచే బ్రకాశింపజేయబడువస్తువులు సూర్యుని బ్రకాశింపజేయలేవు గదా! 14

ద్వితీయాధ్యాయము – ద్వితీయవల్లి
సమాప్తము.

ద్వితీయాధ్యాయము - తృతీయవల్లి

అ॥ వృక్షముయొక్క వేళ్ళు భూమిలోన న్తర్నిహితములయి పైకికాన్పింపకపోయినను కార్యరూపమగు పుష్పాదికముచే నదినిశ్చయింపబడుచున్నది. పైయావరణమును దీసినవెంటనే నది ప్రత్యక్షముగగాన్పించును. అటులనే సర్వజనవిదితమగు సంసారవృక్షమునలన దానిమూలమగు బ్రహ్మమును నిర్ధారణచేయుటకుగాను తృతీయవల్లి యారంభింపబడుచున్నది.

మూ॥ ఊర్ధ్వమూలో౽వాక్శాఖ ఏషో౽శ్వత్థః సనాతనః। తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృతముచ్యతే। తస్మింల్లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన॥ ఏతద్వైతత్ ॥ 1

టీ॥ సంసారవృక్షము పతనస్వభావము గలదియగుటచే నియ్యది సర్వవ్యాపియగు పరబ్రహ్మమే మొదలుగా గలిగినట్టిదియు స్వర్గనరకాదిరూపములగు లోకములే యడ్డముగావ్యాపించిన కొమ్మలుగాగలిగినట్టిదియుకావున నిద్దానికి శుద్ధమయిన యాబ్రహ్మమే మూలము. ఆబ్రహ్మ మమృతస్వరూపము. దానియందే లోకములన్నియు నాధారపడి

యున్నవి. ఏవియు దాని నతిక్రమింపజాలవు. ఇదియే నచికేతసు డడిగిన బ్రహ్మము.

తా॥ వి॥ సర్వాంగసుందరమగు రూపకముచే సంసారమశ్వత్థవృక్షముగ నిచటవర్ణింపబడినది. సర్వాతీతమగు బ్రహ్మమునుండి మాయావిద్యలచే నీసంసారవృక్షము ప్రరోహమగుటంజేసి దానివ్రేళ్ళు ఊర్ధ్వముననున్నటుల చమత్కరింపబడినది. ఖడ్గముచే ఛేదింపదగినదని వృక్షశబ్దార్థము. జ్ఞానఖడ్గముచే ఛేదనయోగ్యమగుటచే సంసారమువృక్షమని వర్ణింపబడినది. ఈసంసారవృక్షమున కజ్ఞానము ప్రారంభము. స్థావరాదులంతము. దాని మొదలు జన్మజరామరణశోకాద్యనేకములగు ననర్థములతో గూడుకొనియున్నది. అది క్షణక్షణము వికారము నొందుచుండును. సంసారవృక్ష మింద్రజాలము. ఎండమావులు గంధర్వనగరములవలె బైకిమాత్రము కాన్పించుచున్నదే యగుటచే యదార్థముగాదు. వేదవిముఖులగువారి బుద్ధివిశేషము ననుసరించి యదియనేకవికల్పముల కాస్పదమగుచున్నది. తత్త్వజిజ్ఞాసువుల కద్దానితత్త్వము నిర్ధారణచేయ శక్యముగాకున్నది. దానియొక్క మూలసారమగు పరబ్రహ్మము వేదాన్తములచే నిరూపింపబడుచున్నది. సంసారవృక్ష మవిద్యాకామకర్మములను బీజములనుండి యుత్పన్నమగుచున్నది. జ్ఞానక్రియాశక్త్యాత్మకుడగు హిరణ్యగర్భుడు దానియంకురము. ప్రాణిజాలముయొక్క లింగశరీరము దాని స్కంధము. తృష్ణాజలసేచనముచే నది యేపుగా బెరుగును.

సంసార వృక్షము

బుద్ధీన్ద్రియము లద్దానిచిగురుటాకులు. శ్రుతిస్మృతిన్యాయ విద్యోపదేశము లద్దానియాకులు. యజ్ఞదాన తపస్సులు మొదలగుసత్కర్మములు సుశోభితములగు దానిపుష్పములు. సుఖదుఃఖవేదనలు దానిరసము. ప్రాణికోటి నిత్యమద్దాని ఫలముననుభవించుచున్నది. ఫలతృష్ణాజలముచే దృఢముగా నారూఢములయి సాత్త్వికాదిభావనాసంమిశ్రితము లయిన కర్మవాసనలు దానిమొదటికొమ్మలు. సత్యాదిసప్తలోకముల యందలి భూతములను పక్షులకది యావాసస్థానము. ప్రాణి జాతములు సంతోషానుభవసమయమున సలుపు నృత్య గీతాదిసుస్వనములచేతను దుఃఖసముద్భూతములు ఆర్తతా నిమిత్తములునగు దీనాలాపనినాదములచేతను నది సంకులా రావసంభరితము. సర్వోపనిషదుపదిష్టమగు జీవబ్రహ్మైక్య జ్ఞానమే దీనిని ఛేదింపగల యప్రతిహతమగు లవిత్రము. ఇట్టి సంసారవృక్షము కామకర్మవాతేరితమయి యనుదినము సంచలించుచున్నది. కర్మవైవిధ్యముచే విభిన్నమార్గప్రవృత్త ములగు స్వర్గనరకతిర్యక్ప్రేతాదు లనేకముఖవినిస్సృతములగు దానియవాక్శాఖలు. అనాదియగుటచే నీసంసారవృక్షము చిరకాలప్రవృత్తము. అనిత్యము భ్రమాత్మకమునగు నీసంసా రమునకు శుద్ధమయిన పరబ్రహ్మమధిష్ఠానమగుచున్నది. పర బ్రహ్మము వినాశవిధురము. అన్నిటికంటె నది మహత్తమ మగుటచే నద్దానికి బ్రహ్మమను పేరుగల్గినది. బ్రహ్మశబ్దము నకు ప్రకృష్టమగువృద్ధి యర్థము. ఈపరమార్థసత్యమును జనులు దెలిసికొనలేకపోవుటచే లోకములన్నియు దానియందుత్పత్తి

స్థితిలయములు గల్గియున్నట్లు కాన్పించుచున్నది. కార్యము లన్నియు సర్వకారణమగు బ్రహ్మము నతిక్రమింపజాలవు. మృత్కార్యమగు ఘటము మృత్తుకంటె వేరుగాదు. సర్వ సృష్టికారణమగు నీపరబ్రహ్మమునే నచికేతసుడు యముని వలన దెలిసికొనగోరెను. ఇచట భగవద్గీత పదునెనిమిదియవ యధ్యాయమునందలి మొదటినాలుగుశ్లోకము లవలోకనీయ ములు. 1

అ॥ పరబ్రహ్మమే సమస్తప్రపంచమునకును కారణము నియామకము నగుచున్నదని చెప్పబడుచున్నది.

మూ॥ యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్।
మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి॥2

టీ॥ పరిదృశ్యమానమగు నీజగత్తునదంతయు సర్వ మహత్తమమగు పరబ్రహ్మస్థితిచేతనే వ్యాపారవంతమగు చున్నది. దానినుండియే బయలువెడలి దానిచే నియమింప బడుచున్నది. పరబ్రహ్మము ఖడ్గమును ధరించినరాజువలె భయహేతువగుచున్నది. అద్దాని భయమువలన సూర్యా చంద్రమ ఆదిగ్రహాలక్షితమగు నీజగత్తంతయు విశ్రాంతిలేక స్వస్వవ్యాపారముల జాగరూకతతో నిర్వహించుచున్నది. నియమనిబద్ధమగు జగత్తునకంతకు నొక నియమనకర్త యుండి తీరవలయును. అటులకానిచో జీవిత మసంభవమగును. సూర్యాచంద్రమః పృథివ్యాదిగ్రహములు నిర్ణీతనిజపథాను వర్తులుగాకపోవుటచే వానికి బరస్పరసంఘట్టనము తటస్థింప వలసియుండును. సర్వభూతము లతనివశవర్తులగుటంజేసియే

యిట్టియిక్కట్టు లొందవకుండ జీవితము సురక్షితమగుచున్నది. అశేషజగద్భరణభారనిర్వహణసమర్థము సర్వజ్ఞము సర్వశక్తిమంతము నగునీమహత్తమపదార్థము పరబ్రహ్మమే కావలయును. ఇట్టి పరబ్రహ్మమున్నదని యెఱింగినవా రమృతులు అమరణధర్మలు నగుదురు. 2

అ॥ పరబ్రహ్మముయొక్క జగన్నియంతృత్వమును విశదీకరించుచున్నాడు.

మూ॥ భయాదస్యాగ్ని స్తపతి భయా త్తపతి సూర్యః।
భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః ॥ 3

టీ॥ ఇతని భయమువలననే యగ్ని దహించుచున్నది. సూర్యుడు ప్రకాశించుచున్నాడు. వాయువు, యింద్రుడు మరణకారణమగు మృత్యుదేవత స్వస్వవ్యాపార నిర్వహణమునం దప్రమత్తులయి ప్రవర్తించుచున్నారు. ఇచట తైత్తిరీయోపనిషత్తు 2-8 మంత్రముల చూడదగును. 3

అ॥ ఇట్టిపరబ్రహ్మమును జీవితముండగానే తెలిసికొనుటకు ద్వరపడవలయునని చెప్పుచున్నాడు.

మూ॥ ఇహచేదశకద్బోద్ధుం ప్రాక్శరీరస్య విస్రసః। తతః
సర్గేషు లోకేషు శరీరత్వాయ కల్పతే ॥ 4

టీ॥ ఇట్టిపరబ్రహ్మమును శరీరపతనమునకుబూర్వమే తెలిసికొనుటకు శక్తుడయినచో సంసారమునుండి విముక్తుడగును. అట్లు తెలిసికొనజాలనివాడు సృష్టములగు స్వర్గాది

లోకముల పాలగును. కనుక శరీరము రాలిపోవుటకుబూర్వమే ఆత్మబోధకు యత్నింపవలెను. 4

అ॥ ఆత్మదర్శన మీజన్మమునందయినంత సులభముగా బ్రిహ్మలోకేతరములగు లోకములయందు గానేరదనువిష యమును సోదాహరణముగ స్పష్టముచేయుచున్నాడు.

మూ॥ యథాదర్శే తథాత్మని యథా స్వప్నే తథా పితృ లోకే। యథాప్సు పరీవదదృశే తథా గన్ధర్వలోకే ఛాయాతప యోరివ బ్రహ్మలోకే ॥ 5

టీ॥ దర్పణమునందు బ్రితిబింబము స్పష్టముగా గను పడినట్లు నిర్మలమగుబుద్ధిగలవాని కీజన్మమునందే యాత్మ దర్శనము కాగలదు. జాగ్రద్వాసనలే స్వప్నరూపమున నుద్బుద్ధములగుటచే స్వాప్నికానుభవ మంత స్పష్టముగాదు. పితృలోకమునందు జీవుడు కర్మఫలభోగాసక్తుడయి యుండును గనుక నచట యాత్మదర్శనమున కవకాశములేదు. జలముల యందలి ప్రతిబింబముయొక్క వివిధావయవములు విభక్తములయి స్పష్టముగాకనుపడనట్లే గంధర్వలోకమునందు గూడ నాత్మదర్శనము స్పష్టముగాదు. బ్రిహ్మలోకమునం దాత్మదర్శనము సుస్పష్టమయినను నాలోకము కర్మజ్ఞాన సాధ్యమగుటచే సామాన్యులకది యలభ్యము. కనుక ఆత్మ దర్శనమున కీజన్మమునందే దృఢమగు ప్రయత్నము చేయ తగును. మానవజన్మగూడ సుదుర్లభము. 5

అ॥ మానవజన్మ మాత్మదర్శనమున కుత్తమకాలమని చూపి యట్టిదర్శనోపాయమును జూపుచున్నాడు.

మూ॥ ఇంద్రియాణాం పృథగ్భావముదయా_స్తమయౌ చ యత్। పృథగుత్పద్యమానానాం మత్వా ధీరో న శోచతి॥ 6

టీ॥ ఆకాశవాయ్వగ్నిజలపృథివీభూతములయొక్క సత్వాంశములనుండి వరుసగా శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు ప్రత్యేకప్రత్యేకముగా నుత్పన్నమగుచున్నవి. ఇవి యన్నియు జాగ్రదవస్థయందు వ్యాపారవంతములు. స్వప్న సుషుప్తులయందు నిర్వ్యాపారములు. మనస్సు జాగ్రత్స్వప్నములయందు జాగరూకతతోనుండినను సుషుప్తియందు నిర్వ్యాపారమగుచున్నది. ఈమూడవస్థలయందు నాత్మమాత్రము ప్రబుద్ధమయియుండును. అందువలన ఆత్మ యింద్రియములకంటె భిన్నము. అతని తేజస్సుచే నవభాసితములయి యింద్రియములు వ్యవహరించుచున్నవి. ఆత్మ తేజస్సులేక నవియన్నియు జడములు అనృతములు. ఆత్మ తేజస్సు ధ్రువము అజము. ఈవిషయమును గ్రహించిన యాత్మకుశలుడు దుఃఖము నొందడు. 6

అ॥ ఆత్మ సర్వమునకు ప్రత్యగాత్మ యయినను దానిని బాహ్యముచే దెలిసికొనసాధ్యముగాదని చెప్పబడిన యర్థము వివరింపబడుచున్నది.

మూ॥ ఇన్ద్రియేభ్యః పరం మనో మనసః స_త్త్వము_త్తమమ్। స_త్త్వాదధి మహానాత్మా మహతో౽వ్య_క్తము_త్తమమ్॥ 7
అవ్యక్తా_త్తు పరః పురుషో వ్యాపకో౽లిఙ్గ ఏవ చ। యం జ్ఞాత్వా ముచ్యతే జన్తురమృతత్వం చ గచ్ఛతి॥ 8

టీ॥ ఇన్ద్రియములు మనస్సు బుద్ధి హిరణ్యగర్భుడు అవ్యక్తము అవిద్య పరాత్పరుడగు పురుషుడు ఇవి క్రమముగా, బూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము శ్రేష్ఠతరము. పురుషుడు సర్వోత్తముడు, సర్వవ్యాపకుడు; అతని నూహింప గల చిహ్న మేదియును లేదు. అట్టి పరమపురుషుని దెలిసికొను నరు డవిద్యావిజృంభితమగు సంసారబంధమునుండి ముక్తుడగును. మఱియు నమృతత్వమును బొందును. ఇచట 1-3-10 మంత్రము ననుసంధానము చేసికొనవలెను. ఇంద్రియశబ్దముచే దద్విషయములగు శబ్దాదులుగూడ నిచట నుపలక్షితములగుచున్నవి. 7-8

పరమాత్మ యింద్రియాతీతము గనుక ప్రత్యక్షగోచరము గాదు; అద్దానిని బుద్ధిచే నూహించుటకు చిహ్నమేదియును లేదు. అట్టిదానినెట్లు తెలిసికొనవలయునను ప్రశ్నకు సమాధానమును జెప్పుచున్నాడు.

మూ॥ న సన్దృశే తిష్ఠతి రూపమస్య న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్। హృదా మనీషా మనసాభిక్లుప్తో య ఏతద్విదురమృతాస్తే భవన్తి ॥ 9

టీ॥ ప్రత్యగాత్మ చక్షురాదీన్ద్రియగణమున కగోచరము. వికల్పవిహీనము నిశ్చలమునగు బుద్ధిచే నద్దానిస్వరూపము మననము సేయుటచేత నయ్యది యభిప్రకాశితమగును. ఇట్లాత్మను దెలిసికొనిన వారమృతత్వమును బొందుదురు.

అ॥ పరమాత్మను మననముచేయు విధానము యోగమని పిలువబడుచున్నదని చెప్పుచున్నాడు.

మూ॥ యదా పఞ్చావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టతి తామాహుః పరమాం గతిమ్ ॥ 10

టీ॥ ఎప్పుడు శ్రోత్రాదిజ్ఞానేన్ద్రియపఞ్చకము శబ్దాది స్వవిషయములనుండి మఱలి సంకల్పవికల్పదూరమగు మనస్సుతోఁగూడ నన్తఃప్రవిష్టమయి యాత్మయందే నిలిచి యుండునో, ఎప్పుడు బుద్ధి స్వవ్యాపారమునందు జలింపక నిశ్చేష్టితముగనుండునో యట్టియుత్కృష్టమగుస్థితి పరమగతి యని విద్వాంసులు సెప్పుదురు.

తా॥ వి॥ ఈస్థితి జాగ్రత్స్వప్నసుషుప్తులకంటె విలక్షణమగు సమాధ్యవస్థయగును. స్వప్నమునందిన్ద్రియములు, సుషుప్తియందు మనస్సుగూడ నుపరమావస్థయందుండును. జాగ్రదవస్థయందిన్ద్రియములన్నియు వ్యాపారవంతములయినను స్వవిషయములు బాహ్యములునగు శబ్దాదులయందు వ్యాపృతములగుటచే నవి యాత్మను గ్రహింపనేరవు. మనస్సిన్ద్రియసహాయముచే బాహ్యవిషయములను గ్రహించును. మనస్సుచే గ్రహింపబడినవిషయముల యుక్తాయుక్తములను బుద్ధివిచారించి తదనుకూలమగు నితికర్తవ్యమును నిశ్చయించుచున్నది. బుద్ధీన్ద్రియమనస్సంయోగఫలముగ బ్రవృత్తిమార్గము లభించుచున్నది. ఇంద్రియములు మనస్సుగూడ బాహ్యవిషయవ్యాపారమును మాని యన్తఃప్రవిష్టములయి యాత్మచింతనమునందుమాత్రము లగ్నమగు స్థితి సమాధియనఁబడును. ఇక్కాలమున సర్వేన్ద్రియములు మనస్సుగూడ నిర్వ్యాపారములుమాత్రముగ నుండునుగాని

